# ఆంధ్రకవయిత్రులు

మదరాసు ప్రభుత్వ పక్షమున

తెలుగు భాషాసమితి బహూకృతి పొందిన

రమణీ రమణీయ సాహితీ విమర్శ గ్రంథము




కళాప్రపూర్ణ, ఆంధ్రసరస్వతి, సాహితీరుద్రమ, ఉభయభాషా ప్రవీణ,

**ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ**

ANDHRA KAVAYITRULU

by Dr. (Smt.) Utukuri Lakshmikanthamma

(Pen - portraits of nearly 200 eminent Telugu women - writers)

---



ద్వితీయ ముద్రణము
ప్రతులు :- 3,500

మూల్యము
రూ॥ 30-00

ప్రాప్తిస్థానము :-

1. డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, బాపట్ల, P.O. గుంటూరుజిల్లా.
2. ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైద్రాబాదు-500001.
3. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్, విజయవాడ.
4. విశాలాంధ్ర బుక్‌హౌస్, సుల్తాన్‌బజార్, హైద్రాబాదు.
5. విశాలాంధ్ర బుక్‌హౌస్, అనంతపూర్.

ముద్రణ :
శివాజి ప్రెస్,
గంజ్‌బజార్, సికింద్రాబాదు. 500003

---

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rate.

# కృతి సమర్పణము

మానసీయులు పూజ్యపాదులు నగు

మత్ప్రియ జననీ జనకులు

శ్రీ నాళము సుశీలా కృష్ణరావులకు



రచయిత ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

శ్రీ హయగ్రీవ గుప్తగారు (అడ్వకేటు).

పూజ్యపితృశ్రీలు

'మధురకవి' నాళము కృష్ణరావు

సుశీలాంబలకు

# కృతి సమర్పణ నమోవాకములు



శ్రీ వాత్సల్యరసానురంజితము, లాశీర్వాద విన్యాస లీ
లా విస్మేరము, లస్మదీయ జయవాగ్లబ్ధోదయోత్ఫుల్ల రా
జీవమ్ముల్, నను గన్నవారి పరమ స్నేహామృతాపాంగముల్
సేవింతున్ మదభీప్సితార్పితకృతిస్వీకారసంసిద్ధికిన్.

కమనీయోజ్జ్వల కల్పనా మధురముల్, కావ్యప్రపంచమ్ము లి
శ్రమ నిర్మించిన యక్షరాత్ముని, సమస్తాంధ్రక్షమావాసితా
చ్ఛమహాకీర్తిసరోరుహాసనవిభాస్వన్మూర్తి, మా తండ్రి రూ
పమునన్ దర్శన మిచ్చుచున్న సుకవిబ్రహ్మన్ సమర్చించెదన్.

పతిమాటే తన బాట గాగ, కులమున్ బండించి బంగారుసం
తతి, సాహిత్యకళావినోది యగుచున్, సంగీతవిద్యా సర
స్వతియై, సర్వజనాభినందితగుణ ప్రాశస్తి వెల్గొందు దే
వత మా యమ్మ సుశీల - యామె యడుగు ల్పట్టింతు సీమంతమున్.

ప్రథితపురాతనాద్యతన లౌ కవయిత్రుల సచ్చరిత్ర లి
వ్విధి శ్రమ కోర్చి కూర్చి నెఱవేర్చితి మేల్ - విరజాజిదండ నో
మధుమతులార ! యుష్మదభిమానకటాక్ష మరందబిందు సం
గ్రథిత పరిమళమ్ముగ వెలార్చి బుధాళికి హాయి గొల్పగన్.

లలిత స్వాంతు, లుదంచితోభయకళా లక్ష్మీసముల్లాసులున్
తలిదండ్రుల్ ! నను మీరు మెత్తు రనుచున్ గా, దిట్లుగా 'మీ ఋణం
బులు తీర్మాన మొనర్తు లె' మ్మను దలంపుం గా, ది కే మన్న- ని
శ్చలమౌ మత్పితృభక్తి చూపుకొను నా చాపల్యమే యింతకున్.

నా సుకృతంబె మీ కడుపునం బడవై చెను, మీరు మంగళో
పాసన లుగ్గుపా ల్గలిపి పట్టిరి యి య్యఖిలాంధ్రము న్నుప
న్యాసపువేదిగా నిలిపినాను జయధ్వజ, మింక నేడు మీ
వేసిన పూలతీవ తొలి విచ్చిన పు వ్విదె మీకె యిచ్చెదన్.

పూ వెటువంటి దయ్యు, ప్రభుపూజిత మైన స త్తమౌళిసం
భావన భాగ్యశాలి యగు మత్కృతి యో సుకృతాత్ములార ! మ
ద్దేవత లైన మీరు మీ కృతిపతిత్వమునం దళుకొత్తి సద్వామ
ర్త్యావృతి సాహితీజగతి రాజిలు శాశ్వత రత్నదీపమై.

నా కల మాంధ్రవాఙ్మయమునం దడు గుంచిననాడు కన్న నా
యా కల లెల్ల నేడు చరితార్థము లైనవి తండ్రి ! మన్నమో
వాకముతోడ నీ కృతి భవచ్చరణార్పణ సేతు, మీ స్మిత.
స్వీకృతి మత్కటాక్షము లవే పదివే లగు చాలు నా కికన్.

అసమకళా వ్యసనులకున్,
ప్రసన్న చరితులకు, కృష్ణరాయ సుశీలా
రససిద్ధుల, కేతత్కా
వ్య సనాథులకు, మదభీష్టపదచతురులకున్.

మీ ప్రియతనూజ

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# కా వ్య వీ థి



## తొలితరము

## మూడవతరము - ఆధునికాంధ్రవాఙ్మయము



## నాలుగవతరము - అద్యతనాంధ్రయుగము

## 5 వ తరము - నవ్యాంధ్రయుగము

# ఆప్తవాక్యం

తెలుగు సాహిత్య చరిత్రను తమ కమనీయ కవితాప్రతిభలతో సమలంకరించిన కవయిత్రుల చరితలను వ్రాసి ఆంధ్రులు సాధించిన సంస్కృతి స్వరూపాన్ని తీర్చిదిద్దే ప్రయత్నంలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఆద్యులు. తెలుగు కవయిత్రుల చరిత్రరచనలోనే కాదు, యావద్భారత కవయిత్రుల చరిత్రను తెలుగులో తొలిసారిగా అందించిన కీర్తి కూడ శ్రీమతి లక్ష్మీకాన్తమ్మకే దక్కుతుంది. దాదాపు మూడు దశాబ్దాలక్రితం ఈ పుస్తకం వెలువడి ఎందరికో, ఎన్ని విధాలుగానో కనువిప్పు కలిగించింది. ఇది ద్వితీయ ముద్రణం.

మొన్నమొన్న జరిగిన అంతర్జాతీయ మహిళాసంవత్సరములో వనితల విశిష్టతను చాటి చెప్పడానికి ఎంతో ప్రయత్నం జరిగింది. కాని ఈలాంటి ప్రయత్నానికి అంకురార్పణ జరుగకపూర్వమే శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ, తెలుగు కవయిత్రుల విశిష్టతను అభివర్ణించడానికి పూనుకోవడం ఆమె విలక్షణతను, ప్రతిభను చాటుతున్నది.

సాధారణంగా చరిత్రకు సంబంధించిన గ్రంథాలలో అందమైన భాషా విన్యాసం, రసవంతమైన రచనా విధానం, అంతగా ఉండదు. ఆంధ్ర కవయిత్రులు అనే ఈ గ్రంథంలో శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు శక్తిమంతమైన తమలేఖినితో చేయించని సాహితీ చమత్కారంలేదు.

శ్రవణ సుందరమైన పదసమ్మేళనమో, రమణీయమైన అర్థస్ఫురణమో, లయాత్మకమైన వాక్యగమనమో లేని వాక్యం, ఈ పుస్తకంలో కనిపించటం అరుదు. పదబంధాలు, జాతీయాలు, సామెతలు, ఈ పుస్తకంలో దర్శనమిస్తాయి. అయితే ఇవి తెచ్చిపెట్టినట్టుగా ఉండవు. కథనకౌశలానికి మారాకు హత్తినట్టుగా ఉంటాయి.

దాదాపు 200 కవయిత్రుల రచనలను ఎంతో వ్యయప్రయాసలకు ఓర్చి శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు సేకరించి, రచయిత్రుల జీవితవిశేషాలతో జతగూర్చి

# ఆ ప్తవాక్యం

తెలుగు సాహిత్య చరిత్రను తమ కమనీయ కవితాప్రతిభలతో సమలంక రించిన కవయిత్రుల చరితలను వ్రాసి ఆంధ్రులు సాధించిన సంస్కృతి స్వరూపాన్ని తీర్చిదిద్దే ప్రయత్నంలో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఆద్యులు. తెలుగు కవయిత్రుల చరిత్రరచనలోనే కాదు, యావద్భారత కవయిత్రుల చరిత్రను తెలుగులో తొలిసారిగా అందించిన కీర్తి కూడ శ్రీమతి లక్ష్మీకాన్తమ్మకే దక్కుతుంది. దాదాపు మూడు దశాబ్దాలక్రితం ఈ పుస్తకం వెలువడి ఎందరికో, ఎన్ని విధాలుగానో కనువిప్పు కలిగించింది. ఇది ద్వితీయ ముద్రణం.

మొన్నమొన్న జరిగిన అంతర్జాతీయ మహిళాసంవత్సరములో వనితల విశిష్టతను చాటి చెప్పడానికి ఎంతో ప్రయత్నం జరిగింది. కాని ఈలాంటి ప్రయత్నానికి అంకురార్పణ జరుగకపూర్వమే శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ, తెలుగు కవయిత్రుల విశిష్టతను అభివర్ణించడానికి పూనుకోవడం ఆమె విలక్షణతను, ప్రతిభను చాటుతున్నది.

సాధారణంగా చరిత్రకు సంబంధించిన గ్రంథాలలో అందమైన భాషా విన్యాసం, రసవంతమైన రచనా విధానం, అంతగా ఉండదు. ఆంధ్ర కవయిత్రులు అనే ఈ గ్రంథంలో శ్రీమతి లక్షికాన్తమ్మగారు శక్తిమంతమైన తమలేఖినితో చేయించని సాహితీ చమత్కారంలేదు.

శ్రవణ సుందరమైన పదసమ్మేళనమో, రమణీయమైన అర్థస్ఫురణమో, లయాత్మకమైన వాక్యగమనమో లేని వాక్యం, ఈ పుస్తకంలో కనిపించటం అరుదు. పదబంధాలు, జాతీయాలు, సామెతలు, ఈ పుస్తకంలో దర్శనమిస్తాయి. అయితే ఇవి తెచ్చిపెట్టినట్టుగా ఉండవు. కథనకౌశలానికి మారాకు హత్తినట్టుగా ఉంటాయి.

దాదాపు 200 కవయిత్రుల రచనలను ఎంతో వ్యయప్రయాసలకు ఓర్చి శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు సేకరించి, రచయిత్రుల జీవితవిశేషాలతో జతగూర్చి

మనకు అందించినారు. రచనలను గూర్చి ఆమె వ్రాస్తున్నప్పుడు ఆమె పాండిత్యం, పరిశీలనాదృష్టి, సహృదయత్వం, ఎంత సుసంస్కృతంగా ఉన్నాయో, ఎంత సముదారంగా ఉన్నాయో తెలుస్తుంది.

సాహిత్య, సాంస్కృతిక రంగాలలో, అతిదక్షతతో తమ నిర్వహణ సామర్థ్యాన్ని ప్రదర్శించిన శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు తెలుగుదేశానికి అందించిన గ్రంథాలలో ఈ గ్రంథానికి పార్థక్యం ఉంది. నాపట్ల ఆమెకున్న వాత్సల్యభావాన్ని పురస్కరించుకొని నన్ని రెండుమాటలు వ్రాయవలసిందిగా ఆమెకోరినందుకు, నేనింత ఉద్గ్రంథాన్ని గూర్చి వ్రాయడానికి పూనుకున్నాను. శ్రీమతి లక్ష్మీకాన్తమ్మ గారికి ప్రతిభ వుంది, పాండిత్యం ఉంది, రచనాభ్యాసం ఉంది. ఈ మూడు శక్తులు మరింత తేజరిల్లడానికి అనువైన అవకాశాలు ఇతోధికంగా లభించాలని ఆకాంక్షిస్తున్నాను. తెలుగు పఠితృలోకం ఈ పుస్తకాన్ని సమాదరిస్తుందని ఆశిస్తున్నాను.

హైదరాబాదు. ఇరివెంటి కృష్ణమూర్తి

తేది. 26-9-1980

శ్రీ ర్జ య తు

# పీ ఠి క - దీ పి క

దర్శనాచర్య, మహోపాధ్యాయ, లాక్షణికశిరోమణి, శాస్త్రవిశారద,
సాహిత్యాచార్య, సాహిత్య విద్యాభాషాప్రవీణ

## జమ్మలమడక మాధవరామశర్మ

నవ్యసాహిత్యపరిషత్తు. ఏ. సి. కాలేజి, : గుంటూరు

''శ్రీలక్ష్మీ కాంతమా గ్రంథ భావ భావన భావుకాః
భావయధ్వ మిమాం వాణిం సచేత స్స్వసహాయినీం
స్వాత్మసంవాదసంతుష్టస్వస్పందశ్రీరసాత్మనః
హృదయాన్ని స్సృతా భాషా పీఠికాత్వేన లోక్యతాం

వనితాజనతాక్రమకవితాలలితా నను
లాలితా పాలితా సేయం గీర్దుగ్ధే గౌరివ స్వయం
గద్యపద్యకథాకాంతాం తుష్టి పుష్టి ప్రదాయినీం
రీతిం నీతిం సమాశ్రిత్య వాచమేనాం నిబోధత!"

శ్రీ కుంకుమశోభిత ఊటుకూరి లక్ష్మీకాంతమాకృతి "ఆంధ్రకవయిత్రులు" చతురస్ర మయిన చక్కని రచన. ఇది యొక సాహితీవిమర్శ. తెలుగు వెలుగుల జూపు తెలుగునాట వెలసిన ఏవంవిధ విమర్శగ్రంథములలో నిది యాద్యకృతి. ఈ కృతి సుకృతి కృతి. ఆకృతి కల కృతి యగుట నిదియు సుకృతి. ఇది కమనీయ కామినీ కవితాసమీక్ష. ఇట్టి సమీక్షాకృతిని మదరాసు ప్రభుత తెలుగుభాషాసమితి ద్వారమున బహూకరింపదలచినది.రచనాదక్షతకలవారి సమీక్షలనీక్షించిసమితి విశిష్ట పర్యవేక్షణమున నిది "యుత్తమసమీక్ష" యని భావించి సంభావించినది. సమితి సంభావనము సకలసామితేయ సంవాద సహితము.ఇది సారస్వతేయ సంభావనము. ఈ ''రమణి రమణీయ సాహిత్య విమర్శ" సహృదయులకు సుహృదయలకు సంభావనార్హము............ నేనొక సాహిత్యవ్రతుడను. జగన్నాథ పండిత

రాయల "రసగంగాధర" మను సాహిత్య శాస్త్రీయ గ్రంథము కొంత నా రచనలో "నవ రస గంగాధర" మయినది. మొదటి వత్సరమున తెలుగు భాషాసమితి 'నవ రస గంగాధరము' నిట్టె చూచి బహూకరించినది. సాహిత్యతాపసుడనుగా లక్ష్మీకాంతమ సాహితీవిశిష్టతల కొంతగా గుర్తించిన నేను ప్రస్తుతాశ్రయముల ప్రస్తుతులు నివేదింతును.

'ఆంధ్రకవయిత్రులు' అని ఈ గ్రంథనామము. తెలుగుదేశ మాంధ్రదేశ మొకటి, తెలుగుభాష యాంధ్రభాష యొకటి ఆంధ్రదేశమున కవిత అల్లిన వనితల చతురకవితల నీ గ్రంథము సమీక్షించినది. కవితాకంకణహస్త లాంధ్రమున నెందరో కలరు. వారి సంస్కృతభాషాకవితలు, ప్రాకృతభాషా ప్రాభవములు, ఆంధ్రభాషాయోషారాధన లిందు గలవు. ఆంధ్రదేశీయసాహిత్యము సర్వతోముఖము తత్ప్రకారము లనంతములు. తద్ధూర్వహు లనేకు లున్నారు. ఆ యనేకుల కనేకులు గోరుముద్దలతో వెన్నముద్దలతో సారస్వతరసము పట్టినారు. తాదృశలె కాక, ఈదృశస్తుతిపాత్ర లయిన సీమంతిను లెందరో కలరు. ఇట్టి స్తోతవ్యప్రజ్ఞ లితరసీమలలో నింతగా లేరు ఇంతగా కవితారంగమున నవత ...కవయిత్రులు" గ్రంథమును ...వారు కాని, యిప్పటివారు ...ంథమున 132 సంఖ్యాకులు స్తుతి పాత్రలయినారు. అందరి చరితములు సులభములు కావు. రచనలు నందు బాటులో లేవు సుజ్ఞాతల విశేషములు కూడ సనిగా సరిగా తెలియుట కవకాశములు కొంత కొంతగనె యున్నవి. కాని కాంతమ్మ యింతగా నన్వేషించి యిట్లు సుప్రకాశదీపిక వెలయింప జేయుట నారీలోకవివేకమున కొక యాలోకము ఇందు సుమారు 400 పుట లున్నవి. కొన్ని విభాగము లిందున్నవి. అట్టి విభక్తియుక్తికి తగిన యుక్తియుక్తి విశేషములను కాంతమ్మ సూక్తమె చేసినది.

వేదసంహితలందు వనితల పేరు లున్నవి. వారి విశేషములును గలవు. అవి యిందు విస్తృతము లగుట యుద్దిష్టము కాదు వికటనితంబ, శీలాభట్టాకరి, అవంతి సుందరి ప్రముఖుల జ్ఞాతాజ్ఞాత సాహితీపర్యాలోచన మిందేల కూర్పు పొంద వలయును? రేవా, మాధవీ, పద్దానహీ ప్రభృతికలు ప్రాకృతలు కాని, ప్రాకృత సాహితీవాసనా వాసితలు. వారి విస్తృతి యాంధ్రకవయిత్రులలో వలయు నేమి? ఇట్లే యన్యాన్యముల కిందు ప్రవేశ మీయమికి సమీక్షలో నీక్ష యున్నది.

నవకాలమునాటివారు కొంద రిందు కన్పడరు. అన్నియు సుకరములా? అందర కుచితప్రవేశ మెట్లు? ఆంధ్రకవయిత్రీ ప్రాంగణ ప్రవేశమునకు వలసిన విధులు కలవారందరు సుజ్ఞాతచరితలు కానందున, నిం దుల్లేఖముపొందలేదు. కేవల ముల్లేఖమున నయిన నందర సూచించుట కీ కాలమున తగిన సౌకర్య మేది? అక్షరముఖ లందరు రచనలు సేయగలరా? చేసినవారును కొంత చేసి యూరకొందురు. అట్టివారి గుర్తించు టెట్లు? ఎట్లును తెలియనివారి నెట్లు తెలియవలయును? శ్రీ లక్ష్మీకాంతమ యెట్లెట్లో తెనుగుదేవుల నెందరినో తన తెలివిడిలో గుర్తించినది. సంస్కృతాంధ్రగ్రంథముల నధ్యయనము చేసి, యాంగ్ల హిందీభాషల పరిచయమున వలసినవానిని తెలిసికొని, విమర్శ రీతినీతు లందుకొని, యలంకారగ్రంథపరిశీలన పరిపాకము కూర్చుకొని, సాహితీవృద్ధ గతిమతులు గుర్తించి శ్రీ కాంతమ కవయిత్రీచరిత్ర సంతరించినది. తీరిక, ఓపికలలో నొకటి యున్న మరియొకటి యుండదు ఏయొకటి లేకున్నను. వెలితి కన్పడును. ఈసమీక్షలో నట్టిది లేదు. లోకమును శ్రీలు కలవా రున్నారు. వారందరు ధీవరు లనలేము. శ్రీ ధీ లున్నవారును గీరంగముల క్రీగంట నేని చూడరు. అందును శ్రీ మతు లయిన స్త్రీల విషయ మేమి చెప్పుదుము? శ్రీమతి యన్నిటి కలిమి సమీక్షా దక్ష యయినది. ఇట్టి రచన మీమె కుభయవంశ సంప్రదాయ విశేషమున, నిరంతరా భ్యాసమున సుసాధ మయినది. అనూచాన విశేష మెంతేని కూర్చును.

ఈ రమణీయ సాహిత్యవిమర్శనము తొలితరము, మలితరము, మూడవ తరము, నాలుగవతరము, ఐదవతర మని యైదు విధముల లక్ష్మీకాంతమ ప్రమదా ప్రపంచము ప్రస్తరించి కు స్తరించినది. కాంతమ దృష్టిలో తొలితరము ప్రాచీనాంధ్ర కవిత్వము, మలితరము శ్రీవీరేశలింగయుగము, మూడవతర మాధునికాంధ్రవాఙ్మ యము, నాలుగవతర మద్యతనాంధ్రయుగము, ఐదవతరము నవ్యాంధ్రవాఙ్మయము. సాహితీ స్త్రీ యం దిట్టి తరముల విభాగము లేదు. స్త్రీ సాహితి యం దిది యపరిహా ర్యమే యయినది. ఇందుపపత్తి ప్రతిపత్తులు తుదిసమీక్షలో విప్రతిపత్తి లేకుంటకై నిరూపితము లయినవి. తొలితరమున 24, మలితరమున 29, మూడవతరమున 19, నాల్గవతరమున 11, ఆయిదవతరమున 42, కవితావనితలు పరామృష్ట లయినారు. తన కందరి చరిత విశదముగ తెలియ లే దని కాంతమ యంగీకరించినది. అందు నను 'చరిత్ర తెలియని ఇతర కవయిత్రులు' ముప్పదియార్గురు వేరుగా నున్నారు. వీరి విశేషము లత్యంత సుప్రసిద్ధములు కావు. శ్రీ పద్మావతీదేవి, దుర్గాబాయి,

నాయిని కృష్ణకుమారి, సీతాకుమారి,ఇందిరాదేవి, ఇల్లిందల సరస్వతీదేవి, శకుంతలా దేవి సారస్వత జీవితగతులు పత్ర పత్రికా పుత్రికలలో చిత్రిత లగుచునె యున్నవి అయిన నీదృశల స్పష్టావగతి లేక చిత్రీకృతి సాధ్యమా?. ఇంక 31 యబలల నామము లుల్లి ఖితము లయినవి. వారందరి దెలియుట కష్టమని యే రనలేరు? 'పురుషులు రచింపని కవయిత్రుల చరిత్రలనపేక్షతో వ్రాయుటయే నాకు పరాయణ' మని లక్ష్మీకాంతమ తెలియ జెప్పినది. గ్రంథమిట్లు శ్రమించి కూర్చిన పిమ్మట లభించిన విశేషము లాధారించుకొని యనుబంధమువ సప్త స్త్రీ శ్రీ చరితములను కాంతమ కూర్చినది. అప్పటి కయిన ననుపేక్షితాపేక్షిత చరిత లందిన సమీక్షించుట కవకాశ ముండెడిది. ఇంతకును ''భవిష్యత్తులో ఇంకొకరు చరిత్ర వ్రాయడానికైనా యీ గ్రంథం ఆధారంగా ఉండా ''లని ఆమె తలంపు. ఇది యత్యంతము యుక్తము. 'మహిళా వాఙ్మయానికి తీరని అపచారం జరిగిన దని శ్రీ లక్ష్మీకాంతమ యనును. ఇట్టి వంతట జరుగును. అది యుపేక్షా కృత మపేక్షాకృతము కాదు. సమీక్షాకృత మనులయు గాదు. ఒకరొకరి ప్రతీక్షకై కొన్ని కొన్ని యట్లుండుట యపరిహార్య మగును.

తెలుగుభాషాసమితి సాంస్కృతిక ప్రదర్శన పటపట్టికలలో కొందరు వనితలు నామసౌభాగ్యముతో నున్నారు. అజ్ఞాతలె కొందరు జ్ఞాతలై యున్నారు. తెలంగాణాలో, రాయలసీమలో. రాష్ట్రేతరాంధ్రులలో నే డింక నెందరో యున్నారు కళాశాలా పాఠశాలాధ్యాపికలు, పట్టపరీక్షాసముత్తీర్ణలు, విద్యాభాషా ప్రవీణలు, స్వయమాచార్య లెందరో నుందురు. వారి నందరి సాక్షాత్కరించు కొనుట సుశకము కాదు. శ్రీ ఊటుకూరిలక్ష్మీకాంతమ ఇట్లు సమీక్షాదక్ష యగుటయ కాక, కవితాదక్షయునగును. ఆయమ్మ విశిష్టత కూడ నిందు చేర్చిన, $24 + 29 + 19 + 11 + 42 + 7 = 132 + 67 = 199$ సంఖ్యాకులతో 200 మంది కవయిత్రులు కానే యయినారు. ఇంకను,

1 అక్కమహాదేవిచరిత్ర రచించిన బాల పాపాయి.

2 మోహినీదండకము వ్రాసిన రంగాజమ్మ.

3 అల్లాడ విజయభూపతిలాసము -సౌందరీదేవి.

4. జొహరాపురం కమలాదేవి.

5. తెలికపల్లి నరసమ
6. కోదాటి నరసమ
7. బెంగుళూరి నాగరత్నమ
8. యమ్. రంగనాయకమ.
9. కె. లక్ష్మమ
10. రుద్రభట్ల లోకమ
11. వంగల వెంకమ
12. కళ్లేపల్లి వెంకటనరసమ
13. కాకాణి వెంకటనరసమ
14. పి. వెంకటసీతమ
15. అమలాపురపు సీతారామమ
16. బోర్లెం హనుమంతమ
17. న డూరి ఆనందమ
18. చిల్లరిగె స్వరాజ్యలక్ష్మి
19. గొబ్బూరి హనుమాయమ
20. నండూరి సరస్వతి
21. పసల సత్యవతి
22. జిన్నూరి లీలాకుమారి
23. దేవరాజు లక్ష్మినరసమ
24. వడ్లమూడి శశికళ
25. గారపాటి కమల
26. అన్నే అనసూయ
27. దాసరి శకుంతల
28. యేలూరిపాటి ఝూన్సిలక్ష్మి
29. మల్లాది పద్మావతి
30. మేడూరి నిర్మల

మొదలగువా రెంద రున్నారో మహానుభావ లందరకు తెలియదు. కొందరు సీమంతినులు పేరు పెట్టుకొనరు. ఈనాటి యోషలు కొందరు మారుపేరులతో రచనలు ప్రకటించుచున్నారు. శ్రీ పదాంతవ్యక్తు లీనా డెందరో వినబడుదురు.

వారందరు స్త్రీ లగుదురో, అస్త్రీ లగుదురో. కనుకలి యున్న గాని యీ కలిలో జెప్ప జాలుదుమా? లక్ష్మీకాంతమ వారి వారి కృతుల చక్కగానే సమీక్షించినది. కొందరి కొందరి కొన్ని కృతు లావిష్కృతి నొందక పోవుట, పరిష్కృతి పడయక పోవుట లిత్యాదులు నిదానముగా కతిపయ సంవిజ్ఞాతము లిందు కన్పడవు. శ్రీబెల్లం కొండ కనకమ సంస్కృతకవితల గూడ వెలయించినది. కతిపయ సౌభాగ్యవతు లాంగ్లమున 'పొయిట్రీలు' పలుకుచున్నారు. హిందీ కవిత లనుచున్నారు. చిలుకూరి నారాయణరావు ధర్మపత్ని యాంధ్రమున కన్నడమున కైత లల్లిగలదు. ఈ సకల కలాసౌభాగ్యల సకలకలామయజీవిత కలాసర్వస్వము నొకరే సునిరూపము చేయుట యశక్యక్రియ. అశక్య మొకప్పుడు దుశ్శకము కావచ్చును అదియ సుశక మని కాంతమాసమీక్ష చాటి చెప్పు నందును.

శ్రీ లక్ష్మీకాంతమ పింగళ సంవత్సరమున (1917) నాళముకృష్ణారావు సుశీలమ్మలకు జన్మించినది. అన్నదమ్ముల సమాదరము పొందినది చిన్నతనమున వీధిబడిలో విద్దెల నేర్చి. రాజమహేంద్రవరము వైశ్యసేవాసదనము యువతీ సంస్కృత కళాశాలలో బత్తుల కామాక్షమ్మగారి సమక్షమున సంస్కృతాంధ్రము లభిమానముగా నభ్యసించినది. లలితకళ లని యిప్పటివారను చిత్ర నాట్యసంగీతము లలవరచుకొనినది. ఆంగ్ల హిందీభాషల పరిచయము సంపాదించినది. 1935 వ సంవత్సరమున 'ఉభయభాషాప్రవీణ' పరీక్షలో ప్రథమగణనీయగా సముత్తీర్ణ యయినది. యల్లాప్రగడ జగన్నాథ ప్రబోధసహకారమున నాధ్యాత్మికాసక్తి కలిగి రామకృష్ణ అరవింద, రమణ ప్రముఖ మహనీయుల తత్వముల తెలిసికొనినది. అప్పటిలో 'కృష్ణకుమారి' పేరుతో లక్ష్మీకాంతమ గద్యపద్యములు రచించి పత్రిక లలో ప్రకటించినది. అవి నాటికి నేటికి ప్రశంసాస్పదములు. శ్రీ నాళం కృష్ణా రావుగా రేకేశ్వరప్రార్థనాసక్తులు. బ్రహ్మసమాజధర్మ పరాయణులు. అప్పటప్పట నైమిత్తికగోష్ఠులలో సాయంప్రాతస్సమయములందు కృష్ణకుమారి యావేశమున భజనము చేసెడిది. ఆమె మన స్నేహితుల్లో ప్రతీకారాధనమున లగ్నమయినది. లవణ క్షార రూక్షములు పట్టక. చెఱుకురసము మామిళ్ళు త్రావి, మల్లె జాజి గులాబులు తరుముకొని, ముత్యాలపేటల మురిపెములతో చిన్నతనమున నల్లారుముద్దుగా పెరిగినది 'కృష్ణకుమారి' కి పదమూడవయేట (24. 3. 1930) వివాహ మయినది నాళము వారి 'విష్వక్సేన' గోత్రమునుండి ఊటుకూరివారి 'సుకాంచన' సగోత్ర యయినది. శ్రీ ఊటుకూరి హయగ్రీవగుప్త

లక్ష్మీకాంతమ సౌభాగ్యవైభవము. వివాహమయిన పిమ్మట గూడ లక్ష్మీకాంతమ వీణా వేణు నాట్య భాషా విద్యా గీత సంగీత విశేషాభిజ్ఞ యగుటలో శ్రీ హయగ్రీవ సుప్తాంగీకారమె సర్వహేతువు. శ్రీ గుప్త తండ్రి శ్రీ వేంకటేశ్వరశ్రేష్ఠి (ఈటుకూరి రామయ్యగారి కుమారుడు) సంస్కృతప్రియత, తల్లి శ్రీ రంగమ్మ సారస్వతాసక్తి లక్ష్మీకాంతమ్మకు మంజులాశీస్సు లయినవి. గుప్త పితృపాదులు వేదసంస్కృత పాఠశాలానిర్వహణమున సుప్రసిద్ధశ్లోకులు. (నేటి చీరాల కళాశాల కదె పునాది.) కాంతమ తల్లిదండ్రులు కళాప్రియంభావుకులు, సారస్వత పోషణారాధనాసక్తులు. కావుననె లక్ష్మీకాంతమ ప్రశస్తపితృమతి, ప్రశస్త మాతృమతి. ప్రశస్తభర్తృమతి. అంతటగల యీ సుప్రశస్తి ఆమెకు విద్యాప్రశస్తి నిచ్చినది. నేడు, శ్రీ ఈటుకూరి లక్ష్మీకాంతమ ''ఉభయభాషాప్రవీణ" ''విద్వత్కవయిత్రి'' "ఆంధ్ర విదుషీకుమారి," ''తెలుగుమొలక'' ''కవయిత్రీతిలక,'' ''ఆంధ్రసరస్వతి'' ప్రముఖ బిరుదభూషిత యయినది. సమకాల పత్రికల నన్నిట నామె రచనలు గలవు. ఆంధ్రదేశ ప్రసిద్ధసభారంగములం దంతట నామె ధీరగంభీర వచనములు నిత్యము ప్రతిధ్వనించును.

ఏ విషయమున నైన తన నిర్దిష్టభాషాపుష్టితో సదస్యులకు సంతుష్టి నిచ్చి భావసమారాధనము చేయును. ఆమె సంస్కృతమునం దుపన్యసించెనా! తేట తెలుగువలె సుగమత్వము సూచించును. ఆంధ్రమునం దట్టె మాటాడెనా! సంస్కృతపండితుల తలలూగును. పత్రికారచనలలో, రేడియోప్రసక్తి విశేషములలో స్త్రీత్వ ముల్లసిల్లునట్లు లక్ష్మీకాంతమ్మ సూచనలు చేయును. ఏవంవిధ విశేషము లనేకములు కాంతమ ఏవంసమర్థ యగుటలో సమర్థహేతువు లయినవి. పేరులో, వాక్కులో, భావములో, సమాజములో, ధర్మములో, గృహములో లక్ష్మీకాంతమ కాంతస్వభావ.భర్తృధీతమయిన న్యాయవిద్య భార్యలో సఫల మయినదని, భార్య సాహిత్యకత భర్తలో స్వప్రయోజన మయినదని ఒకరొకరు ఒకరొకరి ప్రేయః శ్రేయో హేతువులై స్వాత్మ సంవాదము పొందుదురు. ఆ సుమానుషసంపత్తి లక్ష్మీకాంతమను వీరభావ చేసినది. సభాగంభీరయై, భాషాప్రసన్నయై, భావ శాంతయై, సుముఖవధువై తన పుత్రీ పుత్రులకు సదపత్యశోభిత, ఈ కుంకుమ శోభిత చక్కగా శ్రద్ధగా తన విశేషముల సంక్రమింపజేయుచున్నది. ఇది మోద సమ్మోదములకు నిదానము.

అంత స్సంజల్పరూపభాగ్యము కలిగి, జిగి బిగి చేర్పు కూర్పు కల పొందిక పట్టి, యభంగురము, స్వస్పందసుందరము, భావభరభాసురము మయిన యొకానొక భాషను తనకై తాను సృష్టించుకొనెను. కవితామయ మయిన శ్రద్ధ సభావేదికలో కాంతమ్మకు విశిష్టతను గూర్చినది. కవయిత్రీ హృదయవేదనాపాకము సర్జవ హేతువు కాగా, కేంద్రీకృతకాంక్షాపరిణామముగా మగ్న భావసమున్మీలనముతో నిగీర్ణమయిన కవయిత్రీజీవనమును కాంతమ యావిష్కరించినది.

"అక్షరాదిరచనైవ యుజ్యతే
తత్రవస్తురచనా పురాతనీ"

అని యానందవర్ధను డనినాడు. ఇట్టి ఘటనాపటీయఃప్రజ్ఞ ప్రాబంధిక భాషాభాషిణి యయిన యామె కసాధ్యము కాదు. పచేళిమభావసంస్కారముతో కవితా వనితా జనతా జీవితముల నధ్యయనించి, సాంస్కృతికాత్మ సంస్కారమున, పద్యావిద్యా పద్యారహస్య విజ్ఞానమున రమణీ సాహితీ సమీక్ష చేసినది.

ఇందు ముక్తకసమీక్ష యున్నది. కామినీ కవితా పరీక్ష యున్నది. కవితా ప్రతీక్ష యున్నది. కవయిత్రీ నిరీక్ష యున్నది. తగిన చరిత్ర పరీక్షయు నున్నది. ప్రసన్నగంభీరము, లలితమధురము, సర్వశ్రుతిసుభగము, ఓజస్తేజః పూర్ణము నయిన రచన యందర కలవడదు. అలవడిన దాని నుపేక్షించుట కాత్మయే సహింపదు. స్వార్ధభాగమున పూర్ణత్వ ముపాదించు స్త్రైణము భావని గరణము పొందిన దని వేదనవడి బోధనకై కాంతమ 'కవయిత్రులు' రచించి ప్రపంచించినది.

చిరకాలమునుండియు నీమె సారస్వతామృత ప్రవాహమున సుస్నాతి యగుటచే, మాసషట్కావధికానుశీలన మొనర్చి యీ గ్రంథము సంగ్రథించినది. అట్టివారి కంతటి కృషి పర్యాప్తము. సర్వరసభావమిశ్రితముగనె సంసారమును జూచు నేర్పు కల దగుట, గృహిణీసుకరము కాని కృతిభరమును లక్ష్మీకాంతమ తాను స్వీకరించి నిర్వహించినది. పతిప్రదత్తము లయిన ప్రజ్ఞాభ్యనుజ్ఞావకాశములు. కార్తాంతికవచస్సఫలత, జాపకప్రదత్తాలేఖినీప్రభావము, భావి వృత్తిప్రవృత్తి సూచకము లగు స్వాప్నికసంకథలు ఇట్లన్యాన్యము లన్నియు సహకారస్వభావము కల శ్రీ దేవీ లక్ష్మీభావుకలక్ష్మీకాంతమకు సహకార మొనర్చిన వనునది కేవల షట్ప్రజ్ఞానుసంధేయము. పలుకు పలుకున పలుకు

దనమును కలికిదనమును నేర్పుగా గూర్పగల కాంతమ గ్రంథ సంభావనమునకు నీ భావానుసంధాన మపేక్షితము

సాహితీధర్మము గల సాహిత్యమునందు స్త్రీపుంసాత్మకత నిత్యసిద్ధ మయిన మహార్థము. అచట వీరస్త్రీత్వము కాని, వీరపుంస్త్వము కాని వేర్వేరుగా భావింపనక్కఱ లేదు. సాహిత్యమునందు లోకానుగతము లయిన స్త్రీత్వ పుంస్త్వ ములు లేవు. సాహిత్యము సాహిత్యమె. ఇది స్త్రీరచిత మని గాని, పుంవిశేషరచిత మని గాని విశేష మొకటి యసాధారణముగ నుండదు. కర్తృవిశేషము ననుసరించిన భావనా విశేషమును భావుకులు భావాస్వాదనమున భావింపనే భావింపరు. కర్తృ విశేషప్రతీతి కావ్యవిశేషప్రథలో నొకప్పుడు హేతు వగును. కర్తృనిష్ఠములయిన రసభావరాహిత్య సాహిత్యము లట్టియెడ విశేషద్యోతకము లని ధ్వనివాదుల వాదము. ఇట్టియెడ నట్టిదిలేదు. అట్టియపుడు స్త్రీకర్తృకమయిన సాహితిలో నేమి విశేష ముండును? భావనా సమయమున నెవరును స్వాత్మసంహితములయిన స్త్రీత్వ పుంస్త్వములను సంభావించుకొనుట యుండదు. మానవీ మానవధర్మములు కర్తృ నిష్ఠముగా గాని, భోక్తృనిష్ఠముగా గాని కావ్యబాంధవ్యములో గన్పడవు. రమణీ సాహిత్యమె రమణీయ మనుట, కవుల కవితయె కవిత యనుట, ప్రాతిస్వికశ్రద్ధ. పురుషసాహిత్యమె పుమర్థప్రాపకమనుట వైయక్తికాభిమానము. సాహిత్యా స్వాదమున భేదప్రభేదములు కూడిన గతి ప్రగతు లుండవు. ఆంధ్రకవయిత్రీ కవితలు వేరుపాటును సృష్టించినవి యగుచో, కతిపయోపాదేయము లగును. కతిపయ సముపాదానము కావ్యాభిఖ్యా ప్రఖ్యాపన మొనర్పలేదు. నాట్యకారు లుద్దేశించిన ఫలము లప్పటినుండి యిప్పటివఱకు గోచర మగుచునే యున్నవి. అన్నియు నొకట లేవు. ఒకట నన్నియు నుండవు. చానమాది శతద్వయములో నవి కొన్ని యున్నవి. అది వానిలోని సాహిత్యము. ఇట్టిది నరులు వ్రాయనీ! నారులు వ్రాయనీ! మఱి యెవరేని వ్రాయనీ! యొకటిగనే యుండును. మరి స్త్రీ సాహిత్య మన్నది యేమి?

కాని నవలోకోద్దిష్ట మొకటి యున్నది. ఆ యా వర్గసముద్బోధనమునకు ఆ యా వర్గవిశేషములను జెప్పవలెను. ఆస్వాదోన్ముఖతా సంపాదనమున కది మృదూకృతమయిన లలితమార్గము. నేడు నారీగౌరవగానమునకై యెల్లవారును గంఠమున కలస్వనములు నింపుకొనుచున్నారు. తద్గౌరవ గరిమలు స్వస్వ వినియోగమునకు కాగూడదు. తత్తద్రూపధేయములకు సౌష్ఠవ మిచ్చి మాననీయతా

పాదనమునకై కావలయును. వనితల చరితలు, కవితలు, వెతలు, వితములు నుపేక్షితము లగుటలో హేతుకథనము లేల. కాని యుద్బోధకసహకార మున్నప్పు డుద్బుద్ధసంస్కారముతో నిట్లు ప్రబోధము, ప్రచారము, ప్రసారము సంపాదించుటకై లక్ష్మీకాంతమ యొనరించిన యీ సమీక్షకు సహృదయవ్యక్తులు సహృదయకవాటముల స్వాగత మిచ్చుట సముచితము.

ఈ గ్రంథమున నుద్దిష్టలలో "చానమ" మొదటిది. "శేషమ" చివరిది. వీరందరిలో ననుగతముగ నే సాహితీధారావిశేష మున్నదో, యప్పటప్పట కాంతమ చెప్పనే చెప్పినది చానమచాటువు, తిమ్మక్కపాట, మొల్ల తొలితెలుగు కావ్యము, గంగ సంస్కృతకావ్యము, పళని రాధిక యను భిన్నభిన్నోద్యమములతో, విభిన్నకావ్యగతులతో కూడిన నీతిరీతులను చూచి ప్రభువుల ప్రాభవ మందు చితకారణ మని కాంతమ కీర్తనము చేసినది. తొలితరమునాటి కావ్యములె కావ్యము లని మలినాటి కవితాచతురలు కూడ కలయ బల్కుదురు కాంతమ సమీక్షలో తత్తత్కాల పుంకవుల పరీక్షయు జేసినది ఇది సంవాద విసంవాదముల కనికాదు. స్పష్టగ్రాహికకై యిది నిర్దిష్టము. బహుగ్రంథపఠన వ్యవసాయమున నీ తరమునాటి వారి నిర్దేశించుటలో తా నొక భాష శాలీనత స్వీకరించి నానా కవితోద్యమముల చిత్రించినది. అటనట చరిత్ర ముల్లేఖించినది. తిర్యతియ్యాని కింవదన్తి నీతి రీతులను గూర్చినది స్వసంవాద మధురము లయిన కొన్ని పద్యముల గ్రథించినది. ఆ యా పద్యభావముల భావనావశమున సమున్మిషితము లయిన వచనవక్రతలును వ్యంజనాయితములై గోచరించును. మొదట పతిభావమును సంస్కరించుకొనిన చానమాంబా కథాకథనము కాకతాళీయప్రాప్తమయినను సభావము. పఠనాసక్తులకు నట్టి స్వాత్మసమన్వయ మపేక్షితము కాదు. సామగ్రీ సముపలంభక్రమము ననుసరించిన కాంతమ కాలచక్రము నచట నచట దాటి, యటునిటు నిరూపించుట యసముచితము కాదు.

గంగాదేవి, తుక్కాదేవి, రామభద్రాంబ, మధురవాణి, వెన్నెలగంటి హనుమా యమ శ్లోకముల నుదహరించుటలో వాని తాత్పర్యము రూపించవలసినది. అది యంతయు గ్రంథవిస్తృతి యగును కాని తద్భావభావన మసంస్కృతుల కందదు. సంక్షిప్త తాత్పర్యమేని యిట్టిచోట గుర్తించుట సముచితము సంస్కృత మున నైషధీయచరిత మహాకావ్యము నిర్మించిన శ్రీహర్షుడు దక్షిణాపథమున

మధురవాణీజన్మ మెత్తె నేమో ? మధురవాణి యయ్యేను. అతి దుద్దామకవితా ప్రతిభుడు మధురవాణియు నాతనివలె సర్గాంతిమశ్లోకములం దన్నిట తన విశేషముల నాత్మవిశ్వాసమున నిరూపించుకొనినది. అట్టి కవితాత్మవిశ్వాసము వనితామతల్లుల కందర కపేక్షితము. రాజశేఖరుని యవంతిసుందరి యుక్తి వక్రత కల దని. భణితిచిత్రత కల దని కావ్యమీమాంసానివేదనము. అట్టి రీతు లీ ''కవయిత్రులు" గ్రంథమున గూడ కొన్ని కలవు.

ఆ యా కవయిత్రుల కావ్యములందలి వస్తువు ప్రస్తుతించి కవితాసమీక్ష చేసిన గలుగు సంతృప్తి యన్యాదృశము. తత్కవితాసక్తికై ప్రరోచనోద్దీపన మిం దుచితరీతి తాళ్ళపాక తిమ్మక్క కీర్తనలు సాయించినది. గేయములు రూపించి నది. ఏకవిధమయిన ఛందము అవిచ్ఛిన్నభావధారా ప్రతిరూపము. వాల్మీకి యేకచ్ఛందమున తన కావ్యమును గేయపాఠ్య మధురముగాచేసినాడు. గేయకవితా లక్షణము గుర్తించి రాగ తాళలయానుగుణ్యము రూపించి,తిమ్మక్కాదుల సౌందర్య మును తెలియవచ్చును.ఆయా కవితలలో ప్రరోచనాసంపాదనమునకై యలతియలతి చమత్కృతి విశిష్టముల నుదాహరించుట నవవిమర్శ పథమున గోచరించును. కొన్నిచోట్ల కవితల సంవాద విసంవాద ప్రదర్శన మున్నది. భావుకులు కవిత లందలి స్వసంవాదరమ్యత కూడ కాంక్షింతురు. అట్టి కాంక్షితముల కిందు దారి యున్నది. "ఈయమ పలుకుబడి పసదనమున కేమైన పసదనము లీయవచ్చును'', "తుల లేని వెల లేని సాహితి యభినివేశమున విరుగని కరుగని కవితాస్వాదనము" ''ఆనాటికి, నేటికి నేనాటికి నింతుల మేల్బంతి'', "తనచేతం బొనరించు సృష్టి తక్కొరులచేతం గానియట్లు" తా నొక్క వివిక్తపథము నిర్ణయించుకొనినది. ఆ యా ఘట్టముల నిట్టిపల్కు లీ రచనలో సమన్వయించును. వారిని కాంతమయందే యన్వయింపవచ్చునో? పళని, రంగాజమ్మల చిత్రణములో కవితావస్తువును వర్ణితము. రేఖామాత్రముగ లోని సూక్ష్మ భావముల నతి నిపుణముగా నతి లలి తముగ చిత్రించు ఘట్టములు,"తేటతెనుగు తియ్యందనము, పాట కమ్మందనమును, దరులొరసి పారుటలు, రుచిర భావమనోజ్ఞత, మృదుమధురభాషా విలసితము" రచనలో కన్పడును. ఆంగ్లీవాసితు లలవఱచుకొనిన సమీక్షాపద్ధతులు రూపు దాల్చినవి. అయినను భాషామార్దవము పరితల మలచుకొనును. తొలితరము సమీక్ష లోని భాష యొక సొరుతో నున్నది. ''ఆనాటి కవిత లట్లు విశిష్టములు.'' ఇది సంఘటనా రమ్యతచే ధ్వనితము.

మలితరము "కందుకూరి" భావ ప్రభావిత మని కాంతమ నిశ్చయము. అందామె కభిమాన మున్నది. ఆమె యా కాలపు భావ ప్రభావ ప్రస్పందిత సంఘ నియమాచారములలో పారిప్లవము. ప్రతీచీ భావసంసర్గసంపన్నములైన విశేషములు వీచినకాలమున కొందరి స్త్రీల కాదర మున్నది. నాటినుండి స్త్రీలలో కలిగిన స్పందమునకు 'భావచైతన్యము' 'స్త్రీ జనాభ్యుదయము'అను పేరులు కొన్ని రూఢములై వచ్చినవి. దాదా పీ తరమువారు లక్ష్మీకాంతమకు పరిచితలు. సమకాలము వారలను మాటలతో మన్నింప వలసియుండును. ఈ తరమువారలకు ''గారు" లున్నవి. చానమ్మ చానమ్మ, తిమ్మక్క తిమ్మక్క, నాచి నాచి, పళని పళని. వారల నెవ రెఱుంగుదురు? వారి వార లందరకు దూరమయిరి. ... ... మలితరమున విభిన్నము లయిన సారస్వతశాఖ లుదయించినవి. వాని ప్రఖ్యాభిఖ్యలు సావధానమున నిందు సముల్లిఖితము లయినవి.అన్నియు మనకు శ్రుతివిషయములె కాని, దృష్టిగోచరములు కా వనునది భావనీయము. ఈ కలిలో నన్ని కలిగింపులు కలిగియుండవు. వినుకలివి. కనుకలివి కావు. విన్నవానిని కన్నను వినువీథులలో వినుటయ కాని, కనుమార్గమున కలుపలేము. భర్తలు కొందరు భార్యల సారస్వతాసక్తిని భంగపఱచుట మనము వినియుందుము. కనియుందుము. కొన్ని యిందు నిర్దిష్టములు. మఱి కొన్ని యట్లు కావు. ఇంకను ప్రథలు కతిపయనిష్ఠములు కావచ్చును. చెప్పనలవి కానిని, వ్రాయ వలనుపడనివిని. కొన్ని నవకాలకావ్యములు నామకీర్తన-సారములు నేడును ముద్రితములు నందుటయే లేదు.అముద్రితము లెట్లు? వాని వాని విషయమున శ్రుత దృష్ట నామ రూపులు వ్రాసిన వ్రాతలె యాధార మగును.

ఒక్కొకచో నొక్కొకరిని చెప్పునపుడు ''ఆమె పట్టి విడువని సారస్వత శాఖ లేదు. చేసి విడువని కావ్యభేదము లేదు. అనుభవింపక వదలిన గౌరవపదవి లేదు. ఆహరింపక విడిచిన అధికపదము లేదు." ఇట్టి మాటల రచన సొంపుగా నున్నది 'ఇందలి రచనలో కఱకుదనము లేదు గాని, చురుకుదనము కొన్నియెడల నున్నది.' మగవాడు చదివినాడు కాని, సంశయము పోలేదు. చదువ చదువ తెలివి సన్నగిల్లినది. పిదప చూడ వీడు మొదటనేపోలు. గుణము కుదురదు" అను భావమున నొక రాటవెలదిని వెలయించిరి. "ఈమె పుణ్యాన నింతతో వదలినది. 'చదువుకన్న మేలు చాకితన' మని పంచపాదిని జేసి యీ యాటవెలదిచే నీ చతుష్పాత్తును నాడించి విడువలేదు" అని యొకరు చేసిన సమీక్ష బా

గున్న దని యాత్మగంధము కలిపిన కాంతమ వచనము స్త్రైణ ముపేక్షించినవారి పర మని పరిభావ్యము.

కొందరు వనితలు కూర్చినను, వారి కా శోభ యన్యోపక్రాంత మను విషయమున నివి భావనీయములు. "... .. పై గౌరవము బాయలేక యూది యూది పలుమరు పలుకరించుటే కాని,నిజమునకు వెలలేని తులలేని కావ్యరత్నముల హృదయకోశమునుండి వెలువరించి రసలుబ్ధులగు ఆంధ్రుల మ్రోలపలుకు పలుకునకు బేహారము పరపి విలువకొన్న యశోధనముల నుగ్గాణములు నించిన ప్రతిష్ఠ వనితలదే." నవకాల వీరకవితోద్యమమునందు నవవనితల శక్తియుక్తులు, సక్తి రక్తులు, భక్తి భుక్తులు నిరూప్యమాణసుందరములు కాగలవు, "అటనట గొన్ని పంక్తులు విశిష్టగ్రథనము కల యీ గ్రంథమున స్వాత్మపరిచితిసూచనా సారములుగా నున్నవి.''ఇట్లని ధారారూఢవిషయసంభావన చేయువారలకు గోచరించు గావుత! ఇందు స్వాత్మసమ కాలీనల నిత్యవ్యవహృతిలోని స్వాత్మాను భూతి కందిన విశేషములును గలవు. అనర్వాచీనలు వాచనికప్రత్యక్ష లగుట అర్వాచీనభాగధేయము కలవారు కాలేకపోయినారు.

ఆధునికము, అద్యతనము, నవ్యము నని సమకాల సారస్వతమును వర్గీకరించి నిరూపించుటలో నుపపత్తులను లక్ష్మీకాంతమ సూచించినది. వాస్తవముగా సాహిత్యమున యుగవిభాగ ముచితమె కాదు. ఆంగ్లసాహిత్యవిమర్శ పథమున సంచరించిన వారీ యుగవిభాగ మభిమానించిరి. యుగపదార్థము నిట్లు వీ రుపయోగించుకొన జూచిరి. కొన్నివిధముల సాహిత్యము విభజించిరి. సాహితీ పోషకు లయిన ప్రభువులపై యాదరమున నట్టి పని చేసిరి. ప్రభువులును కావ్య విశేషముల గుర్తింపవలసినవారిలో నన్యతములు; పాఠకులు, శ్రోతలు, భావుకులు తాదృశుల నెందరినో యనుగ్రహించిన సారస్వతముపై శ్రద్ధాసక్తులు చూపునపు డిట్లొనరింపము. ఔత్తరాహులు తమ సారస్వతమును వీరగాథ, కృష్ణభక్తి, రీతి, రామభక్తి యని యన్యాన్యవిధముల విభాగించి నిరూపించిరి అది వారలకు సుగ్రహ మేమి? ఆంధ్రసారస్వతమున వారి విభాగములు కాని, వీరి విభాగములు కాని, వేరు విభాగములు కాని సముచితములు కానేరవు. సాహిత్య శాస్త్రీయ విభాగమె మనకు సముచితము. అదియె మన సాహిత్యాస్వాదమున కుపకారము. అట్టిది రానంతవఱకు మన కావ్యాస్వాదము మనకేని శక్యము కాదు. కాని విమర్శల పేరిట వెలసిన రచనలలో యుగవిభాగములు వచ్చినవి. తలపుతలపున విభాగ ముండును.

జష్టిసుయుగము, కాంగ్రెసుయుగము, కమ్యూనిష్టుయుగము అనియు నెవరేని యనగలరు. సమన్వయమును జూపగలరు. ఇట్టి వన్నియు నిలుచు నేమి? స్పష్టగ్రహమునకై కొందరు కొంద రిట్లుచేయుటను కాంతమ గుర్తించినది. అందుననె యిట్టి విభాగ మొనరించి యుండును. సమకాలమున సంచలితము లయి యున్న కొన్ని భావములు విమర్శనములో నుండును కదా?

ఐదవతరమును నవ్యాంధ్రయుగముగా పరిగణించి 43 వ్యక్తుల కవితాపరిచితులందించి లక్ష్మీకాంతమ్మ మొదటి నలుగురి కవితల మాత్రము సమీక్షించినది. శిష్టలయిన 38 వ్యక్తుల కవితలనె యుట్టంకించినది. కొంతగనె కైత యల్లినను, శ్రీ లలితమ్మకు నవ్యాంధ్రకవిత్వమున ప్రతినిధిస్థాన మిచ్చిన కాంతమ్మ సౌహార్ద మభినందనీయము. ''శ్రీ లలితాకవితాసమీక్ష యయిన వెనుక సవివరముగా జీవిత విశేషము వివరించుచు సమీక్షింపవలసిన కవయిత్రుల సంఖ్య ముగిసినట్లే'' లక్ష్మీకాంతమ తత్సమయమున భావించినది. విశేషము లందకపోవుట హేతువు. విస్తృతి భీతి హేతువు, నిర్ణాయకనియతి హేతువు. ''ఒకానొక నిర్దిష్ట మగు ఛందమున శ్రేయస్సంపాదకము లగు కావ్యార్థముల వివరించి ప్రచలింప జేయుటయె పరాయణము'' ఇది లక్ష్మీకాంతమ వికల్పము లేని సంకల్పము అది సకలముగా సఫల మయినది.

ఈ గ్రంథమున రెండువందల కవయిత్రుల నామము లుల్లిఖితములు. పెద్దవి కాని, చిన్నవి కాని వారి కావ్యములు సహస్రసంఖ్యాకములు నిర్దిష్టములు. పద్యకావ్యముల విమర్శనమె యిం దున్నది గద్యకావ్యముల గద్యరచనల పరామర్శన మిందు లేదు. ఇం దుద్దిష్ట మింత మాత్రము. కవయిత్రుల కవితల చవులు చూపుటకై 576 పద్యములను లక్ష్మీకాంతమ కూర్చినది, సమీక్షించినది. సహృదయవ్యక్తుల కర్పించినది.

స్త్రీసారస్వతము నభినందించు స్త్రీ రిత్త యాభిమానికవాము లాడ వచ్చును. పురుషులకు పురుషులందువలె మహిళలకు మహిళలయం దనూయాగ్రహిళత, యీర్ష్యాళుత, యన్యాన్యము లనిపింప వచ్చును. అట్టి వానిని నే నీ గ్రంథమున జూడను అమాయముగా అపక్షపాతముగా శ్రీలక్ష్మీకాంతమ విమర్శ యొనర్చినది. విమర్శనమున కాలరుచి ననుసరించి చేర్పులు రావలెనని కావలెనని లోకము కోరును. లోకకాంక్ష లన్నియు నేకత్రి సిద్ధములు కావు. ఒక్కొకచో నొక్కొక

పథము కాంక్షాగమ్యమున కగును. లక్ష్మీకాంతమ యొక రమ్యపథ మనుసరించినది. అది యశఃసంధ్యా మని నేను భావింతును.

'తెలుగుభాషా సమితి' 'ఆంధ్ర కవయిత్రులు' వెలువడుటకు హేతువు. ఇది ఒక్కొక్కరై మోద మాధానించును. ఇది హిందిలో ననూదితము కావలెను. పరిసరభాష లలో పరివర్తనము పొందవలెను. ఆంగ్లమున ననువాదము పొందవలెను. పరీక్షల పాఠ్యము కావలెను. తెలుగునా డంతట వ్యాపింపవలెను. ఆ ట్లగు నని నేను సంభావింతును. "అస్తు"

"నమస్తే దేశనాసక్త చిత్పూి కాశిప్రదాయినే
విమర్శారూఢతపసే భావానందవిభూతయే"

"భద్రం తే' భద్రమాచక్ష్వ! భద్రాం వాచ ముదాహర!
భద్రయా భద్రభారత్యా భద్రంభావముపాహర!"

"ఆత్మన్! స్వాత్మసమీక్షార్థం ఆత్మానాత్మ విమర్శినీం
వాచమాలిఖ్య భద్రాం మే రసీభూతాయ తే నమః."

నందన-శివరాత్రి
12 ఫిబ్రవరి, 1953.

# మల్లికార్జున మనవి

తెలుగుభాషా సమితివారి పోటీపిలుపున కాకర్షింపబడి 'ఆంధ్ర కవయిత్రులు' గ్రంథాన్ని రచించి సుమారు 20 సంవత్సరాలు గడచిపోయినవి. అది 1953 వ సంవత్సరంలో గెలుపొందడమూ, దేశమంతా ఆవిజయానికి బ్రహ్మరథముపట్టి, జయకేతనాలు ఎత్తడమూ, పత్రికలన్నీ పతాకశీర్షికలతో ప్రశంసించడమూ, వెంటనే ఆ ప్రప్రథమాంధ్ర కవయిత్రీ చరిత్ర గ్రంథాన్ని నేను ప్రచురించడమూ, ప్రచురించిన 2,3 సంవత్సరాలకె ప్రతులన్నీ ఖర్చు కావడమూ, అంతా తలచు కొంటే, అదేదో ఒక అపూర్వమైన మధురస్మృతిగా నాహృదయంలో మెదుల్తు, అపూర్వానందానుభవాన్ని అతిశయంగా అందిస్తూనే ఉంటుంది.

అంతేకాదు. ఒక తపస్సుగా అప్పట్లో నేను ఆ రచనను సాగించానంటే అతిశయోక్తి కాదేమో! అనిదంపూర్వ రమణీయమైన అనితర సాధ్యమైన, ఆ శైలి నాకెట్లా అలవడిందో! మఱి! ఇప్పుడా శైలిచూస్తూంటే మళ్లీనేను ఆ శైలిని చేపట్టి, ఏదైనా గ్రంథ రచనను కొనసాగించగలనా అనిపిస్తుంది !

దానికి కారణాలు రెండు ! ఇప్పుడు దేశంలో విద్య, భాష, పాండిత్యముల పట్ల ఉన్న అభిప్రాయాలు, రెండవది రచన పట్ల నాకుగల దీక్ష !

నేను ఆ గ్రంథ రచన చేసిన రోజులలో పాండిత్యానికి చాలా గౌరవం ఉండేది ! పట్టుమని నాలుగు పూర్వకావ్యాలు చదివిన వారంటేనే దేశంలో గౌరవం ఉండేది !

కాని యిప్పటి పరిస్థితి అంతా తలక్రిందులై పోయినది ! ఏ సమస్యపట్లా, ఏ రంగలోనూ, ముఖ్యంగా విద్యారంగంలో, ప్రామాణికత్వమే పూర్తిగా నశించి పోయింది. దానితో నైతిక విలువలు పోవడమూ, మంచి **Set-up Upset** యై పోవడమూ మనంచూస్తూనే ఉన్నాంకదా ! ఆకారణంగానూ, అంత రచన

చేయగల ఓపిక, తీరిక, నాలో సన్నగిల్లడం వలనను, అట్టి గ్రంథరచనను. నేను ఇప్పట్లో చేయలేనేమో అనిపిస్తూంది. ఏదియేమైనా, కారణాలేమైనా, ఆ వాఙ్మయ శాఖలో ఇట్టి గ్రంథం మళ్లీ రానేలేదు ! ఆ కారణంగా, 'ఆంధ్రకవయిత్రులు' గ్రంథం అప్పటికీ, ఇప్పటికీ ఆంధ్రవాఙ్మయంలో ఆదికావ్యమూ, అద్వితీయ కావ్యమూ అనే ప్రఖ్యాతినీ యశస్సునూ సుస్థిరంగా ఆర్జించుకొన్నది.

అది నా భాగ్యం !

అంతేకాదు ! ఆంధ్రలోకం నాపై చూపిన అద్వితీయమైన అనితరదుర్లభమైన మహాదరం !

నా యీ భాగ్యానికి గర్విస్తూ ఆంధ్రమహాజనుల ఆదరానికి, వారికి కృతజ్ఞతా పూర్వకమైన నాదోసిలిని సమర్పించుకొంటూ ఉన్నాను.

ఈ గ్రంధ విషయం ఇంత విలువైనది కావడం వలన, సుమారు పది సంవత్సరాలనుండీ చాలామంది సాహిత్యవేత్తలు, సహృదయులూ ఈ గ్రంధానికి ద్వితీయ ముద్రణ తీసికొని రమ్మని నన్ను ప్రబోధిస్తూనే ఉన్నారు.

కానీ, నేను కేవలం భాషా సరస్వతిని ఆరాధించే సామాన్య వ్యక్తినేకాని ధనవంతురాలను కాకపోవడంవలన, పలు రంగాలలో దేశసేవకు నన్ను నేను అంకితం చేసుకొంటూ నిర్విరామంగా పాటుపడ్తూ ఉండడం వలనను, నేను ఈ మలికూర్పు మాటను మనస్సులో తలచుకోవడానికే భయపడ్డాను.

కానీ ఈ మధ్య పెద్దలు, పూజ్యులు, సాహిత్యారాధకులు, స్వయం సాహిత్యజ్యోతియైన సోదరులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు "ఆంధ్రకవయిత్రులు గ్రంథానికి దేశంలో మంచి విలువ ఉన్నదమ్మా, మీరు కష్టపడియైనా ద్వితీయ ముద్రణం చేయించాలి.తప్ప"దని నన్ను ప్రోత్సహించడం వలనను, వేయిరెట్లుగా కాగితపుధరా, ముద్రణవ్యయమూ పెరిగిపోయిన సందర్భములో ఆర్థిక సహాయనికి నాచేత ప్రభుత్వానికి అర్జీలు పెట్టించి కొందఱు పెద్దలు సాయంచేయడం వలననూ, కాగితంకూడా Concession రేటులో రావడానికి సాయపడిన, శ్రీయుత I.J. నాయుడుగారి సహాయంవలనను,సోదరులు డా॥ అంతటి నరసింహం గారి సహాయం వలనను నేను ఈ ఆంధ్రకవయిత్రుల ద్వితీయ ముద్రణానికి

సాహసించగల్గాను. ఇంతమంది పెద్దలు, ఇన్ని విధాల సహాయంచేసినా నాబోటి అల్పవ్యక్తికి ఇదంతా కొండంత భారమే అయి కూర్చున్నది. అయినా రోటిలో తలపెట్టడం జరిగింది కనుక రోకటి పోట్లను తప్పించుకోవడం జరిగేపని కాదు ! ఈ గ్రంథాన్నే కాదు ! నా యితర రచనలనన్నింటినీ, సుమారు పది కావ్యాలను ధరలు చుక్కలనంటే, ముట్టుకొంటే వ్రేళ్లు కాలిపోయే. ఈ విపరీత, విపత్కర కాలంలోనే నేను ప్రచురించడం మొదలుపెట్టాను.

ఏమైనా, నా ఆంధ్రదేశం ఉన్నది ! నిత్య సాహితీ సేవా వ్రతంతో, నిరంతర దేశ సేవాదీక్షతో సతమతమైపోయి ఎందరో ఎన్నిరచనలనో ప్రచురించి ప్రబలంగా సాహిత్యానికి సేవచేస్తూంటే, నిస్సహాయంగా, నిట్టూర్పులతో, అనుకూల సమయానికి నిరీక్ష సల్పుతూ, తుదకు తెగించి ముద్రణకు పూనుకొని ఆర్థిక దుర్భిక్ష ప్రభావంతో అల్లల్లాడిపోతూ ఉన్న నేనే ఉన్నాను !

నా ఆంధ్రసోదరులు నన్ను అగాధంలోకి త్రోసివేయరనే నా ఆత్మ విశ్వాస మే నన్నీపనికి పురికొల్పింది ! వారి ఆశీస్సులతో ఆశావహమైన భవిష్యత్తు నూహించుకొంటూ వారికంజలి సమర్పిస్తూ ఉన్నాను.

సాహిత్య విషయంలో నేను ఆంధ్ర కవయిత్రులు రచించిన కాలానికీ ఆధునిక కాలానికీ చాలా భేదం కనబడ్తూ ఉన్నది

ఆనాడు పద్యకవిత్వానికి ఆదరం ఉన్నది. ఈనాడు కవితా విషయంగా గేయ కవిత, వచన కవిత మినీ కవితలకు బహుళతర ప్రచారం ఉన్నది.

ఇక ప్రఖ్యాత ప్రక్రియలైన, కథ, కథానిక, నవలలకు కల గిరాకీ విష యమై చెప్పనక్కరయే లేదు. ఆ ప్రక్రియలలో కూడా కథ, అప్పుడే కొంత తెరమరుగవుతూఉన్నది.

ఈమాసం 'వనిత' పత్రికలో రచయిత్రులతో జరిపినఇంటర్వ్యూలనుపరిశీలించిచూస్తే ఈనాటి సాహిత్యసృష్టిలో వాసికంటె, రాసి యెక్కువౌతూ ఉన్నదనీ, సాహిత్యం ప్రయోజనాత్మకం కావడమే అభిలషణీయమనీ, ఆధునిక రచయిత్రులే భావించే రోజులు మళ్లీ రావడం దేశ ప్రజలకు చాలా శ్రేయోదాయకం. ప్రసిద్ధరచయిత్రు

హై[illegible]లత, రామలక్ష్మి, శారదాదేవి, ఉషాభాటియా, కృష్ణకుమారి, సీతాదేవి మొ||గు సోదరీమణులు వివిధమైన అభిప్రాయాన్ని వ్యక్తీకరించడం ముదావహం !

ఆధునికయుగంలో శ్రీమతులు చోడవరపు సత్యవతీదేవి, దర్భా కామేశ్వరమ్మ, నాయని కృష్ణకుమారి, వేదుల మీనాక్షి, కొలకలూరి స్వరూపరాణి (కొత్తపేట వాస్తవ్యురాలు), శ్రీమతి లక్ష్మి సరస్వతి, జె. వి. సుబ్బలక్ష్మి, [illegible] [illegible] పార్వతీ,నేను,ఇంకా కొందరు ప్రసిద్ధంగా పద్యరచనచేస్తూ ఉండటం ప్రశంసనీయం.

నేటి వచన కవితల విషయంలో, శ్రీమతులు, టి. వాణీ రంగారావు, కాకాని అశోకవర్ధన్, నాయని కృష్ణకుమారి, వాసా ప్రభావతి, వాసిరెడ్డి సీతాదేవి. [illegible] [illegible] కమల, జ్యోతిర్మయి, డి. సుజాత, బుద్ధిరాజు సులోచన, ఉదత్తు సత్యవతి, ఘంటసాల నిర్మల, కొండేపూడి నిర్మల, షహిజాదాబేగం కొలకలూరి స్వరూపరాణి, తురగా జానకిరాణి, దుర్గం తారాబాయి, గోపరాజు హేమలత, శ్రీలా సుభద్ర ఆనందారామం, పి. యశోదారెడ్డి, చిల్లర భవాని, రామినేని [illegible], నేను ఇంకా లెక్కకు మిక్కిలియైన రచయిత్రులు సృజనాత్మకమైన [illegible] కావ్యాలను ప్రచలంగా ప్రచురిస్తూ ఉన్నారు.

ఆంధ్రసాహిత్య రంగంలో ఇది యెంతో శుభావహమైన పరిణామం ! ఈ సోదరీమణులందరకు నా వందనాలు !

ఇంక ఈ రెండవ ముద్రణలో పూర్తి గ్రంథమును 1500 ప్రతులు ముద్రించి, 2000 ప్రతులు నాలుగవ తరము వరకు పరిమితము చేసి ప్రచురించుట జరిగినది.

ఈకారణముగా సమీక్షలో కొందరిపేర్లు ప్రథమప్రచురణలోనివి ఒకటి రెండు కనుపింపవచ్చును. ఈ పొరపాటునకు పాఠకులు మన్నింతురుగాక,

"ఆంధ్రకవయిత్రులు" రెండవముద్రణకు ఆర్థికసహాయ మందించిన

1. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమునకు
2. శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆర్య వైశ్య సంఘము, నరసరావుపేట
3. ది వెస్ట్ గోదావరి ఫెడరేషన్ ఆఫ్ ఛాంబర్స్ ఆఫ్ కామర్స్,&ఇండస్ట్రీస్, ఏలూరుకు అనేక ధన్యవాదాలు

సోదరులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, సాహిత్యరంగమున సుగృహీత నామధేయులు యువభారతి అధ్యక్షులుగా పెక్కుసాహిత్యసంస్థల సభ్యులుగా, ఆంధ్రసాహితికి పూజారులైన ధన్యజీవులు.

ఇట్లపూర్వ మహనీయమైన వారి సాహిత్యసేవయే నేడీ నాడు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, కార్యదర్శిత్వపదవిగా ఆకృతిపొంది వారి నాశ్రయించినది! సుహృదయులు, సుభగంభావుకులూ, అయిన వారినేతృత్వంలో సాహిత్య అకాడమి చల్లని నీడపట్టున ఉల్లాసముగా, తన చరిత్రమున ఉత్సాహాంకములను అలవోకగా పుటలు పుటలుగా త్రిప్పి వేస్తూ ఉన్నది.

అట్టి రసజ్ఞులు, యువసాహితీపరుడు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి సోదరులు నా'' ఆంధ్రకవయిత్రు"లకు ఆప్తవాక్యము వ్రాయుట కంగీకరించుట నాభాగ్యమని భావిస్తూ, వారికి కృతజ్ఞతాంజలు లర్పించుచున్నాను.

అద్వితీయగ్రంథరాజమైన ఈ"ఆంధ్ర కవయిత్రులు" గ్రంథమునకు మలికూర్పు, ప్రచురించుటలో నాకు ప్రోత్సాహమొసగిన శ్రీ దేవులపల్లి రామానుజరావు సోదరులకు, డా॥ అంతటి నరసింహం సోదరులకు. ముద్రణ దోషములను సరిచూచుటకు సహకరించిన పెద్దలు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు (సంగ్రాహకుడు, తెలుగువిజ్ఞాన సర్వస్వము) గారికి, ముద్రణకార్యభారమును వహించి తోడ్పడిన శ్రీ పాండురంగయ్య గారికి, అందముగా ముద్రించి యిచ్చిన శ్రీ S. బడేసాహేబ్ (పార్టనర్, శివాజీ ప్రెస్సు) గారికి నా ధన్యవాదములు. ఈగ్రంథముద్రణకు చౌకధరలో కాగితము ఇచ్చిన ప్రభుత్వమువారికి అనేకధన్యవాదాలు.

బాపట్ల
27.9.1980

ఊ. లక్ష్మీకాన్తమ్మ

# మనవి మాటలు

"గృహిణీ గృహ ముచ్యతే" అన్నారు పెద్దలు. "కవిః కావ్య ముచ్యతే" అంటాను నేను. "ఇల్లు జూచిన దెలియు నిల్లాలి శుభవృత్తి". అట్లే, కావ్యమును గాంచి తెలియనౌ కవులు హృదియు. ఇల్లు లేకున్నను నిల్లా లుండ నగును. కాని కావ్యం లేక కవులు ఉండరు. కమ్మని కవితాత్మతో శోభించే కావ్యప్రసూనాల కున్న విలువ ఇంతనికివెలగట్టడానికి వీలుపడనిది. అట్లా సుకుమార మైన విరులతో దండ గ్రుచ్చడం సుకుమారహృదయ లైన కోమలాంగులకు చేతకాదనే కొందఱపలుకు ఇంకా ఈ రోజుల్లో కూడా పలుకుబడిలో ఉండడం కొంతమందికి ములుకువలె నాటుకొంటూనే ఉన్నది. వనితకు సరియైన అవకాశమా ఇయ్యరు; పైన బహిరంగంగా కార్యకల్పనాప్రమాణాన్ని, కావ్యరచనా చణత్వాన్ని తీవ్రంగా చర్చించేటప్పుడు "స్త్రీలలో సరియైన రచయితలు కవయిత్రిలు లే రని చెప్ప డానికి విచారిస్తూ ఉన్నాము." అని అలవోకగా బాధ్యతారహితంగా వేదికలమీద పిడిగ్రుద్దులతో వాదనలను సిద్ధాంతీకరించడానికి వెనుకంజ వెయ్యరు. ఔను! స్త్రీల కున్న అవకాశానవకాశాలను గుఱించి సత్యంగా మాట్లాడి సరియైన సిద్ధాంతం చెయ్యడానికి వారికి గల బాధ్యత యే మున్నది? "ఏమి! యిట్లా మాట్లాడతారు?" అని నిలదీసి అడిగే దెవరు? ఒక్క భవభూతి గ్రహించాడు స్త్రీలగోడు! "యథా వాచాం తథాస్త్రీణాం సాధుత్వే దుర్జనోజనః" అని నిజం వ్రాశాడు. పాపం! యావత్ స్త్రైణం అంతా ఆ మహాకవికి చెయ్యెత్తి నమస్కారం చేసినా ఋణం తీరదు. రాను రాను ఈ ప్రథ పిల్లికి చెర్లాట, ఎలుకకు ప్రాణసంకటముగా పరిణ మించినది.

ఎన్నో కవిచరిత్రలూ, మఱింకెన్నో వాఙ్మయచరితములూ అప్పుడూ ఇప్పుడూ వెలసినవీ, వెలుస్తూన్నవీ చాలానే ఉన్నాయి. కాని కవయిత్రీ జీవితాలకు కవయిత్రీ రచనలకూ కూడా సర్వసామాన్యంగా చేసే ఆ రచనలలో నిష్పాక్షిక స్థానమూ, ప్రవేశ ప్రాధాన్యాలూ ఇచ్చిన గ్రంథాలెన్ని అంటే, అట్లాంటివాటి

సంఖ్య ్రేళ్ళమీద మడచి చూపడానికి కూడా ఏమీ లేవు. ఎవరో కొందఱు శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీగురజాడ శ్రీరాములుపంతులు, కవిత్వవేది వంటి మహాసుభావులు కవుల అందఱ చరిత్రలూ సవిమర్శంగా వివరిస్తూ, ఏదో కన్నీళ్ళు తుడిచినట్లు మొల్ల ముద్దుపళని, తరికుండ వెంకమాంబలను మాత్రం పేర్కొంటూ వచ్చారు. శ్రీ వేటూరివారి పుణ్యమా అంటూ తిమ్మక్కను వారు వెలుగులోకి తీసికొనివచ్చారు.

భారతీయ స్త్రీసాహిత్యచరిత్రను ఇంగ్లీషులో వ్రాస్తూ, అందులో ఒక్క ఆంధ్రకి కూడా రావలసిన స్థానం ఇయ్యక పోయినారు. ఆధునికులలో కొందఱు శ్రీ మిధునాపంతులవంటి సాహితీవేత్తలు వ్రాసిన 'ఆంధ్రరచయితలు' లాంటి సాహిత్యవిమర్శనలలో కూడా మచ్చునకైన ఒక్క కవయిత్రిపేరు పేర్కొనలేక పోతే ఏ సారస్వతేయులకూ చీమ కుట్టలేదు. ఇది నిజంగా మిక్కిలి శోచనీయ మైన విషయం. అంతేకాదు-ఆడువారితో బాటే జమకట్టా రేమో శ్రీ మధునా పంతులవారు; శ్రీ బొడ్డు బాపిరాజు, శ్రీ నాళము కృష్ణరావు ప్రభృతులే అధమ పక్షం రచయితల పట్టికలలోకి కూడా చేరలేకపోయారు దానికి వారు రూపించు కొన్న కారణాలు కేవలమూ క్షంతవ్యాలు కానివే అని వ్రాయడానికి సాహసిస్తూ ఉన్నందుకు సహృదయులు నొచ్చుకో రని నాకు తెలుసును.

ఇట్లా మహిళావాఙ్మయానికి తీరని అపచారం జరిగిపోయింది. ఈ నాటి కీనాడు మన మద్రాసుప్రభుత్వంవారు తెలుగుభాషా సమితి రూపంతో ప్రత్యేక శ్రద్ధ తీసికొని యీ విషయానికి ప్రాధాన్యం ఇయ్యడం నిజంగా స్తుతిపాత్రమైన అపూర్వ విషయం.!

"ఇంతకూ— ఏరమ్మా పట్టుమని పదిమంది ఉన్నారా పసగల కావ్యాలు సృజించిన కవయిత్రులు? ఎందుకు ఇలా ఊరికే చరిత్రకారులమీద రవాళిస్తావు?" అని అంటారేమో. ఇది చదివిన ఏ కొందరైనా, షుమారు శతాధికసంఖ్య కలిగిన యీ కవయిత్రీ మధురవాఙ్మయ సమీక్షలో నామాటవిలువను, చరిత్రకారుల అప చారాన్ని రుజువు పఱచుకొనగలరు. 'ముంజేతి కంకణానికి అద్దం ఎందుకూ ?' 'తినబోతూ రుచు లడగడం దేనికి ?' ఐతే శ్రీ చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదు గారు భారతిలో కొన్నాళ్ళుగా "ఆంధ్రవాఙ్మయము- స్త్రీలు" అన్న శీర్షికతో వ్రాసి ప్రచురించిన వ్యాసావళీ, శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారి "ఆంధ్రవిదుషీమణులు"

'[illegible]మణులు' అన్న గ్రంథాలూ, స్త్రీ వాఙ్మయసౌధాని కెత్తిన కరదీపికలు. ఇంకా అక్కడా అక్కడా చెదురువాటుగా కొందఱ కవయిత్రుల కావ్యాలపై వ్రాసిన వ్యక్తిగత కావ్యవిమర్శనలు పత్రికలలో అడపాదడపా దృష్టిపథాన పడక పోలేదు. ఇంకా వారూ వారూ కొందఱిట్టి అభిమానాన్ని స్త్రీవాఙ్మయంపై చూపి తమ సహృదయతను చూపినవారు లేకపోలేదు. కాని అది యేమంత చాలినంత సంపూర్ణమైన కృషి కాదని అందఱూ ఎఱుగుదురు.

ఇట్లాంటి పరిస్థితిలో మన ప్రభుత్వంవారి దృష్టి యిటువైపు ప్రసారితం కావడం ఎంత [illegible]. దీనికి ప్రభుత్వమువారి నభినందించక తప్పదు.

ఈ నా రచనోద్యోగానికి ముందు నన్ను ప్రోత్సహించినవారు నా సోదరుడు చిరంజీవి [illegible] పురుషోత్తముగారు ఆవెనుక విషయం తెలిసికొని ఈ ఈ కార్యభారం నీవు చేయక తప్పదని నన్ను పురికొల్పిన వారు శ్రీ నా పతిదేవులు. నా పతిదేవుల సహకారమూ, ప్రోత్సాహము లేకపోతే, ఈ బృహత్కార్యం కడతేరేదే కాదు. నిజంగా వారి కీ విషయంలో నేను చాలా ఋణపడి ఉన్నాననే చెప్పాలి.

తరువాత ఈ రచనావిషయంలో పూజ్యసోదరులు శ్రీ బొడ్డు బాపిరాజుగారు చేసిన సహాయం ఇంతా అంతా అని విలువ కట్టడానికి వీలైనదికాదు. తెలంగాణా కవయిత్రులను గూర్చి తెల్పిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, గ్రంథరచన మొదలుపెట్టింది చివరవఱకూ వలసినసలహా లన్నీ ఇచ్చి పీఠిక వ్రాసి యిచ్చి తోడ్పడిన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు చేసిన సహాయం ఇంతా అంతా కాదు. వీరంతా నాకు అన్నగార్లు. నేను వారికి తోబుట్టువను. ఏరీతిగానైనా వారి ఋణం తీరదు. కృతజ్ఞతాస్మేరభావంతో వందించడం తప్ప-

ఈ నారచనకు శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారివీ, శ్రీ చిరుమామిళ్ళ వారివీ విమర్శలూ ఇంకా ఇతరులవ్యాసాలూ బాగా ఉపకరించాయి.

వేటపాలెం గ్రంథభాండాగారం, శ్రీ సారస్వతనికేతనంవారు చేసిన సహాయం నిజంగా అమూల్యం. భారతి, గృహలక్ష్మి, ఆంధ్ర మహిళ, ఆంధ్ర [illegible]తి, హిందూసుందరి, అనసూయ, ప్రతిభ- ఆంధ్ర వారపత్రికలూ ఒక [illegible]సంచికలూ నేను ఏది కోరితే అదీ, ఎన్ని కోరితే అన్నీ

అసంఖ్యాకంగా నాకు ఇంటికి కూడా ఇచ్చి, వారు తోడ్పడంలో ఎంతో ఔదార్యం చూపినారు. వారికి ఒక్క నమస్కారం చెయ్యడం తప్ప నేను ఇయ్యగలిగిన ప్రతిఫల మేమీ లేదు కదా !

ఒక శుద్ధప్రతి నేను వ్రాసి యిస్తే దానికి ప్రతులు తీసి యియ్యడమే కాక, నా పూనిక విని నన్ను అనేకవిధాల ప్రోత్సహించిన సోదరులు శ్రీ పిల్లుట్ల తిలక్, శ్రీ A. S. ప్రకాశరావు, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము, శ్రీకోనా సుబ్బారావుగార్లకు నా కృతజ్ఞతాభివందనాలు.

స్త్రీవాఙ్మయ పోషకులుగా ప్రభుధర్మాన్ని నిర్వహించిన శ్రీ కేసరిగారి గృహలక్ష్మిపత్రికలన్నీ నా కెంతో తోడ్పడ్డాయి. దానికి వారికి నా ధన్యవాదాలు !

ఇక చెప్పుకోదగిన ఘనసహాయం ఒకటి మిగిలి ఉన్నది- అది యేమిటంటే మా కవయిత్రీసోదరీమణు లొనర్చినది- అడిగినదే తడవుగా తమతమ కావ్యాలూ, రచనలూ పంపి నన్ను బాగా ప్రోత్సహించారు. ఆ నా సోదరీమణులను నే నీ శుభసమయంలో స్మరించక తప్పదు.

ఇక కడపటకు మిగిలిన విషయం- నా రచనోద్యోగం. అది చాలా అవ్యవధికంగా జరిగింది. కేవలమూ ఒక నెలకంటె హెచ్చుగా నేను ఈ రచనకు కాలము వినియోగించలేకపోయినాను. అందుచేత యీ రచనలో ఎన్నో స్ఖాలిత్యాలు దొరలి ఉండవచ్చును. కేవలమూ సహృదయ వాఙ్మయ విమర్శన చేయడం తప్ప, ఏ వ్యక్తి గౌరవాన్నీ క్రిందుమీదులు చేయడం నా ఉద్దేశం కాదు. కాని విమర్శకుని పని కత్తిమీద సామువంటిది. 'పట్టబోతే కప్పకు కోపం, విడువ బోతే పాముకు కోపం' అన్నట్లుంటుంది-నా ధర్మనిర్వహణం నే నెట్లా చేశానో, ఆ మంచి చెడ్డలు సుహృదయుల హృదయరాగంమీద అధారపడి ఉంటివి.

మఱొక్క విషయం చెప్పడం మఱచాను ఇట్టి ఉద్గ్రంథరచనకు పూనుకొన్నా నని తెలియగానే, ఎన్నో పుస్తకాలు తెచ్చి యిచ్చి, పోస్టులోఎడతెరపి లేకుండా పంపీ అనేకవిధాల మానాయన శ్రీ కృష్ణరావుగారు, మా గురుపాదులు శ్రీమతి కామాక్షమ్మగారు ఎనలేని సాయం చేశారు.

[illegible] గూర్చి ఎక్కడా ఇంతవరకూ ప్రస్తావన జరిగి ఉండకపోవ టంచేత నా మనస్సుకు ఏమాత్రం ఇంపుగా ఉన్నా, కొద్ది పద్యాలు వ్రాసిన వారిని కూడ కవయిత్రులలిస్టులో చేర్చాను. ఇంకా అందఱనూ చేరిస్తే షుమారు [illegible] మంది కవయిత్రులు కాగలరు. భవిష్యత్తులో ఇంకొకరు చరిత్ర వ్రాయడాని కైనా ఈ గ్రంథం ఆధారంగా ఉండా లనే తలంపే ఇట్లా చేర్చడానికి హేతువు. [illegible] లేమీ లేదు

— కట్టకడపట ఒక్క ప్రార్థన—

అమృతమయ మైన హృదయభావంతో దీనిని చదవం డని మాత్రం పాఠకుల పదేపదే అంజలిస్తూ విరమిస్తూ ఉన్నాను.

నాపల్లి [illegible] |
24-[illegible] | ఊ. లక్ష్మీకాన్తమ్మ

శ్రీ హయగ్రీవాయ నమః

# ఆంధ్ర కవయిత్రులు

## ఆముఖము

భరతవర్షము రత్నగర్భ. ఆ జనని కడుపార కని పెంచిన శతసహస్ర చిరత్నరత్నములలో మెరుగు మాయక తరతరాలకు వెలుగుదారులు వెలయించినవి కవిరత్నములు. అవి జాతికి వేగుజుక్కలు. దేశమునకు కీర్తిపతాకలు. తత్కావ్య సందేశములు మానవ లోకమునకు మంగళాశాసనములు.

భారతవధూటి యితరరంగములతో పాటుగా కవితారంగమునఁ గూడ పవడపు కోళ్ళ పసిడిగద్దె నెక్కి తన పలుకుబడి చెల్లించుకోగల్గినది. కన్నతల్లిగ, వలపు ప్రియురాలిగ, చిన్నారిబిడ్డగ, ఊఁకొట్టించు నేరుపామె కనభ్యస్తసంప్రాప్తము. సకలకళారసస్వరూప మగు నామె జీవితమే యొక మధురకావ్య మనినచో, సాహిత్యజగమున చంద్రవంకలై కవితామృతస్రోతస్వినుల బంగారు పంటల పండించి నేల నాలుగు చెరగులకు పంచిపెట్టిన మహాకవయిత్రులకు, రసభావబంధురములగు కావ్యవిపంచికల మ్రోయించి విశ్వమానవహృదయ ప్రతిస్పందనములతో చిరజీవనలైన కవితాసరస్వతులకు నీ సీమ లోటు లేదనుట అతిశయోక్తి కాజాలదు.

విజ్ఞానధనులైన పురుషులతో సమముగా పరిషత్తులలో పాల్గొనుచు ధర్మాధర్మ నిర్ణయములలోను విజ్ఞానవిశేషచర్చలలోను, ములుసూపిన తమ వివేకముతో వ్రేల్మిడిపించుకున్న విదుషీమణులు అపాల, విశ్వవార, శశ్వతి. గార్గి, సులభ, మైత్రేయి వేదవాఙ్మయమున లబ్ధప్రతిష్ఠలు.

'వికటనితంబ' యను సరసపదప్రయోగమున తన కదె బిరుదనామమై, చివరకు వ్యవహారసిద్ధ మయిన వికటనితంబ, శ్యామలాంగి యగు సరస్వతి యని దండికవిచే మెప్పులుబడసిన నీలాభట్టారిక యను నామాంతరము కల విజ్జిక, కవికుల

పోషకురాలగు సామ్రాజ్యేశ్వరిగా నెగడొందిన ఇందుబాల మున్నగు కవయిత్రులు, గీర్వాణకవితాకాశమున నిశ్చలసౌదామినులు. పద్మావతి చరణచారణచక్రవర్తులను సృష్టించ గలిగిన పద్మావతీ సదృశలును చాటుశ్లోకములతో రసికజన రసనాగ్ర జీవనలైన కవితాశాలిను లింక నెందరెందరో యెడనెడ నీ సంస్కృత వాఙ్మయ మున నెదురుపడుచునే యుందురు.

ప్రాకృత కవితాకాసారమున గూడ రమణీయ కూజితముల రంజించు రాయంచ లెందఱో కలరు. హాలుడు సంతరించిన గాథాసప్తశతిలో చేవ మీరిన సీమంతినీరత్నములు రేవా, రోహా, పహాయీ, పద్దానహీ, అణులచ్ఛి, ససిప్పహా, అసులద్దీ, మాధవీనాథ మున్నగు వారలీనాటికిని రసగుళికల వంటి తమ గాథలతో కళాప్రియుల మానసముల సుమాళించుచునె యున్నారు. కావ్యమీమాంసాకారుడైన పతిదేవుడు రాజశేఖరుడు మాటికిమాటికిని పాండిత్య ప్రమాణములు ప్రశంసించు నట్లు విదగ్ధభంగీఫణితి, ఉక్తివక్రత మున్నగు విషయములపై స్వకీయము లగు లాక్షణికప్రమాణములను సృష్టించి నిల్పిన మహామతి అవంతిసుందరి, విద్వత్కవికుల సామ్రాజ్య పోషకుడుగా, రసికావతంస మగు ప్రభురత్నముగా వెలసిన భోజమహారాజు పట్టమహిషియైన లీలావతియు నేటికిని స్పృహణీయలే కదా. సమనుపలబ్ధములైన వీరి కావ్యములవలెనె, యశ్రుత కవితాచారిత్రలైన కవయిత్రు లెందరో యెవరు చెప్పగలరు ?

అన్యసారస్వతేయుల నటుంచినను, మన యాంధ్రసాహిత్య ప్రపంచము నందును, సముచితస్థాన మాక్రమించిన కవయిత్రులు శతాధికముగ నున్నారు. వీరి నాయా కాలవిభాగము ననుసరించి నాల్గుతరములుగ పేర్కొనవచ్చును.

ఇంచుమించు పదమూడవ శతాబ్దిపూర్వార్ధమున తిక్కనార్యుని గృహ ప్రదీపములైన చానమ, ప్రోలమలతో, నిజవల్లభుని విజయవంశావతారవర్ణనల తేజోలేఖినిం దీర్చి సాహిత్యమున కోజస్సు కూర్చిన గంగాదేవితో, పదునేనవ శతాబ్ది పదకవితాపితామహుడైన తాళ్ళపాక అన్నమయ్య సతీమణి సంగీత సాహిత్య విశారద తాళ్ళపాక తిమ్మక్కతో మన మహిళాసారస్వత మహనీయచరిత్రము మొనసూపుచున్నది. 13 వ శతాబ్దమునకు పూర్వము కవయిత్రులు కలరేమో కాని, వారి చరిత్రలు కాని రచనలు కాని కాలదష్టములై కానరాకున్నవి.

భారతరచనా నిర్వహణమున నాదికవి నన్నపార్యునకు దోడైన నారాయణ భట్టు కుమార్తె కుప్పమ్మ ఉన్నత కవితావిజ్ఞాన సంస్కారములు కల మనీషి యని వెలసిన దొక ప్రథ కలదు.

స్వాదుకవితా రసవిశేషములు జీవనవిభూతులుగా నివేదించి సుమారు ఏడు వందల యేండ్లుగా ఆంధ్రకవయిత్రులు సాగించిన సారస్వతసేవ తజ్ఞులు గుఱుతింపక పోరని యాశించుచు, నాదికవయిత్రులు చానమ, ప్రోలమలను పరితలకు పరిచయము చేయుచున్నాను.

— ఇది ప్రస్తావన —

——

ప్రాచీనాంధ్రకవిత్వము–తొలితరము

# చానమ, ప్రోలమ

మధురాతిమధుర మగు ఆంధ్రసారస్వత వాహినిని కమ్మని కవితా మరంద ములు చిందించిన కవయిత్రులు పూచిన పొందమ్మిలై పరిమళించుచున్నారు.

ఆమె నలువరాణికి తెలుగుచానలు ఉపాయనముగ పచరించిన తొలి పూజా పద్మము.

ఆమె భారతీసతి మంజులపదరాజీవములకడ మోకరిలిన మొదటి పూజారిణి.

ఆమె వాగ్దేవీసంసద్భవనమున ఆంధ్రకవయిత్రీ ప్రాతినిధ్యము నంగీక రించిన ప్రథమాస్థాని.

ఆమె సుందరాంధ్ర మహిళావాఙ్మయాంబరమున నుదయించిన తొలితార. ఆ పూజ్యురాలు చానమాంబ– అది పదుమూడవ శతాబ్దము.

పూజ్యుడు నన్నపార్యుడు బీజావాప మొనర్ప, కవిబ్రహ్మ తిక్కనార్యుడు ప్రోది సేసి తెలుగుసారస్వతశాఖిని ఆంధ్రావళి మోదముం బొరయునట్లు అమృత ఫలములు గాయించినాడు. కవిలోకమున కాతడు నిజముగ విధాతయె. విధాతృ నిర్మాణరహస్య మేమో, మహిళాలోకమునను ఆ కవివర్యుని కుటుంబముననే ప్రథ మముగ చానలమోమున సరస్వతి యావిర్భవించినది.

చానమ రణతిక్కన యని రాణకెక్కిన ఖడ్గతిక్కనార్యుని కులకాంత. తెలుగుల కవిబ్రహ్మకు వావికి పదినగారు. కరుణామయ దృశ్యముచే కంపితమై కఱగిపోయిన ఆదికవి వాల్మీకిఋషిసత్తముని హృదయ సాగరమునుండి పొంగులు వారుచు కవితాతరంగములు కురంగలించినట్లై, రణక్షేత్రమునుండి పరీభూతుండై పగరకు వెన్నిచ్చి పారివచ్చిన పతిని గాంచి వచ్చినతోడనె, ఉమ్మలికము చెందిన వీరపత్ని చానమాంబాహృదయాంతరాళమునుండి పైకుబికిన శౌర్యాగ్నివిస్ఫులింగ

ములో యనునట్లు, చటులార్భటితో సరస్వతి చానమాంబా ముఖకందమునుండి వెడలి ఛర్రున సాక్షాత్కరించినది.

ఆ కందమె స్త్రీసారస్వతసృష్టికి మూలకంద మయినది.
పగరకు వెన్నిచ్చినచో,
నగరే నిను మగతనంపునాయకు లెందుఁ ?
ముగు రాడువార మైతిమి;
వగ పేటికి జలకమాడ వచ్చినచోటన్ ?

ఓహో ! ఏమి యా వాగ్దేవివీరరసావతరణ ప్రాభవము ! మచ్చునకైనను వ్యర్థపదము కానరాదు. భావనకై యగచాట్లుగాని, పదములకై తడబాట్లు గాని, యతిప్రాసలకొరకై మతిమాలిన యవస్థలు కాని యేమియు గానంబడవు. అవమానముచేతను, ఆక్రోశముచేతను ఉత్తప్తమైన హృదయమునుండి సూటిగ వెల్వడిన కైత యిట్లుండక ఎట్లుండును ? అగును. మఱి నాధుడు విజయలక్ష్మీ సనాధుడై నేత్రపర్వముగ దిరిగి వచ్చినచో, ఆంధ్రలక్ష్మికిని, విజయతేజోవిరాజమాన మగు నాధుని ముఖలక్ష్మికిని, నిండుగరువమున నివాళి యొసంగుద మను భావావేశమును మది పదిలపఱచుకొని యా పుణ్యముహూర్త మెపుడెపుడా యని యెదురుచూచుచున్నసతి యెదకు, ఖండనమునుండి పారివచ్చిన పతిదేవుని ప్రాణములతీపి సహ్యమాన మగునా ? ఆ యావేశమె ఉత్తాలతాలతరంగితమై కట్టలు త్రెంచుకొని హృదయపుటంచులు దాటి పెల్లుబికి వెల్లి విరిసినది.

చానమాంబ చక్కని కవితాత్మ గల కాంత యని యా కందమె చాటుచున్నది. ఆమె కావ్యసూనముల గ్రుచ్చి వాగ్దేవి కంఠహారముగ నలంకరించు నవకాశమె యుండిన, మనమును మేరలు లేని కావ్యపఠనానందము నొందగల మహాభాగ్యము నందియుందుము. కాని యేమి లాభము ? అట్టి నోము నోచమైతిమి.

ఇంతియె కాదు – 'ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్త్రం' అన్నట్లు, కవితిక్కననుు, ఖడ్గతిక్కననుు, తెనుగుప్రజకు కాన్కలిచ్చిన ముదుసలి ప్రోలమ కడుపెంత బంగారపు గనియొ కాంచితిరా ? ఒకవంక వీరరస తరంగిత మహాసాగర మాతల్లి

గర్భసీమ. ఆ గర్భశుక్తిముక్తాఫలమె రణ తిక్కన ! ఒకవంక గమ్మన వలచు కవితా కర్పూర సౌరభ్యసంవాసిత మా చల్లనితల్లి గర్భసీమ. ఆ తల్లికడుపు పొందమ్మిని పొటమరించిన మరందబిందువే కవితిక్కన.

ఒకపరి శౌర్యరసము చేపి చన్గుడిపిన వీరప్రసవ యామె. ఒకపరి పౌత్రిళ్ళ పసిబాలునకు కవితారసామృతము పాలిచ్చి పెంచిన దా తెల్గుల భాగ్యరాశి. తిరిగి వచ్చిన సుతుం గాంచి యామె ఏమన్నదో చూడుడు.

"అసదృశముగ నరివీరుల
పస మీరగ గెలువలేక పందక్రియ, నీ
వసివైచి తిరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్."

పలుకులా యివి ! గరళపుములుకులు గాని ! ఆ కుటుంబ మెంత గౌరవార్హమో ! అత్త కవయిత్రి ! కోడలు కవయిత్రి కుమారుడు కవిబ్రహ్మ ! యింకేమి కావలయును ఆ కుటుంబమునకు, అట్టి కుటుంబమును గన్న తెల్గుధాత్రికిని ?

ఈ యాడువారి ప్రతాపాగ్నిచ్ఛటులధాటి కోహటించ లేకయే కదా, ఖడ్గ తిక్కన రణసీమకు మగుడి వెడలి యద్భుతముగ నరివీరుల కసిమసంగి విజయలక్ష్మిని చేపట్టినాఁడు !

స్వదేశమునకు సమరవిజయమును సముపార్జించిన యా కవయిత్రుల తేజోలేఖిని యాంధ్రదేశమున నేటికిని నజరామరకీర్తులతో శోభిల్లుచున్నది.

ఇది స్త్రీ వాఙ్మయరంగాలంకరణము సవరించిన ప్రారంభయుగము.

— ఇది ప్రారంభము —

---

సంస్కృత మహాకావ్యకర్త్రి

# 3. గంగాదేవి - మధురా విజయము

విద్యానగరసామ్రాజ్య మహాపీఠమును మలిచిన మహాశిల్పులు సంగవంశజుల శక్తిసామర్థ్యముల నేల నాలుగుదెసలకును సారించిన స్వర్ణయుగ మది ! అందు 1370 సంవత్సరప్రాంతమున రాజ్య మేలిన మూడవరాజు కంపరాయలు పుట్టువు తోడనె స్వీయ ప్రతాపమున పరిపంథుల నాసాంతము కంపింపజేయు సార్థకనాము డని దేవేరి గంగాదేవిచే సంస్కృతకావ్యమున ప్రాభవవర్ణనము లొందిన వసివాళ్వా డని వన్నెకాడు.

గంగాదేవి విద్యానగర సామ్రాజ్యమునకె కాదు, విద్యాప్రాజ్య సామ్రాజ్య మునకును పట్టమహిషియె. కవికులగురువగు కాళిదాసంతటి వాని నాదర్శముగ గైకొని, ఒక్కొక్కచో నాతని కవితలకును మెఱుగులు దిద్దజాలిన మెలకువ గల మెలత యామె. చిత్తగించెదరా ? యామె యుపమాచిత్రణము :—

సనయన్ మహతీం సేనాం
వ్యరుచ ద్వీరకుంజరః
పయోదమాలా మాకర్షన్
పౌరస్త్య ఇవ మారుతః॥

[వీరకుంజరుడైన ఆ కంపభూధవుఁడు మేఘమాలను గొనిపోవు తూరుపు పయ్యెరవలె గొప్పసేనను వెంట నిడికొని పోవుచున్నాడు] అని వర్ణించినది. ఈమె యీ శ్లోకమునకు ఆధారభూత మగు కాళిదాస శ్లోక మీ విధముగ నున్నది :

స సేనాం మహతీం కర్షన్
పూర్వసాగరగామినీమ్
బభౌ హరజటాభ్రష్టాం
గంగామివ భగీరథః॥

(తూర్పు సముద్రమువరకు వ్యాపించియున్న తనసేనను హరజటా జూటమునుండి "భ్రష్ట" యగు గంగను గొనిపోవు భగీరథునివలె రఘుమహారాజు

తీసికొనిపోవుచుండెను.) కాళిదాసు ఈ శ్లోకమున రఘువంతటివాని సేనను భ్రష్ట యైన గంగతో ('భ్రష్ట' పదము నుపయోగించి) ఉపమించెను. ఈ వర్ణనము కును, మన గంగాదేవియుపమకును భేద మారసితిరా? ఆమె యెంత లలిత మగు ఉపమ నుపయోగించి విధేయివస్తువున కెంత సురుచిరత్వము నాపాదించినదో! స్త్రీహృదయ సౌకుమార్య మట్టిదే కదా! ఇదియే కాదు - ఈమె ఉపమ లన్నియు నిట్టి విశిష్టములైనవే. ప్రకృతిమనోహరత్వ మీమెకావ్యమునం దెల్లెడను పాదు కొని యున్నది.

ఉన్నత మైన ఈ రమణీయ భావకల్పనతో పరిచయపడిన గంగాదేవి కవితానిస్తులసంపదకు హృదయసీమల నెంత యున్నతస్థాన మిత్తురో చదువరులు! కావ్యరచనము ఆర్యభాష యగు సంస్కృతము! కావ్యవస్తువు వలచి వలపించు కున్న వల్లభుని విజయ యాత్రాభివర్ణనము!! నిర్వహణము అష్టాదశవర్ణనా లక్షణలక్షితమగు మహాకావ్యము!!' శైలి సులభసుందరమగు ద్రాక్షాపాకము!! ఆదర్శము మహాకవికావ్యార్ధ నిస్తులసంపద!! ఇక కావ్యము గుణవత్తరము, రసోదంచితము ననుటకు సందియ మేమి?

మన కావ్యవస్తువును ఖ్యాతము, కల్పితము, ఉభయము నని ముత్తెఱగుల విభజింపవచ్చును. అందీ కావ్యవస్తువు ఖ్యాతము. సాధారణముగ మన సంస్కృ తాంధ్ర కావ్యములకు పురాణాదులనుండి యితివృత్తము గైకొని దానిని స్వకపోల కల్పనముతో పెంపొందించి ప్రబంధము గావింతురు. కాని ఉపజ్ఞామహిత యగు గంగాదేవి మాత్ర మట్లుగాక, తన జీవనప్రభుని వీరగాథలె కావ్యవస్తువుగా గొని క్రొత్తబాట వెలయించి, కవిపుంగవులకును నాదర్శము చూపినది. దైవప్రార్థనతో కావ్యారంభము, కవిస్తుతి,కుకవినింద, విద్యానగరవర్ణనములను గావించినది. బుక్క రాయల దేవేరి "దేవాయి". ఆ దంపతులకు 'కంపన, సంగన, కుమారకంప' లను మువ్వురు కొడుకులు. అందు కడకొట్టువాడు కుమారకంపన మన కావ్యనేత. మొదట సమస్తవస్తుసంపూర్ణయు, నిర్మల సరఃపరిపూతయు, రమణీయ సౌధ సముత్తుంగ మదగజ సంశోభితయు, దక్షిణాశాసరోజాక్షి ఫాలలీలాలలాటికను బోలి నదియు, తుంగభద్రాతీరస్థ మయినదియు నగు విద్యానగరాభివర్ణనము, తర్వాత రాయల దక్షిణ దిగ్విజయాభివర్ణనము, కాంచీపురరాజ్య ప్రతిష్ఠాపనము, రాయల విశ్రాంతిసమయ విలాసజీవనము, యుద్ధకాలాటోపజీవనము, కావ్యగీతిప్రియత్వము,

భార్య యగు గంగతోడి సరససాహిత్యగోష్ఠీభాషణము అనునవి యీ కావ్యమునం దాయా సర్గలలో వర్ణింపబడినవి.

సర్గమున కొక ఛందమును వాడి, యీమె తన ఛందశ్శాస్త్ర పారంగత్వ మును కూడా ప్రదర్శించినది. దేవతాప్రార్థనము, కవిస్తుతి చాలా క్రొత్తపద్ధతు లలో నొనరించినది.

తన కవితా సాంప్రదాయమునకు కులదేవత యగు కాళిదాసు నెంత మహీ యసముగ వర్ణించినదో చూడుడు.

> ''దాసతాం కాళీదాసస్య కవయః కే నభిభ్రతి
> ఇదానీ మపి తస్యార్థా నుపజీవ త్యమీయతః."

ఇట్లే, భట్టబాణుడు, మయూరుడు మున్నగు సంస్కృతకవుల నందరను వేర్వేర 16 శ్లోకములలో వర్ణించినది. తిక్కయజ్వ స్తుతి మఱింత మనోహరముగ నున్నది.

> "తిక్కయజ్వకవేసూక్తిః కౌముదీవ కలానిధేః
> సత్పృష్ణైః కవిభిస్స్వైరం చకోరైరివ సేవ్యతే."

ఇక అర్థము, శబ్దము, భావము, రసము మున్నగువాని నిబంధనతో గూడిన రసభావమహిత మగు కావ్యము దుర్లభ మని మొదలిడి సంపూర్ణముగ కావ్య లక్షణముల వాకొన్నది. కావ్యమున నీషద్దోష మున్నను, అది పరిత్యాజ్యమే యన్నది. కావ్యమున స్వతంత్రతయే ప్రస్తూయమాన మన్నది. కావ్యలక్షణముల వర్ణించిన యీ సామాన్య ఘట్టములను గూడ సిద్ధహస్త యగు నీమె యెంతో మనో హరముగ వర్ణించినది.

ఈ రాజవంశము శైవమతానుయాయి. క్రియాశక్తి వీరిగురువు. ఈమె పేర్కొనుట బట్టి విశ్వనాథకవి యీమెకు కవిత్వగురువుగా కన్పట్టుచున్నాడు. రాజవంశము శైవమతప్రవిష్ట మగుట, నీమెయుపమ లన్నియు శైవసంబంధ ములై యున్నవి. బుక్కరాయలకు పట్టమహిషి దేవాయి. దీని నామె చెప్పినవిధము. "దేవాయీనామ తస్యాసీత్ శంకరస్యేవ పార్వతీ'' "త్రిలోచనామివా పరం...''

"పశుపతిరివ నేత్రై స్త్రిభి రపి...త్రైస్తనూజైరభాసీత్."..."మౌలౌ స్త్ర్యంబక పాదుకాం భూషా మమంస్త......'' "దేవీమహాసేన మివేందు మౌలేః" అను నీ యుపమ లన్నియు శివసంబంధములే.

కంపభూజానికి మహమ్మదీయులకు జరిగిన యుద్ధము లిం దుత్సాహముతో వర్ణింపబడినవి. "అంధ్రాంధకారక్షయతిగ్మభాసో బాణాన్ ము ముంచద్యవనేనరేంద్రః'' ఇందు తెలుగుజాతి పర్యాయాభిదము, "అంధ్ర" పదము ఆది హ్రస్వపూర్వకము గానే పరిగ్రహింపబడు టీమెయభీష్టము.

స్త్రీ యగుట కాబోలు, గర్భమును, గర్భదౌహృదమును చిత్రముగా చిత్రించి నది. రోమరాజి గర్భస్థశిశుసంరక్షణార్థ మేతెంచిన కాలోరగిగా వర్ణింపబడినది. కావ్యమునం దెల్లెడను నిసర్గమనోహరములగు ఉపమలు కుప్పలు తిప్పలుగ కన బడుచుండును. "అంతర్బింబిత చరిపేంద్రో కంపస్యాసిపుత్రికా అప్సరోభ్యః పతిం దాతుం అంతర్వత్నీ కిలాభవత్'' ఇట్టి మహితోపమానము కావ్యప్రపంచమున మరల గానరా దేమో ?

"అవపత్కాల కాలకర్షక స్తిమిరాంశః కలుషే నభస్థలే విమలా ముడుబీజ మండలీం నవచంద్రాతపస్య సిద్ధయే.'' నక్షత్రవర్ణనమందలి ఈ మహీయసకల్పన కానంచంపు భాగ్యమును సహృదయలోక మేమి వెల యిచ్చి విలుచుకొనవలసి యున్నదో? ......ఏనవసర్గయందలి భార్యతోడి సంభాషణము, చంద్ర చంద్రికా వర్ణనము నీ కావ్యమున ప్రత్యేకస్తుతి పాత్రములు. చంద్రునికళంకము నామె యెన్నో విధముల సంభావించినది. అందీ క్రింది రెండుకల్పనలు మరింత మనో జ్ఞము లైనవి, ''రాజు కావున హృదయస్వభావమో అనియు'' ''తమతమ భాగము లలో వ్యత్యాసములు రాకుండ తీసుకొనుటకై యమృతాంధసు లగు దేవతలు తమ తమ భోజనపాత్ర యగు చంద్రునియం దుంచిన మిళ్ళిగరిటె యేమో" యనియు, ఇందలి గృహిణీస్వభావధర్మ విశేషములను చంద్రుని కళంకముతో ముడివెట్టిన యీమె యపూర్వకల్పనకు ముగ్ధు లై రసోచితముగ తల యూచనివా రుందురా ? ఇట్లె యీమె యుపమ లన్నియు, ఈమె కావ్యవస్తువువలెనే స్వతంత్రములు, ప్రకృతి తంత్రములు.

ఈమెరచనమునందు కాళిదాసున కెన్నో అనుకరణములు కలవు. రాఘవేంద్రవిజయ మను సంస్కృతకావ్యమున కనుకరణములును నటనట కనబడుచున్నవి. అయినను నవి కావ్యగుణమునకు అపకర్ష కలిగించునవి కావు.

గంగాదేవి హృదయమువలెనే కవిత్వమును మిగుల సరళముగను మృదుమధురముగ నున్నది. ఇంతయుపజ్ఞ కల యీమె తన్ను గూర్చి కాని, తన పుట్టింటివంశమును గూర్చి కాని యంతగా చెప్పుకొనలేదు. ఈమెరచనలో వ్యర్థపదములు కనపడవు. శైలి అంతటను సద్యోర్థ స్ఫోరకమైన ద్రాక్షాపాకము. ఎక్కడో "సమస్తసామన్తమస్తకన్యస్త శాసనః'' అను మాత్రపు సమాసములు కనబడును. రాజవంశసంజాతయై, పట్టమహిషియై, సారస్వతవ్యాసంగమున దవిలియుండు లేయరుదు. అందును చతురకావ్య నిర్మాణము చేయగలిగిన ప్రజ్ఞామతియగుట యింకను నబ్బురము ! ఇట్లు రాజపత్నులై కావ్యనిర్మాణము చేసినవారు సంస్కృతవాఙ్మయమున మఱికొందఱు కనబడుచున్నారు. వారిలో రాజశేఖరుని పత్ని అవంతిసుందరిని, భోజునిపత్ని లీలావతిని నిట ప్రశంసింపవచ్చును. కల్హణుని రాజతరంగిణి, బాణుని హర్షచరిత్రల వలెనే యిది సంస్కృతమున కావ్యపద్ధతిని వ్రాయబడిన చారిత్రక గ్రంథము. గంగాదేని మధురావిజయము ఎందఱు చరిత్రకారులకో ఆధారభూత మయినది.

తెలుగునాట ఎఱ్ఱాప్రెగడ, నాచన సోమనాధుడు, రావిపాటి త్రిపురాంతకుడు, కాటయవేమారెడ్డి, రేచర్ల సర్వజ్ఞ సింగభూపతి, కుమారగిరి వసంతరాయలు అను కవివరు లీమెసమకాలికులు కావచ్చును.

ఈ కావ్యమునకు తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు తెలుగున ననువాదము కూడ పొసగించిరి. వీరకంపరాయ విజయచరిత్రా ప్రత్యక్షభిప్రేమను కల "మధురావిజయ'' మను మహాకావ్య నిర్మాణ మొనర్చి ప్రథితి కెక్కిన ప్రథమాంధ్రస్త్రీ గంగాదేవి స్త్రీజనమూర్ధన్య.

ఈ గ్రంథము ద్వితీయ ముద్రణమందుచున్న యీ సమయమున నింకొక విశేషము పేర్కొనదగినది కలదు.

ఇటీవల తెనాలి పురవాస్తవ్యులు, మహాపండిత కవీశ్వరులు, బహుగ్రంథ రచనా ధురీణులు నైన శ్రీపోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రివరేణ్యులీ మహాకావ్యమునకు సమగ్రవ్యాఖ్యను రచించుటేకాక 'గంగాదేవి' యను నవలను కూడ విరచించిరి.

———

తొలి తెలుగుకావ్య కవయిత్రి

# 4. తాళ్లపాక తిమ్మక్క - సుభద్రా కళ్యాణము

ఇంతవరకును వాఙ్మయచరిత్రలు వ్రాసిన వారందరును రామాయణ కావ్యకర్త్రిణి యైన మొల్లను ప్రథమాంధ్రకవయిత్రిగా పేర్కొనినారు. కాని బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశ్రమ ఫలితముగా మొల్లకంటెను మున్ముందు జన్మించి తన మంజుల కవితాగానముతో ప్రజల కొసరి కొసరి మెప్పించిన యింకొక సాధ్వీమణి కావ్యము సరిక్రొత్తగా ప్రపంచపువెల్గు చూచినది.

ఆ భవ్యచరిత నామధేయము 'తిమ్మక్క'. ఇంటిపేరు తాళ్ళపాకవారు. ఆ నూత్నప్రకాశిత కావ్యము సుభద్రాకళ్యాణము.

తాళ్ళపాకవారి వంశము కూడ తిక్కనార్యుని కుటుంబమువలెనె పండిత కుటుంబము. ఈ పూజ్యురాలు తాళ్ళపాక అన్నమాచార్యుని పెద్ద భార్య. అన్నమా చార్యుని గొప్ప సంగీతప్రబంధకర్తగా శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగారు బహుళముగ పరిశ్రమించి లోకమునకు పరిచయము చేసినారు. వీరివంశమువాడే చిన్నన్న 'అష్టమహిషీ కళ్యాణమును' రచించు కృష్ణదేవరాయల యాస్థానమునం దుండెను. ద్విపదకును గేయమునకును వీరియిల్లు పుట్టిల్లు. ''చిన్నన్న ద్విపద కెరగును, పన్నుగ పెదతిరుమలన్న పదమున కెరగున్'' అను చాటూక్తి దీనిని ధ్రువపఱచు చున్నది.

అన్నమాచార్యుడు 1424 - 1503 లోనివాడుగా శ్రీప్రభాకరశాస్త్రిగారి నిరూపణము. అగుట, శ్రీమతి తిమ్మక్కయు నప్పటిదే.

తిమ్మక్కరచన మంజరీద్విపద. ఇది గేయవాఙ్మయమునకు మిక్కిలి సన్ని హితమై పాటగా పాడుకొన దగియున్నది. నిజమునకు ద్విపదయంతటి మనో హరచ్ఛందము మఱియింకొకటి లేదేమో ! వివిధములగు జాత్యుపజాతి ఛందో భేదములతో కావ్యమును రచించుటకంటె ఏదియో యొక్క నిర్దిష్టచ్ఛందమునవె

రచన మొనర్చిన చదువరుల కేకతానత నించును. కావుననే వాల్మీకి రామాయణ మంతపెద్దదగు కావ్యమును ఒకే అనుష్టుప్ ఛందమున సాగించియున్నాడు. అంతేకాక, ప్రసిద్ధి వహించిన కొన్ని సంస్కృతకావ్యములలో ఒక్కొక్క సర్గకు ఒక్కొక్క వృత్తము వాడుట గమనింపదగినది. కాని, తెలుగు గ్రంథములు మాత్ర మట్లు కాక, వివిధవృత్తముల కలబోతగానే ఆదినుండియు ఆరంభింపబడినవి. దేశీయచ్ఛందస్సులలో ద్విపదకావ్యములు మాత్రము ప్రత్యేకవిశిష్టములై మాధుర్యమునకును, లాలిత్యమునకును పేరు గాంచిన ఆంధ్రికి వ్యక్తిగత స్వభావనిరూపణములుగా వాఙ్మయమున నిలిచిపోయినవి. ఇంకను చెప్పవలె ననిన, సుకుమార హృదయయగు స్త్రీ హృదయవ్యక్తికివి నివి చెప్పక చెప్పిన సాక్ష్యనిరూపణములే. ఇందు, జాను తెలుగు జాలువారుచు రచన మింపులు గులుకుచున్నది; మూడు ఇంద్రగణములును ఒక సూర్యగణమును కలిసి యొకపాద మగును. ప్రాసనియమము మొదట పాటింపబడినది. తరువాత నేలనో విడువబడినది. ఆసాంతము ప్రాసనియమము పాటింప బడినచో బాగుండు ననిపించినది.

"శ్రీరమావల్లభులు శ్రీకృష్ణ లెలమి
ద్వారకాపట్టణము తమ రేలుచుండ
శ్రీకాంతపతికృపను జెలగి పాండవులు
ప్రాకటంబుగ ద్రౌపదిని బెండ్లాడి.......""

ఇట్లుగా కావ్య ముపక్రాంతమైనది. "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి" అను కావ్యలక్షణమునుబట్టి యిది ద్విపదకావ్య మైనను, నెత్తుగడయే వస్తు నిర్దేశముతో జరిగించినది. శైలి యెక్కడను ఒడిదుడుకులు లేక చక్కని యొదుగుతో, ఒయ్యారపు నడకలతో, కలస్వనములతో కదలిపోవు చిన్ని సెలయేరువలె మనోహరత నించినది.

ద్రుపదాత్మజ పెండ్లి, నారదుడు వచ్చి యేవురకు ఒక్కొక్క యేడు ఆమె భార్యగా నుండుసమయ మాదేశించుట, సమయభంగ మొనర్చిన వారికి ఒక యేడు తీర్థప్రదక్షిణ మను శిక్ష యేర్పరచుట, ఒకప్పుడు బ్రాహ్మణగోరక్షణార్థమయి తప్పనిసరి యయి సవ్యసాచి వ్రతభంగ మొనర్చుట...మొదలుగా గల మామూలు

కథయే యిందును ప్రస్తరింపబడి కుస్తరింపబడినది. కాని, యంత్యమున నిందలి కథకును సామాన్యకథకును గొలదిగ భేద మగుపడుచున్నది. "సుభద్ర కుహ నాయతి యగు నరునకు అన్నయాజ్ఞపై పరిచర్యలు చేయుచుండును. శ్రీకృష్ణుని చనవు నండజూచుకొని యర్జును డామెతో శృంగారభాషణమునకు దిగును. అత డెవరో తెలియక అతని యా వింతప్రవర్తనమును గూర్చి సుభద్ర శ్రీకృష్ణున కెఱిగించును. కృష్ణుడును సర్వమును తెలిసినవా డగుట, నవ్వి 'అమ్మా ! నేను అతని మందలించెదను, ఎప్పటియట్ల నీవు పొమ్మని మరల పంపును." ఈ మార్పుచే సుభద్రసౌశీల్యమునకు కవయిత్రి మించుదనము నాపాదించిన దనియే చెప్పవచ్చును.

తన్ను దరిసి సిగ్గున తలవంచియున్న చెలియలి నెన్ని విధముల కృష్ణుడు సంబోధించెనో:—

"శిరసు వంచుకయున్న చెల్లెలిని జూచి
దయతోడ బిలిచె నా త్రైలోక్యపతియు
అమ్మ రా ముద్దులగుమ్మ రావమ్మ
కొమ్మ రా నవకంపుబొమ్మ రావమ్మ
ముత్యాలసరమ రా ముద్దరాలా రా
చిత్తజుబాణమా చెలియ రావమ్మ
చిలుకలకొలికి రా శృంగారకన్య రా
తొలకరిమెఱుప రా తోయజగంధీ
పండువెన్నెల రావె భాగీరథి రావె
మచ్చెకంటీ రావె మాధవళీ రావె
అమృతంపు తెప్ప రా అరవిరిమొగ్గ
బంగారుపెట్టె రా భాగ్యాలభరిణె
వెలయ ముజ్జగముల వింత యైనట్టి
శ్రీ కలా బిరుదుల చెలియ రావమ్మ"

ఇందలి 'భాగీరథి' 'మాధవళి' యను పదముల యర్థము విచార్యము. ఇన్ని విధముల సంబోధించియు దనివిసనక కడపటికి శ్రీ కలా బిరుదుల చెలియ అనెను.

అనగా 'సంపత్కరమైన బిరుదులన్నియు కలదానా !' యని యర్థమేమో - ఎం
ప్రేమయో చూచితిరా ! శిరసు వంచుక......అనుచో క్రీగీత గలచోట కొ
ధాతుక్త్వార్థమునకు. 'క' అని వాడుట అప్పటికే యున్నది కాబోలు. ఇట్టివి కొన్ని
చూచియె కావచ్చును - వెంకటకవి గూడ నిశ్శంకముగ "ఊదుకపోవు శంఖమ
సహో గళరేఖ" అని వాడియున్నాడు !

ఇంచలి ముద్దులు గులుకు రచనా సంవిధానమునకు మోజుపడి, చేమకూర
వెంకటకవి యీ కవయిత్రి వాడిన కొన్ని పాదములు పాదములే తన విజయ
విలాస ప్రబంధమున సంతరించినాడు:

"ఎగుభుజమ్ములవాడు మృగరాజునడుము
నడచిపుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరనివాడు, చక్కనివాడు, నతడు
గొప్పకనులవాడు, కోదండగుణకి
ణాంకంబులౌ బాహు లమరినవాడు.
వెన్నున మచ్చ కల విభవంబువాడు
బవిరిగడ్డమువాడు, పన్నిదం బిడిన
వెన్ను పగడసాల వెస నాడవచ్చు...".

అను నీ తిమ్మక్క పాదములనే వెంకటకవి యథాతథముగ తన ప్రబంధ
మున నెట్లు పచరించెనో పరికింపుడు:—

"ఎగుభుజమ్ములవాడు మృగరాజు మధ్యంబు
వుడిచి పుచ్చుకొను నెన్నడుమువాడు,
నెఱివెండ్రుకలవాడు, నీలంపు నికరంపు
మెఱుగు జామనచాయ మేనివాడు,
గొప్పకన్నులవాడు, కోదండగుణకిణాం
కము లైన ముంజేతు లమరువాడు,
బవిరిగడ్డమువాడు పన్నిదం బిడి డాగ
వచ్చు నందపు వెన్నుమచ్చవాడు,
గరగరనివాడు, నవ్వు మొగంబువాడు .."

అంతే కాదు - సుభద్ర కపటయతిని గాంచి, "తీర్థయాత్రాపరుడగు అర్జును డెక్కడ నుండెను ? అతనిని మీ రెందైన మీ తీర్థయాత్రలలో గాంచితిరా?" అని యడిగినపుడు, అర్జునుడు ద్వంద్వార్థముగ బల్కిన శ్లేషోక్తికి కూడ నీ సౌభాగ్యవతి యుక్తిచాతుర్యమే మూలకందమైనది.

''అమరగా బలికెను అతివతో నపుడు
కోమలి యిద్దరము గోకర్ణమందు
కూడియే యుంటిమి కొన్నాళ్ళు లచట
భోజనమ్ములు శయనము లొకచోట
చెలియ యుంటిమి మేము చెలికాంద్రవలెను;
అతనికి నాకును నరమర లేదు,
అతనికి నా కైక్య మతివరో వినవె."

అను పద్యపాదములనే పెంచి

''కోమలి యీగతిన్ మది దగుల్వడ బల్కిన నవ్వి నిర్జర
గ్రామణి సూను మీ రెచట గంటిరొ యంటివి ! కన్నమాత్రమే
యే మని చెప్పవచ్చు నొక యించుక భేదము లేక యాయనే
మేమయి యున్నవారము సుమీ వికచాంబుజపత్రలోచనా !"

"తీర్థములను గ్రుంకి దేవతాసేవలు
చేసికొనుచు బెక్కువాసరములు
కూడి యతడు మేము గోకర్ణమునయందు
నుంటి మనిన................."

ఇంతే కాదు - వేంకటకవి పడకటింటివర్ణనలయందును దిమ్మక్క వర్ణనల ననుగమించినాడు. ఇది కేవలము కాకతాళీయ మేమో యనుటకు వీలులేదు.

పద్యపాడములు పాదములు ఎటులుండెనో, అటులే వాడుకొనుటచే నది కావలయునని చేసినపనియే యనదగును.

రసోదంచిత మగు కవిత్వములు గాంచినపుడు, మనసుపడి వాని ననుస రించుట కవిలోకమున ననూచానముగ వర్తిల్లుచు వచ్చుచున్న ప్రాతయాచరమే.

ఇంత కమ్మని కవితామృతము అప్రయత్న లబ్ధముగి నందుచుండ, నా కవయిత్రీ మణి కావ్యమునకు ప్రశస్తి హెచ్చింపజేయుటకును, నా కవయిత్రిపై గల తన ఆదరభావమును ప్రస్ఫుట మొనర్చుటకును, తన కావ్యమున కిమ్మడి యగు శోభ కల్గుటకును వేంకటకవి యట్లొనర్చెను గాబోలు !

వేంకటకవి యంతటివానికిని రచనా సౌందర్య సామాగ్రిని బదు లిడిన తిమ్మక్క సామర్థ్యమును నైపుణియు ప్రశంసనీయములు. కావ్యము మొత్తముపై పైకొన్న నిసర్గ మనోహరధారాప్రవాహ సన్నిభ మగు శైలి పరితను లోగొనుట కేమియు శ్రమ తీసికొనదు.

నీలాలవంటి వా నెలతనెఱికురులు
వాలారుకొనగోళ్ళ వడి చిక్కుదీసె
చుబుకంబు పైకెత్తి చూచి యోదార్చి
మక్కువనె యలరించె మగువనెమ్మోము

అను పాదము లెంత మనోహరముగా నున్నవో రసలోకమే ఎఱుంగును. వేంకటకవి యనుకరణమును బట్టి గ్రంథము వేంకటకవి కాలమువరకు అనగా 18 వ శతాబ్దమువరకు ప్రకాశమానస్థితి లోనే యున్నదని చెప్పనగును. ఈ నడుమ కాల మెట్లు కనుమఱు గైనదో ? ఇప్పటి కైన నాంధ్రుల యదృష్టవిశేషమున దొరకినందులకు సంతోషింపవలసియున్నది. ఈమె మహాకవులు శ్రీనాథ, పోత నాదుల సమకాలీన గౌరవము నందినది.

పస మీరి రుచులీను కవితామృతమును దెనుగువారికి జుబ్బన చూరలుగ గ్రోలనిచ్చిన తొలి తెలుగు కవయిత్రీ ! నీ కివే మా జోతలు !

---

# 5. మహాకావ్య నిర్మాత, ఆతుకూరి మొల్ల రామాయణ మహాకావ్యము

"సుడిగొని రాముపాదములు సోకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొకకాంత య య్యె నట; పన్నుగ నీతని పాదరేణు వి
య్యెడ వడి నోడ సోక యిది యే మగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాము పదకంజయుగమ్ము భయమ్ము పెంపునన్."

అను పద్యరత్నముతో సారస్వతేయుల హృదయపీఠముపై భద్రాసనము గొన్న మొల్ల రామాయణ మహాకావ్య నిర్మాణము గావించిన చదురాలు,

తెలుగు తరుణియై తరుణులలో ప్రథమముగా తెలుగుబాసను మహాకావ్య నిర్మాణము గావించిన ఘనత యీకాంతకు నాటికి నేటికిని నట్లే నిలిచియున్నది. మొల్ల కుమ్మరికులజాత. ఆతుకూరి కేసనసెట్టి యీమెతండ్రి. బాలవితంతు వగుట, గ్రంథమునం దెచ్చటను భర్తృవంశ కథనము కనబడదు. ఈమె ఆంధ్రభోజుడు శ్రీకృష్ణరాయల సమకాలీన యందురు. అనగా 1525 సంవత్సర ప్రాంతము నాటిది. కాని, యేలనో యామెను గూర్చి యాకాలమువా రెవరు ప్రస్తావింపరై రి. దానికి కారణము ఆమె స్త్రీ యగుటయు, కుమ్మరికులజ యగుటయు నేమో ? రాయల యట్టి రసికప్రభు విట్టి దురాచారముల మన్నించునా ! కాకున్న నిట్టి కవయిత్రిని మన్నింపక ఏల విడిచెను ? ఈమె తెలుగునాడున నే మండలమున నుండెడిదో ? ఈమె నెల్లూరు మండలవాసిని యని యొకప్రతీతి. రాయల కీమెయునికి తెలియ దేమో ? కాని యీామె జీవితమును గూర్చి కొన్ని గాథలు కలవు. వికటకవి యగు తెనాలిరామకృష్ణు డీమెను గూడ ఒకప్పుడు తన హాస్యకాలక్షేపమునకు బాత్రముగా జేసి వినోదించె నని ఐతిహ్యములు కలవు. అట్టియెడ రాయలీమె నెరుంగ దన్న నెట్లు విశ్వసింప దగును ? మొల్ల యను నీమె నామమును గూర్చియు, నీమె శీలమును, స్వభావమును గూర్చియు నధిక్షేపించు గాథలెన్నో ఆంధ్రదేశమున నల్లుకొని యున్నవి. కాని అవి యన్నియు నిట నప్రస్తుతము.

ఏమో యీ గాథలే యసత్యప్రవాదములో ? ఏమైనను రామనామస్మరణముతో, రామాయణకావ్య నిర్మాణముతో చల్లగా కాలము గడపి ధన్యురాలైన సాధ్వి మొల్ల యని మనము తెలుసుకొనిన జాలును. తెలుగున రామాయణ సంగ్రహరచన చేసినవారిలో నీమె యొకర్తుక. తిక్కన నిర్వచనోత్తర రామాయణము, అయ్యల రాజు రామభద్రుడు రామాభ్యుదయమును రంచించిరి. కాని విమర్శకులు కవిత్వశిల్ప మున మొల్లకే యనూన గౌరవము నూల్కొలుపజేసిరి.

ఆరు కాండములలో సుమారు 900 పద్యములు కలవు. మొదటి మూడు కాండములకంటె తుదల మూడుకాండములు మరింత మురువు గూర్చినవి. సుందర కాండము మొదలు మొల్ల పరవశత్వము జెంది రామాయణ రచనము గావించినదా యని యనిపించును. యుద్ధవర్ణముల పట్ల నీమె నిజముగ యుద్ధములు చూచెను కాబోలు ననిపించును. గ్రంథము "నగర్త్వినశశి......" వర్ణనాదులతో మహా కావ్య లక్షణలక్షితమై యున్నది. దేశీయ మగు తెలుగురచనపై నామెకు మిక్కిలి మక్కువ. కావ్యరచనకు వలయు లక్షణములు దా నేమియు నెఱుగ ననియు, గోపవరపు శ్రీకంఠమల్లేశు కృపను కవిత్వము చెప్పితి ననియు నామె వ్రాసికొన్నది.

"కందువమాటల సామెత
లందముగా గూర్చి చెప్ప నది, తెలుగునకున్
బొందై రుచియై వీనుల
విందై కానుపించు విబుధులమదికిన్"

అను పద్యమును, మఱియు, 'వలిపపు సన్నపయ్యెద......... పొంద గునే పటహాది శబ్దముల్'' అనుపద్యమును బట్టియు, నామె రచనాపద్ధతి హృదయ పద్ధతి తేట యైన దని మనము తెలియ గలము.

ఈమె రచనయందు అటనట పోతనార్యుని ప్రభావము గానబడుచుండును.

"పలికెడిది భాగవత మట, పలికించెడు వాడు రామభద్రుం డట"

అను పోతనార్యుని యాదర్శమునే తిరిగి మొల్ల యూది పల్కినది.

"చెప్ప మని రామచంద్రుడు
చెప్పించిన పలుకుమీద జెప్పెద నే నె

ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర, తప్పు లెంచకుడు కవుల్.''

అంతే కాదు - కథాంశములలో, వర్ణనాంశముల పట్టునను అంత్యపదనియమములలో పోతనార్యు ననుగమించిన పట్లు గలవు. కావ్యవస్తు వగు రామగాథను గూర్చి పఠితలకు వేర దెలుపవలసిన దేమి ?

కావ్య విమర్శనకు పనివిందము :- మొల్లకవిత్వము కేవల ముఖుసుపోక కేవేవో యొండు రెండు పద్యము లల్లినది కాదు. ఆమె గొప్ప పండితురాలు. సందర్భము ఔచిత్యము నెరిగిన యతివమిన్న. మిక్కిలి కష్టము లగు నర్థాలంకారములను శబ్దాలంకారములను వాడినది. పండితులును సరిగా నిర్వహింపలేని విరోధాభాసాద్యలంకారములను గూడ నిర్వహించినది.

"ప్రకటానురాగసంపన్ను లౌదురు కాని
రమణీయ రుక్మకార్ముకులు గారు.''
"మదనాగయూథసమగ్రదేశము గాని
కుటిలవర్తనశేషకులము గాదు''
అనునవి దీని కుదాహరణములు.

"'రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు, వాహినీ
రాజులు దానమందు, మృగరాజులు విక్రమ కేళియందు, గో
రాజులు భోగమందు, దినరాజులు సంతతతేజమందు, రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారు లందరున్.''

ఇట్టి వామెపాండిత్యమున కుదాహరణములే గాక, భట్టుమూర్తి, అడిదము సూరకవి యంతటివారికి సహితము లోభనీయములై యనుకరణీయములై నవన, యీయమ పలుకుబడి పసదనమున కేమైన పసదనము లీయ వచ్చును.

స్వభావోక్తి చాతుర్యముతో వర్ణ్యాంశమును పఠితకన్నులయెదుట నిల్పు శక్తి మొల్ల యందతిమాత్రముగా నున్నది.

"సాలముపొంత నిల్చి, రఘుసత్తము డమ్మరివోసి శబ్దవి
న్మూలముగాగ వీల్ దివిచి, దృష్టియు ముష్టియు గూర్చి, గోత్రభృ
త్కూలము వజ్రపాతహతి గూలు విధంబున గూల నేసె న
వ్వాలి బ్రతాపశాలి మృడవందనశీలి సురాలి మెచ్చగన్.''

ఇందలి స్వభావోక్తియే గాక, అంత్యపద నియమమును గాంచుడు. అంతే కాక, యీ పద్యమున ధనువు నాకర్ణాంతములాగి విడుచునపుడు, ధన్వి నిలుచుండ వలసిన భంగిమము, ఆ ధనువునం దుంచవలసిన శ్రద్ధాదృష్టియు, నారిని దిగుచు నప్పటి విన్యాసమును మూర్తిమంతములుగా రూపింపబడినవి - చూడు డీక్రింది పద్యమును అట్టిదే.

మొగము బిగించి, పాదముల మొత్తముగా నట నూది త్రొక్కి, నీ
టుగ మొగ మెత్తి, భీకరకఠోరరవంబున నార్చి, బాహు ల
త్యగణితలీల జాచి, వలయంబుగ వాలము ద్రిప్పి వేగునన్
నగము సగంబు క్రుంక కపినాథుడు నింగికి దాటె రివ్వునన్,

అన్నింటిని మించి యందగించిన స్వభావోక్తి :—

పతి బాసినట్టి యాపదకంటె బలుమారు
వివిధమాయలచేత వేగి వేగి
విరదానవకోటి వికృతవేషంబులు
కనుగొని చిత్తంబు క్రాగి క్రాగి
తనదిక్కు లేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోగి లోగి
కర్ణకఠోరముగానాడు మాటల
దొరగెడి కన్నీట దోగి దోగి
రాము దలచుకొంచు, రాముని బేర్కొంచు,
రామరామ యనుచు, రమణి పలుక,

కపివరుండు సూచి కామినీరత్నంబు
సీత యంచు బొంగె చిత్తమందు.

అయోధ్యాకాండాంతర్గత జ్యోత్స్నానుభవ మొకింత తలపున బారనిండు.

''వెన్నెలతీగలన్ గొనల వేడుక ముక్కుల ద్రుంచి తెచ్చి, దా
ర్కొన్న ప్రియాంగనాతతికి కూరిమి నోరికి నిచ్చి, కేళికిన్
సన్నపు కంఠనాళముల సన్నలు జేసి సుఖించె నింపుగన్
దిన్నని బంద్రకాంతముల తిన్నెలమీద చకోరదంపతుల్.

ఉచిత శృంగారరసానుప్రాణితమైన యీ పద్యము విరిసియు విరియని తామరవలె, లలితంపు వలపుల జిలికియు జిలుకని లేగులాబి కన్నెవలె నతి సుకుమారమై యొప్పుచుండలేదా ? చిఱుతపద్దెములలో, అలతిపొలతి పదములలో నెంతో రసభావములను ఒప్పించు శక్తియు దీర్ఘ కథావృత్తముల నలవోకగా, సులలితముగ జొప్పించు శక్తియు కలదు. చిన్నపద్యమున హెచ్చుభావము జొప్పించుటకు,

బడలు ధరియించి తపసుల చందమునను,
దమ్ముడును దాను ఘోరదుర్గమ్ములందు
కూరగాయలు కూడుగా కుడుచునట్టి
రాము డేరీతి లంకకు రాగలండు,

సానలు దీర్చిన జాతిరతనములవోలె ప్రకాశించు నిట్టి చిన్ని గీతము లెన్నైన గలవు.

ఇంక నొక ముఖ్యవిషయమును దడవి మొల్లకడ సెలవు గైకొందము. ఔచితీవిచారమున మొల్ల కడు దిట్ట యని మున్నె పేర్కొంటిమికదా ! ''శింశు పాశ్రిత యగు సీతామతల్లిం గని........దనుజకాంత లంతంత నెడబాసి నిదుర వోయి రంత...యదరి సీత తనకు దిక్కులేమి తలపోసి దుఃఖింప పవనసుతుడు మనుజభాష పలికె......''

ఉన్నాడు లెస్స రాఘవు,
డున్నా డిదె కపుల గూడి యురుగతి రానై
యున్నాడు, నిన్ను గొనిపో
నున్నా డిది నిజము నమ్ము మూర్వీతనయా.

జానకి నిస్స్పృహమై తన రాము డేనాటి కైన వచ్చు నను ఆశయు నుజ్జగించి తన దిక్కులేమి తలపోసి దుఃఖించు సమయమున, నామెలో పోయిన ఆశను పొటమరింపజేయ పవనసుతుఁడు "ఉన్నాడు లెస్స రాఘవు డున్నాడు" అని నొక్కి పలికినాడు. క్రియావాచకము మొదలుగా ప్రారంభించిన ఈ పద్యమున మొల్ల 'హృదయ మొల్లములో' యీ భావమెల్ల దోబూచులాడి యుండవచ్చును. చికిలి చేసిన చిన్ని తుటారిశత్తియ వోలె చెన్నుమీరిన యీ చిన్నిగీతము సీతాసంశయచ్ఛిన్నము చేసిన దనుటలో సందియ మేమి ? ఇట్టిదె యింకొకపద్యము గలదు:

"కంటిన్ జానకి బూర్ణచంద్రవదనన్ గల్యాణి నా లంకలో
గంటిన్ మీ పదపంకజంబులును నే గౌతూహలం బొప్పగా
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగా గీర్తులన్
గంటిన్ మా కపివీరబృందములలో గాంభీర్యవారాన్నిధీ"

వీనులవిందై, అమృతపుసోనల పొందై యీ పదబంధము రాఘవునకే కాక మనకు నానందదాయి యైనది.

అయ్యలరాజు తన రామాయణమున శబరివృత్తాంతము నుజ్జగించి, కబంధవృత్తమును కడు పెంచినాడు. మొల్ల యట్లు కాక, శ్రీరామచంద్రుని దీర్ఘవాపసత్వమునకు వట్టువ పారువమై నెగడిన శబరిగాథను పెంచి కబంధవధను త్రుంచినది.

"కూరాటితేరులు, కావేటిగుర్రములు, పూటగా భారపడంగ జాలుదు, కంటిలో నెరసుచందమున, చెవినిల్లు కట్టుకొని" మున్నగు జాతీయములు, నుడికారములు నెన్నో గలవు. పనయ్యనేని, పట్టుక, కోసుక యిత్యాది ప్రయోగములు నటనట గలవు. అయ్యవి రసపుష్టిని జెఱచునంతటి శక్తిమంతములు కానేరక పోయినవి.

భాస్కరరామాయణము ననుకరించిన ఘట్టము లెన్నియున్నవో దానికి మెఱుగులు దిద్దిన సందర్భము లన్నియున్నవి.

అదభ్రశుభ్రరుచితో నాచంద్రార్కము తులలేని మానికమైన జీవత్కావ్య రత్నమును సారస్వతమున కమూల్యాభరణముగ ప్రసాదించిన మొల్ల యనల్ప ధిషణావిభవము సభినందింతము !

ఈ ద్వితీయ ముద్రణయందు మొల్లకాలమును గూర్చి కొంత మార్చితిని. మహాకవయిత్రియగు మొల్ల కాలమును గూర్చి నేను ప్రథమ ముద్రణమున మొల్ల శ్రీకృష్ణదేవరాయల సమకాలీనయే యైయుండుననను పూర్వవాదమునే యనుస రించితిని-

కాని ప్రతాప చరిత్ర వ్రాసిన ఏకామ్రనాథుడు కుమ్మరిమొల్ల రామాయణం బను వచనకావ్యము వ్రాసి ప్రతాపరుద్రున కంకితము సేయనుద్యుక్తురాలైనదని వ్రాసి యున్నాడు - అంతేకాక మొల్ల రచించిన కృత్యాది పద్యములలో "సుర సన్నుత జ్ఞాను సువివేకి వాల్మీకి నఖిల వేదాగమాభ్యాసు, వ్యాసు" అను పద్యమున నానాటికి గల కవులుగా శ్రీనాధ, రంగనాధులను మాత్రమే పేర్కొని యున్నది.

ఈ రెండు కారణములచేత, మొల్ల శ్రీనాధుని ప్రౌఢవయః పరిపాక కాల మున కౌమారావస్థయందున్న కవయిత్రిగా - అనగా 1320 నుండి, 1400, లేక 1405 ప్రాంతమువఱకు జీవించి యున్నదని యూహింప వచ్చును.

ఈ విషయమై నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారి ప్రచురణయైన మొల్లరామాయణమునకు వ్రాసిన పీఠిక యందు వివరముగా చర్చించి యుంటిని - అందుగాననగును.

---

# 6. మోహనాంగి - మరీచీ పరిణయకర్త్రి

కవులపాలిటి కొంగుబంగారమై, సామ్రాజ్యాధినేతయై, స్వయముగ సార స్వతస్రష్టయై, ఆంధ్రభోజు డనబరగిన శ్రీకృష్ణదేవరాయల కొమరిత యనబడు మోహనాంగి యొక్కతె వాఙ్మయరంగమున మినుకు మినుకు మనుచున్నది, ఈమె రాయలతనయ యను టెంత నిశ్చయమో, యీమె కావ్యము మాత్ర మంత యదృష్టము. సాహితీవేత్తలకును, చరిత్ర పరిశోధకులకును నశ్రుతపూర్వమైవ యీమె కావ్యమునందలి దని చెప్పబడు పద్యము నొకదాని నిట చూపుదును.

''ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తి చూచి
తరుణితనుమధ్య మెచటికో తలగిపోయె;
నుండెనేనియు గనుపడకున్నె ? యహహ !
యుద్ధతులమధ్య పేదల కుండ దరమె ?

ఇది మోహనాంగి కావ్యమునందలి పద్య మని యొకవాడుక యుండగా, నట్లు కా దనియు, నిది సంకుసాల నృసింహకవి పద్య మనియు నొక వాదము కలదు. ఆ కథ ముందు వివరింతును. దొరకిన పద్య మిట్లున్నది. కావ్యము పూర్ణముగ లబ్ధపూర్వమైన నెట్లుండెడిదో ? కాని యీమె గొప్ప రసగ్రహణపారీణ యనియు, రాయల యంతటి వానితో హేలావిలాసముగ చతురంగక్రీడ సలుపు చతురమతి యనియు గాథలు కలవు.

అర్థిజన కల్పభూజమును.. కవిజనాశ్రయుడును సంతతకావ్యరసాస్వాద నాయత్తచిత్తుండు నైన కృష్ణభూజాని యాస్థానమున కేతెంచి, యాతని కర్ణరసా యన మొనర్చి మెప్పొందవలెనని తలంచిసంకుసాల నృసింహకవి 'కవికర్ణరసాయన' మొనర్చి తెచ్చి విద్యానగరమున పీఠము వేసెను. ఆ భువనవిజయాస్థానములోనికి బోయి రాయలదర్శనము నొందవలెనన్న మాటలా ? అందులకై అతడు ముందు పెద్దన నాశ్రయించి యతనికడ పడిగాపులు పడియుండె. కాని పెద్దన నృసింహకవి యంతటి ప్రతిభశాలి రాయలకంటబడిన తనబ్రతుకు పదునుసెడు నని యెన్నా ళ్ళకు నతనికి రాయలదర్శనము కల్గింపకపోయెను. లక్ష్మికిని, లక్ష్మికోడలికిని

బొత్తు దూరము కదా ! సరస్వతీపుత్రుడైన సంకుసాల నృసింహకవి పాపము - లక్ష్మీకాపురమైన యాపురమున నిత్యదరిద్రము వెళ్ళబోయుచు నిరాహారియై దిన ములు గడుపవలసిన యవస్థ యేర్పడెను. ఇక నట్టి దుర్భరస్థితికి దాళజాలక యాయన తనకావ్యమగు కవికర్ణరసాయనమందలి పద్యములు విక్రయించి తత్ప్రాప్తధనమున జీవిక నెట్టెట్టులో నెట్టుచుండెను. ఒకనా డంతిపురిలోని సౌధా గ్రమునుండి మోహనాంగి యీ పద్యవిక్రయము నెఱింగి యా పద్యములు మిగుల రసవత్తరము లగుట, కోరిన వెల యిచ్చి విలిచి పుచ్చుకొనెను.

పద్యములను గ్రహించుటతోబాటే యా కవిదుస్థితిని గ్రహించి యద నెఱింగి తన తండ్రిదర్శనము వారికి గల్గించవలెనని వేచియుండెను. ఒకనాటి చతురంగక్రీడలలో తనబంటు తండ్రి రెండు ఏనుగులనడుమ చిక్కుకొని చీకాకు పడుచుండగా నామె "ఉద్ధతులమధ్య పేదల కుండ దరమె ?" యని నృసింహకవి పద్యపాదమును సమయోచితముగ చదివెను, అంత రసికుడగు నాప్రభువరేణ్యుడు ఆ పద్య మెచ్చటిదో కనుకొని, నృసింహకవి దీనావస్థను నాతని కవితా సామర్థ్య మును గుర్తించి యంతిపురి కాతని రావించి సంభావించి తన తప్పిదమును మన్నింప ప్రార్థించి యాస్థానకవిగ స్వీకరించెను. కథానకము నిజమో కాదో కాని, మోహ నాంగి రసజ్ఞ, గుణగ్రహణపాధీణ, యౌచిత్య మెరిగిన యతివ యని తెలియు చున్నది.

ఆమె తన కావ్యమున నెట్టి గుణములు కుప్పలు వోసి తండ్రియగు రాయలచే మెప్పులు గొన్నదో !

ఇంతవఱకు రచించినది ప్రథమ ముద్రణ మందలి రచన. ఈ క్రింది భాగము ఈ ద్వితీయముద్రణ రచన.

ఇటీవల నెల్లూరు వాస్తవ్యులైన శ్రీ కావుటూరు వేంకట రామచంద్రరావు **M A.,Ph.D.** గారు, శ్రీ నవులూరు మాలకొండయ్య పంతులుగారు సమదర్శిని పత్రికయొక్క శిథిల ప్రతులనుండి సంపాదించి యిచ్చిన మోహనాంగి మరీచీ పరిణయ కావ్యమున కుపలబ్ధమైన 99 పద్యములుగల, షష్ఠ్యంతములతో కూడిన,

అవతారికను ప్రచురించి యుండిరి. తరువాత కావ్యమంతయు సముపలబ్ధము కామింజేసి, చతుర్థాశ్వాసమున దొఱకిన యంతవఱకు రెండు పద్యములను, రెండు వచనముంను ప్రచురించి యుండిరి.

కాని దొఱకిన యవతారిక మాత్రము ఆంధ్ర సాహిత్య ప్రియులకు మిగుల ఉపయోగకరమైనది. సాహితీ సమరాంగణ చక్రవర్తియు, నాంధ్రభోజుడునైన శ్రీకృష్ణ దేవరాయలు పదునారవ శతాబ్దము వాడేయైనను నా మహానుభావుని చరిత్ర విషయమున, చారిత్రకు లిదమిత్థమ్మని నిర్ధయింప ననువుపడని సందేహములు కుప్పలు తిప్పలుగా గలవు.

ఇన్నాళ్ళకు లభించిన మోహనాంగి యొక్క మరీచీపరిణయ కావ్యావతారికవలన చారిత్రకుల సందేహములు చాలావఱకు సమసిపోయినట్టే.

ముఖ్యంగా శ్రీకృష్ణదేవరాయల విషయమున ప్రముఖ చారిత్రక పరిశోధకులకు గల భిన్నాభిప్రాయములను మోహనాంగి తాను తెల్పిన తన పితృపాదుల జన్మాబ్దముతో సమయింప జేసినది.

"నాగాంబా నరసింహ పుత్త్రుడయి జన్మంబందె, నాజన్మ స
ద్యోగంబుల్, తనరం ద్రిరత్నగుణచంద్రుల్ కల్గుశాకాబ్దముల్
కాగన్, నిర్వికృతిత్వమౌ, వికృతి రాగం బుష్యమందునన్
సగంబేగన్ ద్వాదశి శుక్రవాసరమునం గృష్ణావనీంద్రుండిలన్"॥

మోహనాంగి తన మరీచీ పరిణయ కావ్యావతారిక యందు రచించిన ఈ పద్యమువలన శకాబ్దములు 1393 కు సరియైన వికృతి నామ సంవత్సర పుష్యబహుళ ద్వాదశి శుక్రవాసరమున శ్రీకృష్ణదేవరాయలు జన్మించెనని వాదమే సరియైనదని యిప్పుడు చారిత్రకులు సిద్ధాంతీకరించినారు. దీనికి సరియైన ఇంగ్లీషు తేది 17-1-1471 అగుచున్నది.

శ్రీకృష్ణదేవరాయల తల్లి నాగాంబ భోగకాంతయను నపప్రథ ఇంకొకటి కలదు. అదియును నీ క్రింది మోహనాంగి పద్యముచే పరాస్తమగును.

"శ్రీనరసింహుడు తిప్పాం
బా నాగాంబా రమణుల బరిణయ మయ్యెన్..."

అను పద్యమున రాయలతల్లి నాగాంబ శ్రీనరసింహ విభునిచే పరిణీత యగు కులవధువు అని తెలిపోయినది. ఇంకొక ముఖ్యమైన సందేహము; మోహనాంగి కృష్ణదేవరాయల తనయయేనా ? అనునది !

"తిర్మల దేవికే పౌడమితిం గనుకన్ మును 'తిర్మలాంబయం'
చర్మిలిపేరు నాకిడియు నట్లుగదా బిలువంగరామి, నన్
గూర్మిని మోహనాంగి యను క్రొత్త సమాఖ్యను బిల్చు తండ్రికిన్
జర్మము కోసియిచ్చినను జాలదుగాదె ఋణంబు తీర్పగన్"

అను నీ పద్యము వలన మోహనాంగి శ్రీకృష్ణదేవరాయల పుత్రికయే యను నంశము సత్యసమ్మతమై భాసించినది.

తర్వాత తన "మగని మక్కోస నిల్పి నమస్కరింతు" నని సీస పద్యాంతమున ఎత్తుగీతి చివరి పాదమున భర్తకు నమస్కరించినది. తనభర్త "అళియ రామరాజని-

"రాఘవా, మహాపుత్రికా రమణ, రావ
ణారి, జహురాణ తనయావనా, యన బ్రథ
మాక్షరావళి, యే ఘను నాఖ్య యౌనా
యట్టి మత్పతి దైవంబె యగును నాకు"

అను నీ పద్యమున జెప్పినది.

అంతేగాదు - తనతండ్రి శ్రీకృష్ణదేవరాయలు తాను కావ్యరచనారంభము చేయుటకై సముద్యోగము సల్పునాటికి అపుత్రకుడు - ఈ విషయము నీమె తాను కావ్యరచనా ప్రయత్నము సేయునెడ, తనను ప్రోత్సహించుచు తండ్రి తనతో బల్కిన పల్కులలోని దగు

"పుత్రిక తొల్త బుట్టు టతి పుణ్యకరంబని, నేనెఱింగి యుం
బుత్రుడు నాకొకండయిన బుట్టమి, రాజ్యమునెల్ల నేల, దౌ
హిత్రుడె, నాకు దొల్త జనియింపగ గోరెద, గాన గబ్బపుం
బుత్రిక నీవు కాంచునెడ, బుణ్యమునుం, బురుషార్థముం జుమీ"

ఈ పద్యమును బట్టి మోహనాంగి కావ్యరచనోద్యోగ ప్రయత్నము చేయుసరికి రాయలకు పుత్రసంతానము లేదు. కాని మరీచీ పరిణయ చతుర్థాశ్వాస రచనా ప్రారంభము చేయునాటికి రాయలు "సుపుత్రలాభప్రా"ప్తుండై నాడు. తన ముద్దుతమ్ము గుణ్ణ నామధేయము 'సదాశివరాయలు' అని కూడా ఆమె ఈ చతుర్థాశ్వాస ప్రారంభమున "మార్కండేయ చిరాయువున్......" అను పద్యమున పేర్కొనినది. శ్రీకృష్ణరాయల పుత్రుడు "తిరుమలరాయ'డని ఇంతవఱకు చరిత్ర పరిశోధకు లూహించిరి.

ఇంకొక ముఖ్యాంశ మేమన :- తన తండ్రి కొలువున, పెద్దన, తిమ్మన, పాండురంగకవి, ధూర్జటికవి, మాదయగారి మల్లన, మున్నగు నష్ట దిగ్గజంబులను కవులు గలరనియు, తనతండ్రి పెద్దనాదుల రచనా గతిం బదక్రమము గల్గు కవిత్వముతోడ విష్ణుచిత్తుకథ రచించుచున్నాడనియు అవతారిక యందలి తొమ్మిది యవ, ఎనుబది యెనిమిదవ పద్యమున పేర్కొనినది.

ఇట్టి ఆనాటి తనతండ్రికి సంబంధించిన చారిత్రక సత్యములనేకములు ఈ మోహనాంగి కావ్యరచనమున ప్రకాశితములై చరిత్రపరిశోధకులు నిర్ణయములు తీసుకొనుటకు సులభసాధ్యములైనవి.

ఈ యన్ని విషయములను మించి యందములు చిందిన మోహనాంగి రచన; రసిక ప్రభుడగు తనతండ్రి కృష్ణదేవరాయలకుమ, దనకును ఈకావ్యరచనా సందర్భముగ జరిగిన సంభాషణము ! ఒకనాడు రాయలు అంతిపురమున నున్న కుమార్తె కడ కేగునప్పటికి ఆమె ఆలోచనాధీన మనస్కయై యుండుట కనిపెట్టి రాయలు

"కన్నుబొమ్మలు పైకెగసి యిటున్న వేల
..............................
..............................
పట్టి ! యెట్టి గట్టి సమస్య పట్టుకొంటి"

వని యడుగగా మోహనాంగి-

''తండ్రి సమస్యపూర్తికి నెదం దలపోయుట లేదు, మీకలే
మంత్రో, మదీయ సాహసము నారసి, కావ్యమొనర్పఁబూనితిన్
"వీంద్రకు బాకముండగ, నపిష్టపు బాకమునేల ?' యంచు ని
ల్లాంధ్రను గేలిసేయు జనులందఱు మెచ్చెడు నట్టి శైలితో"

నని బదులిడగా, రాయలు

''అన విని యెట్టిటూ పలుకవమ్మ మఱొక్కఁ తఱిం బ్రబంధ మీ
వొనరుప నింతకాలమున కూహయొనర్చితె ? యెంత చెప్పినన్
వికనయ యుంటి విందనుక వీనుల విందుగ నీదుకబ్బ మో
తనయ, వినంగ నబ్బును కదాయని, నిత్యమపేక్ష చేయుదున్"

చదువుల సరస్వతివి, నీ
మృదు కవితాశైలి స్త్రీలకే యననేలా
తుదకుం గొమ్మలు తిరిగిన
మదవత్కవి పుంగవులకు మహినిఁగలుగునే.

స్త్రీలన్నంతనె చుల్కఁ చేయుటకు కుమారీ మౌఢ్యమే సుమ్మునా
రీలోకంబున శేముషీయుతలు లేరే, పూర్వమింతేటికిన్..."

అని మహిళా రచనలపై తనకు గల యభిమానమును తేట పఱచుటయేకాక, ఆ కావ్యమునకు తాను కృతిపతిత్వము నంగీకరింతుననికూడ ఎన్నియో చమత్కార ములతో జెప్పెను.

మోహనాంగి తనతండ్రి తనపై గనబఱచు అత్యంత ప్రేమమును వెల్లడి సేయుచు-

"చతురంగ బలయుత సైన్యముల్ నడపెడు
నతడు నాతో జతురంగ మాడు
గంగార్భటిని నాకుకవిత చెప్పునతండు
నా సమస్యాపూర్తి కాసచెందు
దిక్కుడ్యములను సత్కీర్తి జిత్రించు నా
తండు నారాయు చిత్రముల మెచ్చు
రాగ సంభరితాంగుడౌ నతడు నే
రాగ మాలాపింప రక్తి గాంచు
నన్ను మన్నాథు నింట మన్ననల తోడ
గన్నులంగప్పుకొని ప్రోచెగాదె యట్టి
పిత, మహాకావ్యకర్త, నన్ గృతిని గోరె
నాదు భాగ్యంబు వర్ణింపగా దరంబె.

రచించిన పై సీసము ఎంతో సుందరముగా నుండుటయేకాక, మోహనాంగి సంగీత, చిత్రలేఖన, కావ్యరచనా కళలలో ప్రవీణురాలని తెల్పుచున్నది.

కాని యీయవతారిక యందెచ్చటను "ఉద్ధతుల మధ్య పేదలకుండదరమె" యను పద్యము యొక్క కాని, అగాథయొక్కగాని ప్రస్తావనయే లేకుండుట గమనీంపము.

——

# 7. తుక్కాదేవి - తుక్కాపంచకము

దక్షిణనాయకుడైన శ్రీకృష్ణరాయని దేవేరులలో నీమె నొకర్తుగా చరిత్రకారులు పేర్కొందురు. ఈమె ఒక మహారాజుకడుపునఁ బుట్టి, యొక మహాచక్రవర్తి కరమును పట్టినది. శ్రీకృష్ణరాయలు కటకమునకుఁ బోయి, ఓఢ్రప్రభుఁడగు గజపతిని జయించి, యాతని సుతయగు యీ తుక్కాంబను బెండ్లాడెను. ఈమెపేరు చిన్నాదేవి యని కొందఱమతము.

రాయ లసలు చిన్నాదేవిసౌందర్యము నాకర్ణించి యామెకొఱకే కర్నాటక్షితిపాలునితో బవరము సల్పెను. రాయ లా ఓఢ్రప్రభుని రాజ్యముతోఁ బాటు కుమార్తెను గూడ పరిగ్రహించెను. కాని అభిమానధనుఁడగు నా యోఢ్రప్రభువులకిది యోర్వరానిదై, మ్రింగరాని పిండ మాయెను. అగుట, చిన్నాదేవివి బోలిన చిన్నాదేవియన్నకు చిన్నాదేవివేసమును, విక్రమధనులగు వేయిమంది వీరులకు చెలికత్తెల వేసమును వేసి పట్టాకత్తులుగా మొలనూళ్ళు పదిలపరచి రాయలపడకటింటికి బంపిరి. రాయలయందు నిజముగ ననురక్తయైన "చిన్న"—

"పడకటింటను నోప్రభూ ! పాన్పు వెలితి,
పేరటాండ్రు నారులు గారు, వీరకులము;
తొందరించిన పను లెల్ల తోన చెడును
సావధానత నే హాని జరుగబోదు."

అని యొకపద్యమునందు ముందే రాయలకు దనవారి యత్నముల దెల్పుచు నొక కమ్మ వ్రాసి బుత్తెంచెను. తిమ్మరసది యారసి, రాయలను సైన్యమును దగు భద్రతలో నుంచెను. రాయలు పడకటిల్లు సేరగానె పాన్పు దట్టి చూచెను. వెంటనే సమలంకృత మైన యా మంచము అమాంతముగ రెండు నిల్వులగోతియందు కూలిపోయెను. రాయలుగ్రుడై కత్తి బెరకెను. చిన్నాదేవివేషమున నున్న రాజపుత్రుడును, పేరంటాండ్ర వేషమున నున్న తక్కిన వీర కులమును కత్తులు దూసిరి. ఇంతలో రాయల సేనావారమును చుట్టుముట్టెను. సంకు లసమరము జరిగెను. పర్యవసానము- రాయ లిట్టివారితో పొత్తు కుదరదని వారిని సకుటుంబముగా

సాగనంపెను. మొలనూలు పట్టాక త్తితో భవనప్రవేశము చేసినది చిన్నాదేవియే యనియు, అర్ధరాత్రియందు రాయల జంపబోవ, సమయమునకు రాయలు మేల్కొని యాపదనుండి తప్పించుకొనె ననియు కథాన్తరము. అట్లు రాయలచే వెనుకకు పంపబడిన చిన్నాదేవి తనపుట్టింటికి బోనొల్లక, రాయలసీమలోనే నల్లమల ప్రాంతమున సఖీద్వితీయయై నిలచిపోయి, యచట దానధర్మములు చేయుచు, నచటి ప్రజల యవసరము దీర్చుచు, నచటనే యొక పెద్దచెఱువు త్రవ్వించి, రాయల యనుగ్రహము ప్రతీక్షించుచుండెను. కొన్ని నాళ్ళకు 'చిన్న' తపస్సు పండి రాయ లనుగ్రహించెను అని కథ.

చిన్నాదేవియు, తుక్కాదేవియు నొకరు కారని యొకరివాదము.

ఏది యెట్లైనను, ఒకటి మాత్రము నిశ్చయము. రాయలను మగనిగా వరించిన యే మగువయో యాతనిచే విప్రోషితయై విరహియై కుందిన యొకనాయిక భృంగవ్యపదేశముగా నా భూజానికి పంపిన అయిదు శ్లోకములకే తుక్కాపంచక మనియు భృంగపంచక మనియు పేరు.

"చరన్వనాంతే నవమంజరీషు న షట్పదోగంధఫలీ మజిఘ్రత్
సా కిం న రమ్యా స చ కిం న రంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా."

"మా కింశుక ప్రకట యాత్మ నిమేషమాత్రం
మన్మస్తకే విహర తీతి మధువ్రతోయమ్
కిం మాలతీ విరహవేదనయా త్వదీయమ్
దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ"

"భ్రమర భ్రమతా దిగంతరాళే
క్వచి దాస్వాదిత మీక్షితం శ్రుతంవా
వద సత్య మపాస్య పక్షపాతం
యది జాతీకుసుమానుకారి పుష్పమ్"

"కుసుమాని లిఖంతే నామ చిత్రే
కతిచి త్కారువిశేషరూఢ శిక్షాః
సురభిత్వ మమూని కిం న లభన్తే
కిముచై తేషు రసం పిబన్తి భృంగాః

కిం మాలతీం మాయసి మాం విహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశు స్స్యాత్
స షడ్భి రత్యన్త పశు ర్నకింస్యాత్."

ధ్వన్యాత్మకము లగు నీ యైదును తుక్కాపంచక మందురు. ఇందు మొదటి మూడును మిక్కిలి రసవత్తరములు.

వీనినిగూర్చి విమర్శింపవలె నన్న నెంతేని చేతినిండ పని కలుగగలదు. కాని యివన్నియు తుక్కాదేవీకృతములు కావనియు, రెండు వల్లభదేవుని సుభాషితావళియందును, ఒకటి ముకుళభట్టు అభిధావృత్తి మాతృక యందును (తత్పూర్వగ్రంథములందె) కనబడుచున్న వనియు శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు తమ ఆంధ్రవిదుషీమణులలో బయల్పరచిరి. ఇక రెండు మిగిలినవి. స్త్రీకర్తృకము లగునో కాదో యని సందియమున కెడమిచ్చిన వీని విమర్శనకె కాలము వ్యయింప నేల ? ఎప్పటికైన కాలము నిర్ణయించు నని యోపిక వహింతము.

---

# 8. తిరుమలాంబ - వరదాంబికాపరిణయము

వరదాంబికాపరిణయ గ్రంథకర్త్రి యగు తిరుమలాంబను పలుకరించుటతో రాయల యుగమును సంభావించినట్లే. గంగాదేవి, మోహనాంగి, తుక్కాదేవి, తిరుమలాంబలతో వీరు విజయనగరసామ్రాజ్యమునకు చెందిన కవయిత్రీ చతుష్టయమైనారు. మఱి అన్నమయసతి తిమ్మక్క కూడా విద్యానగర సామ్రాజ్యమునకు జెందినదేనా ?

శ్రీకృష్ణదేవరాయలకు బిదప నాతని సవతితమ్ముడు అచ్యుతదేవరాయలు రాజ్యమేలెను. వరదాంబిక యతని పట్టపురాణి. ఈమె సలకరాజనందన. అచ్యుతరాయల మంత్రు లగు సలకము పెదతిరుమల దేవుడు, చినతిరుమల దేవుడు అను వారికి సోదరి. కంభము నందలి పెద్దచెఱువును త్రవ్వించిన దీ వరదాంబయే అందురు కాని యిది నిజము కాదు. రాయలచే పరిత్యక్త యైన చిన్నాదేవియే కంభము చెరువు గట్టించినది. ఆ గాథ ప్రసక్తపూర్వమే. ఆ చిన్నాదేవికి అన్నపూర్ణ యనియు, వరదరాజేశ్వరి యనియు, రుచీదేవి యనియు ననేకనామాంతరములు గలవు. ఈ రుచీదేవిగాథ యెంద రెందరో కవికుమారులకు రుచిర మగు రచనావస్తువుగ కూడ నుపకరించినది.

ఈ గాథ యిట్లుండ, కంబముతటాకము కట్టించినది అచ్యుతదేవరాయల సతి యను శ్రుతి యెట్లు కలిగెనో విచార్యము.

ఏమైనను కృష్ణరాయల పత్ని వరదరాజేశ్వరీ బిరుదాంచితురాలు వేరు, అచ్యుతరాయల దేవేరి వరదాంబిక వేరు. ఇంతవట్టు సత్యము. ఈ వరదాంబికకును అచ్యుతరాయలకును జరిగిన పరిణయగాథను చిత్రించినదే వరదాంబికా పరిణయము-పేరున కిట్లున్నను, కావ్యమున ముందువెనుకల గాథను తెగసాగించి, అసలు పరిణయగాథను అతి స్వల్పముగ వర్ణించినది.

ఇక నాయకురాలైన వరదాంబిక రాజ్యవ్యవహారములలో జోక్యము పుచ్చుకొన్న నిపుణురాలు. విద్యానగరమునకు సమీపమున 'వరదరాజమ్మపేట' యను జనపదమును నిర్మించిన కీర్తిశాలిని. కంచి వరదరాజస్వామి ఆలయమున పతితో

సుతునితో తులాభారము తూగి భూరిదానములు వెలయించినది. తన పతి యచ్యుత రాయల యనంతరము పుత్రుని రాజ్యస్థిరత్వము నాసించి బీజపురసుల్తాను ఇబ్రహీం అనిల్‌శాహాతో రాయబారములు జరపినది. వరదాంబ నింత రాజకీయవ్యవహార నిపుణగా తిరుమలాంబ తన కావ్యమున వర్ణించినది.

తిరుమలాంబ రచించిన యీ వరదాంబికాపరిణయము కూడ గంగాదేవి మధురా విజయమువలెనే కేవలకావ్యముగానేకాక, చారిత్రకగ్రంథముగాగూడ ఉపయోగించినది.

ఈ కావ్యరచనకు దలపడిన విదుషి తిరుమలాంబ గద్యమున దన్ను గూర్చి యిట్లు వ్రాసికొన్నది.

"ఏకవారాకర్ణనమాత్ర ధృఢావతారితనవ్యకావ్యనాటకాలంకార పురాణా గమరహస్యస్వారస్యానుబంధ సమింధన స్వాభావిక ప్రతిభావయా, విద్యావిశేష నిరవద్యా విద్వద్వర సకలకవికుల శ్రవణానంద చింతితాభీష్ట ఫలాశ్రయణ, విశ్రాణ కావ్యగవీభవదశేష భాషావిషయ సవిశేషోన్మేష చతురిమగర్భిత సరసప్రబంధ సందర్భయా, వివిధవిద్యాప్రగల్భ రాజాధిరాజాచ్యుతరాయసార్వభౌమప్రేమ...సర్వ స్వవిశ్వాసభువా నిరుపాధికతా మహోపకారనిర్మాణ ధర్మనిర్మలహృదయయా, విరించి చంచలనయనా నఖాంచలసముదంచిత విపంచీప్రపంచిత పంచమమధురిమో దంచన వికస్వరకంఠస్వరయా, విపులతలాతల వినోదసాకారావ తీర్ణ శతపత్రా సనవరవర్ణినీ మతనిర్మాయకయా, నానాదేశప్రతిష్ఠిత విరచిత వాజపేయ పౌండరీక సర్వతోముఖ మహాధ్వర ద్విజవర వితీర్యమాణాశీర్విశేష పరితోషిత భాగ్య సౌభాగ్యయా, నియతతక్షత......? ...కవికుటుంబయా, తిరుమలాంబయా విర్మిత వరదాంబికాపరిణయ చంపూకావ్య మాచంద్రదర్క మభివర్ధతాం."

ఒక్కపర్యాయము వినగానే, నవ్యకావ్యముల నర్థము చేసికొనగలది. నాటకాలంకారపురాణాగమాదులను బాగుగ నెఱిగినది. కవి పండితులను పోషించుట యందు నిండారు కుతుకము గలది. సరసకావ్య నిర్మాణము చేయగలది. అచ్యుత రాయల ప్రేమను సర్వవిధముల పొందినది. అనేక భాషాలిపులను చదువను వ్రాయను నేర్చినది. వీణానాదమువలె సొంపగు కంఠస్వరము కలది. భూలోకసర స్వతి యనదగిన దని యామె వ్రాసికొనినదానింబట్టి యీమె ఎంతో ప్రజ్ఞాశాలినిగ

కనబడుచున్నది. "అచ్యుతరాయల ప్రేమను పొందిన''దను వాక్యముచే నీ యమ అచ్యుతరాయల అంతఃపురవాసినియే కాక, తదీయహృదయాంతఃపురవాసినియు నని వ్యతీయమాన మగుచున్నది. తంజాపురీనాయకరాజులకు పూర్వము రాజుల భోగపత్నులగు విదుషీమణు లా విషయమును లోకమున కంతగా వివరింప లేక పోయినారేమో? కాని నాయకరాజుల కాలమునుండి రామభద్రాంబాదులు ప్రకాశముగ తమ ప్రణయభాగస్వాములగు రాజుల నాత్మస్వాములుగ వాకొనినారు. అసలు కావ్యమునకు సంబంధించిన వర్ణ్యాంశమును బరికింపుడు:—

"ప్రవిశ్య తస్మిన్ ప్రమనా నృపాలః
తాం రాజకన్యాం విధినోపయేమ్యా
శ్రియం పయోధేరివ శేషశాయీ
సమాసయత్తాం సదనం స్వకీయం."

కవిత్వ మంతయు సామాన్యముగ నిట్లే యున్నది. గద్యయందు చెప్పుకొన్న పాటవము ప్రబంధమున నగపడదు. ఏమైనను సంస్కృత కావ్యరచనకు పూనుకొనిన యీమె యుద్యమము సామాన్యమనదగునా?

ఈమె 1530 ప్రాంతమున నున్నట్లు వేరుగ వ్రాయ నక్కరలేదు. 1527 ప్రాంతమున సువర్ణమేరుదానసందర్భమున వీరప్రతాప అచ్యుతదేవమహారాజు హంపియందలి విఠలస్వామి దక్షిణగోపుర ద్వారము చెంత వేయించిన శాసనమొకటి కలదు. అది ఓఢ్ర సంస్కృత భాషలలో వేయించినది. అందలి ఒక సంస్కృతశ్లోకమునకు "ఓదువ తిరుమలాంబ'' యను నామె యొకరు కర్త్రిగా పేర్కొనబడినది. 'ఓదువ' పదము 'చదువరి' యను నర్థమిచ్చు ఓఢ్రభాషాపదము. దానింబట్టి ఆ శ్లోకకర్త్రి ఓఢ్రదేశస్థ యనియు, ఆ తిరుమలాంబయు వరదాంబికా పరిణయగ్రంథకర్త్రి యగు తిరుమలాంబయు నొకరే యనియు కొందఱ వాదము. అది 'ఓదువ' కాదనియు 'ఓడూరు' అను గృహనామ మనియు, యీ ఓడూరు తిరుమలాంబయు, కావ్యకర్త్రిణి యగు తిరుమలాంబయు నొకరే యనియు మరి కొందర పూర్వపక్షము. కేవలము 'ఓదువ' పదము చేతనే ఓఢ్రస్త్రీ యన జెల్లదు. "తిమ్మరుసు, అళియరామరాయలు" అను పేరులయందలి 'అరుసు, అళియ' పదములు ఓఢ్రదేశీయములే. ఐనను అంతమాత్రాన ప్రథిత విద్యానగర సామ్రాజ్య

మహాప్రధాని యగు తిమ్మరుసును ఓఢ్రుఁ డందుమా ! అరుసు పదము కన్నడ దేశమునందును కాననగుచున్నది. నాగరికతాసంకలనమున నర్వైన్య దేశీయము లెన్నెన్నియో యన్యభాషల జేరుచున్నవి. కావున దానశాసన శ్లోకరచయితయు, కావ్యరచయితయు నొకరే యైనను, నామె యోఢ్ర స్త్రీ యని సంశయింప బని లే దని కొందఱ సిద్ధాన్తము.

చూడగా, నా కీ సిద్ధాన్తమే యుక్తిసహముగా నుండి సత్యసమీపముగా నున్నట్లు తోచినది. అంతే కాక, గ్రంథాన్తమున ఆంధ్రదైవతమగు తిరుమల స్వామిని గీర్తించినది.

గ్రంథాన్తమున వెంకటేశ్వర స్తవ మొనరించిన తిరుమలాంబ ఆంధ్రియే.

---

# 9. నాచి - నాచీవిజయనాటకకర్త్రి

వీరేశ్వరోపాధ్యాయుల పుత్రిక యగు 'నాచి' యను నామె 'నాచీవిజయ' మను సంస్కృత ప్రబంధకర్త్రిగా కనబడుచున్నది. నాచి గొప్పవిదుషి. నానారాజన్య [illegible] ప్రవరుల వాదముల నోడించిన 'వాచాహ్నవి'. ఇట్టి యీ మెకు జనకుడైన వీరేశ్వరోపాధ్యాయుడును సామాన్యుడు కాడు. ఆతడును వేద వేదాంగకోవిదుడు. సంస్కృతాంధ్రసాహితీనిష్ణాత. జ్యోతిషమునందు పారము ముట్టిన మేధావి. తెలుగుబ్రాహ్మణులలోని నాడుభేదముల నేర్పరచినవాడీతడే.

ఈ మహాకవుడు గుంటూరుమండల మందలి పల్నాడుతాలూకాకు సరిహద్దున [illegible]క్షేత్రసమీప మందలి కృష్ణవేణీనది కప్పలితీరమున నున్న [illegible]గ్రామవాసి. అది దక్షిణకాశి యని నుతింపబడిన క్షేత్రరాజము. ఈతడు [illegible] కాలమువాడని కొందఱమతము. క్రీస్తుశకము ఏడవ శతాబ్దియం దీతడు జీవించియుండెనని శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు వ్రాసిరి.

ఇతడు వీరేశ్వరవిజయ మనుకావ్యమును, స్మృతిదర్పణ మను పేర గౌతమ స్మృతికి వ్యాఖ్యను రచించెను.

నాచికి బాల్యముననే దుర్భరవైధవ్యము సంప్రాప్తించినది. జ్యోతిషము [illegible] చిరకాలము భూమిపై ఆయుష్మతియై మనవలసిన తన గారాబుపట్టి [illegible] యగు టాతనికి మిక్కిలి దుస్సహవేదన యైనది. కాగా తన పుత్రిక పండితురాలి నొనర్చినచో, సద్గ్రంథ కాలక్షేపమున నాయమ సార్థకజన్మ యగునని తలంచి, పండితుడు తనకడ నున్న అసంఖ్యాక శిష్యులతో బాటు తన కుమార్తెను గూడ శిష్యురాలి నొనర్చి విద్యల చెప్ప దొడంగెను. కాని సహజముగ మందప్రజ్ఞయగు నాచి శీఘ్రగతిని తండ్రి ననుసరింపలేకపోయినది. కాని తానును పండితురాలు కావలెనను ఉత్కంఠమాత్రము ఆమెకు మిగులగ మిగిలియుండెను.

ఇంతలో తండ్రి తనకడ నధ్యయనము సేయు శిష్యులలో మందులగు వారికి జ్యోతిష్మతీరసము త్రావనిచ్చుటయు, నచిరకాలముననె మూఢు లగు వార లు మేధాసంపన్ను లగుటయు కన్నులార గాంచిన నాచి తండ్రికి తెలియకుండగనే యొకపరి మహాజ్యోతిష్మతీరసమును గుప్పె యెత్తి మోతాదుకు మించి గడగడ

త్రాగివైచెను. అది విషమించి అధికతాపము పెంచి గంగవెర్రు లెత్తించగా, నాచి భరింపజాలక పెరటిలోని నూతియందు దుమికెను. నూయియు లోతు తక్కువ దగుటచే, నాచి యందు నిలువబడి యుండిపోయెను. ఉపాధ్యాయుడును నాచికొఱ కూరంతయు వెదకి యెందును గానక, నాచీ ! నాచీ ! యని అఱచుచు, నూతికడ కేతెంచెను. అపుడు నూతిలో నున్న నాచి తండ్రికేక విని మారుపలికి తండ్రి కంతయు నివేదించెను. నూతియందలి శీతజలసంగతిచే తాపము తగ్గి యొకింత సేద దేరిన నాచిని గాంచి యుపాధ్యాయు డింకొక కొంతసేపందే యుంచి పైకితీసెను.

జ్యోతిష్మతీప్రభావమున నాచి యపారశేముషీధురంధరురాలై, తండ్రికడ సకలవిద్యలు సకలశాస్త్రములను గ్రహించి వికసించిన పద్మమువలె ప్రకాశించెను.

తాతపాదునికడ యధ్యయన మంతమొందిన వెనుక, నామె తండ్రి యను మతి బడసి కాశీయాత్రకని యిలువెడలి, మధ్యేమార్గమునందలి కవి పండితుల నెల్ల గెలిచి, తండ్రికి మించిన యశ మార్జించి తిరిగి వచ్చెను. అట్లు దిగ్విజయ మొనర్చి తిరిగి వచ్చిన కూతును గాంచి యుపాధ్యాయు డామెయే తనకు కుమారుడై పితౄణ మీఁగె నని యానందించెను.

ఆమె యటుతర్వాత తన వృత్తాంతమునే "నాచీవిజయ" మను పేర నాటక ముగా రచించెను. ఈ సంస్కృత నాటకమునందలి శ్లోక మొక్కటి యైనను, మచ్చున కైన గానరాకుండుట శోకహేతువే.

జన్మతః అబలయై స్త్రీప్రజ్ఞకు మించిన పాండితీగరిమము సంపాదించి కవి పండితుల నోడించిన మేటి ప్రజ్ఞాధురీణ యని బిరుదంది సుస్మరణీయ యైన నాచి యభినందనార్హయే.

---

# 10. లీలావతి - గణితశాస్త్రకావ్యకర్త్రి

నాచియట్టిదే లీలావతియు. గణితశాస్త్రపండితుడైన భాస్కరాచార్యుని తనూజ; లీలావతియు గణితశాస్త్ర పండితయే.

లీలావతికి వైధవ్యము సంప్రాప్తించునని ముందే యారసి, భాస్కరాచార్యుడు దీర్ఘాయు వగు వరుని వెదకి వెదకి యొక బలమైన సుముహూర్తమున లగ్నము నిర్ణయించెను. పూర్వము చిన్న రంధ్రములు కల లక్కపుటికలో నీరు నించి యొక్కొక్క బొట్టుగా నా జలము క్రింద పాత్రయందు పడుచుండ క్రింది పాత్ర పూర్తి కాగానే, గంట యైనదని కాలము నిర్ణయించెడువారు. అట్లే శుభ ముహూర్తమున కొక వేళ పూర్తికాగానే గంట కాగలదని కాలము నిర్ణయించి, యా వేళ కందఱును నిరీక్షించుచుండిరి.

ఇంతలో మౌక్తికాదిహారములతో సింగారింపబడిన యా హేలావతి లీలగా నా ఘటికాయంత్రమునందు వంగి చూచెను. ఆ చూచు సమయమున, నామె కంఠమందలి ముక్తాహారము తెగి యొక ముత్య మా యంత్రమున బడి యా రంధ్రమును మూసివైచెను. ఇది ఎవరును గమనింపరైరి. ఎంతసేపటికిని సుముహూర్తమును దెలుపు కాలమును సూచింప దేమి యీ యంత్ర ! మని కొంతవడి నిరీక్షించి భాస్కరాచార్యులు చూచును గదా ! యే మున్నది ? ముక్తచే రంధ్రము నిరోధింపబడుటయు లగ్నకాల మతిక్రమించుటయు జరిగిపోయినది. తా నెంత ప్రయత్నించినను బలీయ మగు దైవ విధి యనుల్లంఘనీయ మగుట కాచార్యుడు విచారించి తనయకు బెండ్లి చేసెను. అనుకొన్నట్లుగానే పసపు పూయుటయు, ముసుగు వేయుటయు తుదకు తప్పినది కాదు. ఇట్లు వర్థ్యజీవన యైన లీలావతి నుద్ధరించుటకై యాచార్యులు శ్రమించి యామెను గణితశాస్త్రమున ప్రవీణగా శిక్షించెను.

ఆమె వివేకమహితయై, సంస్కృతమున శ్లోకములతో గణితశాస్త్రమును రచించెను.

> "బాలే బాలకురంగనయనే లీలావతీ ప్రోచ్యతాం,
> అయే బాలే లీలావతీ మతిమతి బ్రూహి...."

అని యున్న వాక్యములచే తండ్రియే రచించి తనయ పేరిడె నని యీ నడుమ కొందఱొకవాదము లేవదీసిరి. కాని నామతమున నది సరికాదు. బాలే యను సంబోధము శాస్త్రాధ్యయనము చేయు బాలల నుద్దేశించినది కావచ్చును, "ఇక లీలావతి యను సంబుద్ధి ఆత్మసంబోధమే కావచ్చును. ఈనడుమ "సత సయి" అను గ్రంథమును రచించుచు, స్థానావతి రుక్మిణమ్మగారు తమ గ్రంథమున తమ్ము తామే సంబోధించుకొంచు వ్రాసిరి. ఇంకను నెందఱొ అట్లు వ్రాయుచున్నారు. అంతమాత్రమున గ్రంథమే తత్కర్తృకము కాదనరాదు. అంతయననేల వేమన తన శతకమున "విసుర వేమ" యను మకుటముతో తన్ను దాను సంబోధించు కొన లేదా.

తెలుగున పావులూరి మల్లన యొకడు నన్నయకు బిదప 11 వ శతాబ్దిని గణితశాస్త్రమును కావ్యముగా రచించెను. ఆతడును నీమెయు సమకాలీను లేమో ! ఈమెయు 11, 12 శతాబ్దులలోని దందురు.

ఇపుడు సూచితమైన కాలపరిగణనమును బట్టి నాచీ, లీలావతుల చరిత్రలే ప్రథమతః ఉల్లేఖింప దగినవి. కాని యింతవఱకు వారి కాలములను గూర్చి అదియేమో, ఇదియేమో అనుటయే కాని యిదమిత్థ మగు నిర్ణయము జరుగనందున, వారిని గూర్చి ప్రప్రథమమున ప్రస్తావించుటేల యని యట్లు సేయ నైతిని.

ఇం దీమె శ్లోకములు మహాపటిష్ఠములుగా నుండును. ఇందలి గణితములు మహాపండితులకే దుర్గ్రహముగా నుండునట. ఈమె కావ్యమును పరాసు, ఆంగ్లము మున్నగు భాషలలోనికి కూడా అనువదించిరి. లీలావతిశ్లోక మొకటి గాంచుడు.

"అస్తి స్తంభతలే తదుపరి క్రీడాశిఖండీస్థితః
స్తంభే హ స్తనవోచ్ఛ్రితే త్రిగుణిత స్తంభ ప్రమాణా న్తరే
దృష్ట్వాహిం బిల మావ్రజన్త మపతత్తి ర్యక్సతస్యోపరి
క్షిప్రం బ్రూహి తయో ర్బలా త్కృతికరై స్యామ్యన్యగత్యో ర్యుతిః"

## శారద - త్రివేణి

"గద్య పద్య ప్రబంధానాం, పఞ్చాశ్యష్టదశనాటకైః,
సాకం ప్రాకృతకావ్యాభ్యాం, సాహిత్యం వ్యధాత్."

అని డిండిమ కవిచక్రవర్తియగు నరుణగిరినాధునిచే బొగడ్త గన్న యీ శారదాదేవి దేవరాయల ఆస్థాని యట. కాని కావ్యము లేవియు కానబడవు. యీ దేవరాయ లెప్పటివాడో?

శ్రీరంగాభ్యుదయ మను చంపువును రచించిన త్రివేణి యను నామె యింకొకతె యగపడుచున్నది. ఈమె కాలముగాని, దేశము గాని, యావాసము గాని యేమియు దెలియకున్నవి. ఈమె దనబడు నాశ్వాసాన్త శ్లోకమిది యొకటి.

"త్వద్గఙ్గాఙ్గతరఙ్గ పఙ్క్తి విలసద్భంత్రప్రాకృత్స్వవా
గ్గుంభో నస్తవిరస్త్వ సూతతనయాం యోఽసౌ, త్రివేణ్యా
శ్రీరంగాభ్యుదయే త్వయా విరచితే సద్బృందవన్ద్యే మహా
కావ్యేఽసౌ దశమస్సుధాకృతసఖ స్సర్గ స్స్వైమాధుర్యకృతః."

ఇట్టి వారిని గూర్చి యిట్లే చరిత్ర గ్రంథములలో పేర్లు దడవుచు దడవుచు రాగా, ఎప్పటి కైన నెవ్వరికైన నుత్సుకత బొడమి వీరిని గూర్చి శోధించి ప్రకాశముగ వెలయింతు రేమో !



# 13· రామభద్రాంబ - రఘునాథాభ్యుదయము

'దేశభాషలందు తెలుగు లెస్స' యని విద్వత్ప్రభుడైన రాయలచే సమ్మానము బడసిన తెలుగుబాస రాయల యనంతరము విద్యానగర సామ్రాజ్య విభవాభిశేషమువలెనే తంజాపురీ పాలకులగు నాయకరాజుల నాశ్రయించినది. రసికవతంసుడు కవితాప్రావీణ్యఫణీశుడైన రాయలు 1530 సంవత్సరమున కాలగతి నందెను. పిమ్మట ఒక నూరు సంవత్సరముల వరకు పొలఁతులయందంతగా సారస్వతపు పొలఁకువలు గానరావు.

దక్షిణ దేశమున నాంధ్ర రాజ్యరమను వెలయించిన వారిలో మూడవ నాయకరాజగు రఘునాథభూపుఁడు విద్యావినోదియు, గానకళా ప్రియుండును, అఖిలకళా పోషకుండునై ఖ్యాతి గాంచెను. రాయలవలె ఆతడును స్వయముగ కవిశ్రేష్ఠుడు. రాయల భువనవిజయము కవిపుంగవుల కాటపట్టైనట్లే, యాతని లక్ష్మీవిజయ సంసద్భవనము కవయిత్రీమణులకు కాణాచియై విరాజిల్లినది. ఇది యీ సుశ్లోకుఁడు వెలయించిన క్రొత్తబాట. అట్లాస్థానకవయిత్రులుగా పేరు పొందిన వారిలో రామభద్రాంబ యొకతె. ఈమె వారాంగన యని ప్రతీతి. తన కావ్యమున ''నాథో మమ రఘునాథః నేతా" యని వ్రాసినది. కాని కావ్యాంతర్గతముగా రఘునాథుని భార్యలను పేర్కొనుచుఁ దన నామము నుల్లేఖింపలేక పోయినది. చారిత్రకపరిశోధకు లింతవఱ కీమెను ఉపకాంతగనే పరిగ్రహించిరి. ఈమె కాలము 1633.

గంగాదేవీ తిరుమలాంబలవలె నీమెయు వీర్యవిక్రమాటోప స్ఫూర్తియగు తత్కాల చక్రవర్తిని రఘునాథుని నాయకునిగ నెన్నుకొని, యాతని జీవితవృత్తమునే యాద్యభాషను ద్వాదశస్సర్గసంభృతమగు కావ్యముగా గానము చేసెను.

ఏలనో అప్పటికాలపు స్త్రీలందరు (మొల్ల తక్క) గీర్వాణమున కావ్యోత్పత్తి కావించినవారే.

ఇతి శ్రీ రామభద్ర కరుణా కటాక్ష లబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖి సమసమయలేఖినీ యాష్టభాషాకల్పిత చతుర్విధ కవితానుప్రాణిత సాహి సామ్రాజ్యభద్రపీఠారూఢ......"

ఇట్లుగా నున్న యీ కావ్యసర్గాంతగద్యల వలన నీమె యుపజ్ఞ స్పష్టమగు చున్నది.

రాజగోపాలవిలాసము మున్నగు బహుళాంధ్రకావ్యనిర్మాత యగు 'చెంగల్వ కాళ' యీమె కవితాగురువు. ద్వాదశసర్గలు కల యీ మహా కావ్యమున 900 శ్లోకములు స్థానము బడసినవి. రఘువంశమువలె అటనట వాడిన శార్దూల, మాలినీ స్రగ్ధరావృత్తములు దక్క తక్కిన కావ్యమంతయు నొకేఛందము.

చోళదేశవర్ణనము- తంజాపూరువర్ణనము, రఘునాథనాయక వర్ణనము, రఘునాథుని దినచర్య, కమలావిలాసము. సభావర్ణనము, రఘునాథునివంశావళి, యువరాజ వివాహము, తుండీరదేశ జయము, చోళంగజయము, నేపాళ (జాఫ్నా) జయము, పాండ్యరాజుల జయములు 10 సర్గలలోను, 11, 12 సర్గలలో ఆకాలమునాటి స్త్రీవిద్య. స్త్రీలసంస్కారము, సంగీతవిద్య, రావణ హస్తము, నాటకరచనము, గాన నృత్య విశేషములును చెప్పబడినవి.

రఘునాథుని కథావృత్తాంతమే కావ్యారంభము. ఆతని విజయాదికములను రామభద్రాంబ ఉత్సాహతరంగితయై కీర్తించినది. అతని కావ్యగీతిప్రియత్వమును, అతని కళాపోషకత్వము, కవిపండితగోష్ఠులను సరస సల్లాపములతో శ్రావ్యముగ వర్ణించినది.

అతడు సహజముగానే కవిరాజు, రాజకవియును. అంతే కాక, సంగీత సాహితీప్రౌఢ లగు యువతీసహస్రము కల సభాస్థానమును ఆమోదముతోను, ఆనందముతోడను తన ప్రాభవమునకు హెచ్చు గర్వ కారణముగను స్వయశోభి వృద్ధికరముగను పోషించి మంతున కెక్కినాడు. రామభద్రాంబ ప్రథమసర్గముననే వర్ణించినట్లు:—

> "చింతా సమస్యాశత మేకదైన తత్కీర్తివార్తా నహి వర్ణనీయా
> అశేషలోకాశ్రయ వృత్తభేద ప్రస్తార విద్యాప్రథితస్య యస్య
> అన్తఃపురా న్తర్హరిణేక్షణాసు త్రిహాయణీ రపి దీప్యమానాన్
> విలోక్య విద్యావిభవా నజస్రం వశంవదాం యస్యవదంతి వాణీ"

అతడు వశంవద యైన వాణితో విరాజిల్లుచుండునట ఇందు ''త్రిహాయణీ రపి దీప్యమానాన్'' అనుచో, మూడేళ్ళ బాలిక కూడ కవిత్వము చెప్పునదే అనుచో, తెలుగుల యింటి వ్యవహారము స్వభావసిద్ధముగ నచ్చువడినది.

సంగరరంగమునుండి విజయలక్ష్మీసమేతుడై మగుడి రాగా, ఆ లక్ష్మీ విలాసము నందలి కవయిత్రు లందఱు నతని వీర్యవిక్రమముల ప్రస్తావించు చుండగా, నాత డాస్థానప్రవేశ మొనర్చెను. అంత అపరసరస్వతులైన యా విద్వాంసురాండ్రా ప్రతాపాధికుని శౌర్యమును సానందముగా సమీక్షించి రను నర్థము వచ్చు నీ క్రింది శ్లోకముల గాంచుడు.

విలాసినీ లాస్య విలాస లాలసమ్,
మృదంగ సంగీత నినాదమేదురమ్
అథేందిరామందిర మాసద న్ముదా,
మహీశ్వర స్సంతత మంగలాస్పదమ్.
సుగంధిచూడార్పితసూనమాలికా
వలీమిలిందారవ వన్ది నిస్వనః,
విశా మధీశో విజయోత్తరం తతః
ప్రమోదమానో భవనమ్ సమాసదత్ .. ,

తరువాత, నా ప్రభుం డా మహిళాసదస్సున గావించిన విద్యావినోదముల నొక దీర్ఘవృత్తమాలికలను వర్ణించినది. సద్యస్సంఘటితమాన విజయలక్ష్మీ కరగ్రహణోత్సవానంద పరవశుండైన యా మహానాయకు డీ మహిళాసదస్సు నందలి మహితగౌరవములకు మఱింత ముదితుడై, వారందఱుకు కనకాభిషేకము గావించె నట.

ఇందలి శైలి ధారావాహికముగ నుండును. అబల యైనను యుద్ధవర్ణనలను చక్కగా నొనర్చినది. ఈ కవయిత్రి కల్పనాచాతుర్యమునకు ఈ క్రింది శ్లోకమును గాంచుడు:—

"వేలాపథే తస్య విభో ర్గజానాం
కర్ణాని వై కేతకిగర్భ రేణుః

ప్రసారిత స్తత్ర పయః పయోధిం
అకల్పయన్ తం లవణాంబురాశిం"

(సాగరతీరమున నడయాడుచున్న యా మహారాజు నేనుగుల కర్ణానిలము చేత ప్రచారితములై సారితములైన కేతకీగర్భ రేణువులు పాలసముద్రమును నుప్పుసముద్రముగా జేయుచున్నవి.)

యుద్ధవర్ణనములు:—

"అయోమయాభి ర్నవికావళీభిః అపాంగకోణై రపి శోషణైః
అవాకిరం స్త్వగ్నికణాన్విపక్షాః భూపాలసైన్యేషు పురస్థితేషు
సంగ్రామాంతస్పాదివర్ణేన క్లప్తాః కాంభోజానాం మండలాకార రేఖా
పాదాతీనా మచ్యుతక్ష్మాపసూనోః ప్రాకారో భూ ద్దురీక్ష్యం విపక్షైః"

శైలికి మరొక్కటి:—

"దళత్ప్రసూనాంకితదామ సౌరభీ
ర్మిళన్మిళిందారవమేదురోదరామ్,
సలీలలాస్యాక్రమచంక్రమోచిత
......పరాగభూసురామ్."

ఇందు తెలుగుకవిత్వమునందు వలె యతి ప్రాసలు గమనింపబడినవి. గమనించియే యుందురు.

ఇట్టి బృహత్ప్రయత్నమునఁ దనకుఁ దోడుపడిన రఘునాథుని కృతజ్ఞతతో ఆమె స్మరించినది.

"శబ్దార్థయో ర్మర్మసమప్రధానాం
వశంవదాం యస్య వదంతి సర్వే
కృతీ స యేవాత్ర కృతౌ సహాయో
నాథో మమ శ్రీరఘునాథనేతా."

రఘునాథభూపుని ఆస్థానకవయిత్రి లబ్ధభాషావిశారద లను మాట కేవల మభూతకల్పన కాదు. ఒకానొకప్పుడు రామభద్రాంబ ప్రాస్తావికముగ పూరించిన ఈ క్రింది పాకృతసమస్యను గమనింపుడు:—

పరిపుణ్ణ కళా హిసోహమాణో అహాయం సక్కుళణిచ్ఛ సెప్వమాణో
సహా వి (సః) చెందిఆవో రహుణాహఖ్కితిచందిరో విహాయి
పరిపూర్ణ కళాభి శోభమానః అభితస్సత్కుల నిత్యసేవ్యమానః
సఖియ (శః!) చంద్రికాఢ్యో రఘునాథక్షితిచంద్రో విభాతి.

ఈమె పూరించిన తెలుగు సమస్య:—

ఏరీ నీ సరిరాజులు ?
భూరమణులు నిన్ను జాల బొగడుదురు భళీ!
స్వారా జని రేరా జని
రారా జని యచ్యుతేంద్ర రఘునాధనృపా.

సంస్కృతసారస్వతమున కజరామర మగు సేవ లొనర్చి తన యమూల్య కావ్యరచనముచే సరస్వతికి హరువు గూర్చిన ఈ కవిగ్రామణికీర్తి లమలమూర్తు లగు గాక!

---

# 14. మధురవాణి - రామాయణ సారకావ్య తిలకము

రామభద్రాంబను గూర్చియు, నాయమ కావ్యమును గూర్చియు ముచ్చటించు కొంటిమి. ఇంక నారాజన్యచూడామణి సంసద్భవనముననే యింకొక కవయిత్రీ మతల్లిని గూర్చి యెఱుకపడయుదము. ఈ యమయు సంస్కృతకావ్య గ్రథనమున గణుతి కెక్కినదే. ఈమె రఘునాథ భూపునిచే స్వయంరచితమగు నాంధ్ర రామాయణము నాతని యనుమతిని సంస్కృతము చేసినది. ఆ రాజదేవేంద్రునంతటి వాని కృతిని సంస్కృతీకరించు మహాభాగ్యమబ్బిన బిబ్బోకవతి మధురవాణి నిజముగ మహిళాలోకమునకే యనూనగౌరవ మాకల్పించిన దనవచ్చును.

మధురవాణి సామాన్యురాలు కాదు. కవితల్లజులను, పండిత ప్రకాండులను తనమతివిలసనముచేఁ దలఁ దన్నినది.

మహామతి యగు నీమెను:—

"చతురమధురవాణీం సమ్యగాకర్ణ్య యస్యా
స్సదసి మధురవాణీ నామ దత్తం త్వయైవ
సరసకృతివిధాయాం సాధు మేధావిశేషా
స్వధికపటువిశేషా స్వాంబు జాక్షీమ సైషా."

ఇట్టి దానినిగా గురుతించి, యా మహాభాగుఁడే 'మధురవాణి' యని సంభావించెను. అదియే యామెకు స్థిరనామ మైనది. కాని, యామె నిజ నామ మేమో యామె నిజవృత్త మేమో యించుకయుఁ దెలియదు. తన కుటుంబము విద్వత్కుటుంబ మనియును, దాను పండితవంశమున నవతరించితి నని మాత్రము.

"విద్యాన్వవాయే నిహితావతారా
సుశిక్షితాసౌ విదుషా త్వయైవ
విద్యాపరీక్షా సమయే విశేషాత్
ప్రకాశమాన ప్రతిభానుభావా."

అని చెప్పుకొన్నది.

ఈమె రామాయణసారకావ్యమునే గాక, కుమారసంభవమును, నైషధమును గూడ రచియించినానని ఆశ్వాసాన్తశ్లోకములలో చెప్పినది. ఆ కబ్బము లింకను సారస్వతేయుల కంట్ల బడలేదు. ఈ రామాయణమైనను, ఇంతదనుక ముద్రణా భాగ్యము నందలేదు. ఈ కావ్యపు దాళపత్ర ప్రతి యొకటి యెట్లో తంజపురిని వీడి బెంగుళూరులోని మల్లేశ్వరమునందలి వేదవేదాంగమందిర గ్రంథాలయమును జేరినది. అది యైనను సమగ్రముగ లేదు. 115 వ తాళపత్రమునకు బిమ్మట గ్రంథపాతము కన్పట్టుచున్నది. ఉపలబ్ధ మైనంతవరకు వివిధఛందములకు జెందిన శ్లోకములు 1500 వరకు నుండి సుందరాకాండమువరకు కథ గనబడుచున్నది.

ఈ నాయకుని యాస్థానమును తేనెటీఁగలవలె నాక్రమించి, కవితాగానముతో ఝుమ్మని రొద సేయుచు, జుంటితేనె పెరలవంటి కావ్యముల రచించుచు కవయిత్రీ సహస్ర మెప్పుడు నలంకరించి యుండెడివారట.

''రసోత్తరం రామకథానుబన్ధం
కావ్యం మయా కల్పిత మాంధ్రవాణ్యాం
కార్యం త్వయా సంస్కృతవాగ్భి రేతత్
ఇత్యేష చిత్తే గణయ న్నవాత్సీత్.
"ఆజహా దలంకృతిక్రమ మనేకరసోల్లసితం
సరసపదార్థసంగతిసమగ్రగుణానుగుణం
రఘురమణప్రబంధతిలకమ్ రసికాభిమతం,
సుదతి విధీయతా మితి సుధీ రగదీ న్నృపతిః."

ఇట్లు నాయకునిచే నాజ్ఞాపితయై యాతనికృతిని సంస్కృతీకరించినది. రఘునాథుఁడును సంస్కృతాంధ్రములఁ గవనము చెప్పగల చతురుడేకదా. అట్టియెడ, నిట్టి మహత్కావ్యనిర్మాణమునకు మధురవాణి నేల పూన్చెనో ! కేవల మాతని స్త్రీవిద్యాభిమానమే యట్లొనర్పఁజేసిన దనవలెను. ఇంతకును నీమె రచించిన సంస్కృతకావ్యమునకును, నాయకుని కృతికి నించుకంతయు పోలిక లేదు. మఱి యీమె రామాయణరచనకు మూలమైన రామాయణ మింకొకటి రఘునాథకృతము కలదేమో !

మధురవాణి మాఘునివలె మిక్కిలి మూలప్రయోగములను ''రాజనీతిః రహస్యః'' యనునట్టివి, చేయగల పాండిత్యమును సంపాదించినది. ఆమెనుగూర్చి యామె చెప్పుకొన్న సర్గాన్తశ్లోకము లొక్కొక్కటి యొక్కొక యామె ప్రతిభను గూర్చి యూఁది పలుకుచున్నవి.

ఇట్టనేకవిధ విశేషణములతోఁ దన ప్రాగల్భ్యము చెప్పుకొన్నది. ఈమెకును నాయకుఁడు స్వర్ణాభిషేకము గావించెను.

"కథాగ్రథనసంవిధానములో కళావైదగ్ధ్యములలో నీకావ్య ముత్తమకావ్యమై రఘువంశ, కుమారసంభవాదుల యంత ఉత్తమముగా నున్నది. శబ్దములయందలి యవ్యక్తమధురమైన నాదవిశేష మీమెకు బాగుగా తెలియును. పేశలమృదూక్తుల కీమెకావ్యము పెట్టినది పేరు. భాష యీ భాషాసరస్వతికి బాగుగా వశవర్తిని. కల్పనాశక్తి యప్రతిమానము" అని కురుగంటి సీతారామయ్య గారీమె కవిత్వ మును ప్రశంసించిరి.

కల్పనకై యీమె కావ్యమునుండి యుదంచితము లగు నిదర్శనములను బహుళముగా పచరింపవచ్చును. తన పోషకుఁడైన రఘునాథ భూపుని వర్ణించిన మెఱిమిడిశ్లోకములు ప్రత్యేకస్తుతిపాత్రములుగ నున్నవి. ఉజ్జ్వలములై రసోల్బ ణములైన యివియే ప్రత్యేక కావ్యమన్నను దోషము లేదు.

''యదన్తరావర్తితనర్తనానాం
సీమన్తినీనాం శ్రమ మాక్షిపన్తి
పర్యాన్తయంత్ర ప్రతిమా కరాగ్ర
ప్రకీర్ణజాతాః పవమానపోతాః.

ఈ శ్లోకమువలన నాకాలముననే యంత్రపాలికలచే మనుష్య ప్రయత్నము లేకయే వీవంబడు వీవన లున్న వని తెలియుచున్నది.

"హేమ్నా కృతం యత్ర మహాకటాహం
హిరణ్యగర్భాండ మివ ప్రతిమ్నః
తథానచేత్ కింతు తదీయగర్భే
భూయాంసి నిత్యం భువనానిసంతి.

హిరణ్యగర్భాండ బ్రహ్మాండముతో సాటివచ్చు స్వర్ణమయములగు జల కటాహములు ఆతని యాస్థానమున గలవు. అవి బ్రహ్మాండకల్పములు, గానిచో వానియందు భువనము (నీరు) లేల ఉండును? అతిభూమంగతమైన యీ ఉదార రమణీయ భావనకు మధురవాణి ప్రశంసార్హయే.

''బన్దీకృతా యేన పరక్షితీశమహా
మణీమందో కీర్తికన్యాః
పరార్థ్యదన్తప్రతిమానిభేన స్తంభం
సమాలంబ్య చిరం వసన్తి''

ఓహో ! యీ మధురకల్పనకు మధురవాణి కే మిచ్చిన యర్థమగునో ?

''రంభాశ్శతం రమ్యముణీసహస్రం గాః
ప్రావ్య లక్ష్యం హరిణీశ్చకోటీమ్
స భూరితారోల్లసనం సదా యత్పటమ్
బలారే ర్బృహూధా తిశేతే''

''నిశమ్య దంతాత్మని భద్రపీఠే నిషణ్ణ
మర్థే రఘునాథభూపమ్
తస్మిన్ జనం పుష్పక మావసన్త
మమన్యతా ద్యం రఘునాథ మేవ''

మధురవాణిచే నిట్లు మంజులపదశింజాన శోభిత రమ్యశ్లోకమున నుపలాలితు డై నందుల కా మహీధవు డెంత యలరెనో!

ఇంతే కాక, "కస్తూరికాచందన కుంకుమాదులచే నుద్వర్తితయైన యువతి వలె, తన కావ్యము సంఖ్యావంతులును సర్యపఠీన బుద్ధిశాలురు నగు పండితులచే పరిష్కరింపబడినదని చెప్పుకొన్నది.

ఇక కావ్యాంతర్గత విషయపరామర్శము గావింతము:—

విభాండకునికడ వేశ్యాచేష్టితములు:—

''శ్రుతిహృద్య ముదారభజ్గి గానం
సుదృశాం తత్ర సుతో విభాండకస్య

నిరవద్య మసౌ నిశమ్య హర్షం
సమధత్తా త్మని సామగానబుద్ధ్యా"

ఇందు విభాండకపుత్రుని అలౌకికము ఉదారముగా పోషింపఁ బడినది;

"అతిదూర మాగతవతః శ్రమచ్ఛిదే
నిజకామినీమణీ జన స్స్వయం ధృతః
పటవాసపాంసురివ కేతకీరజ
స్తటసీమని స్ఫురతి వాసయన్ మహీం"

"తట వికస్వరనూతనకేతకీపతిత పాంసుపరీతనిజాన్తరం
స్ఫురతి యస్య పురారితనుః పయస్సితభాసితభాసితభాఇవ"
"శత్రూన్ జేతుం శాతశాతా మతస్త్వన్
నాళీకానాం పాళికా రాజహంసాః
పత్త్రాగ్రాణాం ప్రాప్నువన్
సప్రశంసా నాళికానా... ..."

శారద, రాజహంస, కేతకులను వర్ణించిన యిట్టి సుందరవర్ణన లెన్నో కావ్యమునఁ గలవు. ఇందలి శబ్దశ్లేషయు, శబ్దాలంకారములును, గమనార్హములు.

సీతామహాసాధ్వికి శ్రీరామచంద్రుని యంగుళీయకము సమర్పించుచు వాయునందను డాడిన పల్కులు మిక్కిలి భావస్ఫోరకములుగానున్నవి.

"ఆయాత మత్ర రఘువీరకరావమర్శం
త్యక్త్వేతి రాగభర మాత్మని మాకృథా స్త్వమ్
రత్నాంగుళీయక, వితర్కయ రత్నగార్భ్యా"
గర్భోదయా త్సహజరాగ మనూన మేవ"

సీతమ్మ యా యంగుళిని గ్రహించి యాడిన పల్కు లింకను హృదయంగమములై రసప్రసన్నములై యున్నవి. ఇచట సీతాశోకము విరహము పతిదేవుని వస్తువును దా నిప్పటికి చూడగల్గుటలోని యౌత్సుక్యానందముల శబలిత భావములై వ్యంగ్యముగా మాత్రమే పోషింపబడినవి. ఇదియే కదా, మహాకావ్య లక్షణము !

"భవ్యం విహాయ భరతో మణిముద్రికే త్వాం
సామ్రాజ్యపాలనసమంజసతాప్రకారే
పాదూద్వయం రఘుపతిం ప్రణయా ద్యయాచే
కిం ను స్తవా మ్యహహ త త్కలితోపకారం."

ఉత్సుకత రేపి కుతుకము బెంచు నిట్టి రచనలు కండచక్కెర వంటివై పఠితల నూరింపజేయును.

"తౌ వల్లకీ మజ్కతలే నిధాయ"

అను శ్లోకముతో నారంభించి 39 శ్లోకములలో వర్ణించిన కుశలవుల సంగీత శిక్షయం దీమె సంగీతశాస్త్రప్రావీణ్యము వ్యక్తమగుచున్నది.

రఘునాథుని ఏల్బడిని గూర్చి—
"కంజాతసూతిప్రమదాంఘ్రి భూషా
శింజారవోదారవచస్సరోజా
పుంజా నమూల్యాన్ దధతీం మణీనాం
తంజాపురీం శా స్తి తరంగితౌజాః."

ఎంత రమ్యముగ వర్ణించినతో గాంచితిరా! తెలుగునందువలె ప్రాసనియమమును, ఇందలి శబ్దాలంకార సామంజస్యమును జూడుడు. ఆవధానవిద్యయందును ఆశుకవిత్వమునందును నీ ప్రతిభురాలు.

"కతికతినః క్షితిపతయః కిం తే రఘునాథనాయకాయ న్తే
భువి బహవః కీలతరవః కింతే సంతాన సాదపాయ న్తే."

క్రీ గీత గల సమస్యను రఘునాథు డీయగా, వెంటనే యింత చక్కగా పూరించెనట.

ఈమె పూరించిన ప్రాకృత సమస్య ఇంకొకటి:—
"తెళ్కొక్కెక్కసుహావహా సుహాయర వియయరాహవం సఇణం
దెత్థూణ ణియతణుయం వడ్డయి రహుణాహరాయపాహోహి.

త్రైలోక్యైక సుఖావహ శుభకర విజయరాఘవం శశినం
దృష్ట్వా నిజతనూజం వర్ధతే రఘునాథరాజపాథోధి.

సంగీతసాహిత్యముల సమగ్రజ్ఞానము కల ప్రభుడు రఘునాథు డేదేని నూత్న నూత్న రాగ తాళాదులను సృష్టించి ప్రస్తరించి యాలాపన సేయుచుండ, వాని నా యాలాపన మధ్యమందే యందుకొని పూర్వపరిచితరాగమువలె నీమె యాలాపన సేసి ముగించెడిదట.

ఈమెయును రామభద్రాంబయును నాంధ్రకవిత్వమునకు వలె సంస్కృత కవిత్వమున గూడ కొన్ని చోట్ల యతి ప్రాసల నుంచిరి. ఈయమ రామాయణ మునకు మూల మని చెప్పబడు రఘునాథరామాయణము మిక్కిలి సుగమముగ నున్నది. ఇయ్యది కొద్ది కష్టనియములతో పండిరంజకముగ నున్నది. ఒకప్పు డీమె కావ్యసమీక్ష గావించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు "పాఠకులు కాల క్రమమున అవ్యుత్పన్నులుగా బుట్టి బోవుదురని కాబోలు, గొన్ని శ్లోకములకు మధురవాణియే స్వయముగ వ్యాఖ్య రచించెను" అని వ్రాసిరి. దీనివలన నీమె పాండిత్య ప్రభ సువ్యక్తము కాగలదు.

మధురవాణి మతివిలసనము దెల్పు నింకొకగాథ కలదు. ప్రస్తుతము తంజా పురియందు సుప్రతిష్ఠితముగా నున్న 'సరస్వతీభవనము' మధురయం దుండెడి దట. దాని నచటి పండితులతో వాదమున గెలిచి తంజాపురికి దెచ్చి, ప్రభునకు సంతోషము ఘటింపఁ జేసె నఁట. ఇది నిజమో, కాదో కాని, మధురవాణి ప్రతిభకు మాత్ర మిది సత్యానువాకమే యగును. సంస్కృతభాషావాఙ్మయమున నుత్తమకావ్యములు రచించి మించిన కవయిత్రులలో గంగాదేవీ, మధురవాణు లుత్తమ శ్రేణికి జెందినవారు. అందు గంగాదేవి కవిత్వము సరళమై యుపమా ద్యలంకార సంశోభితమై యున్నది. మధురవాణి కవిత్వము కదళీపాకమై పండిత మాత్రజ్ఞేయముగా నున్నది. కూచిమంచి తిమ్మకవి, అడిదము సూరకవి, చేమ కూర వెంకటకవి మున్నగువారు ఈమె సమకాలీనగౌరవము నొందిరని చెప్పవచ్చును.

ఈమె కావ్యమునందలి సర్గాన్తముల శ్లోకములు సంస్కృత కావ్యములలో విశిష్టములై, ప్రత్యేక గమనార్హములై యున్నవి.

తత్తాదృక్ ఘటికార్థ నిర్మిత శత
శ్లోకీ ఫణీగ్రామణీ
వాణీ ప్రాకృతశాస్త్రనైపుణ్యసము
న్మీల ద్యశశ్శీజుషా
దీవ్యోద్యన్మతి సఖ్యయా మధురవా
ణ్యంబాఖ్యయా నిర్మితే
శ్రీ రామాయణసార కావ్యతిలకే
సర్గస్తృతీయోఽభవేత్॥
ప్రస్తారాభినవాత్త వృత్త కవితా
ధాటీ కథాశక్రియా
షడ్భాషారచనావిశేషబహుధా
విఖ్యాతకీర్తి శ్రియా
దీవ్యోద్యన్మతి......సర్గస్తురీయోఽగమత్॥
వీణావాదనకళావినోదసమయే
ధృత్వా సమస్యా శ్శతం
సద్యస్సంసది సాధుపూరయతి యా
దత్తా కవీంద్రైస్తయా
దీవ్యోద్యన్మతి......సర్గోఽ భవత్పంచమః॥
ప్రఖ్యాంతార్జవయా పదార్థగమక
వ్యాఖ్యాన పక్షాన్వయ
ప్రాగత్భ్యస్పద నైషధప్రతివిధా
సానంద సూరీంద్రయా
దీవ్యోద్యన్మతి... ...సర్గోఽత్ర షష్ఠోఽ భవత్॥
సద్యో విస్మయకృన్నిరోష్ఠ్యకవితా
సందర్భధారా సుధా

సారోర్మి పరిపూరిత శ్రుతిసుధీ
సంభావితాభిఖ్యయా
దీవ్యోద్యన్మతి......సర్గో ఽజనిష్టాష్టమః॥
మాధుర్యాతి ధురంధరాంధ్రకవితా
నిర్మాణసమ్మాన్యయా
దీవ్యోద్యన్మతి సఖ్యయా మధురవా
ణ్యంబాఖ్యయా నిర్మితే
శ్రీ రామాయణసారనామని మహః
కావ్యేతి భవ్యే సుధీ
వర్గోల్లాస విశేషధామ్ని నవమ
స్సర్గో మనోజ్ఞో ఽభవత్॥
సూరిస్తవ్య కుమారసంభవమహః
కావ్య ప్రతిగ్రన్థన
ప్రాగల్భ్యప్రకటశ్రియా పదనదః
ప్రఖ్యాత నైదుష్యయా
దీవ్యోద్యన్మతి.......దశమ స్సర్గో ఽత్ర కావ్యే ఽభవత్॥
ప్రౌఢశ్రీ రఘునాథనాయక కృత
స్వర్ణాభిషేకక్రియా
దీవ్యోద్యన్మతి సఖ్య యా మధురవా
ణ్యంబాఖ్యయా నిర్మితే
శ్రీ రామాయణసార కావ్యతిలకే
సర్గస్త దైకాదశః॥

ఇంతటి మహామతికి మధురవాణికి ఆంధ్రులచరిత్రయందు తమ కాలము నొక తేజోవంతమైన యధ్యాయముగ దిద్ది ఆ చరిత్రకు నాయకమణి యైనవాడును, పెక్కులగు సంస్కృతాంధ్ర గ్రంథములు స్వయముగ రచించి రచింపజేసిన వాడును, చోళ, పాండ్య, తుండీరా ద్యనేక క్షేత్రముల దేవతా విమానముల నెక్కొల్పినవాడును, ఎంత వీరుడో యంత రసిక డనిపించుకొన్నవాడును,

ఆన్వీక్షక్యాది రాజతంత్రముల నెంత సమర్థుడో సరసుసంగీతసాహిత్యతంత్రముల నంత కుశలుడైన వాడును, జాఫ్నాకు నౌకలతో వారధి గట్టిన మేటియు, సంగీత సుధాది శాస్త్రగ్రంథముల రచించియు జయంతసేన రామానందాది నూత్నరాగ తాళములను వెలయించిన ప్రౌఢయు, అవక్ర విక్రమమునకును అదభ్రకీర్తికిని తంజాపురిని విహారభూమినిగా జేసి శూద్రక, వాసుదేవ, విక్రమార్క, భోజ, కృష్ణదేవరాయాదుల పరిపాలన దలంపునకు దెచ్చిన వాడును, సర్వమతసహిష్ణువై ప్రజల కన్న బిడ్డలవలె కాపాడినవాడును, తంజాపురిని లక్ష్మీసరస్వతులకు నర్తనశాలగా నొనర్చినవాడు నైన రఘునాథ భూపుడు స్వర్ణాభిషేక మొనర్చె నన్న, నది యామె ప్రజ్ఞ కర్హబహుమానమే. మధురవాణి యట్టి మహాకవయిత్రిని పోదరిగా గాంచిన యాంధ్రమహాజనుల భాగ్యమే భాగ్య మనవలెను.

---

# 15· కృష్ణాజమ్మ - 16· రంగాజమ్మ

## ఉషాపరిణయప్రబంధ, మన్నారుదాసవిలాసములు

అత్యధికైశ్వర్యమును అమితం బగు భోగంబును అనుభవించి రమణీయార్థ కావ్యసృష్టితో రసప్రపంచమును రాగిలజేసిన నాయకరాజులలో కడపటివాడు విజయరామనాయకుఁడు. ఈతడు రఘునాథుని కుమారుడు. "తండ్రి యంతటి వాడు దాను పో దనయుండు" అను నంత ప్రశస్తి గాంచినవాఁడు.

> "ఏ వనితల్ మముం దలప నేమి పనో? తమ రాడువారుగా
> రో? వలపించు నేర్పెఱుగరో? తమ కౌగిట లోన నుండగా,
> రా వది యేమిరా విజయరామ యటం చిలుదూరి బల్మిమై
> తీవరకత్తెనై పెనగి తీసుకవచ్చితినా? తలోదరీ!"

అను ఉక్తివిశేషముతో వాఙ్మయ ప్రపంచమున విశిష్టస్థానము సృష్టించు కొన్న రంగాజీ యీ విజయరాముని యాస్థానకవయిత్రియే.

విజయరాఘవు నాస్థానము నలంకరించిన పెక్కండ్రు రమణీమణులలో కృష్ణాజీ, రంగాజీ యనువారలు ప్రధానలు· వీ రిద్దరును అప్ప చెల్లెండ్రు కారు: కృష్ణాజీ యను నామె వేరనియు, ఆమెకు కృష్ణాంబ యని పేరుగలదనియు, ఆమె తండ్రి రావినూతల తిరుమలయ్య అనియు కొంద అందురు. విజయరాఘవుని పరిషత్తున 'కృష్ణాంబ' యను నొక కవయిత్రి గలదు. కావ్యము కానంబడదు. కృష్ణాజియు కృష్ణాంబయు నొకరే యని నా యూహ. సమకాలీన యగు నామెను గూర్చి రంగాజీ పల్కిన ''సరసగుణనిష్ఠాత కృష్ణాజమాంబ" యను వాక్యముచే కృష్ణాజమ్మకే 'అంబ' ను చేర్చి రన్నమాట తేలిపోవుచున్నది.

> ''ఇరువదారును ఛందంబు లెఱిగి యిట్లు
> కవిత చెప్పినవారు లోకమున గలరెః
> యని వినుతింప వినుతించి ఘనత గాంచె
> గీర్తినీయ గుణాలంబ కృష్ణమాంబ"

ఈమెను గూర్చి యీ యొక్క పద్యము తక్క యిక నేమియువివరములు తెలియకున్నవి.

ఇక రెండవది యగు రంగాజమ్మ బహూళో క్తిమయ కావ్య ప్రపంచమునకు స్రష్ట. విజయరాఘవనాయకునకు కడు గూర్పు ప్రేయసి. మొదటినుండి వచ్చు చున్న యాచారము ప్రకారము, ఈమె కూడ తన్ను నాయకునకు భార్యగనే తన ఉషాపరిణయ ప్రబంధమున వ్రాసికొన్నది. ఇట్టి వారిని ఉపకాంతలని పేర్కొను టపచారముగా కూడ నాకు తోచుచున్నది. వీరిని కులకాలతలనియే వాకొనదగును.

"అని సబహుమానంబుగ తాంబూల జాంబూనదాంబర మాల్యాభరణాదు లొసంగిన, నేనును బరమానందము నొందుచు బతియును గతియును గులదైవంబు నైన నీదు పాదారవిందబులు... ..."

అని...ఇంతియే కాక, రాజగురు వగు తాతాచార్యులు కూడ "చతురాస్యుం డగు నీపతి యిటు గారవించి బహుమతి దోపన్ కృతి రచియింపు మనెన్ భారతికిన్ బ్రతి వత్తు వమ్మ రంగాజమ్మా" అని ప్రశంసించెను. ఇందలి భారతీచతురాస్యుల యౌపమ్య మును గమనింపుడు. ఈమె కావ్యము లీక్రింది విధమున నున్నవి: —

1. రామాయణకథాసంగ్రహము.
2. భారతకథాసంగ్రహము.
3. భాగవతకథాసంగ్రహము.
4. మన్నారుదాసవిలాసము (ప్రబంధము).
5. మన్నారుదాసవిలాసము. (నాటకము) యక్షగానము.
6. ఉషాపరిణయప్రబంధము.

"రాణింప రచియించి రామాయణంబును
భాగవతంబును భారతంబును
.....................
సంగ్రహంబుగ రచియించి సరసరీతి.. "

అను పద్యపాదమును బట్టి వ్య క్త మగుచున్న యీ కావ్యములలో మొదటి మూడును నిపు డెచటను కానబడకున్నవి. మన్నారుదాస విలాస యక్షగానమే

యిప్పుడు ముద్రణాసౌభాగ్యము నందినది. ఉషాపరిణయము జీర్ణమై శిథిలబంధ-మయిపోయినను మూడాశ్వాసములైనను దొరకలేదు.

ఈమె రచనలలో ఉత్తరోత్తరము రసోత్తరముగా కనబడుచున్నది. కథా సంవిధానమునను, కవితాపటిమ యందును ఈమె రచనలలో మిన్నయైన ఉషా పరిణయము - పూర్వకవుల రీతుల స్ఫురింపజేయు నుత్తమకావ్యముగా నున్నది. సమకాలీను డగు కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధచరిత్రము కంటె నిదియే గుణోత్తరముగ నున్న దని రసజ్ఞులు నిర్వచించిరి.

ఉషాపరిణయమందలి యొక పద్యము:—

"అంత కోపము రెట్టింప అంతకోప
మాకృతిని వైష్ణవజ్వరం బావహిల్ల,
మస్తకంబులు నిజఘోరహస్తములను
చదిపి మోదుచు మఱియు వక్షంబు నడచె."

ఈమె రామభద్రాంబ, మధురవాణి మున్నగువారివలె కాక తన గ్రంథాంత గద్యలో తన కులగోత్రము లన్నియు నుపలక్షితము గావించినది:— "సార సారస్వతధురీణయు విచిత్రతరపత్రికాశతలిఖిత వాచకార్థానగాహన ప్రవీణయు, శృంగారరస తరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్టభాషా కవితా సర్వంకష మనీషావిశేష విశారదయు, రాజనీతివిశారదయు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవిజన స్తవనీయవివేకయు, మహనీయ మహాభారత భాగవత రామాయణకథాసంగ్రహణ విచక్షణయు, పసుపులేటి వెంక టాద్రిబహుజన్మతపఃఫలంబును, మంగమాంబాగర్భ శుక్తి ముక్తాఫలంబును" అని తన వుట్టుపూర్వోత్తరములను సమగ్రముగా వర్ణించినది.

ఈమె మన్నారుదాసవిలాస యక్షగానము:—

ఇది 1926 లో కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ముద్రించిరి. విజయ రాఘవునకు కాంతిమతికిని జరిగిన వివాహాదికమే యిందు విషయము.

ఇందు సంస్కృతశ్లోకములు, చూర్ణికలు నున్నవి. అట నట పైశాచి, మాగధి, శౌరసేని, అపభ్రంశభాషావాక్యము లున్నవి. విజయరాఘవుని యాస్థాన

పరివారమున కొందఱు తమిళము మాట్లాడువారున్నా రని కూడా తెలియుచున్నది. నాటకలక్షణము లంతగా సమగ్రముగా దీని కన్వయించుట లేదు. వ్యాకరణవిరుద్ధ ప్రయోగము లున్నవి. ఇదంతయు ద్రాక్షాపాకమున నున్నది.

తావి జగజంపు సిలపూవుల సరుల్
తళుకుమోవి పలుగెంపు బురుసాపలువ సొంపుల్
ఠీవి తులకింప నొకతావి చుఱుకున్మరుతు
మావి వయినెక్కి పురిలో వెడలి రాగా
నీ పగలు చూచి చెలి రేవగలు చొక్కుచును
బూవుజముదాడి దొరహావడికి జిక్కెన్
మా వెలది నేలుకొన రావలదె నీవు దయతో
విజయరాఘవ మహీవర పరాకా.

ఇది యిటు లున్నది.

ఈమె ప్రబంధములలోని వనబడు ననేకపద్యములను వరుసగా శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ తంజాపురాంధ్ర నాయకరాజుల చరిత్రయం దుదహరించిరి. ఈ ముఫ్వురకావ్యములు చారిత్రకప్రమాణమున నమూల్యమైన గ్రంధములని వారీ సందర్భమునం బ్రశంసించిరి.

ఈమె మన్నారుదాసవిలాస ప్రబంధరచన కొక ప్రబలకారణము కల దందురు: — రంగాజమ్మ! విజయరామని యువపత్ని యందురు. విజయరాఘవుడు పరిణీతుడై, పట్టాభిషిక్తుడైన ప్రథమరాత్రముననే రంగాజియు, కృష్ణాజియు నాస్థానమున గజ్జెకట్టి నాట్యము చేసిరి. అతిలోకసుందరియగు రంగాజియొక్క అపరంజి యట్టి తనుకాంతి, రసికు డగు విజయరాఘవు నప్రయత్నముగ నాకర్షించి నది. ఆకర్షించుటే తడవుగ, నిటు లంతిపురమునకు వెడలవలసిన రాజకుమారు డటు వేశ్యాగృహమునకు దారితీసెను. అంతటనుండి మహారాజునకు రంగాజి యిల్లే అంతిపురమాయెను; రచ్చచావడి ఆయెను; కొలువుకూట మాయెను. సర్వము నాయెను. తాళి కట్టిన తరుణియు తరుణకాంతిరూపసమంచితయే. ఐన నేమి? కాంతు డటు జూచిన గదా!

అంతిపురమున సతులును, నాస్థానమున సచివులును ప్రభుని వింతవర్తనము నుండి మరల్చుటకై సర్వశక్తులును ధారవోసిరి. కాని, రంగాజి నునువెచ్చని కౌగిళుల దనుపాడు ప్రభునకు, ఆమె రంగారు ప్రేమామృతము నింపార గ్రోలుచు, సొక్కి సోలిన సొగసుకానికి, వారాంగనా పవిత్రప్రణయశీలమునకు పాతివ్రత్యమునకు నిచ్చమెచ్చి బరాబరులు సల్పు ప్రభుసత్తమునకు నివి యన్నియు బట్టవాయెను.

రాణి ప్రభుని చిత్రపటము తెప్పించి రంగాజీ యింటికి చేటికచే బంపి పతి భిక్షయిడుమని ప్రార్థించినదట. పతిప్రణయగర్వితయయి వయసుపరువమున నున్న రంగాజమ్మ వెంటనే

> "ఏ వనితల్ మముం దలంప నేమి పనో? తమ రాడువారు గా
> రో? వలపించు నే ర్పెఱుగరో? తమ కౌగిట లోననుండగా;
> రా వది యేమిరా విజయరామ యటం చిలు దూరి బల్మిమై
> దీవరకత్తెనై పెనగి తీసుకవచ్చితినా తలోదరీ."

అని, యా చిత్రపటము వెనుకనే వ్రాసి దూతికను వచ్చిన దాశినే వెనుకకు పంపినది.

రాజగృహమున కల్లోలము రేగినది. రాజపత్ని యొక గడువు బెట్టి, యా గడువులోపల మహారాజు అంతిపురి జేరకున్న, దా నసువుల బాసెద నని శపథము పట్టినది. రంధ్రము రోయుచు రాజపరివార మంతయు గలగుండు వడుచున్నది.

ఆ నాడు రాణి యిడిన గడువు ముగియు దినము. రంగాజీ ప్రేమ నుండి యచంచలుడైన రాజును మఱల్చుట కే యుపాయమును బనిచేయకపోయినది. రాజగురు వగు తాతాచార్యుడు విదూషకుని చెవిలో నేమియో చెప్పి పంపివైచెను అది సాయంతనము, సకలజనాహ్లాదకరుడగు చంద్రభగవాను డింకను రాజ్యపాలనకై గగనసింహాసనము నధిరోహింపలేదు. ప్రభుప్రేయసి రంగాజమ్మ అంతర్వత్ని యైనట్లు రాజున కానాడే కబురు తెలిసినది. అతిశయించిన యానందముతో అధిపుడు రంగాజి యంతఃపురమున కరుగవలె నని సింగారించుకొని సిద్ధమాయెను.

ఇంతలో విదూషకు డేతెంచి రాజు నా వ్యవసాయమునుండి మరల్పుటకై బహుభంగుల బ్రతిమిలాడెను, కడకు భంగపడెను కాని ప్రభునికడ నది యంతయు, బూదిని( బోసిన పన్నీ రాయెను. రంగాజీ సందర్శనవ్యగ్రుడైన మహారాజు తలంచకుండ నడుమ జరిగిన యీ విఘాతమునకు మహోదగ్రుడై మహావ్యగ్రతతో విదూషకుని విడిపించుకొని, వడి రంగాజీ యుద్యానమును దరిసెను. అంతతో( బోక విదూషకుడు తానును రాజను వెంబడించి రంగాజీ యభ్యంతరగృహ ప్రాంగణమున కాలిడిన ప్రభుని చెవులో నేమో గుసగుస లాడెను. అంతే. ఇంతలో నంతయు దల్లక్రిందులై పోయినది. అటు వైచిన కాలిటు తిరిగినది. మహారాజు మోము వివర్ణమై వింతచెలువుదోప తన చెవుల( బడిన రహస్యము నిజమగునా, "ఇంతకాలము తాను తన కులగురువగు తాతాచార్యుని భోగపుత్రిని, తనసోదరినా, కామించి ప్రేమించినది ?" అని వితర్కించినాడు ; విదూషకుడు నిజము నిజమని రెట్టించి పలుకగా, విశ్వసించి "ఛీ!" యని రోసినాడు. తన యవివేకమునకు పశ్చాత్తప్తు డైనాడు. ధర్మగ్లానికి పరదేవతలను మన్నింపుడని వేడుకొన్నాడు. వెనుదిరిగి హుటాహుటి నిజాంతఃపురము సమీపించినాడు. రంగాజి జీవితము వలవంతల బడి మంటలపాలై ముగ్గిపోయినది. రాణి జీవితము ఫలవంతమై వలపు పంట బండించినది. ఉరికై కంఠమున తగిలించిన త్రాడు కాంతునిచే కళ్యాణదామ ముగ గళసీమ నలంకరింప బడినది. పరమాభిమాన యగు రంగాజీ కత మెఱుగక కొన్నాళ్ళు గగ్గోలుపడినది. కాని రా జెన్నాళ్ళకు అనుగ్రహింప డాయె. అభిమాన ధన యగు నామె రాజునకు కబురుపంపుటకు సైతము ప్రయత్నింపలేదు. వెన్నెల వెనుక చీకటి యుండుట సాజ మని సమాధానము చెప్పుకొని సమాశ్వాసము వడసినది.

కాని, పతిగతప్రాణయు, పవిత్రప్రణయశీలయు నైన యా మెకు పతివిరహ మోర్వరాని దైనది. నిద్రాహారములు వర్జించి కేవలము గర్భగత శిశుసంరక్షణార్థము ఓగిర మారగించెడిది. అక్క యగు కృష్ణాజియు, తల్లి యగు మంగమాంబికయు నిది వేశ్యాధర్మమునకు విరుద్ధ మనియు, వేరొకని వరించి సుఖ ముండు మనియు వేనోళ్ళ నుపదేశించిరి. కాని యా పతిప్రాణ యట్టి యవినీతిని జెవి నిడక నిరాక రించినది. ప్రసవదినము సమీపించినది. లావణ్యరేఖామాత్రశేషిత రూపోద్దీప్తయగు

నామె పూర్ణ చంద్రతేజోవిరాజమాను డగు కుమారుని బ్రసవించినది. విజయ రాఘవునకు బుత్రునికొఱ కైన యొకపరి రమ్మని దూత్య మంపినది.

పట్టమహిషియు, ప్రభుండును రంగాజి నగరునకు విచ్చేసిరి. ఆ పసినిసు గును ప్రభుని చేతుల నిడినది. ధర్మము నిర్వర్తించి విధినిర్వహణము గావించితి ననుతృప్తిభావ మొకటి గన్నుల తేజోరూపమున నలమికొన్నది. శరీరము శుష్క మైనది. గన్నులు తేజోవంతములై మిలమిలలాడ, ఱెప్ప లల్లనఁ ద్రోచి స్వామి నొకపరి తేరిపారఁ జూచి యాయనపాదముల కడ వంగి ప్రణమిల్లినది. శరీరాంత ర్గత మగు జీవనజ్యోతి యల్లే యెగిరి మహాపథమున విలీన మైనది. రాఘవుఁడును, రాజీయును కన్నులు చెమ్మగిల్ల నార్ద్రహృదయముతో నా పూతచరిత్రకు మొక్కి ఋణము దీర్చుకొనిరి.

ఈ రమణీయగాథా వర్ణనమే మన్నారుదాసవిలాస ప్రబంధేతివృత్తము. ఇంతే గాక, చాటువుగ జెప్పిన పద్యము లెన్నో గలవు.

రాజనీతివిశారదయై, కవిత్వకళాప్రౌఢి మెరసి, అన్నింటిని మించి ముగ్ధ ప్రణయతపస్విరియై, నాధుని హృదయవర్తన మెఱిగి నర్తించు ననురక్తయై యా నవరాట్టహృదయము లోఁగొనిన యీ రసరాజ్ఞి క్షేత్రయ సమకాలిని.

జీవితేశ్వరుని తోడిద లోక మని కులకాంతలకును రూపించిన రంగాజి వెలకాంతయని ఎవ్వరన సాహసింపఁ గల్గుదురు? ఆమె నిజమగు కులకాంతయనియే మనము గౌరవింతుము గాక !

కులరేని వెలలేని ప్రణయభావమును, తరుఁగని విరుఁగని కావ్యప్రాభవము నార్జించిన 'రంగాజి' నాటికిని, నేటికిని నేనాటికిని 'ఇంతుల మేల్బంతియే.'

*రంగాజీ ఉషాపరిణయ ప్రబంధము ఇటీవల ముద్రితమైనది.

---

* ద్వితీయ ముద్రణ విషయము.

# 17. ముద్దుపళని - రాధికాసాంత్వనము

కవయిత్రీమండలమున కంతకును నేకైకశృంగారప్రబంధకర్త్రిణి ముద్దు పళనియే. అప్పటికిని నిప్పటికిని మఱల నట్టి శృంగారకర్త్రిణి వెలయలేదు. 18 వ శతాబ్దమధ్యభాగమున నున్న యీమె సేనాధిపతులును, రాయల కోశాధ్యక్షులు నైన విశ్వనాథ నాగమ నాయకులచే ప్రతిష్ఠాపితమైన రాజ్యభాగమున ప్రచలితము లగు శృంగారభావములచే ప్రభావితయై, యిట్టి రచన చేసిన దనిన, నది యీ యుగలక్షణప్రభావము కాని, వేరొండు కాదు. ఆమె ఆ కాలమునాటి దక్షిణాపథప్రభుడగు "ప్రతాపహేళిభోసలతాళరాజన్మణిసుత ప్రతావసింహేంద్రమౌళి"కి వలపు నేస్తమట! తనకును, తన ప్రభునకును, తన సపత్నులకును నడుమ నడచిన శృంగారమును ఏ చాటును, మాటును లేకుండ, జంకును గొంకును లేకుండ వర్ణించినది. దీనినే లలితలలితముగా "ఈమె తన జీవితములోని మధురపట్టముల ఛాయలను ఇంకా నాలుగుమెట్లు పైకి ప్రసరించి ఇళా రాధాకృష్ణుల ప్రణయసన్నివేశచిత్రణముగా రూపొందించి ఆ చిత్రణములో అప్రతిమ ప్రతిభ చూపినది. స్వీయజీవితము ఒక రసామృతభాండము కాగా, లలిత సకలకళా ప్రౌఢిమ మెఱయు కావ్యముగా వెలయింప జేసుకొన్న పళని మేలిలేఖినిలో కళాదేవత లాస్యము చేసింది—" అని యిటీవలి విమర్శకు లొక రనిరి. కాని నలుగు రొక చోట కూడి సారస్వతపిపాసతో గ్రంథసమీక్ష చేయుద మన్నను, మనసు నీయని పచ్చి శృంగార మది.

ఇందులకై పూర్తిగా దోషము నంతను పళనిపై పులుముట తగదేమో యనిపించును. ఏ మందురా-మధురా తంజాపురులలో రాయల సేనాధిపతులును, కోశాధ్యక్షులు నగు విశ్వనాథ నాగమ నాయకులచే రాజ్యప్రతిష్ఠాపనము గావింపబడినది. 'మిలిటరీ' అధిపతుల రాజ్యపాలనా సమయమున నెట్టి ధర్మపారీణత పాలకపాలితాదర్శమగునో అందఱు నెఱుంగుదురు కదా. అంతియ కాక, ముద్దుపళని జీవించిన కాల మొక అరాచక మన దగిన కాలము. ఆమె బాహిరశృంగార వర్ణనమున కిది యొక హేతువు.

ఇంతే కాక, నిప్పటికిని ఉత్తరదేశమున ఆరాధ్యమానమగు మధురభావము నందు పరకీయయే నాయికాప్రాధాన్యము వహించుచుండుట మనము గాంచుచునే యున్నాము. పరకీయ నాయిక యైనపుడే, యీ రసభావప్రచారము ప్రపూర్ణ మగును. వారి వాఙ్మయమున, రచనా సౌష్ఠవమున మేరుశిఖరప్రతిష్ఠ నందుకొన్న బిహారీ సతసయి విద్యావతి పదము లిందులకు తార్కాణములు. మీరాబాయి యొక్క భక్తిపరతంత్రతయు శృంగారరసపరముగ చూచినచో, పరకీయా ప్రాధాన్యము కల మధురభావములోనికే చేరును.

అంతే కాక, భోజదేవుని శృంగారప్రకాశికలోని రీతీరమ్యతలు, అను రాగభేదములు, ఈర్ష్యామానవిప్రలంభాదుల విస్తారత, పరకీయా భావప్రకృష్టత అనన్యములు; అద్భుతములు. దక్షిణాదియందు మాత్రమే లభించు ముద్దుపళని గ్రంథము దీనికి లక్ష్య మనదగియున్నది. చేమకూర యంతటి వాడే భోజునిపద్ధతి నవలంబించి తనగ్రంథములలో వర్ణయోజనము చేయవలెనని యత్నించియు సఫ లుడు కాకపోయెను. స్త్రీ యగుట పళని అనుభవసహజముగా వర్ణించి కృతకృత్య యైనది.

ఆదికాలము నుండియు నద్యతనకాలమువఱకు ఆధ్యాత్మిక దృష్టితోడను, కావ్య దృష్టితోడను కళాదృష్టితోడను చెలులు సరస్వతీసేవ గావించిరి. కాని, ముద్దుపళని మార్గమనుసరించినవారెవ్వరును గానరారు- ''తనచేతం బొనరించు సృష్టి తక్కొరుల చేతం గాని'' య, ట్లామె తా నొక విచిత్రపథమును నిర్ణయించుకొన్నది. దీనికి కార ణము మున్నే చెప్పియుంటిని. ఇది లలనలకు కీర్త్యాపాదకమా, కాదా ! యనిన, నిరుతెఱగులను నభిప్రాయ మియ్యవచ్చును. రతి స్థాయీభావము గాగల అచ్చ మగు పచ్చిశృంగారము ప్రధానమై వర్ణ్యాంశ మెల్ల నావరించి యుంట వెగటని పించినది. చక్కనగు జాతీయములు జాలువారునట్లు రచింపబడిన దగుట. సగటున మేలౌహా యనిపించినది.

కృష్ణునకు పిన్నవయసువనే మేనమామకూతురు ఇళతో వివాహమైనది. ఆమె మేనత్త యశోద యింటనే గోముగా రాధచే పెంచబడినది. బాల్యము తీరు నంతవఱకు ఇళ కెపుడు బాల్యము దాటునాయని రాధ తపస్సు చేసినది. ఇళ

ఆక్రాంతయౌవన యైన వెనుక, తన కృష్ణుని తనకు గాకుండ చేయుచున్నదని "యామె కెందులకు యౌవనము ప్రాప్తించినదా!" యని యక్కసు పుట్టినది. ఇళాకృష్ణులకేకాంతమ్మును గూర్చినది. ఆవెనుక తన విభుడు ఇళ కమ్మడు వోయెనే యని యుమ్మలికము చెందినది. ఇళతో బాటు ఇళపుట్టింటికి వెడలిన కృష్ణుని విరహమున కతిమాత్రముగ వగల బొగిలినది. కడకు విరహ మోర్వలేక చిలుకచే దూత్య మంపి కృష్ణుని రావించికొని యాతనితో సుఖించినది. పంతము నెగ్గించుకొని సంతసించినది. ఇది కథా వస్తువుగా గల యీప్రబంధము 585 గద్య పద్యములతో నాలుగాశ్వాసములతో కూడియున్నది. అంగాంగవర్ణనలును అధిక సంభోగశృంగారములును బలిసియున్నవి.

ఇక నీ విషయము నింతతో నాపి, యామె ప్రత్యేకించి చూపిన భావసౌకుమార్యమును, భాషాసౌందర్యమును బరిశీలింతము.

మగని కింకొక పెండ్లి యని మక్కువపడుటే కాని, సవతి యననేమో అనుభవము లేకపోయినది రాధకు- అది తెలిసినంతనే రాధ పడిన బాధ చెప్పనలవి కానిది. ఈ బాధ తెలియనంతవఱకు రాధ ఇళను ప్రేమించిన తీరు వేరు. బాల్యము నుండియు చాలా గారాబముగా పెంచి ముద్దుమురిపెముల దీర్చినది.

''పాడించు నొకవేళ బహు దేశ్యరాగముల్
సారించు నొకవేళ జంత్రవాద్య
మెఱిగించు నొకవేళ భరతశాస్త్రప్రౌఢి
బట్టించు నొకవేళ భావరసము
నెగడించు నొకవేళ నెఱి కావ్యసంగతుల్
గనిపించు నొకవేళ కవనరీతి
బోధించు నొకవేళ పూవిల్తుశాస్త్రమ్ము
చదివించు నొకవేళ శయ్య లోలి
నూరిపోయును నొకవేళ నారజంబు
వచ్చె ననిపించు నొకవేళ వాద్యవిధము
ఎపుడు చూతునొ యిక శౌరి నెనయ ననుచు
దయ నపుడు పొంగి యిళకు రాధాలతాంగి."

"నలు గలదు, జలక మార్చును,
వలువలు గట్టించు, షడ్రసాన్నము లుంచున్,
దెలనాకుమడుపు లిచ్చును,
కలికి రమ్మనుచు దీసి కౌగిటఁ జేర్చున్."

"సతి నిటు రాధికామణి। సతతము కనుగందనీక చనువున మనిచెన్."
అంతే కాక,

"నగలు గైసేసి చెలి యుండ సొగసు జూచి
దృష్టి పై దృష్టి తీసుక తెఱవ నాదు
సవతి వౌదువే యని చెక్కు జఱచి మోము
మోమున గదించి నూరార్లు ముద్దు లిడును"

ఇంత తెలిసియు ఇళా కృష్ణులు శయ్యాగృహమున కేగగనే, రాధ భోరు మని యేడ్చి తన సొమ్మంతయు పోయినట్లును, తన పతిని తనకు దానై ఎవరో సవతుల కప్పగించినట్లును బాధపడినది.

"సొమ్ము నియ్యవచ్చు సొమ్మంద నియవచ్చు
నియ్యరాని ప్రాణ మియ్యవచ్చు
తనదు విభుని వేరు తరుణి చేతికి నిచ్చి
తాళ వశమె యెట్టి దాని కైన."

ఇట్లిన్నినాళ్లు తనకు తెలియకుండగనే తన యంతరంగమున గూడు కట్టు కొన్న ఈర్ష్య యిట్లొక్కమారు అగ్నిపర్వతమువలె భళ్ళు మనినది. ఈ స్వభావ చిత్రణ మతిలోక మైనది. ఇదే కాదు, రేఖామాత్రముగ లోని సూక్ష్మభావముల నతి నేర్పుగను నతిలలితముగను చిత్రించు ఘట్టము లీయమ కావ్యమున నెన్నో కలవు.

మఱియొకప్పుడు, గోపీసహస్రనాథుండైన కృష్ణునితో ఇళాపక్షమున వాదించు నట్లుగా మాటలాడి, తన భావము నెంత సుకుమారముగ ప్రకటించెనో చూడుఁడు.

"అకట మగలకు తమ యక్కరైన జాలు
నబల లా గెంచి లాలించి రనుచు నికకు
వగచుగతి" నన్యాపదేశముగా తన గోడు వెళ్ళబోసికొన్నది.

ఇంకొక సున్నిత మైన సన్నివేశము కలదు. అది కుంభకుడు అల్లుని కూతును తన యింటికి గొంపోవు ఘట్టము. రాధ కది గొంతు కొత్తైనది. కృష్ణుని కుంభకునితో పంపననుటకు వీలులేదు. పంపి తా నుండుటకు వీలు లేదు. ఈ రెండుభావముల నడుమ రాధ యిరుకున బడియు లోకగౌరవము పాటించి సరెలె మ్మన్నది. అనినదే కాని, వెంటనే యామె పడిన ఆరాట మింతింత కాదు.

'పగిలి గుండియ వకావకలు కాగ,' మురవైరి ముచ్చట తలంచుకొన్నది. 'సోకిన నెమ్మేను ఝుమ్మని సొమ్మసిల్ల' హరిభోగ్యవస్తువులు దాకి విరవిరలాడినది. ఒకపద్ధతి కాదు - ఒకబాధ కాదు — మగనాలైన పట్టు వగలానదు. ఏమిభాష ! ఎన్నిజాతీయములు ! విచారమును గుప్పించి విరహమును మెప్పించినది.

అంతయు నైనది. కృష్ణుఁడు తిరిగి వచ్చినాఁడు. ఇన్నినాళ్ళ విరహమే మైనదో - ఒక్కమారు విరోధ మెత్తి వచ్చినది. పగఁబట్టిన పాముపలె బుస్సు మన్నది. కస్సు మన్నది.

'మనసున పట్టరాని కినుక పొడమి—
'మానమె ధనమును గేహము
మానమె సర్వంబు చూడ మానవతులకున్
మానము పోయిన వెనుకన్
బ్రాణముతో నుండనగునె పద్మదళాక్షా."
"వనజాక్ష ఇంత చేయగ
మన సొప్పెనె? యింత చాలు, మానముకన్నన్
విను ప్రాణ మేమి ఘన మగు"నని విసవిస లాడినది.

"అల్లందుకొన్నను నీ
బెల్లింపుల బడిన మొదలు పెనుబాములకే
యి త్తైతి నరసి చూడగ
గొల్లనితో పొందు చెలికి కొదువే కొదువల్."

అని అల్లరి చేసినది. ఐనను అంతర్గత మైన అనురాగము, అపేక్ష ప్రతి పదమునందు తొంగిచూచుచునే యున్నవి. పరకీయ యైన రాధ యొక్క యిట్టి నయగారపు పచరింపులు స్వకీయకు వలె చెల్లించి రసలోకమున ప్రస్తుతి గొన్నది పళని—

ఇక ప్రత్యేకించి ముద్దుపళని వర్ణనాప్రాగల్భ్యమును పరికింతము:—

"పడతి గప్పిన కాంచనాంబరము తనరె
నంబుజాక్షుని స్వచ్ఛ దేహంబుమీద
అతని యెద నిండి తగు నా దయారసంబు
పయిని తా నిట్టులను గానవచ్చె ననగ"

"నిద్దపుటద్దము జూపిన
ముద్దియ తగె నద్దిమధ్యమున బింబితయై
ముద్దులు గులికెడు కలుముల
ముద్దులగు మ్మనగ భువనమోహిని యగుచున్"

ఇట్లున్నవి- రాధ మనోవికారమును గూర్చి చెప్పిన యీ పద్దియము నిసర్గ మనోహరము.

"ఉలుకును, వెచ్చనూర్చు, గడు నుస్సు రనున్, దలయూచు, లేచు, లో
గలగబడున్, దిగుల్పడును, గానిపను ల్దలపోయు, వేసరున్,
గళవళ మందు, గన్గొను, వికావిక నవ్వు, భయంబు నొందు, గ
న్గొలకుల నీరు నించు, మఱి కొంకు, దలంకు, వడంకు నెంతయున్"

ఇందలి ల, ళ ప్రాసమును గమనించియుందురు.

ఇంతే కాక, పళనియొక్క "మురవైరినెమ్మోము" అను సీసము చేమ కూరకవియొక్క "తరుణి నూగారు సరి యెందు లే" దని అను పద్యమును పోలి యున్నది. ఇట్టి వింకను కలవు.

ఇట్టి లలితసుకుమార భావముల కీమె కావ్యము పుట్టినిల్లగుటే కాదు, అది యొక సామెతల బుంగ. జాతీయముల దుత్త! ''వ్రేలు వాచిన రోలంత విరివియైన, రోలు వాచిన నది యెంత బోలు గాదు.'' "చల్లకై వచ్చి ముంత దాచంగనేల'' ''కుట్ట దేలును కుట్టకున్న కుమ్మర పురుగును'' "అల్లునకు కల్మి వచ్చిన నర్ధరాత్రి గొడుగు దెమ్మన్న కథగా'' ''వెన్నకు బండ్లు వచ్చు వితమాయె గదే" ''ఎల్ల వారికి శకునమ్ము లెల్ల బలికి, బల్లితాబోయి తొట్టెలో బడిన యట్లు" ఇట్టి వెన్నో ! ఇంకెన్నో.........

సజీవ మైన చక్కని హాస్యములయందును నీమె సిద్ధహస్తురాలే. అత్తింటి నుండి రాధకౌఁగిలికై యాతురముగ తిరిగివచ్చిన కృష్ణుని జూచి రాధామణి చేతిచిలుక కూడా ఏ మన్నదో చూడుడు:—

"గోపాలసామిగారా ?
కాపుర మేపురము? చాలకాలమున కహో !
మీ పాదయుగము గంటిమి
చాపల్యము పేర నున్న శాంతము దీరెన్''

అట నట కొన్ని వ్యాకరణాపప్రయోగములును, లక్షణవిరుద్ధ ప్రయోగ ములును గలవు.

ఇట్లు సురుచిరార్థసృష్టి చేసిన ముద్దుపళని సప్తపదు లను పేర ద్రావిడ పాశురములను దెలిగించినది. ఇందు తేట తెలుగు తియ్యందనమును, పాట కమ్మం దనమును దరులొరసి పారుచున్నవి. దీనిని వేంకటకృష్ణప్ప వ్రాసి యీమె పేరు పెట్టె నందురు. కాని, శైలీభేద మట్లు కాదని చెయ్యెత్తి చెప్పుచున్నది.

రుచిరభావమనోజ్ఞమును, మృదుమధురభాషావిలసితము నగు కావ్యరచన చేసిన ముద్దుపళని—

"పున్నమ చందమామ కెనబోలు ముఖంబు, ముఖానురూపమౌ
తిన్నని పల్కు, పల్కులను దేరిన సద్దయ, సద్దయారసో
త్పన్నపు జూపు, చూపున ధృవం బగు నీవియు సొమ్ము లౌచు మే
నన్నలు వొంద నరనాథులు మెచ్చునట్టి"

సౌందర్యమును, సౌగుణ్యమును తనకు పెట్టని సొమ్ములుగా,
"ఘటియింప నేర్తువు కవనజాతు లెఱిగి
పలుకులకలికి నేర్పెలలుబార—
నటియింపనేర్తువు నవరసంబుల నంటి
తగ రంభ యనిమిషత్వము వహింప"

నని ప్రభుచే మెప్పులుగొన్న ప్రతిభావంతురాలు. రచనలో శబ్దాలంకారములు హెచ్చుగనున్న పనుట కీ పద్య మొక మేలి యుదాహరణము—

ప్రబంధముపద్ధతి ప్రాతదే యైనను, భాషామార్దవము పఠితలను మంత్ర ముగ్ధుల నొనర్చినది. దీనికి తోడు, పాకము ముదిరిన యాశృంగారమును దగ్గించి రాధాకృష్ణుల శృంగారప్రకృతీరహస్యమును పవిత్ర ప్రణయభావమును దన మధుర రచనాపద్ధతిలో పొదిగి యందించిన నది జాతిరతనములు పొదిగిన స్వర్ణాభరణము వలె ప్రకాశించియుండెడిది. మఱి యిపు డన్ననో, ఇమి టేషన్ రాళ్ళుదాపిన నకిలి బంగారునగయై పోయినది.

ఏమైనను, శృంగారకథాకథనమునందును రసావిష్కారమునందును, శృంగార రసానుకూల మైన రసప్రసన్న మధురరచనామర్యాదల యందును తనకు తానే సాటి యైన మేటి యని యనిపించుకొన్న ఈయమకాలము 1740-1780. ఈమెతండ్రి ముత్యాలు. అవ్వ, తాతలు అవ్వయ్య, చెంగాతి యను వారలు !!

ఉనికి దక్షిణాపథాన ! మనికి మధురాపురిని ప్రభుప్రతాపుని కేళీమందిరాన !!

# 18. మదిన సుభద్రమ్మ, 19. బండి బాపమ్మ, 20. రత్నాంబ, 21. చెలికాని చెల్లాయమ్మ

ముద్దుపళనితో రాజుల యాశ్రయమున గవిరాజులు కవితా సామ్రాజ్య మేలు కాలము పదట గలిసిపోయినది.

గంగాదేవి మొదలు ముద్దుపళని వఱకు కవయిత్రు లైన కాంత లందఱు- ఒక్క మొల్లతక్క - రాజాశ్రయము, రాజసంబంధము, రాజ బంధుత్వమును ఏదో రీతిగా గల్గినవారే. నాయకరాజుల కాలమున కావ్యము లల్లిన స్త్రీలందఱును ఇంచుమించు ప్రభువుల ఉపకాంతలే యట. ఐననేమి ? కావ్య సూనముల గ్రుచ్చి గీర్వాణిని పూజింప దగరా ? ''గుణిషు నచ లింగం నచ వయః'' అన్నట్లు, జన్మకు గణికాత్వ మేమైన కొద్దిపాటితనమును చేకూర్చునా ? రమణి రంగాజి యెంత రమ్యజీవితము గడిపినది?

> "పురుషవ ద్యోషి తోపి కవీ భవేయుః
> సంస్కారో హ్యాత్మని సమవైతి నస్త్రైణం పౌరుషం వా
> విభాగ మపేక్షతే శ్రూయన్తే దృశ్యంతేపి చ రాజ
> పుత్రికా మహామాత్య దుహితరో గణికాః కౌతకి
> భార్యా శ్చ శాస్త్రప్రహతబుద్ధయః కవయశ్చ."

అని రాజశేఖరు డాడిన మాట యవితథ మగునా ? వారు జన్మ కెవరైనను, గవిత్వవిషయమున పురుషులకంటె నౌచిత్యము పాటించిరన వలెను. శ్రీకృష్ణదేవ రాయల కాలమునుండి యనౌచిత్యమునకు బాలుపడి పాల్పడి ".........పోపో నీళ్ళకుం బల్చనై" అని సారంగు తమ్మయ నుడివినట్లు, కావ్యాత్మ, కావ్యవస్తువు గూడ మిక్కిలి హైన్యమునకు బాల్పడి, ఆంధ్రవాఙ్మయగౌరవమునకు భంగము వాటిలఁ జేసినవి. అట్టి సమయమున గూడ, ఒక్క ముద్దుపళని తప్ప తక్కిన కవయిత్రు లెవరును నట్టి నైచ్యమునకు దమరచనలలోఁ దా వీయలేదు. కడకు యుగలక్షణ ధర్మమంతయు నాగలేక మిన్నువిరిగి మీద పడినట్లు ముద్దుపళనిపై వులుముకొన్నది. మధురవాణ్యాదులు కావ్యగానముచే వంద్యలే యైనారు.

ఇక ప్రజాజీవనమున నతి సామాన్యముగ బ్రదుకు గడిపిన నల్గురు కవయిత్రులకు పేర్కొనుటతో నీతరము ముగియును.

షట్కర్మయుక్త యగు కులధర్మపత్నినిఁ గూర్చినది మదిన సుభద్రమ్మ యని చెప్పఁబడు నీ క్రిందిపద్యమును గృహలక్ష్మినుండి సంతరించితిని:—

పనుపడిచర్యలందు, దగుకార్యములందును, ధర్మసంగరం
బున, శయనించు వేళలను, భోజనకాలమునందున నీ క్షమా
గుణమున దాసి, మంత్రియును, కూలియు, రంభయు, దల్లి, ధాత్రిలా
గునఁ జరియించు భార్య కులగోత్రములెంతయు నుద్ధరించెడున్.

వే రొకటి యందే గాంచినది:—

కార్యసిద్ధి క్రమము:—

తనియఁ బండక యుండ మును గోసి భక్షణ
గావించగా చవి గల్గకుండు
నుత్తమతర మైన విత్తనంబులకును
సత్తువ తప్పను సదమలముగ
సురుచిర లీలను పరిపక్వమై యున్న
ఫలములు ఫలమిచ్చు బంధురముగ
బీజముల్ ధాత్రిని బెంపార హత్తింప
వృక్షమ్ములై సొంపు వెలయుచుండు
కార్యసిద్ధి క్రమం బిది ఘనుల కైన
కొన్ని రయంబున కావింపఁ దిన్నఁబడవు
సింహగిరిభూష నిర్మలాంచితమనీష
మధురసంభాష హర్యక్ష మనుజవేష...

ఈమె రాఘవరామ, రఘురామ, కేశవరామ శతకముల రచించిన దఁట! పుస్తకముల నెందును గానము.

మీనాక్షీశతకకర్త్రిణి బండి బాపమ్మ యొకర్తు కవయిత్రిగా కవిచరిత్రల కెక్కినది. గ్రంథము మృగ్యము.

'వేంకటరమణశతకకర్త్రి' రత్నాంబ యొక రిట్టివారే.

చెలికాని చెల్లాయమ్మ యను నింకొకరు "జానకీశతకము" "పార్థసారథి శతకము" రచించి రఁట. వీరందఱ కావ్యము లెందు దాగినవో?



# 22. కుప్పమ్మ

1230, 40 వ సంవత్సరప్రారంభమున బుద్ధరాజు కుమార్తె కుప్పమ్మ యనునామె యొకతె కవయిత్రిగా కనబడుచున్నది. నన్నయ కాలమందు పేర్కొన బడిన కుప్పమ్మ వేరు, ఈమె వేరు. ఈమె రంగనాథునకు ఆతని ద్విపదరామాయణరచనమునందు తోడుపడిన దట. ఇంతేకాక, బాలవితంతు వగు ఈమె తన దుస్థితిని వినువారి హృదయము కరిగిపోవునట్లు రచించిన దట. వానిని అయ్యలరాజు రామభద్రుడు తన సకలకథాసారసంగ్రహమున జేర్చుకొనె నట.

ఆంగ్లకవివరుని భావసౌహార్ద మిందుల కుపబలముగ నున్నది:—

Full many a gem of purest ray serene
The dark unfathomed caves of ocean bear
Full many a flower is born to blush unseen
and waste its sweetness in the desert air.

"విమలమౌక్తిక సద్రత్నవితతు లెన్నొ
ఉదధిగర్భాన విలయమ్ము నొంద లేదె?
గుమగుమ వలచు సుందరకుసుమచయము
రాలి నీల్గవె నిర్జనారణ్యసీమ ?"

'అశ్రుతర్పణము' నుండి

# 23. బాల పాపాంబ అక్కమహాదేవి యక్షగానము

కాలజ్ఞానము మొదలగు శైవ గ్రంథములయందు వీరభోగ వసంతరాయడుగా పేర్కొనబడి, క్రీ. శ 1565 లో జన్మించి, 1664 లో లింగైక్యము చెందినట్లుగా చారిత్రకులచే పేర్కొనబడుచున్న వీరవసంత వసుమతీశుని పుత్రిక బాల పాపాంబ కుదురైన శైవ సాహిత్య రచయిత్రి.

ఈమె కాలమును క్రీ. శ 1600 గా పరిశోధకులు నిర్ణయించిరి.

ఈ ద్వితీయ ముద్రణ సందర్భముగా నీమె రచనను గూర్చియొకింత వ్రాయగల్గుట భాగ్యమే యనవలెను—

వీర శైవమత ప్రవర్తకులైన బసవేశ్వరునకు, అల్లమ ప్రభువునకు సమకాలీనురాలై, మహా శివభక్తురాలుగా ఖ్యాతి గనిన అక్కమహాదేవి చరిత్రమును బాల పాపాంబ యక్షగానముగా రచియించెను. అక్కమహాదేవి చరిత్రమను యక్షగానారంభమున నీ కవయిత్రి

"అష్టయోగాది విద్యా ప్రవీణుడగు
వీరవసంత వసుమతీశునకు
ప్రథమ పుత్రిక బాల పాపాంబ యనగ
నధిక తేజంబున నపుడుద్భవించిన
సంగీత సాహిత్య సరస లక్షణల
రంగు మించిన యట్టి రమణిదానగుచు
నల భద్రకాళి నా యాత్మలోపలను
పలికించె నేరీతిఁ బలికెదననుచు
నవనిలో యక్షగానావళికెల్ల
రవళిమించిన శిరోరత్నమో యనగ

మంగళప్రదమగు మహాదేవి చరిత
యింగిత జ్ఞానియై యీ కృతి జేసె"

వ్రాసిన యీద్విపద పంక్తులను బట్టి యీమె వీరవసంత వసుమతీశుని తనయ యనియు, భద్రకాళి భక్తురాలనియు, అక్కమహాదేవి చరిత్రరచించెననియు తెల్లముగా దెలియుచున్నది. కావ్యాంతమున తన తండ్రికి మంగళాశాసనముగా చెప్పిన:—

''ఇమ్ముగ భోజుండిమ్మన నెపుడు
కొమ్మని వరములు నెమ్మది నొసగు
అష్ట భోగములు ఆయుర్వృద్ధిగను
ఇష్ట భోజునకు నిరవుగ నొసగున్...

ఇత్యాదిగాగల యీపై పంక్తుల వలన వీరవసంత వసుమతీశునకు వీర భోజుడు అను పేరుకూడా కలదని తెలియుచున్నది.

అక్కమహాదేవి చరిత్రము మిక్కిలి పవిత్రమైనది. తఱికుండ వెంగమాంబ వలె నీమెయు యోగీశ్వరురాలు!

తన్ను కామించి వచ్చిన జైనప్రభువునకు పరీక్షనిడి, ఆ పరీక్షలో నాతనిని శైవము స్వీకరింపవలసినదిగా కోరెను. ఆతడద్దానిని తిరస్కరించినందున మొదటి ఒప్పందము ప్రకారము, ఆతనితో పెండ్లికి రోసి తపస్సునకు బోయెను. తరువాత మఱల బసవేశ్వరుని, అల్లమప్రభుని వెదకుచు తన పట్నమునకు వచ్చెను- మిక్కిలి సౌందర్యవతియైన ఆమె తపోభరమున మిగులడస్సి, జటలు గట్టి శిరోభారముతో నుండుట జూచి అందఱు నవ్విరి. అంతనచ్చట నుండ నోపక కళ్యాణ పురము ప్రవేశించెను. ఆపురమున నల్లమప్రభు, బసవేశ్వరు లామెకు మంచి స్వాగతము పల్కిరి.

కాని అల్లమ ప్రభు వామెను ఈ చింపిరి వేషమేలయని ప్రశ్నింప

''పరతత్త్వ విధియైన, పరమేశ్వరుని సతికి
మఱి కోకలేల, పల్కఱునెంచి చూడన్
తను మాన ధనము, సంగతము విడచిన నాకు

మనసిజునితోటి మొగమాట యేమిటికి
అకలంక తేజుడగు సకలేశ్వరుని భక్తు
లకు నేల, నన్ను నొకలాగు చూడగనూ
సుకృత దుష్కృతములకు చొరక నిర్గుణ వ్యక్తి
వికృతి బొందిన నాకు వేషమేమిటికి ?

అని సాగదీసి చెంపకాయ కొట్టినట్లు జవాబిచ్చినది. ఈ ప్రత్యుత్తరమునకు సంతోషించి, అల్లమప్రభు వామెకు పరతత్త్వోపదేశ మీరీతిగా నొనర్చెను.

''తొమ్మిది త్రోవలు తొడరి బంధించి । యిమ్ముగా బ్రహ్మాండ మింతయు నాత్మలో నుండ జూచుచులూనత లేక । మానకంతట పరమానందమునను నొగినిష్ఠ ప్రాణసంయుక్తి షడంగ । మగునందు లింగైక్య మారూఢి దెలిసి స్థిరమైన హంసను, జీవుని బట్టి । మఱి మనస్సున నన్ని మారుతములను వెడలించి సమరస విధినిచేయించి............కనుబొమల్ ముడివడగాను భ్రూమధ్య । ద్విదళంబు నడుమ దేదీప్యబ్రహ్మంబు సదమలో క్తిని గని......... సదమలోంకారంబు కర్ణాంతరంబున వినబడు । ..........'' నని యిట్లు యోగసమాధిని దెలిపి । వనజాయతాక్షిని వదలక పిలిచి సిద్ధాసనంబున స్థిరముగ నిలిపి । హస్తమస్తక యోగమలవడజేసె.

ఈ యుపదేశానన్తరమక్కమహాదేవి తపస్సొనరించి శివైక్యమొందెను. అక్కమహాదేవి ఘన మహిమను గూర్చి కర్ణాటక దేశమున నెక్కువ ప్రసిద్ధి కలదు. శ్రీశైల పర్వత ప్రాంతములలో అక్కమహాదేవి తపస్సు చేసిన గుహ కలదు.

వెంగమాంబ కంటె ముందుగానె యిట్టి యుజ్వల రచన చేసిన బాలపాపాంబ మంగళారతులను గూడ రచించెను.

"పసిడి పళ్ళెరములో పంచదళ పద్మమున
పంచరత్న ప్రభలు భాసిల్లగా
విశదముగ బాడెదరు విశ్వాస్వనంబుచే
శశివదన మహాదేవి నరసి చెలగి

జయమంగళం సదాశుభమంగళం

ఈమె కవిత మిక్కిలి ధారాశుద్ధముగ నుండును. ఈమె రచించిన యక్షగానములో జంపెలు, రచ్చరేకులు, ఏకతాళి మొదలగు దేశిపదములును, జోలపాటలు, మంగళారతులు గలవు.



# 24. దార్ల సుందరీమణి - భావలింగశతకము

శాలివాహన శక సంవత్సరములు 1755కి సరియైన క్రీస్తు శకము 1833వ సంవత్సరమున 'భావలింగ' శతకమును రచించిన దార్లసుందరీమణి గొప్పవేదాంతి. తనయనుభవమున బాగుగా గుర్తైన పరమాత్మతత్త్వమును సహజ సుందరముగా, సరళ గంభీరముగా, చాలా మనోహరముగా-ఆమెయే వాకొనినట్లు "నూట యిరువదొకటి యాటవెలందుల నాటలాడు" కొనుచు-పరతత్త్వమును 'అనుభవము' కొలది సూటిజూచినట్టి సుందరమ్మయగు నీమె భావలింగ శతకముగా రచించిన మహాకవయిత్రి యీమె !

ఈ కావ్యమును తొలుత ముద్రించి నాకు పంపినవారు, కవిశేఖరులు శ్రీ కొండవీటి వెంకటకవిగారు ! తరువాత "వీవర్స్ వెల్ఫేరుట్రస్టు" ప్రచురణగా వెలసిన వెనుక ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సహసభ్యులైన శ్రీ సుబ్బన్న శతావధానిగారు పంపినారు.

ఇది చదువగల్గిన భాగ్యమబ్బిన నాడు ఇంత మహావైదాంతిక కవయిత్రి యొకరు, తెలుగు దేశమున నుద్భవించి యిన్నాళ్లు మఱుగున పడిపోయెనే యని యాశ్చర్యమందుటే కాక ఇన్నినాళ్లు ఈ శతక కావ్యమును జదివెడి భాగ్యము లభింపనందుకు చాల బాధపడితిని. ఈ మహాకావ్యమును నాకు పంపిన ప్రయోజన ముందునని తలంచి, లెస్సగా నాపని చేసిన కవిమిత్రులు శ్రీ కొండవీటి వెంకట కవి గారికిని శ్రీ సుబ్బన్న శతావధానిగారికిని కృతజ్ఞురాలను.

ఇందలి ప్రతి ఆటవెలదియు సుందరీమణికి గల్గిన పరమాత్మ సాక్షాత్కారానుభవానందమున పారవశ్య నాట్య మొనర్చుచు, పఠితలకు నట్టి యానందము హృదయమున గాటుగా నాటుకొనునట్లు చిందులు వేసి, వేయించినదే! అగుట ఈ కవయిత్రీమణికి గల పరమాద్భుత వైదాంతిక పరిజ్ఞానము, దానికి తగిన కవిత్వ శిల్ప పాండితియు ననన్యసాధ్యములని ఈ భావలింగశతకము వేయినోళ్ల చాటి చెప్పుచున్నది.

గంజి వంశజుండు ఘనుడు శ్రీరాములు
తండ్రి, నాగమాంబ తల్లియయ్యె
గుదురుకొంటి జెర్లగుడిపాడునందేను
పాపభయ విభంగ భావలింగ !

అను 117 వ పద్యము మొదలు 122 పద్యముల వఱకు చెప్పిన తుది పద్యములలో నీమె తన తండ్రి గంజి శ్రీ రాములు, తల్లి నాగమాంబ "దార్ల వంశజుండు, తగ శేషయాఖ్యుండు తాళిగట్టి నట్టి ధవు" డనియు. గురువు వుద్దెమఱ్ఱి వేంకట రాయడనియు, తాను సాలెవంశజురాలననియు శాలివాహనశకము1755 లో విజయ వత్సర నిజచైత్ర పౌర్ణమి ఈ మహా కావ్యరచనా కాలమనియు, భావి చారిత్రక పరిశోధకులకు నెట్టి సందియమును గలుగకుండ స్పష్టముగ జెప్పివైచినది.

తన యోగసాధన యందలి పరిణామ క్రమమును ఎంత చిన్న పదములలో ఎంత విశదముగా వివరించినదో గాంచుడు:—

మ్రొక్కి, మ్రొక్కి, నొసట మోరుండగట్టెను
దిక్కులేక పోయె దేవుడెవడొ !
మ్రొక్కు నొసటిలోన మఱిసితి నిను జూచి ॥పాప॥

ఎంతగనో కుదురు వడిన చిక్కని జ్ఞానసంపత్తి కలవారు తప్ప ఇంత సూటిగా తమ అనుభవమును వాకొనలేరు !

"మఱచినట్టి సొమ్ము గురునిచే దొరకెను
ఎఱుకయైన సొమ్ము మఱువబడియె
మాటలేల ? చాలు ! మనకిద్దఱకు నింక ॥పాప॥
ఏభయంబును లేక, యే చింతయును లేక
విమలనగుచు నెల్ల విడచియుంటి
నిదియె కాదె నిన్ను నెఱిగినందుకు సాక్షి ॥పాప॥

పరమేశ్వర సాక్షాత్కారమును కాని, భగవదనుభవమును గాని పొందిన వారెంత నిర్భయమైన, నిర్మలమైన నిశ్చింతతో కూడిన ప్రవర్తనతో నుందురో,

ఆ విషయమును నిజమగు భగవదనుభవజ్ఞానము కలదగుట సూటిగా చెప్పగల్గినది ! ఆ చెప్పినతీరు నందలి, నిర్భయత్వము, నిర్మలత్వము కూడ కవిత్వశిల్ప విజ్ఞాన శేముషికలవారికే వశంవద మగుననుట కూడ తెల్లమే.

అంతేకాదు, ప్రాణిహింసతోగూడిన యజ్ఞయాగాదులకు పరమేశ్వర ప్రీతి ప్రదములని బిరుదు తగిలించుటకీ మహాసిద్ధురాలి మనసొప్పలేదు ! చూడుడు:—

"కటికవానికైన గాల్ మ్రొక్కవచ్చును
సోమయాజి ముఖము చూడరాదు
పాఱుడైన వాడు పశువులఁ జంపునా ॥పాప॥

అను పద్యమున నెంత తేలిక పదములతో పశుహింసాకరములగు యజ్ఞ యాగాదులను, వాని నొనర్చు పాఱులను నిరాస మొనర్చినదో !

ఏమి లేదటంచు నెందఱో చెప్పంగ
వేయి విద్యలేల పెట్టెఁ జదువ !
యేమి లేనివాని నెఱిగిన జాలదా ॥పాప॥

ఇట్టి పారమార్థిక భావములు ఈ శతక కావ్యమున నెన్నియోగలవు !

అంతేకాదు. కులము గొప్పగాదు. గుణము గొప్పయనుచు జెప్పిన ఈదిగువ పద్యమును గాంచుడు:—

గొప్పకులముగాదు, గొప్ప ధనముగాదు
గొప్ప విద్యకాదు కోటి యేల ?
మాట నిల్పెనేని మాదిగైనను గొప్ప ॥పాప॥

పరతత్త్వ భావనారూఢ ప్రజ్ఞయేకాక లౌకిక భావనారూఢ స్థితినికూడ నొంద జాలిన సిద్ధురాలని ఈ పద్యము తేటపఱచుచున్నది-

వేపచెట్ల లేదు వెదకిన దీయాకు
మాటలందు లేదు మంచిమాట
అట్టి చెడ్డమాటలాడి చింతిలనేల ? ॥పాప॥

'జాతి' అను పదమును వాడి స్థిరత్వము నందినవారికెట్టి భంగపాటును గలుగదను ధ్వనితో 6, 7 పద్యములను జెప్పినది-

> జాలి నమ్మి సురలు రమ్యపదవులంద
> వారి నమ్మనేల ? వ్యర్థబుద్ధి !
> మాకు జాడ్యకఱవె ? మనసార బూజింప ॥పాప॥
> శివుడనంగజాయి జీవుడన జలమ్ము
> మాయయనగ దనువు. మఱుగికేల,
> ..............................

కట్టి ప్రతి పద్యమును, ప్రతిపదమును ఆ మహానుభావురాలి అనుభవైక సారామృతస్థితి సార్థకతను భజించి, అంధకారమున కాంతిపుంజముల వెదజల్లినది !

ఎన్నని యుదాహరింపను ? ఆమె నుడివిన నుడువులన్నియు జాతి రత్నములే, భారతీయ సంస్కృతీ కాంతి పుంజముల వెలార్చు మహానర్ఘ రత్నములే. ఒక్క వ్యర్థపదములేదు. భావములకొఱకు తడవులాటలేదు. మేలిమి బంగారమును కమ్మచ్చున లాగి వెడిచినట్లు విశుద్ధమైన, విశదమైన భావసంస్కారము, పదప్రయోగనైపుణ్యము, రచనా శుద్ధి, ధారావేగమును పోటీపడి పరువులెత్తినవి !

ఇట్టింత ఓజః పూర్ణమైన రచన గావించినవారు ప్రపంచ వాఙ్మయముననే అరుదని వాకొన్నను అతిశయోక్తి కానేఱదు-

ఆసక్తి, అసదృశమైన ఇట్టి రచనలో ఈమెకు దీటుగా నిలుచువారు ఇద్దరు, ముగ్గురే మనకు లభింతురు. వారు స్త్రీలలో అవ్వైయార్, లల్ల, తఱికుండ వెంగమాంబ, కన్నడ వాఙ్మయమున ఒకరిద్దఱు కానవగుదురు-

వేమనయోగి ఈ శ్రేణికవితలో గురుప్రాయుడు !

ఈమె పోతులూరి వీరబ్రహ్మంగారి శిష్య, ప్రశిష్య పరంపరకు చెందినదందురు !

మహాయోగినీ మతల్లియై, మించిన వైదాంతిక అమృత కవితావేశమును పతితలకు పులకిసిల్లగా ద్రావ నిచ్చిన దార్ల సుందరీమణికి వేనవేలుగ జోహిళ్లు !

# 25. తరికుండ వేంకమాంబ

ఆంధ్రసాహిత్య క్షేత్రమున పీను మిగిలిన విదుషిగా, కవయిత్రిగా పేరొందిన తరికుండ వేంకమాంబ 19 వ శతాబ్ద మధ్యభాగమున జీవించి యున్నట్లు పరిశోధకుల నుడి. 1840 ప్రాతమున నామె జీవించియున్నట్లు బ్రౌనుదొర తన నిఘంటువునఁ బేర్కొనెను.

ఈమె బాలవితంతువు. విశేషించి కృష్ణభక్తురాలు. వేంకటాచలపతి యీమె యిష్టదైవము. ఇష్టదైవమే మాత్ర మేమి ? పతిదేవుడు కూడ నాతడే. బాల్యము నుండియు నాధ్యాత్మిక, వైదాంతికచింతల తో జీవనము గడపినపుణ్యురాలు. ఈమె తన ద్విపదభాగవతమున దన్ను గూర్చిన వివ రములను సాకల్యముగ నిట్లు వివరించిరి.

> ' ధరపైని వెలయు నందవరాహ్వయుండు
> గురుతర సువసిష్ఠగోత్ర సంభవుడు
> కానాలివంశ సాగరహిమాంశుండు
> నైన కృష్ణార్యున కతిభక్తితోడ
> నంగన యగు మంగమాంబ గర్భమున
> సంగతి కృష్ణుండు సైదోడు గాగ
> వెంగమాంబిక ప్రభవించి లింగాంగ
> భంగంబుకొఱకు సుబ్రహ్మణ్యగురుని
> చరణాబ్జయుగళి హృజ్జలజమం దుంచి
> యరసి పూజించి తదనుమతి వడసి."

దీనిని బట్టి, తండ్రి కానాలి కృ ష్ణార్యుఁడు, తల్లి మంగమాంబ, సోదరుడు కృష్ణుఁడు. గురువరుఁడు సుబ్రహ్మణ్య దేశికులు. వారు వేదాంతోపదేశికులు కూడ నని తెలియుచున్నది.

ద్విపద భాగవతముననే ఒక్కచో మాత్రము భర్తపేరు స్మరించినది, శ్రీవత్సగోత్రుండు నుంజేటి తిమ్మయార్యాగ్రణి పుత్రుఁడు వేంకటాచలపతి పాదపద్మములను మనసునం దుంచుకొని యీ కావ్యము రచించుచున్నా నని అందుల్లేఖించినది:—

"వరుసగా నుంజేటి వంశభూషణుఁడు
గురుతర శ్రీవత్స గోత్రసంభవుఁడు
ఘను డైన తిమ్మయ్యాగ్రణి పుత్రుఁ డనగ
జను లెన్న వేంకటాచలపతి పాద
వనజయుగ్మంబు భావంబునం దుంచి."

కాని, యీమె జీవితకథను బరికించినను, నింక యితరరచనలను బరికించినను, భర్తృనామస్మృతి చిహ్నముగ నొక కావ్యము రచింపవలెనను కోరిక కూడ నీమెకు కలదా యని యనిపించును. ఈమె బాల వితంతు వని ముందే పేర్కొని యుంటిమి. తండ్రి యగు కృష్ణార్యుడు బిడ్డలు లేక, కనబడిన దేవతల కెల్లఱకు మ్రొక్కి- తుదకు వేంకటేశ్వరుని కృపావిశేషమున నీమెను బిడ్డగా బడసెను. లేక లేక కల్గిన తనయ యగుటచే, నీమె నతిగారాబముగా బెంచి ఏయే వయస్సులలో నేయే విద్య యుచితమో, ఆయా విద్యల నేర్పుచుండెను. ఈ బిడ్డయు నతిసునిశిత మేధాసంపత్తి కలదై, విద్యల నన్నిటిని చిఱుతప్రాయముననే గ్రహించి అపరసరస్వతియో యనునట్లు, తలిదండ్రులకును జూచువారలకును నత్యాశ్చర్యము కలుగ జేయుచుండెను. అంతియ కాక-యీ బాలిక దేవీవర ప్రసాదిని యగుట, మిగుల సుందరాంగియై 'జనముద్దు' బిడ్డయై గోమున బెరుగుచుండెను. ఇట్లామెకు 7, 8 ఏండ్లవయస్సు వచ్చునప్పటికి లౌకిక విద్యలను విసర్జించి, ఆధ్యాత్మిక విద్యావిజ్ఞానతంత్రములలో విదుషియై, సంతత కృష్ణనామస్మరణంబున మేను మఱచి, యన్యము నొల్లని పరమభక్తురా లాయెను. బిడ్డ కలుగుట తోడనే యా బిడ్డ ముచ్చటలతో దన బాము ధన్య మగు ననియు, దన వంశము పున్నామనరకబాధల నుండి విముక్తమై ఉత్తరగతులు పొందు ననియు, నామెపై పుట్టెడాసలు పెట్టుకొనియున్న తండ్రి కీ బిడ్డయొక్క యీ లౌకిక విముఖతయు, భగవద్ధ్యానపరతయు నసహ్యము లాయెను. అంత నాతఁడు తన పుత్రి కనేక విధముల లోకతంత్ర ముపదేశింప సాగెను. కాని యామె యవి యన్నియు .బెడచెవినిఁబెట్టి కృష్ణస్మరణముననే నిమగ్న కాఁ జొచ్చెను. అంతఁ దండ్రి తనయాశ లన్నియు నిరాశలు కాఁగా, మిగుల కుపితుఁడై యింతవఱకు చెప్పించిన విద్యలే యిట్టింత కొంప ముంచెను, ఇంకను విద్యలేల ? యని చెప్పించుచున్న చదువులను గూడ మాన్పించి, మున్ను హిరణ్యకశిపుడు

ప్రహ్లాదుని హింసించినట్లు హరిచింత మానుమని యనేకబాధల బెట్టెను. చక్కని సౌందర్యముగల యాబాలిక తనసహజశిక్షవలన వచ్చినసంగీతజ్ఞానముతో కంఠమెత్తి కోయిలవలె హరినామ సంకీర్తన చేయుచుండ, నటు చేయుట మానుదువా, లేదా యని మూతిపై వాతలు బెట్టెను. ఇట్లు కొన్నాళ్లు గడచినవెనుక, పెండ్లిచేసిన నీ పిచ్చితలంపులు మాని, యామె సాధారణ సంసారజీవితమం దనురక్తయగు నని తలంచి, ఒక చక్కని కుఱ్ఱవానిని చూచి పెండ్లి చేసెను. పెండ్లితో ఆమెబుద్ధి సంసారానురక్త మగుటకు బదులు, మఱింత విరక్త మాయెను. ఆమె తన్ను భర్త దరియబోవునప్పటికి, 'వేంకటాచలపతియే నాకు పతి, నీవు నాకు భర్తవు కావు. పొమ్ము– బలవంతముగా నన్ను పొంద దలచితివేని, నీతల వేయి వ్రక్క లగును జాగ్రత్త' యని హుంకరించెను. దానితో నాతడు బెగడు గుడిచి మంచ మెక్కి ఆరునెలలకు "అదుగో దెయ్యము! అదుగో దెయ్యము–అమ్మో! నిన్ను ముట్టబోను, నా జోలికి రాకు" మనుచునే చనిపోయెను. తరువాత నామెను జగద్గురు శంకరాచార్యులు ఎన్నో విధముల పరీక్షించి మహాభక్తురాలని మ్రొక్కా లిడెను. ఇట్లే ఆమెజీవితము మహామహిమలు గల మానినీజీవితముగా 'శ్రీ వేంక టేశ్వర భక్తవిజయము'న చిత్రింపబడినది. ఇది యీమె కథలోని ప్రథమ ప్రకరణము. భర్తృవిషయమున నీమెవిరక్తి యిటు లుండ, నీమె తన భర్త స్మృతిచిహ్నముగ కావ్యము వ్రాయు టెట్లు సంభవించెనా యని యనుమానము. అయితే యింకొకవిధముగ దీని నన్వయింపవచ్చును. వేంకటాచలపతి యనగా, శేషగిరీంద్రాధిపతియు తన యిష్టదైవము నైన వేంకటేశ్వరుని పేరుమీదుగా తన భర్తపేరును నేదో ఉబుసుపోకకై లోకమర్యాదకై కావ్యమున నిల్పిన దేమో?

ఇంక నీమెరచనలును చాల గలవు. ఈమెను గూర్చిన గాథలును చాల గలవు. ముందు రచనల నొప్పరికింతము. ఆమెరచనలలో బహుశః ద్విపద భాగవతము కడపటిది కావచ్చును. అందే యీమె తన రచనల నన్నిటిని సమగ్ర ముగ నుటంకించినది

"నా చిన్ననాట నోనమాల నైన
నాచార్యు లెవరు నా కానతీలేదు
ఇక నేను చెప్పుదు నెట్టులో వాణి

నకలంకుడై జిహ్వయం దుంచె గురుడు
అటు గాన నారసింహాంకిత శతక
మటమీద నారసింహవిలాసకథయు
అట శివనాటకం, బదియును గాక,
అట రాజయోగసారాఖ్య మౌ ద్విపద,
అట కృష్ణనాటకం, బదియును గాక
యట పారిజాతాపహరణసత్కృతియు,
అట రమాపరిణయం బను పెండ్లిపాట,
యట చెంచునాటకంబను నొక్క కథయు,
మఱియు శ్రీకృష్ణమంజరి, యవల
నిరుపమ శ్రీ రుక్మిణీనాటకంబు,
విరచించి భక్తితో వేంకట శైల
పతికిచ్చి...... ..........

ఇట్లు వ్రాసియున్న యీ పంక్తులనుబట్టి యీయమ గ్రంథముల నీదిగువ వరుసగా నిట్లు పేర్కొనవచ్చును.

(1) నరసింహశతకము, (2) నరసింహ విలాసకథ, (3) శివనాటకము, (4) పారిజాతాపహరణసత్కృతి యక్షగానము, (5) రాజయోగసారము, (6) కృష్ణ నాటకము, (7) రమాపరిణయమను పెండ్లిపాట, (8) చెంచునాటక మను నొకకథ. (9) కృష్ణమంజరి-ద్విపద, (10) శ్రీ రుక్మిణీనాటకము, (11) గోపికా నాటకము- అనునవి- ఇం దింకను భాగవతము చేరలేదు. దానితో పండ్రెండైనవి. ఇందు పేర్కొనబడిన వన్నియు నిపుడు మనకు లభ్యములు కావు. అంతియకాక, మనకు దొరకిన వేంకటాచలమాహాత్మ్య ప్రబంధము ఇందు గైకొనబడనే లే దెందువలననో ? లేక పేరు మార్చి యందె చెప్పినదో ? ఇంకను ఈమెదిగా చెప్ప బడు ముక్తికాంతావిలాస మింకొకటి కలదు–ఇట్లు రమారమి యీమె రచనలు పదునైదువఱకు నున్నవి. కాని, ఇందు ప్రస్తుతము దొరకునవి రాజయోగసారము, వేంకటాచలమాహాత్మ్యము, విష్ణు పారిజాత యక్షగానము. భాగవతము మాత్రమే.

తక్కిన వన్నియు నేమైనవో ? ఇవియే కాక, ప్రాసంగికముగా తిరుమల వేంకట రమణునిపై వ్రాసిన పాట లెన్నో కలవు.

కపిలునకును దేవహూతికిని జరిగిన తాత్త్వికసంభాషణము వస్తువుగా గల రాజయోగసార మీమె ప్రాథమికరచన. మిగుల సామాన్యమైన శైలితో పామరుల కును దెలియునట్లు రచింపబడినది. పిండోత్పత్తి ఘట్టము, పంచకోశప్రభావము అనువానిని కపిలు డిందు తల్లియైన దేవహూతికి బోధించెను.

''సంపద గల్గిన సామర్థ్య మనుచు
సొంపు మీరగ తుచ్ఛసుఖ మిచ్ఛయించి
కామాంధులై తమ గతి గానలేక
భామలయొడిలోన బడి లేవలేక
తరుగని యీషణత్రయవార్ధిలోన
మఱిమఱి మునుగుచు మమత రెట్టింప
నాలుబిడ్డల కని యర్థంబు గూర్చి
కాలంబు నూరకే గడపుచునుండి
..........................
పుట్టుచు గిట్టుచు దొరలుచుండెదరు"

శైలి యాద్యంతము నిట్లే యుండును- కాని, ధార మొదటి ప్రకరణము నందు కంటె రెండవ ప్రకరణమున జీవన్ముక్తి విచారమునుండి విశుద్ధమై చదు వరులకు హాయి గొల్పినది. ఇందలి కుహనా యతినిరాసము బాగుగ నున్నది.

"ఖండవిద్యలు నేర్చి గర్వంబు మించి
స్తంభనమోహనోచ్చాటన మంత్ర
జృంభణమ్ములు చూపి చెలగెడువారు
..............................
కడుపు నిండుగ నుదకంబును బీల్చి
కడుపులో మల మెల్ల గడిగి శోధించి

యది యాత్మసిద్ధి యౌ నని నిశ్చయించి
ముద మొంది తమలోన మురిసేటివారు..."

ఇట్లుగా నున్నది. "హెయక, నెటిగింతు, పట్టుగా, వినుము, వరుసగా, నెదియును, వాసి, నిర్మితము, కొమరొప్ప, సరవితో, క్రమమొప్ప" మొద లగు పడికట్టురాళ్లను, 'ఓ సారసాక్షిది' అనుచో సంబుద్ధి 'ఇ'త్వముపై సంధి, "తరుచైన హంకారతత్త్వముల్" అనుచో, అదంతంబైన ధాతుజ విశేషణమున సంధి కార్యము మున్నగు వ్యాకరణ విరుద్ధ ప్రయోగములును ఇందు విరివిగా నున్నవి. అంతియ కాక, "విమలపాన్పు, నభపథము, కళ్యాణపాటలు, వరనీల మౌక్తిక వజ్రచప్పరములు" మున్నగు అపప్రయోగములు, దుష్టసమాసములు, ఛందో భంగములును పెక్కు గలవు. వీనినిబట్టి చూడ, నీమెకు, తన అనేకగ్రంథములలో చెప్పుకొన్నట్లు క్రమశిక్షణాయుత విద్యాసంస్కారము తరుగనియు. పెక్కుమారు లామె పేర్కొనినట్లు దేవునిమహిమవలననే కవిత్వ మబ్బియుండవచ్చు ననియు తోచుచున్నది- ఈ విషయ మామె యీ గ్రంథాదినే యిట్లు వ్రాసియున్నది.

"వినరయ్య కవులార ! విద్వాంసులార !
వినరయ్య మీరెల్ల విమలాత్మ లార !
ఘన యతిప్రాససంగతులు నే నెఱుగ
వరుస నాక్షేపింపవలదు సత్కృపను."

'కవిత్వమునం దల్పదోషము లున్నను, కవన మతిమనోహరమైన' దని శ్రీ వీరేశలింగముపంతులుగా రీమెకు యోగ్యతాపత్ర మిచ్చియున్నారు.

భాగవతద్విపద మాత్రము చాలా ధారాశుద్ధి కల శైలితో నడచినది.

'నిలు నిలు మర్జున ! నీ విపు డతని
చలముపెంపున నేల చంప బూనెదవు ?
పచటుదనమున నీ పాపాత్ము డకట
చెదరక నిదురించు శిశువులను జంపె
నట్టి క్రూరుని విప్రు డనుచు నీ కింత

పట్టి చంపుట గాదు ........"

...........................

ఇనతేజులార ! ఇక ఈ మాట లేల ?

సహదేవు నిచట రాజ్యంబునం దుంచి

రహి మీరగా నల్గురము వనంబునకు

బోద మటన్న, నపు డా సహదేవు

డా దీనమందారు డగు హరి జూచి

వీరి వాక్యంబులు వింటివే కృష్ణ—"

ఇందలి శైలి యంతయు నిర్జరీ ప్రవాహసన్నిభమై యింపు నింపినది. రాజయోగసారమునందు వలె నిం దంతగా వ్యర్థపదములు, అపసంధులు గానంబడవు.

ఈ భాగవతము చాలదినములవరకు మన కందుబాటులో లేకనే యుండి పోయినది- కాని, శ్రీ కేసరిగా రెక్కడ సంపాదించిరో - 1931 వ సంవత్సర మందలి మార్చి, ఏప్రెల్ గృహలక్ష్మి సంచికలలో దీనిని ప్రచురించిరి.

ఇఁక నీమెరచనలలో వేంకటాచలమాహాత్మ్యము మిగిలి యున్నది. ఇది ఆరాశ్వాసముల కావ్యము- శైలి మిక్కిలి చక్కఁగా నుండి, పూర్వకృతులను దలపించుచున్నది- కావ్యము చదువుచున్నపుడిది రాజయోగసారమును రచించిన వేంగమాంబ కృతియేనా ? యని అనిపించును.

'తొలుత హిరణ్యాక్షుఁడు భూమిని హరించి పాతాళమున డాగఁగా, హరి ఆదివరాహరూపమున ధరిత్రి నుద్ధరించి, యది మొదలు వైకుంఠ మొల్లక భువినే నిలువ నెంచి గరుడునిచే దన, క్రీడాద్రిని భువికి రప్పించెను. అదియే భూమిపై వేంకటగిర్యాఖ్యఁ బరగినది. భువి నిలిచిన యా పద్మావతీ మనోహరుని యొక్కఁయు, నాతని యావాసస్థాన మైన వేంకటాద్రి యొక్కఁయు మాహాత్మ్య కథావర్ణనమే యీ కావ్యవస్తువు.

ఇందు ఆశ్వాసాది శ్లోకములు గూడ కాన్పించుచున్నవి. సంస్కృత భాషను గూడ తరువాత సాధించెను. ఔను- భగవద్భక్తురాలి కసాధ్యమెందు గలదు ?

గ్రంథమున శృంగారఘట్టములు వ్రాయవలసివచ్చుచో, వితంతువైన తన కా రచన యనుభవసిద్ధము కానిదగుట నలవి కామి, దన స్వామి యగు కృష్ణుడే యా ఘట్టముమ వ్రాసి తనకు తోడుపడె నని యీమె వ్రాసిన—

"శృంగారాకృతితోడ వచ్చి పదముల్ గూఢంబుగా..."

అను నీ పద్య మంధ్ర దేశమునందలి సారస్వతాభిరతు లందఱకును దెలిసినదే-

ఈ కావ్యమునందలి శైలి :--

'శరదభ్రశుభ్రభాస్వర శరీరంబునందు । శ్వేతప్రకాశవిభూతి మెఱయ
ధవళ సంపూర్ణచంద్రకళంక మనగ , నైల్యావత్కృష్ణాజినంబు మెఱయ
సురుచిరారుణ జటాజూటంబు శిరమున । దపనబింబమునందమునఁదోప'
గా రమణీయమై యున్నది.

విటకాని వేషము ధరించిన హరిసొబగును వర్ణించిన,
"మేఘంబుపై వెల్గు మెఱపుదీగలవలె
దగిన బంగరు జన్నిదంబు మెఱయ"

అను పద్యము బాగుగ నున్నది. ఇట్టి యుపమ లటనట గలవు. అంతే కాక, ఉపమాలంకారములో తన సొంతదనము గనఁబఱిచిన స్థలములు కొన్ని కలవు. అందీక్రింది దొకటి :—

అబ్జబాంధవు డిట్టు లపరాబ్ధిఁ గ్రుంకంగ
నపు డహిగిరి నుండినట్టి లక్ష్మి
మొదలైన సతులను ముచ్చటగా చూడ
హేమాంబరము ధరియించి పద్మ

రాగభూషణములు రక్తచందనమును
　　బసుపుకుంకుమఁ దాల్చి భక్తి మెఱయ
పశ్చిమాశాకాంత పయనమై వచ్చెనో
　　యనగ సంధ్యారాగ మతిశయిల్లె

నందుచే బార్వతీ ప్రముఖాబ్జముఖుల
మణివిభూషణముల రక్తిమములు మించె
పక్షులా రత్నములు చూచి ఫలము లనుచు
మెక్కుటకు బొంచుగతిఁ జెట్లమీద వ్రాలె"

ఇందలి భావార్థముల సంగతి పాఠకులకే వదలితిని.

కురవక మను నూరిలోని భీమన్న యను కుమ్మరిభక్తుని కథావర్ణన పద్ధతి బాగుగ నున్నది.

వరాహావతారుడైన హరి భూమిని గామించి వైకుంఠమునకుఁ బోనొల్లక, గరుడునితో నే మనుచున్నాడో చూడుఁడు :

ధారుణి నీటన్ మునిగిన
కారణమున దాని నెత్తు కార్యంబున నీ
ఘోరాకారము దాల్చితి,
నా రూపము చూచి లక్ష్మి నగదె ఖగేంద్రా.
ఆ వైకుంఠపురమ్మున
కేవిధమున వత్తు ? లక్ష్మి యెకసక్కెముగా
నీ వెవ్వడ వంచు నడిగిన
శ్రీవిష్ణుం డనఁగ నాకు సిగ్గగు గరుడా ''

అని తన వ్యామోహమును దన వికృతాకారము మీదుగా దాచి సమర్థనగా చమత్కారముగా గరుడునితో సంభాషించిన యీ ఘట్టమును మనోజ్ఞముగా నున్నది.

గ్రంథాదిని పచరించిన -

''విప్రమాతృకలకు వెలిపట్లు తెల్లకలువలు గంధమౌక్తికములు నొసఁగి
రాజమాతృకలకు రహిని గావులు.........
వైశ్యమాతృకలకు.................
శూద్రమాతృకలకు...............

'ఆనవాల్ తేనెయు నాసవమును,
బొసగ నర్పించి కృతులు సెప్పుదురు కవులు;
నేర నొక్కటి తరికుండ నృహరికృపను
భక్తి మ్రొక్కెద మాతృకాశక్తులకును."

అను పద్యమునుబట్టి యా కాలము కవులు మాతృకాశక్తుల నుపాసించెడు వారని తెలియుచున్నది. ఈ మాతృకాశక్త్యుపాసనను గూర్చి అప్పకవి కూడ ప్రస్తావించెను. ఇట్లు పెక్కు తావులలో నామె తన ప్రతిభ క్రమశిక్షవలన వచ్చినది కాదనియు, దైవకృపచే లభించిన దనియు వ్రాసియున్నది. ముక్తికాంతా విలాస మను యక్షగానము వ్రాసినట్లు వేంకటేశ్వరమాహాత్మ్యమున పేర్కొన్నది.

ఈమెయింటిపేరు 'తరిగొండ' యని ప్రకృత వ్యవహారమున సిద్ధము. కాని, నిజమున కది 'తరికుండ' కాని, తరిగొండ కాదు. పూర్వము రాయదుర్గ నివాసు లగు ప్రజలు అచట తీరని క్షామము సంభవింపగా, నా గ్రామమున నుండ నోపక ఊడనిపారిరి. మార్గమధ్యమునఁ బత్తిమిట్ట యనుగ్రామమునఁ గొన్నినాళ్ళు నిల్చిరి. అచట నొక స్త్రీ మామూలువలె నొక ప్రాతఃకాలమున మజ్జిగ తఱచుచుండగా, కుండయం దేదో రాయివలె నడ్డుపడినది. అంత ఏమా - యీ ప్రతిబంధకము? అని లోపల చెయి బెట్టి చూడగా, నా కుండక్రింది భాగమున శిలారూపమున నృసింహదేవుడు వెలసియుండెను. అంత నా జనులందఱు జూడఁబోయిన దైవ మెదురైనట్లు, చాల సంతసించి యా పరదైవమునకు మ్రొక్కులిడిరి. అంత నా శిల క్షణక్షణములో పెరిగి వారి నాదరించి 'నేనీ స్థలరక్షకుఁడనైన దేవుండను, మి మ్మనుగ్రహించుటకై యిచట వెలసితిని. మీరంద ఱీతావుననే తిరముగ

నెలకొని నా కాలయము గట్టించి భక్తితోఁ బూజాదికము లొనర్పుఁడు' అని యాన తిచ్చెను. మజ్జిగ తఱచు కుండయందు భగవానుడు వెలయుటచే, నా గ్రామము 'తఱికుండ' యైనది. ఆ గ్రామవాసులగు వేంకమాంబగారి పుట్టింటివారి పేరును 'తఱికుండ'యే కాని, తరిగొండ కాదు. ఇట్లనియే పెక్కురు పరిశోధకులు వాకొనిరి. ఇది కడపమండలమందలి వాయల్పాడు గ్రామమునకు నాలుగుమైళ్ళ దూరమున నున్నది.

ఈమె భక్తిమాహాత్మ్యములు దెల్పు కథానకము లెన్నో దేశమునందు విచిత్రముగ నల్లుకొని యున్నవి. బాలవితంతు వగుట, బందుగులంద ఱీమెపై లేనిపోని దూరులు వెలయించి బాధింప దొడఁగిరి. ప్రాయము వచ్చినవెనుక వేంక మాంబకు కేశవపనము చేయించుటకై యుద్యమించిరి. కాని, యాపని యామెకు రుచింపక తన బంధుజనుల నా పనినుండి విరమింప జేయదలచినది. వారును విడువక చలమూని బలవంతముగా నామె కేశకలాపమును దీయించివేసిరి. అంత నామె మిక్కిలి విచారించి తన యిష్టదైవమును బ్రార్థించి యొక సరసున మునిగెను. వెంటనే యెప్పటి యట్లామెకు కచపాశము తిరిగి కన్పట్టెను. బంధువు లామె భక్తి మాహాత్మ్యమునకు వెఱగంది లెంపలు వైచుకొని చేయునది లేక సద్దుమణఁగిరి.

కాని, తుంటరు లగు గ్రామవాసులు కొంద ఱామెను హింసించుట మాన లేదు. నిర్మలభక్తిపరతంత్రురా లగు నామెభక్తిని కపట తంత్ర మని వారు ప్రచారము చేయుచు నామెను బహుభంగుల బాధించిరి. ఆ బాధలను పడలేక యామె తిరుమల జేరి యట వేంకటాచలపతిని సేవించుచు, నా దేవదేవుని మ్రోల ఘహితకవితాగాన మొనర్చుచు, దక్కుంగల జీవితవిశేషము నా స్వామి సన్నిధినే కడపి తన ఎనుబదవయేట కాలము చేసినది.

వేంకటేశ్వరునికడ నుండగా, నామె ప్రదర్శించిన అతిమానుష మహిమ లనేకములుగా వేంకటేశ్వర భక్తవిజయమున గల యీమె చరిత్రమునఁ జేర్కొనఁ బడినవి. అచట నుండగా, నామె ప్రాసంగికముగా రచించిన గీతము లింకెన్నో యున్నవి. వేంకటాచలపతి యామెకు ప్రత్యక్ష దైవము కాగా, నా దేవునే పతి

దేవునిగా భావించి నలుగుపాటలు, సింగారింపుపాటలు, బువ్వంబంతిపాటలు, అలకదీర్చుపాటలు, ఆరగింపుపాటలు, నిదురబుచ్చుపాటలు, హారతిపాటలు నింకెన్నో సమయానుకూలముగా రచించిన వెన్నో కలవు. మచ్చునకు రెండు పాటలనుండి రెండు చరణములు చూడుఁడు:—

విందునకు బిలుచు పాట

రాగం సావేరి - తాళం అట.

ప॥ శ్రీలక్ష్మీస్థితాంగచిద్రూప చిన్మయా శివనుత శుభాంగ రావయ్యా
అ॥ ప॥ మేలైనభక్ష్యముల్ చాలతెచ్చినాను, నీలవర్ణ తిని పోవయ్యా,
శ్రీవేంకటేశ్వర రావయ్యా, బ్రహ్మాండనాయక రావయ్య !

స్త్రీయై, బాలవితంతువై, అభిమానధన యగుట, గ్రామస్థుల తిరస్కృతికి గుఱియై యేకాంతవాస మంగీకరించియుఁ, గాలము వృథసేయక భగవదేకాంత భక్తురాలై, యిట్టి మాననీయ గ్రంథశ్రేణి నుత్పాదించి మెఱసిన దన్న, నామె కీ మానవాతీత దైవశక్తియే తోడుపడిన దని తలంచవలెను.

పుణ్యకవితాతపస్విని యైన తరికుండ వేంకమాంబను దర్శించిన భక్తి భావముతో ముందుకు సాగిపోవుదము.

తఱికుండ వేంకమాంబను గూర్చియు, నామె రచనలను గూర్చియు ప్రథమ ముద్రణమున గావించిన ప్రస్తవము మీరు పరికించియే యున్నారు—

ఈ ద్వితీయ ముద్రణావసరమున నామె విష్ణుపారిజాత యక్షగాన విషయమై లభించిన విశేషవిషయము నీ క్రింద నిచ్చుచున్నాను.

1965లో అఖిలభారత రచయిత్రుల మహాసభలను నేను భాగ్యనగరమున నాంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆధ్వర్యమున జరిపిన సందర్భమున నాచే సంపాదింపబడి ఆంధ్రప్రదేశ్ అకాడమీచే ప్రచురింపబడిన తఱికుండ వేంగమాంబా రచితమగు విష్ణు పారిజాత యక్షగానమును గూర్చి యొండు రెండు మాటలను ఈ ద్వితీయముద్రణావసరమున ప్రస్తావించుటుచితము.

వేంగమాంబ రచించిన కావ్యములలో విష్ణు పారిజాత యక్షగానము ఒక మేలి ముత్యము. ఇది శ్రీకృష్ణుడు సత్యభామ కొఱకు దివినుండి భువికి పారిజాత తరువును తెచ్చిన గాథ ! సహజముగనే సౌందర్యము చిప్పిలు నట్టి యీగాధ పరమ భక్తాగ్రగణ్యయైన వేంగమాంబ హృదయనైర్మల్య సరసియే, యిట్లు కవితారస సౌందర్య సింధువై, వెల్లివిరిసినదా యనిపించును.

కావుననే ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రను రచించిన శ్రీ యస్వీ జోగా రావుగారు తమ యక్షగాన చరిత్రలో "ఆమెవలె నిన్ని యక్షగానము లింత సమర్థవంతముగా రచించిన కవయిత్రులులేరు- సరికదా కవులును లేరు" అనివ్రాసి యుండిరి.

---

# 26. అమ్మాజీ

త్యాగరాయల శిష్య ప్రశిష్యకోటికి జెంది సంగీత వాఙ్మయకర్త్రిణిగా పేరొందిన అమ్మాజి యను నామె యే కాలమునాటిదో, కులగోత్రము లేవియో యెఱుకబడవు.

ఇంతటితో విపులకావ్యశ్రేణిని నిర్మించి కాలగర్భమున విలీనలై చారిత్రక ప్రసిద్ధి గాంచిన తొలితరము తొయ్యలుల కావ్యములు సమీక్షించుట పూర్తియైనది.

రాయలయుగము, నాయకరాజుల యుగమును నిందు ముఖ్యముగ కవయిత్రులకు గాణాచులైనవి. ఇంతటితో నీతరము తెర మరుగున కేగినట్లే.

— ఇది తొలితరము —

———

మలితరము — శ్రీ వీరేశలింగయుగము

# 27. కొటికలపూడి సీతమ్మగారు

ఆంధ్రవైభవము, ఆంధ్రసారస్వతమును ఆరాధించు కాలము కడచన్నది. నాయకరాజుల కాలములో ఆంధ్రుల వైభవజ్యోతి తుది యూర్పుగా నొకమారు గప్పున వెలిగి, గుప్పున నారిపోయినది. ప్రభుత్వాదరణ యను సలిలసేకము చేతనే యేపుగ నభివృద్ధి నొందు సారస్వతము ఆలన పాలనలు లేక అణగారి పోయినది.

తరిగొండ వేంకమాంబకు తదుపరి సుమారు ఏబది వర్షములు సారస్వత రంగమున అంధకార మావహించిన దనవచ్చును.

కాని, పుణ్యశ్లోకుడు శ్రీ వీరేశలింగమహితుడు దేశహితార్థియై అన్ని సంస్కారములకంటె స్త్రీజనసంస్కారము నెక్కుడుగ భావించి, స్త్రీలలో నవిద్యాచ్ఛేదన మొనర్ప పని బూనెను. ఆయన స్త్రీవిద్యా ప్రచారమునకు, స్త్రీ సంఘసంస్కారమునకు పడనిపాట్లు లేవు. తన యింటనే పాఠశాలలు పెట్టి స్త్రీలలో విద్యా ప్రచారము కావింప మొదలిడెను. స్త్రీలకొఱకు ప్రత్యేకముగ పత్రికలు పెట్టి స్త్రీల యెడకావింప బడుచున్న సంఘదురాచారముల దెగ్గివైచిపోసెను. ఇట్లాయన సంఘమున ఉత్తమార్ధ (Better half) మగు స్త్రీజనతాభ్యుదయమునకై పలు విధముల శ్రమించెను. అపుడు వారి నాదర్శముగా గొని వెలసినవే నరసాపురమున బుద్ధిరాజువారి యాజమాన్యమున వెలసిన విజ్ఞానచంద్రికా సమాజమును, రాజమండ్రి యందు శ్రీనాళము కృష్ణరావుగారిచే స్థాపింపబడిన స్త్రీల పోటీపరీక్షల సంస్థయును. అంతే కాక, రాజమంచిరమున శ్రీ కృష్ణరావుగారే తమచే స్థాపింపబడిన వీరేశలింగ గ్రంథాలయము అను (సర్వజనగ్రంథ భాండాగారము— ఇదే యిపుడు గౌతమీ గ్రంథాలయము) గ్రంథనిలయమునుండి యింటింటికి నాడువారికి పుస్తకముల నిప్పించి విద్యాప్రబోధము చేయుచుండెడివారు.

ఇట్లు జరిగిన నిరంతర స్త్రీవిద్యా ప్రచారముచే గొందఱు స్త్రీలు పత్రికా నిర్వహణ మొనర్పఁగలిగిన ప్రజ్ఞావతులు గూడ వెలసిరి. శ్రీమతి బాలాంత్రపు

శేషమ్మగారి "హిందూసుందరి" యు, పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి "సావిత్రి" యు, వింజమూరి వెంకటరత్నమ్మ గారి "అనసూయ" పత్రికయు నప్పటివే. ఇందు శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు శ్రీ వీరేశలింగము పంతులుగారికి వ్యతిరేక పక్షము వారై, సనాతన శిరోమణు లైన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్యురాలై, వితంతు వివాహాది సంస్కార కార్యములలో శ్రీ పంతులుగారికి వ్యతిరేకవాదముతో పత్రిక నడపిరి. ఐనను స్త్రీవిద్యా ప్రచారము విషయమున మాత్రము ప్రోత్సాహభావమునే చూపిరి.

అట్టి మహనీయయుగమున శ్రీ వీరేశలింగము పంతులుగారిచే స్వయముగ దిద్దబడి వారి ఉత్తమశిష్య యని పేరు బడసిన శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారితో ఈ తరమునకు శ్రీకారము చుట్టవచ్చును.

1. సాధురక్షకశతకము, 2. అహల్యాబాయి, 3. పద్యభగవద్గీత, 4. భక్తి మార్గములు, 5. సతీధర్మములు, 6. లేడీ జేన్‌గ్రే మున్నగు కావ్య పరంపరకు జనయిత్రి యైన యీ కవయిత్రి, తెనాలి తాలూకా జెవుడుపాడు వాస్తవ్యులు శ్రీ అబ్బూరి సుబ్బారావు పంతులుగారి పుత్రిక- శ్రీ కొటికలపూడి రామారావుగారి సతి. ఉద్యోగధర్మ మందున భర్తతో చాలకాలము రాజమందిరము వాస మొనర్చి విద్యా వైదుష్యములచే విద్వల్లోకమునకు విజ్ఞాతపూర్వయైన యీ విశ్రుత కీర్తి శ్రీ పిఠాపురము మహారాణి చిన్నమాంబగారికి గురుపద మధిష్ఠించి విరాజిల్లి యుండిరి.

1913 వ సంవత్సరమున బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్ర మహాసభ యందలి మహిళాసభకు అధ్యక్షపీఠ మలంకరించిన యార్యురాలీమె. అంతేకాక, వితంతువివాహాది విషయములలో నామె యెన్నో సభాముఖములనుండి స్త్రైణము నుద్బోధించినది. అట్టి యామె యుపన్యాసము లన్నియు "ఉపన్యాససుమమాలిక" యని వేరే యొకపొత్తముగా నచ్చొత్తించిరి. "ఉన్నతస్త్రీవిద్య" యను నింకొక వచనగ్రంథమును గూడ రచించి సంఘసేవ యొనర్చిరి. ఈ సాధుశీల సంఘ సంస్కర్త్రి, ఆస్తికభావ సంపన్నయు నై యున్నది.

ఈమె రచనములలో అహల్యాబాయియు, సాధురక్షకశతకము మాత్రమే నా కంట బడినవి. తక్కినవి సులభప్రాప్తములు కాకున్నవి.

అహల్యాబాయి :— మహారాష్ట్రజాతియందు సాధారణ కుటుంబమున (యాదవవంశమున) బుట్టి, వివేకమహితయై, మహారాజపత్నియై, రణరంగమున భర్త గతింపగా సహగమనమున కుద్యుక్తయై, మామగారిచే వారింపబడి మామగారి యనంతరము రాణియై, కన్నసుతుడు, సుతయు గతించినను, నధైర్య మొందక యనేకయుద్ధములు జేసి, యనేకము లగు బన్నములకు పాలుపడియు, ప్రజారంజన మగు పరిపాలన గావించి, పాశ్చాత్యులచే సహితము మెప్పుబడసిన 'శ్రీ అహల్యా బాయి' మహారాజ్ఞీ చరితమే యిందలి యితివృత్తము.

"స్త్రీలు విద్య నేర్వ జెడిపోదు రనుమాట
కల్ల యనుచు దోప నెల్లరకును
విశదపరతు నొక్క విద్యావతిచరిత్ర
సంగ్రహంబు గాగ చదువుడయ్య."

అనియు, సాధ్వీశిరోమణి సతి యహల్యాబాయి సద్వర్తనము మన సతుల కెల్ల వినిపింప, వారు తద్విధమున వర్తింతు రను నాస కలిగి యీ వనితచరిత వ్రాయబూనితి ననియు, నీమె వ్రాసిన దానినిబట్టి యోజింప నా కాలమున స్త్రీ విద్యాప్రచార మెంత కష్టతరముగా నుండెడిదో యూహింపవచ్చును.

"కవిత్వపద్ధతు లే నెఱుగ"నని యామె వినయముకొఱకు వ్రాసిరి. కాని, యీమె కవిత్వము సరళముగ చక్కగనే యున్నది. నాయిక యగు అహల్యా బాయిపాత్ర సముచితముగ వర్ణింపబడినది. చారిత్రకగ్రంథ మైనను, అహల్యాబాయి పాత్రపోషణాదులను మిక్కిలి జాగ్రత్తగా గమనించిరి. అహల్య చేసిన భర్తృసేవ మిగుల నాదర్శప్రాయమైనది.

"క్షీరోదకములకైవడి । నారీరత్నమును విభుడు నయ మొప్పంగా
గూరిమి కలిసియునుండిరి । ధారుణిజను లెల్ల చూచి తగుననిమెచ్చన్"

అను రీతిగా అహల్యా అత్తింట నడచుకొన్నదట. చిన్నికందముల యందును, పెద్దవృత్తములయందును, గీతములయందును వీరిశైలి యొకే విధముగ ధారావాహికయై యలరినది. శైలికి-

"ఎంతదయావిహీను లని యెన్నగవచ్చును వీరి నయ్యయో!
సుంతయు జాలి లేక తమ శూరత పక్షులపైని జూపి నొ
ప్పింతురు జీవజంతువుల ప్రీతిని జూడక మూఢచిత్తులై,
యింతట నైన వీనిశ్రమ లెల్ల నివారణ మేను జేసెదన్."

అని తలచి పంటచేలను
గొని పులుగులకొఱకు విడిచె గోమలి, దయ, యీ
వనితామణియై పుట్టెనొ
యని సంశయ మంది లోకు లద్భుత మందన్."

ఇందు నాయికయొక్క గుణోత్కర్షమును గాంచుడు. అప్పటి అనసూయ పత్రికలో సీమె "ఒక మహమ్మదీయవనిత" యను శీర్షికను మన సక్కుబాయి యట్టి కష్టచరిత్రగల స్త్రీ జీవితమును ప్రచురించిరి.

భక్తురాలైన ఒక మహిళ ఆవేదనను దెల్పు ఒక పద్యము :-

ఇంటిపను లెల్ల దీరిచి యిటకు వచ్చు
సరికి నాలస్య మగుచుండె సదయహృదయ
నా మనోభావమును, మఱి నాకు గల్గు
చిక్కులను నీవెఱుంగుదు చిన్మయాత్మ."

ఇక సాధురక్షకశతకము :— ఉత్పలమాలావృత్తము.
ఇం దీమె గావించిన యాత్మబోధ యద్భుతముగా నున్నది.

"కోపము మెండు నా కెపుడు, కుచ్చితబుద్ధి యఖండవృత్తితో
గాపుర ముండు, నామదిని గల్మష మింక నశింప దయ్యొ, నా
పాపపు జిత్తవృత్తులను భస్మము చేయగదయ్య వేగ సం
తాపహరుండ ! భక్తవరదా, శరణాగత ! సాధురక్షకా."

"క్రోధుడు లోభుడుం గలిసి క్రూరత నేర్పుదు రయ్యా నాకు, సం
శోధన చేసి మోహుడు విశుద్ధత దాను హరింపజూచు, నే
సాధన శక్తి నైనను విచారణ చేయుచు వీని ద్రుంప స
ద్బోధ యొసంగి కావవె ప్రభూ ! శరణాగత ! ......"



"తక్కిన మత్సరాదులగు తస్కరు లెల్లరు గూడి తాము పే
రెక్కిన జ్ఞానరత్నము హరింపగ జూచెద రయ్యా, యింక నే
నక్కట ! యేమి చేయుదును ? హంతకు లైనటువంటి వీరినే
గ్రక్కున నొంప సాయపడరా శరణాగత.......!"

ఈ దుష్కాలమున నూటి కొక్కరైన యిట్లాత్మశోధ జేసికొన్నచో, అమృతత్వవసాయికులే యగుదురు. 

## 28. భండారు అచ్చమాంబ



ఈమె కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి (విజ్ఞానచంద్రికాగ్రంథమండలి) సోదరి. కృష్ణామండలములోని మునగాల సంస్థానమునకు క్రీ. శ. 1880 వ సం. ప్రాంతమువఱకు దివాన్‌గిరీ చేసిన కొమఱ్ఱాజు వెంకటప్పయ్యపంతులుగారి కుమార్తె. 1874 లో నందిగామయందు జన్మించెను. జనయిత్రి గంగమాంబ. ఈమె తన మేనమామ భండారు మాధవరావుగారిని పరిణయ మాడినది. ఉద్యోగ ధర్మి యగు భర్తతో కాపురము సేయుచు, నాజన్మాంతము మధ్యపరగణాలలోనే యుండిపోయినది.

పతిశీల యైన యీమె మొదట స్త్రీవిద్యాపరాఙ్ముఖులుగా నున్న తనవారిని రుచిర మంజులభాషలతో మెల్లగా తన మాటవారినిగా గావించి, తమ్మునిసాయమున విద్యాభ్యాసము సాగించి యందు కుశలయైనది. ఆమె పుత్రిపుత్రికాశోకసంతప్తయై యున్న సమయమున, తమ్ముడు లక్ష్మణరావుగా రుదాహరించిన ''శబ్దేందుశేఖరో మమపుత్రః మంజూషా మమకన్యకా" యను నాగోజీభట్టు శ్లోకముచే ప్రబోధితయై, శోక ముడిగి కన్నుదెఱచి కావ్యరచనకు గడంగినది. బాల్యమునం దంత విద్యావతి

కాకున్నను, స్వయంకృషిచే శాస్త్రములను, సంస్కృతకావ్యములను, శ్రుతిస్మృతులను గూడ నర్థముచేసికొను శక్తిని సంపాదించినది. మహారాష్ట్రాంగ్లభాషలలో కూడ పండిత యయ్యెను.

చరిత్రరచన యనిన మగవారికే మిక్కిలి కష్టతరము కదా. అట్టి యెడ, స్త్రీలలో ప్రథమముగా చరిత్రను రచించి చక్కగా రచన నిర్వహించిన దను ఖ్యాతి పొందినది. స్త్రీలలో చరిత్ర రచించిన ప్రథమ గౌరవ మీమెదే. ఈమె కృత మగు "అబలాసచ్చరిత్రరత్నమాల" మూడు భాగములు. పౌరాణిక స్త్రీ చరిత్రము, చారిత్రక స్త్రీ చరిత్రము, ఆంగ్లేయాది విదేశరమణీ చరిత్రము నని. ఇది కాక, యీమె యేదో శతకమునుకూడా రచించి రట. అది శ్రవణశేషము మాత్రమే.

అబలాసచ్చరిత్రరత్నమాలయందలి శైలి అమృతప్రాయముగా నున్నది. గద్యమందు పద్యపురుచిని జూపినది. రుద్రమ్మ, అహల్యాబాయి, ఆనందీబాయి జోశీ, నాచీ, తరిగొండ వెంకమ్మ మున్నగువారి చరిత్ర లెన్నో కలవు. ఈమె కొందఱు చరిత్రకారులవలె గాక, మన యాంధ్ర పురంధ్రుల చరిత్రలు గూడ గ్రంథమున వెలయించినది.

ఏ చరిత్రము వ్రాసినను, నద్దాని సమర్థించు శ్రుతి స్మృతివాక్యములు, శ్లోకములు నెన్నో యీ గ్రంథమున నగపడుమ. ఏవాక్యము నుద్ధరించినను ప్రత్యక్షముగా పరిశీలించి కాని, సమగ్రముగా పరిశోధన చేసి కాని యుల్లేఖించెడిది కాదు.

ఈ గుణోత్తరురాలు మిగుల కరుణాళువు. సాధ్వి. పేదల కెందఱకో ఆశ్రయ మిచ్చిన పెన్నిధి. విద్యార్థుల కెందఱకో కామధేనువై వెలసిన వితరణశీల.
ఇట్టి పరార్థజీవనల గడుపార గన్న దేశములు భాగ్యోపేతములన్న నతిశయ మేమి !

# 29· రాణీ చిన్నమాంబ

ప్రఖ్యాతి బొందిన పద్మనాయకవంశమున బుట్టి, పీఠికాపుర ప్రభుని సూర్య రాయమహీజానిని చెట్టబట్టిన దీ చిన్నమాంబ.

పీఠికాపురమహారా జైన సూర్యరావు మహీపతిని తెలియని తెలుగువా రుండరు. వారు సారస్వతాభిమానులు, సంస్కారప్రియులు. వారి ఉదారహృదయ మెంద రనాథలకో తలిదండ్రులు లేని లోటు తీర్చినది. వారి విజ్ఞానధనము ఎందరు కళాపిపాసులకో ముంగొంగు పసిడి యైనది.

వీరి రాజ్ఞీమణి చిన్నమాంబయు నట్టిదే. ఆయమ పాతివ్రత్యమును గూర్చియు పరహితత్వమును గూర్చియు, భాషాప్రియత్వమును గూర్చియు తెలుగులు కథలుగ జెప్పుకొందురు.

మగవారు, మహారాజు లెందైన కొలువు దీర్చుటయు, కవిగాయకులతో గోష్ఠిగానముల వినోదముల సల్పుటయు చరిత్రములలో వినియుంటిమి. ప్రత్యక్ష ముగ కనుచుంటిమి. కాని, ఆడువారు కవయిత్రుల గారవించి విద్వద్గోష్ఠుల నెఱపుట యబ్బురమే. రాణి చిన్నమాంబ జీవిత గాధయే యీ ఉబుసుపోకకు తొలి యుదా హరణము.

తనకు గురుపదమున నున్న కొటికలపూడి సీతమ్మగారిని, జూలూరి తుల శమ్మగారిని, యింకా కొందఱు కవయిత్రులను చేర్చుకొని యీమె యెపుడపుడు కవితాగోష్ఠివిలాసముల ప్రొద్దులు పుచ్చుచుండెడి దట. సమస్యలు పూరించుట, ఆశువుగా కవిత్వము చెప్పుట, రచించిన కావ్యముల జదివించుట, సాహిత్యవిమర్శ నము చేయుట యనునవి యా గోష్ఠులయందు ప్రస్తావము బడసెడివట.

ఈమె స్వయముగ "రామాయణసంగ్ర" హాదులు కొన్ని వచనగ్రంథములు రచించిరి. ఏదో ఒక పద్యగ్రంథముగూడ వీరు రచించి రని వినికిడి. ఏమైన నేమి- అన్నియు మనకు శ్రుతివిషయములే కాని, దృష్టిగోచరములు కావు. ఇట్టి రసికప్రభ్వి సాహితీక్రీడాకలాపములను, కావ్యములను చూడ నోచుకొనని ఆంధ్రులు భాగ్య హీనులే యనవలెను.

# 30. కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు

శ్రీ వీరేశలింగముపంతులుగారి సహధర్మచారిణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారి నెఱుంగని యాంధ్రు లుండరు. ఆమె శ్రీ పంతులుగారికి సర్వ సాంఘిక సంస్కరణోద్యములందును సహధర్మచారిణియే.

వీరు ఏకేశ్వరోపాసనాప్రార్థన లెన్నేని గేయరూపమున రచించిరి.

మచ్చున కొక మంగళహారతిలోని కొన్ని చరణములు:—

మంగళం శ్రీసృష్టిరక్షకా నీకు జయ
మంగళము శ్రీ భక్తపాలకా । పల్లవి.
తల్లి తండ్రి వంచు నమ్మితి దేవాదిదేవ తనయను రక్షింప వేడితి
ఉల్లమందు నీదు ప్రేమ నెన్న నెవరితరము గాదు,
చల్లని కృప నాపై చల్లవె కరుణాకటాక్ష !
కనికర మెద నుంచ వేల కరుణను పరీక్షింప వేల ?
ప్రణయముననను కందుకూరి రాజ్యలక్ష్మిని నేల వేల !

కీర్తనవాఙ్మయస్రష్టగా నీమెను లెక్కింపవచ్చును.

———

# 31. బుర్రా సూరమాంబగారు

"హరితసగోత్రోద్భవ సోమంచివంశరాకాసుధాకర భీమశంకర తనూభవ" ననియు, "భారద్వాజగోత్రోద్భవ శ్రీబుర్రా రాజలింగ ద్వితీయపుత్త్రి దేవేంద్రనాథ ధర్మపత్ని" ననియు, నీమె తన సావిత్రీవిజయ గద్యమున తన్ను గూర్చి చెప్పుకొన్నది. ఈ బుర్రావారి కుటుంబము విద్వత్కుటుంబముగా ప్రసిద్ధికెక్కినది.

వీరిది ఆంధ్రదేశమందలి విశాఖపురీమండలాంతర్గత శ్రీకాకుళము.

సర్వధారివత్సరమున మాతామహుల యింట జననము. తండ్రిగారగు సోమంచి భీమశంకరముగారు ఏలూరున స్వగృహమున బాల్యమున వీరిని బాగుగా చదివించిరి. భారతీస్తవస్తబకము, హరినాథ, నందనారశతకము, ప్రహ్లాద నాటకము, హరనాథశతకము, శ్రీకృష్ణబోధామృతము, సావిత్రీవిజయము ననునవి వీరి పొత్తములు. శైలికి భారతీస్తవస్తబకములోనివి :

"భూరిగుణావలంబ ! సురభూరుహమా ! భవదీయసత్పదాం
భోరుహచింతనంబు దలపోయుచు నన్య మెఱుంగ, నన్ని కే
తీరున బ్రోచెదో యిపు డిదే సమయంబు సుమీ ! లతాంగి న
న్గారము సూపి నా యమితకామితసిద్ధి నొసంగు భారతీ."

"నీ కరుణాకటాక్షమున నిచ్చలు నెవ్వని జూతు వాతడే
లోకపవిత్రు డయ్యెడు, తలోదరి ! ని న్బొగడంగ శక్యమే ?
ప్రాకటమైన విద్దెలకు పన్నుగ మూలము నీవె కావె ? నీ
నా కిలవేల్పు వంచు మది నమ్మితి సుమ్ము నిజమ్ము భారతీ."

ఇవి యిర్వదియైదు పద్యములు.
హరిశతకమునుండి యొకమచ్చు—

గిరిజాధిప ! సురవరముఖ ! యరవిందభవాది వందితాంఘ్రియుగళ ! నీ
చరణసరోజము లెదలో ! నెర నమ్మితి బ్రోతు వంచు నిరవద్య హరీ.

ఇక మిగిలినది సావిత్రీవిజయము. ఇది ఒక చిన్న కావ్యముగ రచింపబడినది. రచన లలితసుందరముగ నున్నది. పతివ్రతలలో ప్రథమగణ్య యగు సావిత్రీదేవి పరమపావనచరితమే యిం దితివృత్తము.

సహజోక్తిసుందర మైన యీక్రింది వర్ణన చూడుడు.

చానకు మంగళస్నానంబు గావించి,
చెలగి రాసుతునకు జలకమార్చి,
జిలుగు బంగరువన్నె చీనిచీనాంబ్రములల్
సరిగపూల్తతల వస్త్రములు గట్టి,
ఘనసారమిశిత చందనలేపన మొనర్చి,
గిరిజకు మ్రొక్కింప సురుచిరముగ,
మంగళసూత్రంబు రంగారగా గట్టి,
చాల ముత్యపుదలంబ్రాలు పోసి,

బంధుజనులకు నచట తాపసుల కెల్ల
వందనం బిడి వారిదీవనల నంది,
పంచబాణుని సరసను మించి వెల్గు
నల రతీసతి యన బొల్చు నవ్వెలంది.

మఱియొకచో, సావిత్రి —

కరయుగము మోడ్చి చయ్యన । శిరమున గీలించి, పతితసేవితకరుణా
కర! దురితహరణ ! యిక నా। వరునాయువు నిమ్ము కామ్యఫలసిద్ధిప్రదా.

అనగా, నామెమాటకు సమవర్తి :—
తరుణి . విను నేటిదాక నీధరణి విగత
జీవు లెందును మఱల సజీవు లౌట
చూడలే, దిక ముందైన జూడబోము;
నీ ప్రభావ మవాచ్యమై నెగడె గాక.

ఇచ్చితి నీవరు, జాలగ । మెచ్చితి నీమహిమ కహహ । మేదినిలో నీ । కిచ్చితి
నతులితసంపద, । నిచ్చలు కైవల్యపదవి నిచ్చితి తుదకున్.

శైలి యిట్లు పూర్వకవుల దలపించుచు జాలుగా సాగిపోయినది.

తమ అరువదిమూడవయేట నీమె యిపుడు శ్రీకాకుళమున భర్తగారగు దేవేంద్రనాథుగారియింట సుశ్రీవిభవమున మసలుచున్నారు.

# 32. వేమూరి శారదాంబగారు

నాగ్నజితీస్వయంవర, మాధవశతకక ర్త్రి యగు శ్రీ వేమూరి శారదాంబ కృష్ణామండలములోని గుడివాడతాలూకా, విన్నకోట పరగణా, అల్లూరు అగ్రహార మున దాసు శ్రీరాములుగారి పుత్రికయై 3-5-1881వ తేదీనాడు జనన మందినది. సంగీత సాహిత్యములలో అభిరుచియు, అభినివేశము కలిగి తన ఆరవయేటనే వినిన గీతములు వినినట్లు పాడ నేర్చిన ప్రజ్ఞయు, పదనొకండవయేటనే పద్యములు వ్రాయగల్గిన ప్రతిభయు నార్జించినది,

వీరి తండ్రిగా రగు **దాసు** శ్రీరాములుగారు సుప్రసిద్ధకవులు. దేవీభాగ వతము మున్నగు నుత్తమరచనలు సాగించిన యుత్తములు వీరు. వీరి "తెలుగు నాడు" చక్కని ఖండకావ్యము. ఆనాటి సాంఘికజీవితమున కది తళుకుటద్దము. వారు స్వయముగ నాట్యకళాభిమానులే కాక, తానై గజ్జె కట్టిన దిట్ట. వీరివి జావ ళీలు కూడ కలవు. అట్టి రసికకవిసత్తముని కడుపున పొడమి, తొమ్మిదవయేటనే గుంటూరుమండల బాపట్ల తాలూకా తహసీలుదారుగా పనిచేసిన వేమూరి కామన్న పంతులుగారి కుమారుడు రామచంద్రునిగారితో పెండ్లి గావింపబడినది.

అటనుండి ఉద్యోగిగా చెన్నపురి వెడలు భర్తతో వెడలి, యట తన సహజ పాండిత్యము కతమున పెల్లుబికిన కవితాధోరణితో నాగ్నజితీ పరిణయమును దన 11 వ యేట కూర్చినది. ఇంతియ కాక, యీమె యపుడపుడు నుడివిన పద్యములు, వ్రాసిన వ్యాసములు, జనానాపత్రిక యందును, జ్ఞానోదయపత్రికయందును ప్రచురింపబడుచుండెడివి. 1899వ సంవత్సరము లోపుగానే యిరువురు బిడ్డల గని తలిదండ్రులను, బంధు జనులను శోకసాగరమున ముంచి, రెండవ ప్రసవసమ యముననే యసురుల బాసినది. ఇట్లు కడు బాల్యముననే అలవోకగా ప్రశస్త కావ్యము రచించిన యీ ప్రజ్ఞామతి కావ్యమునకు కృష్ణుని యష్టమహిషలలో నొకతె యగు నాగ్నజితి నాయిక. ఇది మూడాశ్వాసముల ప్రబంధము. కావ్యము పూర్వపక్కినె యున్నను. వెట్టిమొట్టి విరహవర్ణనలును, అనుచిత స్త్రీవర్ణనలును లేవు. కాని, నాయికా నాయకులు పరస్పర గుణాకర్ణనమున ప్రేమించుకొనుట,

నాయికచేటి కుహనాయోగివేష ధారిణియై మాత్యము నడుపుట మున్నగున వన్నియు ప్రౌబద్ధతులే. ఇయ్యది చెన్నపురి పార్థసారథిదేవున కంకితము.

"మదర్శిపురివాసి యగుట—

"పూపనెలదారి పిళ్ళారి ప్రోచు మమ్ము"అని పిళ్ళారిపదమును సంభావించినది.

నగరవర్ణనమున :—

''వీరులు, నీతిచారులు, గభీరులు, ధీరులు, నర్థికోటిమం
దారులు, ఖడ్గధారులును, ధర్మవిచారులు, వజ్రహారులున్,
శూరులు, ప్రేయసీహృదయచోరులు, నింక గడు న్మనోహరా
కారులు తత్పురంబునను గల్గిన రాజకుమారు లెంతయున్."

ఉదారులై, యమకాలంకారమున నీయమచే ప్రస్తావింపబడి మొల్లయొక్క 'రాజులు కాంతియందు, రతిరాజుల" స్ఫురింపజేసిరి. ఇంకను శైలికి :—

''కనలుచు నెంతయుం గినిసి కన్నులు నెఱ్ఱగ జేసి, మమ్ములన్
గని కడు నీచగోవు లయి కాననసీమల సంచరింపుచున్,
మనుజుల నెల్లరన్ భువిని బాధల బెట్టగ బుట్టు డింక మీ
రనుచు శపింప, మే మపుడు హా ! యని దీనతతోడ వేడగన్."

ఇట్లుదారమై యున్నది.

ఆశ్వాసాంతమున :—

భాసుర మైన నీ వెడదవక్షమునందున శ్రీ వెలుంగగా,
దాసుల కే కొఱంత ? సతతమ్మును సంతసమూర్తి శోభితా
వాసులు గారె విశ్వపరిపాలన ! సుందరరామ ! శారదా
భాసమకీర్తిపూరిత ! దిగంతరవైభవ ! చంద్రమాధవా."

అను రథబంధ మగు నుత్పలమున దననాథుని నామాక్షరముల నలువరుసల గూర్చి తన కవితాశక్తిని పతిభక్తిని వెల్లడించినది.

మాధవశతకమునం దనేకవిషయములు ప్రస్తావింపబడినవి. ముఖ్యముగ స్త్రీవిద్యావిహీనతగూర్చి యెక్కువ ప్రస్తావింపబడినది.

''గొల్లది చల్ల వాడు కిడ, గోడల గీతలు గీసి లెక్కలన్
దెల్లము సేయు, జాకలిది తెచ్చిన బట్టలు వ్రైచు బట్టలున్
బల్లవపాణి త్రాడునకు బాగుగ వ్రైచును విప్పుముళ్ళ దా
సల్లలితంబుగా జదువజాలని చిన్నియ లెన్న మాధవా.

గోడల గీతలు గీయుట, త్రాడున ముళ్ళు వ్రైచి విప్పుట, మొదలగు చదు వెఱుగని చానలపోకడల నింత చక్కగా వర్ణించి "యౌరా ! విద్యావిహీనల దుస్థితి'' యని యొక్కపరి ముక్కుపై వ్రేలిడ జేయుచున్న దీ యమ.

"భళిరే ! యెట్టిది వింజమూరికుల తిమ్మాభిఖ్యనుం జూడ, నా
లలనారత్నము రామణీయకము డోలాయాత్ర యనౕ గ్రంథ మీ
వలనే జేసె నటందురే ద్విపదలో బాండిత్య మింపార, నీ
చెలులుం దద్గతి విద్య నేరగ భువిం జేయంగదే మాధవా.''

ఈ పద్యమునం దీమె పేర్కొనిన వింజమూరి తిమ్మక్క యెవరో? ఆమె కృత మగు ''డోలాయాత్ర'' యెచటనో!

కడు పిన్నవయసునందే మృతిచెందియు, జాతికుసుమసౌరభమట్లు పుట్టగనే పరిమళించి, స్వచ్ఛమైన జీవితసౌందర్యరేఖతోడను, అచ్ఛమైన కావ్యశోభనశ్రీ తోడను, యశశ్చంద్రికల నలుగెలంకుల వెలయించిన యీమె శుభచరిత్రము ఆంధ్రులకు గర్వకారణము !

# 33. మాపిడన్న సుభద్రమ్మగారు

## అధ్యాత్మ రామాయణము-ద్విపద

ఈమె అయ్యగారి రామమూర్తి పంతులుగారి సోదరి. రామగాథనంతను బూర్వభాగమువరకు అధ్యాత్మ రామాయణకీర్తనల ననుసరించి ద్విపదలో వ్రాసెను.

సరగ నామెకు బల్కె జానకీజాని
''భరతుడ రా జగు ! భామిని యేను
జరియింతు వనములో, జగతీధవుండు
కడకు దుఃఖించుచు కడు నజ్ఞురీతి
నిప్పని నాతోడ నింపుతో నిపుడు
చెప్ప సంశయ మేమి శీఘ్రమే ?"యనిన,
రాముని గనుగొని రా జిట్లు లనియె
కాముకుం డను, భ్రాంత కలుషమానసుడ,
రామ! నన్వధియించి, రాజ్యంబు గొనుము,
భూమిలో నఘము ని న్బొందదు- నిజము''
అని పల్కి భూపతి యతిదుఃఖము నను
తనయుని గన్గొని తానేడ్చె నపుడు.

ఇ ట్లున్నది. విశేషములు లేవు. వ్యర్థ పదములు మెండు

## 34, 35, 36, 37

సుకేశి, సుగుణహేళి యను నవలలు రచించిన

## గోపిసెట్టి లక్ష్మీనరసమ్మగారు

సేతుపిండారి, ప్రియాన్వేషణము నను నవలలు రచించిన

## శ్రీనివాసమ్మగారు

నీరజరామాశ్రమము రచించిన

## చిల్లరిగె రమణమ్మగారు

సగుణమ్మ యను నవల రచించిన, 'విద్యావతి' యను పత్రిక
నడిపిన క్రీస్తువనిత

## క్రపాబాయి సత్యనాథమ్మగారు

నిట స్మరణీయలే.

## 38. గూడపాటి లక్ష్మీనరసమ్మగారు

ఆనాటికి బాగుగా విరుద్ధధర్మ మైన రజస్వలానంతరకన్యను స్వయముగ చూచి వరించి పెండ్లియాడి సంఘసంస్కారప్రియు లని యనిపించుకొన్న ఆచంట లక్ష్మీపతిగారి వివాహగాథ 'స్వయంవరము'ను ఏకాంకికగా రచించిన గూడపాటి లక్ష్మీనరసమ్మయు నిట లెక్కింపదగినదే.

# 39. గుండు అచ్చమాంబగారు

రామేశ్వరయాత్రా, కాళహస్తీశ్వర కళ్యాణ మహోత్సవము, శ్రీ పూజా విధానము, శ్యమంతకమణి యను నాటకమును రచించిన గుండు అచ్చమాంబ గారొక రా కాలమున సుప్రసిద్ధ కవయిత్రి. ఈమె పొత్తములలో ఒక కాళహస్తీశ్వర కల్యాణోత్సవము దప్ప తక్కిన వేమియు గానరాలేదు. శార్వరినామ వత్సరమున నిది ముద్రితమైనది. అప్పుడు రిజిష్ట్రారుగా పనిచేసిన శ్రీ గుండు వాసుదేవశాస్త్రిగారి మేనగోడలీమె.

ఇది యొక 'వీథి' కావ్యము. శ్రీనాథుని క్రీడాభిరామమువలె కాళహస్తి యందలి స్వామి కళ్యాణోత్సవమునాటి వేడుకలను, స్టేషనుచిత్రములను, స్థల మాహాత్మ్యమును వర్ణించినది. ఇందైదు ప్రకరణములు గలవు. ఆటనట పద్యములు నున్నవి. తక్కిన రచనలలో నొకటి పద్యకావ్యము.

మీరాబాయి యను కావ్యము వ్రాసిన

# 40. మొసలిగంటి రామాయమ్మగారు

మృగశృంగచరిత్ర వ్రాసిన

# 41 . చూడికుడుతమ్మాళ్ గారు

వీరును ఈ కాలము వారే.



# 42. మోదవరపు లక్ష్మీనరసమాంబగారు

వీరి పద్యము లొండు రెండు చూడుడు.

"శ్రీ మీర న్దలజంబు దాల్చి మృదులస్మేరంబుతో బృథ్వీజ
బ్రేమ న్జూచి భవత్కరాక్షిపదము ల్వీక్షింపగా పద్మ మిం
కేమాడ్కి సరిపోలు వాని? కనుచు హేలావిలాసంబుగా
వామాంకంబున సీత ముద్దుగొనె దా భద్రాచలాధీశ్వరా."

"కాలజ్ఞానము లేని పక్షితతుల న్గల్పించి, నీ వందులో
గాలజ్ఞానము దామ్రచూడములకుఁ గల్పించుటల్ సూడగా,
నీ లీలావిభవంబు లబ్బురములౌ నిక్కంబుగా దెల్పగా
బాలు న్నీ ర్విభజించు హంసముపలెన్ భద్రా......"



# 43. వెన్నెలగంటి హనుమాయమ్మగారు

ఈ యుగమున- అనగా సుమారు ఏబదివర్షముల క్రితము సంస్కృతమున కవిత్వము చెప్పిన కవయిత్రి శ్రీ హనుమాయమ్మగారే కనబడుచున్నారు.

ఈమె నెల్లూరుమండల కోవూరుతాలూకా చెన్నూరు గ్రామనివాసులు శ్రీ వెలగపూడి సుందరరామయ్యగారికి 1875 అగష్టుమాసమున జన్మించి బడినీడల నడుగిడకయే కాలము గడపినది. వెన్నెలగంటి నటేశ మను నాతని కిచ్చి చిన్న తనముననే వివాహ మొనర్చిరి. వివాహ మగుటయు. వితంతు నగుటయు వెంట వెంటనే తటస్థించినవి. తమ్ముడును మేనమఱదులును చదువుకొనుచుండగా, వారితో బాటు శ్రుతపూర్వముగా విద్యల పరిగ్రహించి రానురాను సంస్కృతమున బలమగు సాహిత్యజ్ఞానమును, ఛందోలంకార వ్యాకరణాది శాస్త్ర పరిచయమును బొందినది.

బాలవితంతు వగుట, చిన్ననాటనుండియు నేర్చిన సంస్కృత కావ్యాధ్యయనముచే ఆధ్యాత్మికజ్ఞాన మతిశయించి వైరాగ్యము కుదురుకొన్నది. నిత్యము గాయత్రి ననుష్ఠించునది. అద్వైతానుసంధాన మీమె నియమవ్రతము. గురుదత్తాత్రేయోపాసకురాలు.

సంతరించిన సాహిత్యజ్ఞానము, శ్రుతి నించిన శ్రుతిస్మృతి పరిచయము, అనుభూత మగు ఆధ్యాత్మికచింతనము ముప్పిరియై మోసులెత్తిన యీమె కావ్య పరంపరను వీరి పితృజ్ఞాతు లగు బాపట్ల నివాసులు శ్రీ వెలగపూడి దక్షిణాయన మూర్తిపంతులుగా రచ్చొత్తించినారు. కానియీమె గ్రంథసంచయ మిపుడు గానరా కున్నది:—

గృహలక్ష్మియందు ముద్రితములైన విషయములే యాధారము. అవి యీ క్రింది విధమున నున్నవి.

(1) పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ బ్రహ్మానంద సరస్వతీస్వామి వారి పాదుకాపూజనము- ఇది నిర్ణయసాగర ప్రెస్సునందు ముద్రితము. అందలి యొకశ్లోకముం జూడుడు.

"నిర్బీజాది సమాధిసంస్థితపదం నీవారశూకోపమం
నిష్పాపం నిగమాంతవేద్యనిలయం నిర్లేపకం నిర్గుణం
నిర్ద్వంద్వం నిరుపద్రవాత్మసదనం నిర్వాణదీపం నిజం
బ్రహ్మానందసరస్వతీ గురువరం మోక్షప్రదం తం భజే.

రెండవది-దత్తపూజాకదంబకం :— ఇది యంతయు కీర్తనల రూపమున నున్నది. దీనిని బొంబాయి ప్రకాశముద్రణాలయమువారు ముద్రించిరి.

మధ్యమావతి— జంపె.

లాలితి జగు రమర లలనా స్త్వందత్త
నారద స్త్వైకదా శ్రీబ్రహ్మసదసి
లోహచణకా భ్యూషపాకపరిశీలా
అత్రిజాయా పతివ్రతేతి ప్రశసంస

ఈ పూజాగీతములలో మేలుకొలుపు మొదలుగా సమస్తోపచారములతో మంగళాచరణమువరకును గలదు. ఈ పొత్తమును బొంబాయి కోస్తాలోని దత్తోపాసకులు బాగుగా మన్నింతురు. దీనియం దీమెసంగీత శాస్త్రజ్ఞానమును స్పష్టమగుచున్నది.

మూడవది:— శ్రీ జగద్గురు శంకరభగవత్పాదాచార్య పూజావిధి. దీనియందు ఆచార్యుల షోడశోపచారవిధి నిరూపితమైనది.

"భాష్యం వామకరే నిధాయ పరత శ్చిన్ముద్రియా బోధితం
ప్రాక్కుండీవర దండశిష్యసహితం పద్మాసనస్థం ప్రభుం
ఫాలే భస్మధరం సుధాకరనిభం రుద్రాక్షహారా ద్గళే
శ్రీమచ్ఛంకరపూజ్యపాద మనిశం ధ్యాయా మ్యహం సద్గురుం॥"

నాల్గవది:—శ్రీ మచ్ఛంకరభగవత్పాద సహస్రనామావళి:—

ఇందు మూడువందల యిరువది తొమ్మిది అనుష్టుప్పులు కలవు. 1021 నామములు. ఓంకారపూర్వ నమోన్తవములతో పరిగ్రహింపబడినవి. శ్రీ శంకరులు క్రీ. శ. 8 వ శతాబ్దము వాడని ప్రథితి. అప్పటినుండియు నాయన కిట్లు నామావళి గూర్చినవారు లేరు. ఆ భాగ్యమున కీ యాంధ్రవనితయే నోచుకొన్నది. ఈ ఈ పుస్తకము పూర్తి యయినపిదప శ్రీ బ్రహ్మానంద సరస్వతుల కందీయబడినది. దానిని వారు కాశీయందలి రామఘట్టములోని హితచింతక ముద్రణాలయమున ముద్రింపించి తాము పీఠిక వ్రాసి, యీమెను శృంగగిరిపండితులతో సమానముగ ప్రశంసించి గౌరవించిరి.

ఇంతే కాక, విశ్వామిత్రప్రోక్తమైన అధ్యాత్మరామాయణము నందలి శ్రీరామ భగవద్గీత లని ప్రసిద్ధి చెందిన శ్రీరామ లక్ష్మణ సంవాదమునకు తెలుగున టీక జేసిరి. ఇది యొకటే యీమె తెలుగుకృషి. గాయత్రీ స్తవమును మహాస్రగ్ధరావృత్తమున పుష్పమాలికా బంధముగ రచించినది.

"హంసస్థాం సత్యసంధా మగజగనిగమాధారతారస్వరస్థాం
గాయత్రీం యజ్ఞయజ్ఞాం సురనరవరదాం పంకజాం కంబుకంఠీం
సావిత్రీం విద్యవిద్యాం శ్రుతి మతిగతిదాం దేవసౌవర్ణవర్ణాం
వందేహం దేవదేవీం విమలమణిమయీం కుందసౌందర్యదన్తాం."

చూచితిరా-విషయ మెంత యాధ్యాత్మిక మైనను, రచన యెంత శివం సుందర మైనదో ! అబల పూనుకొని యిట్టి గ్రంథముల రచించుట యెట్టి పూన్కియో సమానధర్మ లెఱుంగగలరు.



# 44. చోరగుడి సీతమ్మగారు

వెనుక జెప్పిన కావ్యముల నచ్చొత్తించిన శ్రీ వెలగపూడి దక్షిణాయన మూర్తిగారి కుమారీమణి, శ్రీ వెలగపూడి సుబ్బారావు పంతులు (బావట్ల) గారి సోదరి సీతమ్మ యను నామె ప్రభావతీ ప్రద్యుమ్నము, మనుచరిత్రము మున్నగు వాని వచన కావ్యములుగ రచించినారు. ఈమె చోరగుడి వేంకటాద్రిగారి సతి. పౌత్ర్రము లిపు డెందునుగానము. ఈమె [illegible] పెండ్లిపేరంటములు తట స్థించిన నప్పటప్పటికి పాట లాశువుగ రచించి పాడెడిదట.



# 45. సీరము సుభద్రయాంబగారు

కవితావిశారద విశాఖపురీవాసులును, శతగ్రంథకర్తయు, కవిభూషణ బిరు దాంచితులును, జయపురసంస్థానకవియు, జయపురాధీశ్వర విక్రమదేవవర్మ మిత్రులును నగు శ్రీ సెట్టి లక్ష్మీనరసింహకవిగారి యగ్రసోదరి యీ సుభద్ర యాంబగారు. ఈమె ధాతనామవత్సరమున జన్మించి 14-3-1947న మరణించిరి.

(1) సురుచీవిజయ మను నాటకము, (2) శిరోమణి యను నాటకము, (3) శ్రీ వేంకటేశ్వర శతకము, (4) శ్రీరామశతకము, (5) ఉత్తరరామ చరిత్ర యను నిర్వచనకావ్యము, (6) సుభద్రారామాయణ బృహత్కావ్యము, (7) శుకజనక

సంవాదము, (8) ఆంజనేయ స్తోత్రాష్టాదశకము, (9) వ్యాసగుచ్ఛము, (10) జాగిలము అను నవలను నింకను ఉత్తరావిలాపము, రుక్మిణీసందేశము, గృహలక్ష్మి యను ఖండ కావ్యములను రచించిరి.

రామాయణమునందలి "స్వయంప్రభ, శబరి, వేదవతి" యను శీర్షికలతోడి పుట్టము ౘ కొన్ని యను నింకను గొన్ని ఖండకావ్యములును గృహలక్ష్మి యందు, భారతియందును ప్రచురిత మైనవి. జాగిలమను నవల ఫ్రాన్సునవల కనువాదము. సరస్వతీగ్రంథమండలివారిచే ముద్రితమై, ఒకప్పుడు విశ్వవిద్యాలయము వారిచే ఉన్నతతరగతులకు,పాఠ్యముగ గూడ నిర్ణయింపబడినది. ఇందు సుభద్రారామాయణ మింకను నముద్రితము. శ్రీ లక్ష్మీనరసింహంగారి కుమారులును, వీరి మేనల్లుడును ప్రస్తుతము జడ్జిపదవియం దున్నవారును నగు శ్రీ శివరావుగారు దీనిని ముద్రించు ప్రయత్నములు చేయుచుండుట ముదావహము. ఈ సుభద్రారామాయణ మొక్కటే సుమారు రెండువేలకు పైగా పద్యములు కలిగియున్నది. అందు యుద్ధకాండ మునునే వెయ్యికి పైబడి పద్యములున్నవి.

ఈమె రామాయణము రచనను పౌరాణికగ్రంథమై యున్నది. అటనట స్వయంప్రభ, వేదవతి యను శీర్షికల నున్న గ్రంథభాగము లుజ్జ్వములై కావ్య పద్ధతి నున్నవి. రామాయణమందలి పద్యముల కొన్నిటిని జూడుడు.

"ఉల్లము పల్లవింప మృదులోక్తులు పల్కుచు నా సమక్షమం
దల్ల కళానిధిం దెగడు నాస్యరుచుల్ వెదజల్లి నా కనుల్
చల్లగ జేయు నా యనుగు చక్కని రాము డరణ్యసీమలో
దల్లడ మందుచుం దిరుగ, దాల్పగలాడనె మేన ప్రాణముల్ ?

దశరథుని యుల్లమునందలి తల్లడమును వర్ణించిన యీ పద్యము నందలి స్వభావోక్తియు-

ప్రాణనాథ ! కంటె ! పసిండిలేడిహొరంగు
వేడ్క నించు సొబగు వింతహొయలు,
చంద్రులోని యిట్టి జగతికి దిగియెనో ?
కాక, యిట్టి మృగము గలదె ధరణి ॥

అన్న సీతాసతి వాక్యమందలి యుత్ప్రేక్షయు,

వాలివలన భీతి దూలెను, కిష్కింధ
నేలు భాగ్య మొదవె, నేను భాగ్య
శాలి, నింక నన్ను సరగున గావుము
రఘుకులాబ్ధిచంద్ర ! రామచంద్ర !

అను సుగ్రీవవచనమందలి ప్రసాదగుణము సంగ్రహరచనయు

రాము నే నెఱుంగుదు పరంధాము డనుచు,
మహిజ లక్ష్మి యటంచును మది నెఱుగుదు,
నాదు మరణంబు రాముచే నని యెఱుగుదు
నాచరించితి నిట్లు మోక్షార్థి నగుచు॥

అనుచున్న రావణుని యర్థవ్యక్తియు,

పాలవెల్లి దోచు పద్మాలయ యనంగ
ననలునందు వెలిగె నతులకాంతి.
సీతస్పర్శవలన శీతలుడై యుండె
పావకుండు సురలు ప్రస్తుతింప॥

అను సీతాసాధ్వి అగ్ని శుద్ధియందలి యుపమయు, నామె రామాయణమున కలంకారములై ఆమె రచనాసౌభాగ్యమును దెల్పుచున్నవి.

'స్వయంప్రభ' యందలి—

''వాడదు మేను సుంతయును, వన్నె తొఱంగదు మోముతేజముల్,
జూడ తరమ్ము కాదు, కడు జోద్యము ! సొక్కును స్రుక్కు లేక యీ
జాడ తపోవనక్రియలు సల్పినవారలు కానరారు, పూ
బోడులలోన నీగతి నపూర్వ మహత్వ మెటుల్ లభించెనో ?

రసప్రసన్నమును, సరసశయ్యారమణీయము నగు నిట్టి కవితాశ్రీ లభించుట ప్రాక్తనజన్మ తపఃఫల మనవలెను.

'వేదవతి' యందలి - వేదవతిని రావణుడు ప్రశ్నించు విధము-

వనితలమిన్న ! యెవ్వతవు ? పావననిష్ఠ వనీతలంబునన్
ఘనతప మాచరించెదు, జగత్త్రియమోహనమై తనర్చు నీ
తను విటు గాసివెట్టుటకు దావకవాంఛిత మెద్ది ? జన్మపా
వన మొనరింప నెవ్వనిని భర్తగ గోరి తపంబు సల్పెదో."

"ఈ యెలజవ్వనంపుజిగి, యీ సుకుమారత, యీ విలాస, మీ
సోయగ, మీ శరీరనవశోభ సురోరగమానవాళిలో
నే యలివేణులం దయిన నే మును గాంచగ లేదు, నిక్క మీ
ప్రాయము గాయ మిట్లడవిపా లగు వెన్నెల జేయ న్యాయమే?"

అందమైన యెత్తుగడ, చక్కని నిర్వహణము, ముచ్చటగా ముగింపును
ర్చు ఈమె పద్యము, లంచనడలవలె సుందరముగా నుండి ప్రత్యేకతతో
సించును.

ఇక వీరి ఉత్తమరామచరిత్రమును మహాకవి భవభూతి గొడుగునీడల
త్రిఛ్ఛాయల) లో నడిపించినది. భవభూతి "ఏకో ఏవరసః కరుణ ఏవ"
రూపించిన మహానుభాగుడు. సాధ్వి సీతమ్మ శోకమును ఆతడు వర్ణించెను
పిదళతి వజ్రస్యహృదయం అపిద్రవతి శిలాః" అని కాదా! ఆతడు వర్ణించెను.

అంత ప్రౌఢితో గాకున్నను, వీరును బాగుగనే రచించిరి.

అతిమృదులమును శీతలమై తనర్చు
నతివ ! నీ తనుస్పర్శంబు నందుకతన,
అతివిచిత్రసౌఖ్యము మేన నలమికొనుచు,
నంతరంగము హర్షాబ్ధియందు మునిగె''

అను పద్యమున శ్రీరామచంద్రుని రసచుళుకితమైన గాఢానుభూతి నిట్లు
మ్మగ వర్ణించిరి.

"ఇయంగేహే లక్ష్మీ రియ మమృతవర్తి న్నయనయోః
అసావస్యాస్స్పర్శోవపుషి బహుళశ్చందనరసః
అయంబాహుః కంఠే శిశిరమసృణోమౌక్తిక సరః"

అను శ్లోకమునకు స్వేచ్ఛానువాద మైన
"నాదు సౌభాగ్య సుఫలంబ ! నాదు కనుల
పన్నీరముల చెల్లి ! జాబిల్లి వెలుగ !
నాదు సౌఖ్యంపు పెన్నిధి ; నాదు జీవ
ధనమ ! ప్రియసతీ ! నా మనోధామనిలయ."

అను నీ పద్యమున నంత భావమును రాకున్నను, క్రొవ్విరుల కూర్పువంటి తెలుగునుడికారపు పనితనము ప్రశంసనీయమైనది—

వాల్మీకి యాశ్రమమున జనకుడు కుశుని కనుగొని—

"ఎవరివాడ వయ్య ? యిందీవరశ్యామ !
సుందరుడవు, సుగుణమందిరుడవు,
ముద్దు లొలుకుమోము, నిద్దంపుజెక్కులు"

అని ముద్దు ముద్దుగ ప్రశ్నించినాడు.

"ఎట్టెటు తెల్పుమా సఖుడ ! యెవ్వరితో నని సంభవించె ? నా
చిట్టి యనుంగుతమ్మునకు జెప్పు, మరాతుల మందజేసి భూ
మట్టి మొనర్తు భూపజనముం దగ నాశ మొనర్తు జూడ, నీ
పట్టున నస్మదస్త్రబలపాటవముల్ గని మెచ్చ నిర్జరుల్."

'ఎట్టెటు తెల్పుమా' అనే ఎత్తుగడతో, ఈ పద్యము సూటిగా వచ్చిన హృదయావేశమును తెల్పుచు సందర్భోచితముగ నుండుటే కాక, "భూమట్టి మొనర్తు' అనే పదమును వాడి, తెలుగుతనముచేత కూడ రచనను కైసేసినారు.

ఈ యుత్తరామచరిత్రమును మృతుడైన తమ పుత్త్రుడు సూర్యనారాయణగారి కంకితము చేసినారు. అంతేకాక, తమ సోదరుని శ్రీ సెట్టి లక్ష్మీనరసింహంగారిని చాలాచోట్ల కృతజ్ఞతతో స్మరించినారు. సురుచీ విజయనాటకమున కర్తపేరు—

ఎవరిపేరి వ్రాలె యీ పద్యపాదాక్ష
రంబులందున నలరారునో, మన
సెవరిగతుల కెల్ల నవనీతసమమొ, య
ట్టి భవనిభుని, నాదు విభుని దలతు.

అని భక్తిపూర్వకముగా స్మరించినారు —

రామశతకమందలి:—

నీ నామమంత్రజపమును,
పూనికతో జేసి మౌనిపుంగవు డగుచు౯
తాను వెలసె వాల్మీకి జ
గాన బ్రహ్మఋషి సమాఖ్య గని శ్రీరామా.

మధురాక్షర సంయుతమై,
విధిరుద్రనిరంతర పరితవిమలతరంబై
సదమల మగు నీ నామము
మదిలో స్మరియింతు సతము మానక రామా.

ఈ పద్యము లిట్లున్నవి. గృహలక్ష్మి యను మకుటమున త్రిమూర్తుల గృహలక్ష్ములను, హరిశ్చంద్ర సత్యవంతుల గృహలక్ష్ములను, పోషించి వ్రాసిన పద్యములు చక్కగ నున్నవి.

"అత డల్పాయు వటం చెఱింగియును, గాసంతైన జింతింప, కే
పతిగా బొంది పతివ్రతాత్వమున దత్ప్రాణంబులన్ బ్రోవ న
ద్భుత మైనట్టి విధంబున౯ ... ..."

ఇట్లే సురుచిరమై యున్నది. రామాయణమునందు తేటగీతలు, ఆటవెల దులను, కందములనే వాడి, వానియందు తమకు గల ప్రత్యేక ప్రావీణ్యమును జూపిరి.

ఇట్లే రసోదంచితములగు విపులకావ్యశ్రేణి నుత్పాదించియు, ప్రకర్ష మనిన నొల్లక, ప్రచ్ఛన్నముగను ప్రశాంతముగానే జీవితము గడపిరి. అందుచే వీరికి వీరి జీవితకాలమున గూడ రాదగిన పేరు రానేలేదని చెప్పనగును.

**'Poet is born, but not made'** అను నుడికి ఉదాహరణ ప్రాయలై మహిళాజనమాణిక్యమకుటమండనం బన నిట్టివారే కదా !

# 46. జ్ఞానాంబగారు

పతివ్రతయై, తత్త్వవేత్తయై, కవీశ్వరియై, పావనకృష్ణవేణీతరంగిణీ ఆరామాయమాన నా స్రోతస్వినికిని పవిత్రత చేకూర్చి, యీ కలియుగమున [illegible] ఆధ్యాత్మ జీవనమాధుర్యము రుచి చూపిన సార్థక నామధేయ శ్రీ జ్ఞానమాంబగారు. ఈమె శేషమాంబా సుబ్బరాయుల ప్రేమమల్లికా కుసుమ ముకుళమై మన్మథనామసంవత్సర వైశాఖ శుద్ధ ద్వాదశీ ఆదివారము (5-5-1895) న విజయ వాటిక జనియించినది.

జ్ఞానమాంబగారితల్లి మొదట సంతానము లేక బహువిధముల కుంది, పిదపవారు శ్రీ కనకదుర్గ నాశ్రయించి, యాదేవివరమున పుట్టు బిడ్డకా దేవి నామము నిడునట్లు బాస యిడి, యొక యాడుబిడ్డను గనెను. బిడ్డ భూమిపై బడినంతనే ప్రమోదప్రవాహమున మఱచి యామెకు దమకిష్ట మగు నేదో పేరును బెట్టిరి. వెంటనే పసికందు పాలు త్రావక రోదింప మొదలిడెను. అంత అపరాధమునకు చెంపలు వైచుకొని 'కనకదుర్గా వరప్రసాదిని' అని పేరిడిరి. అది మొదలా బాలిక శుక్లపక్షచంద్రకళవలె దినదినాభివృద్ధి నంది. యీడుబాలికలలో పాపటబిందువై సకలసద్గుణసంపన్న మైనది. అంతే కాదు- ఆమె శైశవచేష్టలు అతిజ్ఞాన యుతములై పెద్దవారికిని ఆశ్చర్యపడనంత సుగుణసంపత్తితో మెఱసినవి. ఔను! పువ్వు పుట్టగనే పరిమళించును గదా!

ఏకపుత్రికావిషయ మగుట, నామెను విడిచి యుండనేరక, జ్ఞానమాంబను తల్లి బడికి పంపకపోయినది. తొమ్మిదిసంవత్సరముల యీడుగల బాలికయై యామె తల్లితోడ స్వయముగ "అమ్మా! నాకు చదువు జెప్పింపు" డని యర్థించినది. అహహ- భగవద్భక్తుల చేష్ట లిట్టివియే. అంత నామెజనని తాను విద్యావతి యగుట. తానే బిడ్డను విద్యాబుద్ధుల చక్కగా దిద్దెను. అక్షరాభ్యాసమైన పదునైదు దినములకే యామె చక్కగా చదువను వ్రాయను నేర్చినది. చిన్నతనమునుండి యామెయందున్న ఏకసంథాగ్రాహిత్వము, ధారణాశక్తి, ప్రకృతిపరిశీలనము, అన్నింటిని మించిన పరమేశ్వరభావము నొండొంట తోడుపడి క్రమముగా నేపుసెంది యామె నుత్తమకవయిత్రిని జేసినవి.

ఈమె భూతదయాళుత్వమును గూర్చి ప్రత్యేకముగ గాథలుగ జెప్పు కొందురు. మొదటనుండియు జీర్ణమంగేసుభాషితమై, పూవును దావి పొదుగుకొన్న, ట్లామె నావరించియున్న పరమేశ్వరభావము క్రమక్రమముగా నభివృద్ధి గాంచుచుండ నా స్వయంవిజ్ఞానముతో దనివిసనక తన పన్నెండవయేట దైవయోగమున శ్రీ రంగావధూతగారి శిష్యులు శ్రీ సీతారామావధూతగారిని గురుదేవులుగా బడసి శుశ్రూష సలిపి, భవబంధమును రోసి, తనకు చిన్ననాటనే తలిదండ్రులు బలాత్కారముగా తగిలించిన పరిణయలౌకికబంధమును దెగగోసి సన్న్యసించిరి. అవల కనకదుర్గకొండలలో గొన్నియేండ్లు తపస్సు చేసి, తమస్సును ద్రోసి, గుహాముఖము నుండి జ్ఞానజ్యోతియో యనునట్లు నిర్గమించి, గురుదేవులచే 'జ్ఞానాంబ' యని యన్వర్థాభిధేయమున నాశీర్వదింపబడిరి.

ఇట్టి పూతచరిత్ర రచించిన గ్రంథములు మిక్కిలి కొలదిగనే యుండుట మన భాగ్యమో, భాగ్యహీనత్వమో?

దేవుడు, విజ్ఞానామృతము, కాశీప్రసాదిని, రంగావధూత, సత్ప్రభు శతకము, గార్గి యనునవి వీరి రచనములు. ఇందు నాకు దొరికినంత వఱకు విమర్శింతును.

ఇందు 'దేవు' డను చిన్నిపొత్తము గీతమాలిక. దీని శక్తిప్రాభవములు వర్ణనాతీతములు. పిట్ట కొంచెమైనను కూత ఘనమనునట్లు, కొలది యిడరాని ప్రభావసంపద కల యీ సద్గ్రంథమును నాసాంతము చదివి యానందింపు డని పఠితలను హెచ్చరించుచు కావ్యవిమర్శకు పూనుకొందును.

ఇది ప్రశ్నోత్తరపూర్వకము--

"అక్కరో! దేవు డెవ? డాత డెక్క డుండు?
చేత లెట్టి? వాకార మేరీతి దమ్మ ?
తలకు నొక్కట నా దగి పలువురైన
దేవతల గొల్తు, రిం దాదిదేవు డెవడు ?

... ... ... ...

ప్రాణిసంఘంబు జన్మించు వానిలోనె
ప్రాణికోటులు జీవించు వానిలోనె

... ... ... ...

శ్రేష్ఠతమ మధ్యమాధమ సృష్టి లన్ని
దాడిమఫలంబులోపల దాగియుండి
పొఱలు పొత్తులయరలతో వరలు బీజ
సమితివోలె. దేవునియందె యిమిడియుండు–

... ... ... ...

దేవు డెచ్చటో కల, డదే త్రోవ నేగి
దర్శనము చేయవలె నని తలచువారు
ఆకసము నెత్తిపై నున్న దనెడివారు,
ఏకరల జూచినను చుట్టు నాకసంబె,
కాక, వెలుపల లోపల నాకసంబె,
లోకముల కాలవాల మా యాకసంబె,
నీకు నాకును నడుమ నయ్యాకసంబె,
కాని, మన మాకసము నెంతొ, పైన నెంతొ
దూరమున నొకింతేనియు జేరరాని
స్థానమున గల దని యెంతుమేని. యదియు
దేవు నెందొ వెదకువారి తెరగెయగును;
కనుల కగపడని యాకార మనుజ !
కనుల కగపడకున్నను గానబడెడు
సకలవస్తులకంటె విస్పష్ట మగును?
మన మనోనేత్రమున కెద్ది గనబడెడిని
దేవదేవుని రూపంబు నీవు గనుమ
కన్నులకు గోచరము కాని దెన్నరాని
దన్న నుడి భ్రాంతిజన్యమో యనుజ వినుమ

ప్రేమ కే మైన రూపంబు పెట్టినామె ?
ప్రేమ నెఱుగనివార లీ పృథివి గలరె !
కన్నులకు ప్రేమ యెట్టిదో కానరాదు,
కుక్క కూడను ప్రేమను గుఱుతుపట్టు,
కన్నులార నీ వింతను గాంచలేదె ?
ప్రేమధాముని దేవు దర్శింపలేవె?

పండువెన్నెల విరిసినట్లు, బొండుమల్లెలు మెఱసినట్లున్న ఈ కావ్యపు విలువ యింత యని కొలది యిడరానిది. కావ్య మంతయు నిట్లే సలలితమై, అద్వితీయమై ధారావేగముతో విశుద్ధమై, వినువారిని కనువారిని నానందమున ముంచియెత్తును. దైవత్వమును దైవతత్త్వమును ఎంతో తేటమాటలతో తెలివైన యూహాలతో నెవరును నాస్తికులైనను కాదనలేని వాదనాసామర్థ్యముతో ప్రతిపాదించినది.

గ్రంథమునం దింకను నిట్లే యరటిపం డొలిచి యరచేత నిండిన ట్లనేక తత్త్వములను తత్త్వార్థములను వివరించినది.

విజ్ఞానామృతము శతకమువలె రచించిరి-
దేహ మస్థిర మని తెలుపవచ్చునుగాని,
దేహముపయి వాంఛ త్రెంచ వశమె ?
చెప్పవచ్చు గాని, చేత యసాధ్యమౌ
స్ఖలనరహితచిత్త ! జ్ఞానమాంబ !
సురభిళముగ నున్న సుమరసంబును గ్రోలి
తేటి యితర మేది తిననిరీతి,
జ్ఞాని యన్ని విడచి యానందమున నుండు
స్ఖలనరహితచిత్త ! జ్ఞానమాంబ !
ఉర్వి విత్తనముల నుంచ నుత్పత్తియౌ
నగ్నియందు వేయ నంతరించు
చెడుమది జెడు నీతి చెలగు మంచి మదిని ॥స్ఖ॥
స్వానుభవము లేని జ్ఞానవాక్యములను

ఆంధ్ర కవయిత్రులు

పలుకుపలుకు గలుగు ఫలితములును
తెలిసి ఫలము రుచిని తెలుపునట్టి దగును ॥స్థు॥

ఉపమాలంకారసంయుతము లగు ఆటవెలదులనోట తత్త్వబోధ చేయించిన యీ శతకమును గూర్చి వివరింపవలె నన్న వేమనశతకమును వివరించినంత గ్రంథము వ్రాయవలెను. మూడు చిన్నపాదములలో ముక్తసరిగా నెంత గభీర తత్త్వమును ఇమిడ్చి చూపిరో వేత్తలగువారి కే యాశ్రమ యర్థమై యానందము నిండును. ఉత్తమబోధకు లగు రామకృష్ణ పరమహంసాదులవలె ఉపమసాయమున దుర్గ్రాహ మగు తత్త్వ విషయమును సుగ్రహ మొనర్చిరి. పతితపావన మగు గంగా ప్రవాహము బోలిన ధారతో నలరారిన నిట్టి పద్యము లెన్ని చూపినను నాకు దనివి తీరదు. కాని గ్రంథ విస్తరణభీతిచే నాగవలసి వచ్చుచున్నది.

కాశీప్రసాదిని - ఇది కూడ శతకమే.
ఏమార్గమునందు నిలిచిన
నామార్గమునందె నడచి యది విడలేదా
నీ మనసు నెఱిగి నిర్మల
మౌ మార్గమునందె యుంచ దగు నో బాలా !
నీ ధ్యానమె నా జ్ఞానము,
నీ ధ్యాన మఖండజ్ఞాన నిత్యానందం
నీ ధ్యానమె నా సౌఖ్యము
నీ ధ్యానమె నాకు ముక్తి నిజముగ కాశీ.

ఇందలి కొన్ని లక్షణదోషములు జూడ, యిది వీరి బాల్యరచనగా కనబడు చున్నది. ఐనను నడిమిదియు తత్త్వవైశేషయికమే. ఇట్లు వీరు ఏమి వ్రాసినను, కోవాతో నే వస్తువు చేసినను నందుండి క్షీరశర్కరాదుల మాధుర్యము తొంగిచూచునట్లు, వీరి యాధ్యాత్మికహృదయసంస్కారము తొంగిచూచుచు బ్రహ్మానందప్రదముగ భాసిల్లుచుండును.

ఉపదేశమునకు బోధనాపాటవ మున్నంత మిక్కిలి యరుదు. ఈమె యందట్లు నా బోధనాపాటవత్వ మతివేలముగ గన్పట్టుచున్నది.

సరళవర్తనయు, మితభాషిణియు, వినీతవేషయు, నూర్జితతేజస్వియు, నగునీమె కమనీయభాషలతో కల్ల కపటములు లేక శ్రోతల యుల్లము రంజిల్లునట్లు హృదయపార్వణముగా భరతఖండమందలి పూర్వపు మౌనుల పద్ధతులు స్మృతిపథమున వెలయునట్లుద్బోధము సేయుచుండ చూచినవారిదే పుణ్యము; వినినవారిదే భాగ్యము. కాని, యిపుడు వ్రాయ నలవికాదు. కడపటిరోజులలో నామె బ్రాహ్మమత ప్రవిష్టయై ౫, ౬ వర్షములకుపూర్వమే శాంతినిర్వాణము నందినది. ఆ బ్రహ్మసామాజికమత ప్రవిష్టయైనపుడే దేవుడు, విజ్ఞానామృతము, సత్ప్రభుశతకము ననునవి రచించిరి.

'స్వయం తీర్త్వా పరాం స్తారయే' త్తను నుడి బాగుగ గ్రహించి తన చుట్టును గల్మాషిత మైన ప్రజాజీవనము నుద్ధరింపవలె నని పాటుపడిన యీ పరహితమతికి జాతియంతయు యంజలి బంధించి మ్రొక్కినను ఋణ మీఁగదు.



# 47. కర్రా సుబ్బలక్ష్మమ్మగారు

విద్యమానకాలమున ప్రవర్తమానయై, సముద్యత్కావ్యజనయిత్రియైన శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి కన్నతల్లి కర్రా సుబ్బలక్ష్మమ్మగారును కవయిత్రియే. కడపమండలములోని చెయ్యేటిదరి "శేషమాంబాపుర" మీ యిల్లాలి పుట్టినిల్లు. వీరి పూర్వులు సకలశాస్త్రపారంగతులు. కర్రా రామశర్మగారీమెను పరిణయమాడిరి. వీరు తొల్దొల్త తిరుపతిని కాపుర ముండెడివారు. తరువాత కాళహస్తికి మారిరి. ఈమెకవిత్వమున నగపడు శివకేశవాభేదమునకీ కాపురమే కారణము. తిరుపతియందున్నప్పుడు, శ్రీ నాగపూడి కుప్పస్వామయ్యగారి శిష్యత్వమున కావ్యశిల్పము నెఱిఁగి "చంద్రకళావిలాస" మను ప్రబంధమును రచించినది. అందలి శైలికి-

"హరి పలికించినంత, గురు డానతియిచ్చినయంత, బ్రాహ్మణన్
గరుణను గారవించి యెసకంబున వాక్కు లొసంగినంత, నే
ర్పరసి పఠించినంత, వినినంత, గనుంగొనినంత, కూర్తు నీ
చరితము పొల్పు నా రవినిశాకరతారక మౌచు నిద్ధరన్."

ఈ పద్యమునుబట్టి యీమె కడు ధీర యనియు, మంచికవిత చెప్పగలదై యుండియు, తన్ను గూర్చి మించులాడ దనియు, ఒకరి మెప్పుల గోరునది కాదనియు, ఆకర్షణల నాశించ దనియు తెలియుచున్నది.

ఇందలి యితివృత్తము కర్మసిద్ధాంతము. సంచితారబ్ధాగాములగు కర్మలవైఖరి నిందు చేర్చి యొక రాజుకథ నల్లి, అం దెన్నొ యుపకథల జేర్చి కావ్యగౌరవము ఘటించినారు. చదువుచున్నంతసేపు నవలవలె నింకను చదువవలయు నని యని పించును. దీనిని కొంతకాలము విద్వాన్ పరీక్షకు మద్రాస్ యూనివర్శిటివారు పాఠ్య గ్రంథముగ నుంచిరి. ఈమె 1919 లో పుణ్యవతిగనే మరణించిరి. వీరి భర్తయగు శ్రీ రామశర్మగా రిపుడు కాళహస్తియందు సన్న్యాసాశ్రమమున నున్నారు.

---

# 48. గ్రంధి మాణిక్యాంబగారు

రాజమందిరపు నివాసులును, శైవారాధనోత్సుకులును, లింగార్చనాపరులును నగు శ్రీ పందిరి వీరన్నగారి జ్యేష్టపుత్రికయు, కీ. శే. గ్రంధి నాగరాజుగారి ధర్మపత్నియునగు మాణిక్యాంబగారు రచించిన 'గురుమౌళి శతకము' అను పొత్త మొకటి కనబడుచున్నది. ఇది యంతయు శైవమత ప్రవచనముగా నున్నది.

"ధర్మార్థకామముక్తుల
మర్మంబుల యుక్తి దెలిసి మనుదురు సుజనుల్,
నిర్మలమతి గీ తెఱుగని
దుర్మార్గులు వనట బొందుదురు గురుమౌళీ."
"మూలాధారమున గనక
లీల మఱి కనత్ప్ర వాళలీల భ్రుకుటియం
దోలిఁ స్ఫాటికలీలున్
నీలో భావింత్రు నిన్ను నిజగురుమౌళీ.'
శతక మంతయు నిట్లే యున్నది.

(౦)

# 49· కాళ్లకూరిమహాలక్ష్మీ సుందరాంబగారు

M. A. (డబుల్) L. S.

సంస్కారపరాయణురాలై, శ్రీ వీరేశలింగము పంతులుగారి శిష్యకోటిలో నొకరై, హిందూసుందరిపత్రికా స్థాపకురాలై పేరొందిన శ్రీ బాలాంత్రపు శేషమ్మ గారికిని, సుందరరామయ్యగారికిని 1914 (ఆనందనామసంవత్సరము) లో మద్రాసునగరమున లేక లేక కలిగిన ఏకైకపుత్రిక.

ఈమె పేరునకు తగినట్లు మిక్కిలి సుందరి, మిక్కిలి ప్రజ్ఞావతి కూడ. ఇరువదిరెండేడ్ల వయసునకే M. A. డబుల్‌కోర్సులు ద్వితీయ శ్రేణిలో పూర్తి చేసినది. పదునాలుగువత్సరముల పూపప్రాయముననే సాహిత్యశిరోమణి ఎంట్రన్సు పరీక్షలో కృతార్థత గాంచినది. హిందీ రాష్ట్రభాషాపట్టము కూడా పొందిన దనుట ఈ ప్రాభవశాలిపట్ల యేమంత గొప్పవిషయము? 1937 సంవత్సరమున B. A.

ఆనర్సుకోర్సు పూర్తిచేసి మద్రాసు సెంట్ థెరిస్సా హైస్కూలులో ప్రధానో పాధ్యాయులుగా పని చేసినది. 1940 లో M. A. పరీక్ష పూర్తి చేసి తనకు గురువును తన శ్రేయోభిలాషియు నగు శ్రీమతి కం. కనకమ్మగారి ప్రోత్సాహముతో ప్రెసిడెన్సి క్వీన్ మేరీస్‌కళాశాల ఆంధ్రోపన్యాసకురాలుగా కొలదిమాసములు పని చేసినది. ఈమెకు కల విద్యాభిలాష చెప్ప శక్యము కానిది. ఆజీవము నీమె విద్యార్థిగానే యుండిపోయినది. ఇంత విద్యాభిలాషతో నితరము నొల్లక గజిబిజి పడుచున్నను, ప్రేమించి పెండ్లాడినభర్తను బంధువులను సముచితమర్యాదల నాదరించెడిది. నిమిషములో గృహకృత్యముల నన్నిటి దీర్చుచుండెడిది. వీరిభర్త శేషయ్యగారు, వీరి ప్రబోధసుధాకరమునకు, రచించిన పీఠికవలననే యీమె గుణమహత్త్వము వర్ణనాతీత మని తెలియగలదు.

చిన్నతనముననే యింత బుద్ధిప్రాభవము జూపి పెద్దయైనవెనుక తల్లిగారు కాకినాడయందు స్థాపించిన సంస్థ లన్నిటిని వృద్ధికి దెచ్చి యాంధ్రదేశమున మించు ఖ్యాతి నార్జించగల దని యందఱకు నాశలు పెంచి పెంచి- తన బ్రతు కొక కనకపత్త్రాకవ్యగీతిక యనునట్లు బ్రతికి- హఠాత్తుగ నీ సుందరమ్మ తన 25వ యేట నందఱ యాసలు ద్రుంచి పరలోక మేగినది.

ఈమె చిన్నప్పటినుండి అలవోకగా సంస్కృతమున శ్లోకములు చెప్పెడిది. ఆంగ్లమున కూడ మనోహర మగు కవిత్వము చెప్పెడిది. ఆంగ్లోపన్యాసములు, సంస్కృతోపన్యాసము లన్న నీమెకు మంచినీళ్ళ ప్రాయమే. ఎన్నియో వ్యాసములను వ్రాసి యెన్నియో పత్రికలలో ప్రచురించినది. శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారి హంసవిజయమును సంస్కృతీకరించినది. కాని యింకను నిది యముద్రితమే. శంకరభగవత్పాద విరచిత మగు 'ప్రబోధసుధాకరము' ను ఆంధ్రమున వచన గ్రంథముగ జేసిరి. 'మహిళామర్యాద' యని సంస్కృతమున గొన్ని శ్లోకములు రచించిరి. ఆంగ్లమున "**Danger Zones of young woman**" అను గ్రంథము రచించిరి.

ఇంకను నామెను భగవంతుడు చిరాయుష్మతిగ దీవించియున్నచో, సంస్కృతాంధ్రాంగ్లములలో నెట్టి యద్వితీయ కావ్యశ్రేణిని వెలయించి యుండెడిదో? ఈమె

చనిపోయినప్పుడు తెలుగుదేశమందలి యెందఱెందఱో గాఢ మగు ననుతాపమును వెలిబుచ్చియుండిరి. ఇంక ఈమెకు కడు గూర్చువారగు శ్రీమతి కనకాంబగారి శోక విషయము చెప్పనక్కఱయే లేదు.

మహిళామర్యాదః—

లీలాకప్త జగజ్జాలే బాలే । బాలార్కభాసురే
అంబ తే పదసాలంబే । పుల్లాంభోరుహలోచనే—
జ్ఞానాంబాలతికాలంబం । సచ్చిదానందకల్పకం
మామకం దేశికం వందే । సందేహధ్వాన్తభాస్కరం॥
మర్యాదా ప్రోచ్యతే స్త్రీణాం । మాయామోహితచేతనం
మహాలక్ష్మ్యమయాసద్యః । ప్రబోధాయ యథావిధి॥
మర్యాదాహేతవోనార్యః । భారతే ధర్మసేతవః
కులసంరక్షకానూనం । కాంత సంతాన శిక్షకం॥

ఇట్లు సుగమములై సురుచిరములై యున్న వీ శ్లోకములు. అమృతానంద నాథ జయంతియం దొనర్చిన త్రిలింగపీఠ ప్రస్తావము—

"సువర్ణపుష్పగ్రథనే ప్రవీణామ్
శ్రీజీవయాత్రాదిక కావ్యకర్త్రీమ్
దిగంతయశోవిశాలామ్
తాం నౌమి వాణీం మనుమంత్రమూర్తిమ్.
కారుణ్యపూర్ణాం మృదువాక్ప్రవీణామ్
త్రిలిఙ్గపీఠార్చిత పాదపద్మామ్
శ్రీసచ్చిదానంద గురుస్వరూపామ్
నమామి దేవీం త్రిపురాం హృదిస్థామ్.
విదుషా మర్చనే సక్తాన్ । గురుపాదార్చనే రతాః
భక్తచిత్తారవిందానాం । మిత్రభూతాన్నమామ్యహం
కృష్ణవేణీతటేపూతే । స్వర్ణదుర్గాపదాంతికే
మహావిద్యాఖ్యపీఠో యం । త్రిలింగేషు ప్రవర్ధతామ్.

—: కీ. శే. మాడభూషి చూడమాంబా ప్రశస్తి :—

శ్రీమాకారాహృదయసదనాక్రాంత మాకాంతకాంతా
రౌద్రీమూర్తిః పరహితపరా సాత్వికీ లోకమాతా
[illegible] స్తోత్ర సంపూరితాస్యా
చూడారత్నం సకలగణితం కాకినాడేందిరాయాః.

పరోపకారాయపరాపవాదం
వపుర్వ్యహంతీ గురుకార్య సిద్ధ్యై
కృతీసతీ స్వాత్మపదం ప్రపేదే
నిమిత్తజన్మా ఖలు చూడమామ్బా.

ఇక వీరి ఆంగ్లకవిత్వము:—

# Flower Garland

**(From the T elugu Flower Garland of** Kavitilaka
**K. Kanakamba Garu)**
By the Late
**Mrs. K. Ma halakshmi Sundaramma, M.A.L.T.**

## The Hot Western Gale

Lo! the gale of the west is laden with dust,
Even the eyes of the wise cannot see the ways;
At every step there is a false step,
With his back to the East and face to the west,
The pilgrim advancing against the wind
Cannot catch the voices behind;
The heart is dried and the face is fried,
Dragging along the weary way,
Sin or merit he spends the day.
Not a drop the tongue to wet
Not a tree the head to protect.

## The Tree

The Tree stands bare ;
The leaves are rare
Worms unseen eat the roots,
Shrivelled up are the off-shoots
Fruit unripe the monkeys pluck.
Tanks and wells sunrays suck
The trunk is swinging,
The whirlwind singing,
Here and there is blossoming
A flower with sweet aroma quickening
Pilgrim ! take the perfume,
To all quarters, to every homc.



## 50· వింజమూరి వెంకటరత్నమ్మగారు

సుప్రసిద్ధకవులు శ్రీ వింజమూరి లక్ష్మీనరసింహంగారిసతి, సుప్రశస్త కవి శేఖరులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సోదరియైన శ్రీమతి వింజమూరి వెంకట రత్నమ్మగారు 1889వ సంవత్సరమున పిఠాపురమందు శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రిగారి కుమార్తెగా జన్మించిరి. ఈ తమ్మన్నశాస్త్రిగారు పీఠికాపురాస్థానకవి వరేణ్యులు; నయనోల్లాసాద్యనేక గ్రంథకర్తలు.

వెంకటరత్నమ్మగారు 1914 నుండి 1920 సంవత్సరమువఱకు 'అనసూయ' అను పత్రికను నడిపి సంఘసేవ యొనర్చిరి. అనేకపత్రికలలో కథలు, వ్యాసములు, పద్యములు ప్రచురించియుండిరి. వీరు చిన్నతనమున నరసాపురం

ప్రోగ్రెస్సివ్ యూనియన్‌వారి విజ్ఞానచంద్రికామండలివారి పరీక్షలలో నెగ్గి ఘనముగా బహూకరింపబడెరి. కాకినాడలోని స్త్రీసమాజ, స్త్రీప్రార్థనాసమాజాలకు కార్యదర్శినిగా చాలకాలము పనిచేసిరి. పుట్టినది పూర్వాచారపరాయణ కుటుంబమైనను, ఆధునిక విజ్ఞాన సంస్కారస్రవంతిని జీవనము మలపిన మాననీయ.

వీరి నివాసము మొదట పిఠాపురము, తరువాత కాకినాడ. ఈ నడుమ వీరు సకుటుంబముగా మద్రపురియం దుంచుచున్నారు. వీరి పుత్రికలు శ్రీమతులు సీతా అనసూయలు జగ మెఱిగిన ఉత్తమ గాయకురాండ్రు. మంచి విద్యావతులు. ఈనడుమ వీరు మఱల కొన్నినాళ్ళు అనసూయపత్రికను నడిపి మానివైచిరి.

వీరి రచన లెన్నో గృహలక్ష్మియందు ప్రచురితము లగుచుండెడివి. అందుండి యొకటి యుద్ధరింతును.

ఉదయకాలమందు ధరణియు జలనిధియు
నినునికాంతికి ప్రతిఫల మిచ్చునపుడు,
ఇలువిడిచి కడు నుత్సాహహృదయ నగుచు
ప్రేమరాజ్యము న్వెదుకంగ వెడలియుంటి.
కవివరు నొకండు దారిలో గానుపింప
నచ్చటికి నడ్డుదారి యే దని యడిగితి.
రమ్ము నావెంట కొలదికాలమ్ములోన
కాంతు వద్దాని సౌధశిఖరము గాంతు,
వనుచు నతడు ప్రత్యుత్తర మప్పు డిచ్చె.
అంతలో దవ్వునం దొక వింతపురము
తోచె మిఱుమిట్లు గొల్పెడు ద్యుతులతోడ.
"అదుగొ నీవు గోరున" దంచు నతడు పల్కె
కాని, యది స్వప్నముల రాజధాని యగుట
నామది చివుక్కు మనె, నాశ నాశ మయ్యె:
ఇట్టు లెంతయో తిరిగి ......"
కడ కొక గుడిసె చూచి నే వెడలి సుంద
రాంగి నొకతె గాంచి యడుగ, ననియె నిట్లు,

"దానిగూర్చియు నే వింటి గాని, నా ప
దములు గృహరాజ్యసీమ వదలవు గాన
దాని కేగు మార్గ మేదియు నే నెఱుంగ''
అనుచు నిట్టూర్పు విడిచె నా యతివమిన్న,
ఏను తత్కటీరము గంటి నెంతొ శాంతి,
అ యువతిమోము కలకల నాడుచుండె,
గొప్పవెల్గు నాయాత్మకు గోచరించె.
ఇల్లె ప్రేమరాజ్యమ్మున కిక్క యంటి.

నిరాభరణభూషి యగు సహజసుందరివలె నున్నది వీరి కవిత్వము. వీరు 1950 ఆగష్టు 24 వ తేదినాడు మద్రాసులో తమ్ముడు కృష్ణశాస్త్రిగారి యింట చనిపోయిరి.



# 51· ఆచంట సత్యవతమ్మగారు

గృహలక్ష్మి ముఖ్యరచయితలలో శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారొకరు. నిజముగ నాధునిక కాలమున శ్రీ కేసరిగారి గృహలక్ష్మిపత్రిక స్త్రీలోకమున కెంత జీవమును జవమును నిచ్చినదో వాకొన్న దీరదు. అది కేవల పత్రిక కాదు, మహిళలపాలిటి కేవల కల్పపత్రికయే. ఆ పత్రిక నాలంబముగా జేసికొని యెందఱో అక్షరపరిచయము లేని ఆడువారు సహితము క్రమక్రమముగా సాధన చేసి కవనము చెప్పునంతటివారైరి. విడువక గృహలక్ష్మిని చదువుచో, నిట్టి క్రమపరిణామము పొందినవారెందఱో కాననగుదురు.

శ్రీమతి సత్యవతమ్మగారు గృహలక్ష్మి చిరకాల రచయితలలో నొకరు.

వీరు సునందిని యను నవల రచించిరి. పత్రికాముఖమున నెన్నో కథలు, వ్యాసములు, పద్యములును ప్రచురించియున్నారు. వీరి పద్యములలో కొన్ని మచ్చునకు—

"ఆషాఢమాసంబు అల్లునకు ప్రీతి;
శ్రావణమాసంబు చానలకు ప్రీతి.
అల్లుళ్ళ కాంక్షనము లలవి లే వెన్న;
ఆడపిల్లనిచ్చువాడు హత మగునట్టి
జామాత బహుమతులు చాలగా గలవు;
తారకావళుల్ మేన ధరియించి జగతి
శోభస్వరంబుగ సొంపారు ప్రకృతి
శ్రావణంబు వచ్చె చాన లందఱకు
బాజు మట్టె మలిపి పూయింత్రు వెల్ల—"

ఈ విధముగా వీరి పద్యము లతిసామాన్యముగా నున్నవి. అయితే, యేదో ఒక అంశమును తీసికొని గృహలక్ష్మిలో వీరు పద్యము వ్యాసము వ్రాయని మాసము లేదు. అంత ఓర్పుతో సాగించిన వీరి ఉపయోగము అభినందింప వలసినదే.

---

# 52. ఆ. రాజాంబగారు

సంస్కృతమున పద్యగద్యములలో 'చంద్రమౌళి' యను పొత్తమును 'చంపకమాలిని' యను తెలుగునవలను రచించిరి. వీరి చంద్రమౌళి బాగుగ నున్నది. లోకానుభవజ్ఞానము, అనేక శాస్త్రపరిజ్ఞానము, నాగరికతాదోషగుణము, నవీన సంస్కారప్రభావము, మూఢాచారవిలాసముతో గ్రంథము కల్పితేతివృత్తమై యున్నది.

కవనము దివిజగంగాప్రవాహ మని, శైలి సర్వజనహృదయంగమ మని విమర్శకులు ప్రశంసించిరి. ఈమె కర్ణాటభాషలో కూడ గ్రంథములు రచించిరి.

# 53· పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు

శ్రీ వీరేశలింగముగారి ప్రతికక్షి యగు శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారి శిష్యురాలు. సావిత్రి పత్రికా సంపాదకురాలు. సంఘసంస్కారమున శ్రీ వీరేశలింగముపంతులుగారికి వ్యతిరేకపక్షమునా రైనను, స్త్రీవిద్యాప్రచారమున వీరును నిరుపమాన సేవ చేసియుండిరి. వీరు కాకినాడ వాస్తవ్యులు. ప్రమాదినామ సంవత్సరమున (1878) జన్మించిరి. శ్రీచింతలపూడి నీలాచలంగారు తండ్రిగారు. తల్లి అగ్గమాంబగారు. వీరి మాతామహి పితామహవంశములు రెండును కవిపండితభక్తవంశములు. వీరిపితామహులు కవీశ్వరులై, యోగీశ్వరులై సిద్ధిపొందిరి. వీరిమాతామహులు నడుకుదుటి రామన్నకవిగారు ప్రసిద్ధకవులు. 'వీరమణి' మున్నగు పద్యకావ్యములు రచించియు, విమర్శకాగ్రేసరు లని పేరుపొంది సుప్రసిద్ధులైన శ్రీనడకుదుటి వీరరాజు పంతులుగారు వీరి మేనమామలు. స్త్రీవిద్యాభిమాను లగు పులుగుర్త వెంకటరత్నం పంతులుగారు వీరిని పెండ్లియాడిరి.

ఇట్టి వాతావరణమున పెరిగిన శ్రీమతిగారు బాల్యమునుండియు పాఠశాలల కేగకున్నను, మంచి సాంప్రదాయిక మగు విద్యావిజ్ఞానముల నార్జించి తమ పదునేనవయేటికే "మహిళాకళాబోధిని" యను కావ్యమును రచించిరి. ఇంకను జనానా పత్రికయందును, హిందూసుందరిపత్రిక యందును అప్పటప్పట వ్యాసములు వ్రాయుచుండెడివారు. వీరు హిందీ వంగభాషలయందును పాండిత్యము కలిగి ఆ భాషలనుండి కూడ పొత్తముల ననువదించిరి. అనేకసభల కగ్రాసనాధిపత్యము వహించుచుండెడివారు. ఆంధ్రదేశముందలి ప్రథమ స్త్రీసమాజమును "విద్యార్థినీ" సమాజ మను పేరున కాకినాడయందు స్థాపించినట్లు వీరువ్రాసిరి. తరువాత దానిని శ్రీ బాలాంత్రపు శేషమ్మగారు పాలించిరి. తరువాత 1904 సం॥న 'సావిత్రి' యను పత్రికను స్థాపించి ఏడెన్మిది సంవత్సరములు సమర్థతతో నడిపిరి. ప్రస్తుతం వీరి డెబ్బదిమూడువర్షముల ప్రాయమున కాకినాడలో ఈశ్వరధ్యానముతో విశ్రాంతి గైకొను చుండిరి.

వీరి రచనలు బహుళములు— (1) యోగీశ్వరి రెండుభాగములు, (2)అన్నపూర్ణ (యోగీశ్వరీ అనుబంధము) రెండుభాగములు, (3) వామనపురాణము (ఇదివీరిమేనమామగారి పురాణమాలా గ్రంథమాలలో ప్రచురితమైనది), (4)మహిళాకళాబోధిని, ఇవి పద్యకావ్యములు. (5) మంగళహారతుల శతకము (కీర్తనలు), (6) సుభద్ర, (7) చైతన్యస్వామి, (8) సత్కథావల్లరి, (9) అమరవిజయము, (10) కమలాకుమారి, (11) లోకబాంధవి, (12) కామమంజరి అనునవి గద్యములు. ఇందు నవలలు, చరిత్రలు, కథలు కలవు.

ఇంకను పద్యగ్రంథము లీరీతిగా నున్నవి—

(13) స్త్రీనీతిగీతములు, (14) సతీధర్మములు, (15) నీతిపదములు, (16) అమూల్యము-మధుపద్యయము, సుజ్ఞాన నవరత్నములు, సరస్వతీ పరిదేవనము అను పద్యకావ్యముల సంపుటి - ఇందు ద్విపదలు పద్యములు కలవు. ఇవికాక, ఇంక నెన్నో ప్రస్తావికముగ వ్రాసినవి వీరి సావిత్రియందు దొరకును.

కాని వీరిదగ్గఱ కూడ అన్ని పుస్తకములు లభింపకున్నవి. కవిచరిత్రవ్రాసి, కవుల జీవితములు లభించుటకు సుస్పష్ట మగు నాధారములు లేవని కటకటంబడిన శ్రీ పంతులుగారియుగమున ప్రవర్తిల్లిన యీ మహిళామతల్లులలో చాలమంది గ్రంథములు ఒక ఏబదివర్షముల పిమ్మట. ఇపుడే కండ్లబడకుండుట శోచనీయాంశము. అది ముద్రణాసౌకర్యము గలుగుటవలని అపచారమో, స్త్రీల కవిత్వము లగుట ఉపేక్షయో ?

ఇంత సుప్రసిద్ధ కవయిత్రి గ్రంథమును సమీక్షింపవలె నని గంపెడాస కల్గియుంటిని. కాని లాభమేమి? వీరి పద్యకావ్యములో 'నీతిపదములు' అను ద్విపద మాత్రము దొరకినది. అది యీ క్రింద నుదాహరింతును.

"శ్రీపరాత్పరు నిత్యసేవలు సేయ
నోపి పుట్టువు సార్థ మొనరింపవలయు;
నాణెంపుబల్కులే రాణ దనర్చు
నాణిముత్తెపుగోవ లందురు బుధులు,
మంచి యొనర్చుటే మనపని కాని,

యెంచ దత్ఫలము నాసించుట గాదు;
నింద సేయుట కొక్క నిముసంబె చాలు,
నింద వాపికొనంగ నేర మెన్నటికి;
చెట్టు నెక్కించి నిచ్చెన దీయువాడు
ఎట్టివాడో చెప్ప నెవ్వరి తరము?
సంతోస మెంతైన సుంతగా దోచు;
వంత సుంతైన గొండంతగా దోచు,
ధీరత్వ మెడలిన దేలి కౌ నరుడు
నీరెండు కొలనులోని ఝషంబు మాడ్కి;
నూరు దారులు ద్రొక్కువార లెప్పుడును
నూరు కష్టంబు లొందువారలే సుమ్మి;
అలతికి నధికార మబ్బు టెన్నంగ
పులికి ఱెక్కలు వచ్చు పోలికి సుమ్ము"—

పొత్తము చిన్నదైనను గుణముల మొత్తము పెద్దది. ఇట్టి భాషాపోషకురాలికి మా యభివందనములు.

---

# 54. జూలూరి తులశమ్మగారు

శ్రీ వీరేశలింగము పంతులుగారి ప్రబోధామృతముచే విజ్ఞానము నొంది యుత్తమ గ్రంథ రచన చేయుచు నిప్పటికిని విద్యమాన లగు స్త్రీ రత్నములలో శ్రీమతి జూలూరి తులశమ్మగా రొకరు. పుష్పలీలావతీ నామాన్తరము కల ఏతత్కవయిత్రీ కృత మగు గులేబకావలి నాటకము చాలా బాగుగ నున్నది. వీరు పీఠికాపుర వాసినులు. శ్రీమతి రాణీ చిన్నమాంబాదేవిగారి గురుపరంపరలోని వారు.

వారి సమకాలీన భాగ్యము బడసినవారు. వీరిచే వ్రాయబడినపొత్తములు— 1.పద్మావతీ విజయము, 2. సుమతిచరిత్ర (హిందూసుందరియందు ప్రచురితములు), 3. రాజీవవాటి, 1,2 భాగములు, 4. భారతేతిహాసములు, 1,2 భాగములు (ఆంధ్ర ప్రచారిణీవారివి), 5. ధర్మవిజయము, 6. గులేబకావళి, 7. ఉపనిషత్ స్త్రీలు అను నవి- ఇంతే కాక, అపుడపుడు గృహలక్ష్మి పత్రికయందు ప్రచురించిన పద్యములును అగపడుచున్నవి.

వీరి గులేబకావళి నాటకము పద్యములు, కీర్తనలతో ధర్మవరంవారి నాటకములతో సాటివచ్చునదిగా నున్నది.

అందలి ఒకరాజు పంచమపుత్రుండైన పరాక్రమకేతుడు తన తండ్రి యంధత్వము బాపుటకై గులేబకావళి యను గంధర్వకన్య యుద్యానమందలి పుష్పము కావలసినవాడై యది కోయుచు నేగుటయు, మధ్యమార్గమున మణిమాల యను మదవతిని నోడించి తన యన్నల విడిపించుటయు, కడకు గులేబకావళి యుద్యానము కేగి కార్యసిద్ధితోబాటు ఆ గంధర్వకామినీ కరగ్రహణసిద్ధిని గూడ పొందుటయు ననునది యిందలి యితివృత్తము.

తన్ను వలచి తనచేయి పట్టుకొని బతిమలాడిన మణిమాలకు రాజపుత్రు డిచ్చిన ప్రత్యుత్తరము: --

చక్కదనమును, ధనమును, సరసవచన
రచనయును గల్గి సద్గుణరాశి యగునె ?
కాంతి, యందంబు, మృదుతయు గలుగు పూవు
సౌరభము గల్గు సుమముతో సాటి యగునె?

అని శీలము లేని సౌందర్యమును, సౌరభము లేని ప్రసూనమును దెగడిన పద్యమును, పరాక్రమకేతుడు గులేబకావళిం గాంచి ....

"మరు డరిముడి నేయ గలకుటమ్మును దూయ
జారిన యారవ సాయకంబొ?
మేఘపటలములో మెరసి నిల్చినయట్టి
విద్యుల్లతావళీ విలసనంబొ?

నాదు ప్రాక్పుల మిట్టు నవ్యమై ఫలియించి
కళల నొప్పెడి రత్నకందుకంబొ?
దేవకాంతల నెల్ల ధిక్కరించెడునట్టి
సొంపు గల్గిన తనుసుందరంబొ?
గాక యుండిన, వింతలౌ కళలు గల్గి
చూడ కన్నులు మిరుమిట్లు చొప్పడంగ
స్వప్న జాగరముల రెంటి జాడ గనక
యంద మైమఱపుం గూర్చ నాప గలనె ?

అను పద్యము; నట్లే కొన్నిపద్యములును బాగుగా నున్నవి. 'పులికి పుట్టు మచ్చయును, నక్కకు పెట్టుమచ్చయును' వంటి జాతీయములు గలవు.

శంకరాచార్యుల శ్లోకముల కనువాదముగ జేసిన అపరోక్షానుభూతి:—

నిత్యమై నిర్మలం బయి నెగడు నాత్మ,
దృశ్య మగుచున్న జగమెల్ల వశ్య మగును,
ఎటను పరవస్తుతత్త్వంబు తేటపడునొ,
అదియె సమ్యగ్వివేకం బటంద్రు బుధులు;

సర్వవిధ వాసనావళి సమయజేయు
టదియె శమ మని వచియింతు రార్యు లెలమి;
బాహ్యవృత్తుల నిగ్రహపాటవంబె
దమ మటంచును మదిలోన దలపు మయ్య."

శైలీపరిణామ మిందు కాననగును—

మోతీలాలు నెహూర్హి కీర్తిశేషు డైనపు, డీమె వ్రాసిన పద్యములు చాలా బాగుగా నున్నవి.

కట్టా! దైవమ! మోతిలాల్ నెహ్రుయే గన్పించెనే? నీ కిసీ !
పట్టై భారతజాతి కెల్ల శుభసంపాద్యంబె గావించువా,
డెట్టే పొట్టను పెట్టుకొంటి వయయో? యీనింద పో దింక, నీ
కెట్టైనన్ భువి కీర్తిమాయు జుమి, నిన్నే మందునే రక్కసీ?

గుండె లవిసెను నీ శోకగూర్చి వినిన,
నట్టుడికినట్టు లుడికిపోనయ్యె జగము,
కీర్తిగాకింక లేదె నీ మూర్తి గనగ?
వెన్న పడవైచి, వ్రేల్నాకు విధము గాదె ?

వృద్ధురాలై వీ రింకను నిప్పటికిని గ్రంథవ్యవసాయము సేయుచున్నా రన, నెంత చక్కని యోపికయో యాలోచింపుడు.

వీరిని విమర్శించుటతో శ్రీ పంతులుగారి తరగతి ముగిసినట్లే యెంచ వచ్చును — కేవలము గ్రంథనామము, గ్రంథకర్తృనామము మాత్రము తెలిసిన పట్టిక పరిశ్కృతముగ నున్నది. వానిని యీ సమీక్ష కనుబంధముగ తుదిని చేర్చి చూపుదును.



# 55. దొంతి రాజరత్నమ్మగారు

1934 వ సంవత్సరప్రాంతమున ప్రకటింపబడిన జనార్దనశతక మొకటి వీరిరచన కానవచ్చుచున్నది. వీరు హేలాపురీ వాస్తవ్యురాలు !

పద్యరచనమున చేయి తిరిగిన వీరి వ్యవసాయము ఒక్క శతకముతోనే ఆగిపోయినది. నిత్య మనారోగ్యముతో బాధపడు నీమెను భగవానుడు త్వరలో తనకడకు గొనిపోయెను.

"ఎందఱొ పుట్టుచుంద్రు, ధర నెందరొ గిట్టుచునుందు రయ్య! నే నందఱ జూచుచుండియు లయం బగు నీ తను వంచు నెంచి, నీ యందు మనంబు నిల్పి యికనైన భవాంబుధి పాలు గాని యా చంద మెఱింగి నిన్గొలువజాల విచిత్రము శ్రీజనార్దనా!"

"నీరధికన్యకారమణ! నీ విమలాంఘ్రిసరోజయుగ్మముం
గోరి భజింత మన్న, బెనుగోతివిధంబున నా మనంబు తా
బారును వేఱుత్రోవలకు బాపురె! యీ భవతారణం బికే
తీరున నాకు జేకుఱునొ దివ్యకళానిధి! శ్రీజనార్దనా.''

సుభగభావబంధురములు కాకున్నను, సుందరతరధారాసమంచితము లైన వీరికవనరీతులు చదువుకొలంది చదువ మన సగుచున్నవి.

కొన్నిపద్యముల ఎత్తుగడలు పతితలను పిలిచి పలుకరించునవిగా నున్నవి.

''చిక్కి కరీంద్రు డా మకరిచే శ్రమ జెంది సహింపలేక, 'నీ
వెక్కడ నుంటి వయ్య జగదీశ్వర! కావవె? శ్రీహరీ!' యటం
చొక్క నిమేషమాత్రమె యసూనవిధి న్నిను వేడ, నాతనిఁ
గ్రక్కున బ్రోవవే ప్రణతకల్పకసన్నిభ! శ్రీజనార్దనా.''

"గట్టిగ గట్టినాడ వట కంకణ మార్తుల బ్రోతు నంచు, నీ
పట్టున దెన్ను గానని యపాయములో బడి పొక్కుచున్న నీ
పట్టిని గావలే దనెడు పల్కును మాయమ లచ్చి విన్నచో,
గట్టదె తాటియాకులను గర్ణయుగంబున శ్రీజనార్దనా!"

చక్కని యెత్తుగడలతో నారంభించి చమత్కారముగ పద్యము నంతటిని నడిపించువారు పద్యవిద్యారహస్యము తెలిసినవారే యనవలెను,

అట్టి విద్య నిట్టివారు పుట్టి నేర్తురో, పుట్టకయే నేర్తురో? ఇంక నీ యుగము నకు జెందినవారే బంకుపల్లి వేంకటరత్నమాంబగారు. వారిని గూర్చిముమ్మందు ప్రస్తావింతును.

వాఙ్మయలక్షణమున సంధియుగ మనదగిన నీ యుగ మింతటితో ముగిసినట్లే.

— మలితరము —



# ఆంధ్ర కవయిత్రులు

## మూడవ తరము

### ఆధునికాంధ్ర వాఙ్మయము

## 56. కాంచనపల్లి కనకాంబగారు [కవితా విశారద]

దేశోద్ధారకులు, వాఙ్మయపోషకులు, సంఘసంస్కారులు, సరస్వతీసేవకులైన, పూజ్యులు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారి ప్రబోధమువలన జరిగిన స్త్రీజనతాభ్యుదయబంధురప్రణాళికలో పాలు పంచుకొని, స్వయముగా కావ్యరచనలు చేసి పత్రికలు స్థాపించి, సంస్థలు నడిపి బ్రహ్మరథమును పట్టెడి మహిళలు కూడ నా నాడాయుద్యమ నిర్వాహకులైనారు. అప్పుడు జరిగిన సారస్వత కృషిలోని కవయిత్రీమణుల సమీక్షించినాము.

ఆ నాటినుండి నేటికిని సారస్వత సేవ యొనర్చుచు, చిరయశస్వినులైన కవయిత్రీమణులతో నీతరము నుపక్రమింతము.

ఆధునికాంధ్రవాఙ్మయరంగమునకు నాందీప్రస్తావము పచరించి అగ్రతాంబూల మందిన గౌరవము శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారిదే.

"చదివిన పండితు లగుదురు,
విదితము గాకున్న యపుడు వెఱ్ఱులె పురుషుల్;
చదివిన జదువక యున్నను,
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టువుచేతన్.''

అను మహాసత్యమును ప్రపంచమున కెలుగెత్తి చాటిన ఆధునిక కవయిత్రీ మండలచక్రవర్తిని యగు నీ శ్రీమతిని గూర్చి ముచ్చటించుటకు ముందుగ, ఈ యుగవాఙ్మయలక్షణము నొకింత పరామర్శింపవలసియున్నది

ఆంధ్రవాఙ్మయోద్ధారకుడు రాజరాజనరేంద్రుని నాటనుండి మొదలిడిన ఆంధ్రవాఙ్మయచరిత్రలో అనువాదసాహిత్యము మున్ముందు ముదలకొన్నది. అటు వెనుక పొడసూపిన ఆంధ్రప్రబంధముల కన్నింటికిని ఒకటే కావ్యాత్మ. ఏవో కళాపూర్ణోదయాదు లొండు రెండు భావిమార్గమునకు ముల్లు సూపినను, కడమవి యిల్లుగట్టి నిలువబడినవి కావు.

సుమారు 8 శతాబ్దము లవ్యాహతముగ దరు లొరసి పారిన ఆంధ్రసారస్వత సంస్కృత మహాప్రవాహమునకు నాయకరాజుల యనంతరము మంచిబాటలును నానకట్టలును నిర్మింపబడినవి. రాజాదరణ లేకయు, మహమ్మదీయ, ఆంగ్లేయుల పరిపాలనవలన గల్గిన అల్లకల్లోలములవలన శాంతికి భంగము వాటిలియు, భారతీయుల జీవితము నిరుపద్రవముకాకపోయినది. నిస్తులార్థప్రతిపన్నములగు కావ్యశ్రేణి నుత్పాదించు కవికులము కానబడకపోయినది. అటుపై కలిగిన అనేకములగు మార్పులతో బాటు మహిళాసంఘమునను వృద్ధిక్షయములు కలిగినవి. పురుషులతో బాటు కష్టములే కాక, మహమ్మదీయ పరిపాలనలో మతాంతర మానభంగాదులకు లోనుగావలసిన యవస్థల పాలుబడిన మహిళాలోకమున విజ్ఞానచైతన్యములు కొఱగానివైనవి.

కాని 19 వ శతాబ్దిని సంఘసంస్కర్తగా నవతరించిన ఘనుడు శ్రీ వీరేశలింగముపంతులు పుణ్యమా యని వనితాలోకమున గలిగిన చైతన్యము నూతగాగొని, కొందరు గరిట బట్టిన చేతనే నూతనముగా కలము బట్టి కావ్యసంతతి నుత్పాదించి వాఙ్మయోద్యానమున సుంగధపరీవాహమును నల్దెసల గ్రమ్మించివేయగల మన సారమతులైరి. శ్రీ పంతులుగారు వెలయింపజేసిన గద్యరచనము, నాటకరచనము, నైతికోద్బోధము లగు ప్రబోధములు, సంఘసంస్కారపరము లగు వ్యాఖ్యానములు, ఉపన్యాసములు, కథానికారచనములు, శ్రీ గురుజాడవారి ననుసరించి దేశభక్తిప్రబోధము పెల్లుబికినవి. ఇవి యన్నియు గడచినతరమునందే ఆరంభింపబడియు నీ యుగమున బహుళవ్యాప్తి నందినవి.

ఇవియే కాక, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి ఆచార్యకత్వమున వెలసిన జాతీయకవిత్వము, రాష్ట్రోద్బోధము, భావకవిత్వము పేరిట ఖండకావ్యములు హెచ్చుగ నీ కాలమునుండి కాంచగలము.

ఇట్లు వైవిధ్యముతో విస్తృతి నందిన కావ్యప్రపంచమున మహిళలెట్లు పాలు పంచుకొనిరో పరికింతురు గాక !

ఇక ప్రస్తుతము ప్రస్తావింపబడిన

శ్రీమతి కనకాంబగారు- బహుగ్రంథకర్త్రి

బహుబిరుదసంధర్త్రి. ఆమె కడు పిన్నవయస్సునుండియు మనోహరమగు కవనము చెప్పగల్గినది. తన బాల్యమున వారి వారికి వ్రాయు లేఖలు కూడా పద్యాత్మకములే. ఈమె శైశవమందలి కవితావ్యాసంగమును జూడ కవిత్వ మీమెకు తోడబుట్టు వేమో యనిపించును. "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యా" యన్నట్లు, ప్రాక్తనజన్మసంస్కారబలమున నీయమ కవయిత్రీమణిగా జన్మించె ననవచ్చును.

పల్నాడుసీమలోని మర్రి గ్రామమున విజయసంవత్సర శ్రావణ శుద్ధాష్టమి ఆదివారమున (3-9-1893) జన్మించిరి. తండ్రి రంగారావుగారు. తల్లి రంగమ్మ గారు. వారి యింటిపేరును కాంచనపల్లివారే. బాలవితంతు వగుట, నీ శ్రీమతియు దండ్రియింటిపేరునే తనకును ఇంటి పేరుగ గైకొనిరి.

బాల్యముననే తండ్రి గతించుటచే, తల్లి రంగమ్మగారు కొలది యేండ్లు కను విప్పని పసిపాపలతో గుంటూరు చేరి యట నొంటరితనమున పలుబాధలు పడిరి. 1906లో నెల్లూరునందలి వారి ఆప్తబంధువు లగు మంగు రామానుజముపంతులు గారును, పంగనామాల వెంకటరంగారావుగారును ఆదరించి ఆహ్వానించుటచే, నా పసికూనలతో నచటకు తరలి యచటనే జీవితశేషము గడపిరి.

బాల్యమునుండియు నిరుపమానప్రతిభాప్రపత్తులు గనబఱచుచు, అసాధారణ ధారా విశేషముతో తోడిచెలులతో గూడ కవిత్వపద్ధతిని సంభాషించు నీయమ ప్రజ్ఞా విశేషముల జూచి యట్టి ధీమానిత జీవితము వ్యర్థ మగుటకు విచారించి, వీరి పెద తండ్రిగారగు మంగు రామానుజము పంతులుగారు ఈమెతనువు సార్థక మగునట్లు

విద్యాబుద్ధుల తీర్చి దిద్దిరి. అప్పటినుండి స్వయముగ కృషి చేసి యెన్నో పరీక్ష లలో ఉత్తీర్ణురాలై, యెన్నో పదవులను బొందుచు, నెన్నో సన్మానముల బడ యుచు, మెల్లగ నున్నతవిద్యకై మద్రాసు చేరిరి. అచ్చట కూడ విద్వాన్‌పరీక్షలో కృతార్థురాలై ఆంగ్లభాషయందు B. A. పరీక్షలో విజయము పొంది, సాటివారిలో మేటియయి క్రమక్రమముగ క్వీనుమేరీ కళాశాలా ఆంధ్రోపన్యాసపదవిని వన్నె కెక్కిరి. అనితరసులభము లగు సమ్మానము లందిరి. మాక్మిలన్‌కంపెనీ వంటి ఆంగ్లవిద్యాసంస్థలకు ఆంధ్రగ్రంథములు వ్రాసి యిచ్చిరి. మద్రాసు యూనివర్సిటీ పరీక్షాధికారిపదవులను, తెలుగు పాఠ్యగ్రంథ నిర్ణాయకసంఘ సభ్యత్వమును పొందిరి. శ్రీ కేసరిగారిచే స్వర్ణకంకణ బహూకరణము నందిరి. ఇట్లు వన్నెయు వాసియు నొంది, బాల్యమునుండి యంతరంగమున ప్రగాఢముగా ప్రవర్ధమాన మగుచున్న ఆధ్యాత్మికచింతనాబలమున చెన్నపురియందు ఉద్యోగవిరమణము చేయ గనె, విజయవాడకు వదాన్యచక్రవర్తులని పేరుగాంచిన శ్రీ చుండూరి వెంకటరెడ్డి గారిచే నాహూతలై వచ్చి, తమ గురుదేవు లగు శ్రీ అమృతానందస్వామి ఆదేశాను సారము త్రిలిఙ్గవిద్యామహాపీఠము నెలకొల్పిరి. అచట తెలుగుకవిపండితులను మన్నన సేయుచు, విద్వద్వరులచే దాను మన్నన వడయుచు, ఘను లగువారిచే బరాబరుల నందుకొనుచు,అబలల కిట్టి అంచితసత్కారము లరుదు గదా యని యెల్లరు నబ్బుర మందునట్లు సార్థక మగు మనికి గడుపుచున్న సాధ్వీలలామ యీమె.

శ్రీమతి కనకమ్మగారిని గూర్చి వ్రాయ దొరకొనినంతనే నాచి, మొల్ల, తరికుండ వెంకమాంబలు స్మృతికి వచ్చుచున్నారు. వారివలె బాలవితంతు వగుట, తండ్రిగృహనామముననే తనవ్యవహారమును సలుపుట, దైవచింతనతో తనువు గడు పుట, తాత్త్వికాధ్యాత్మిక వైదాంతిక భక్తి విషయములపై చవులూరు కబ్బములు చెప్పుట, మున్నగున వన్నియు వారికి నీమెకును సమానధర్మములే. కాని, శ్రీమతి కనకమ్మగారికి వారందఱకంటె విశేషప్రాముఖ్యము లింకెన్నో కలవు.

ఆమె పట్టి విడువని సారస్వతశాఖ లేదు, చేసి విడువని కావ్యభేదము లేదు. అనుభవింపక వదలిన గౌరవపదవి లేదు. ఆహరింపక వదలిన అధికపదము లేదు. అతిగంభీరముగ పండితులకు సహితము కొఱుకుబడని పరమాద్వైతభావమును

చిత్రించిన లేఖినితోనే, అతిసులభధోరణిని లౌకికకథానకప్రస్తావములను హాస్య రసానుప్రాణితముగా రచించి మెప్పించగల మనీషి.

ఔను. సిద్ధహస్తుల కృతీసౌభాగ్యము లిట్టివే కదా !

ఇంక నీమె రచనల పేర్కొందును:--

1. 1905 లో అనగా ఆమె పంద్రెండవయేటనే సింహపురీనాధుడు రంగభర్తపై జెప్పిన రంగశతకము. ఇది యామె తొలియత్నము.
2. 1907 లో అమృతవల్లి యను నవల. కీ. శే. పండిత నటేశశాస్త్రిగారి "దిక్కట్రయిరుకోళందై గళ్" అను తమిళకథానకమున కిది యనువృత్తము. దీనినే మఱల 'రాధ' యను పేరున పునర్ముద్రణము గావించిరి.
3. గౌతమబుద్ధచరిత్రము } గద్యకావ్యములు.
4. పాండవోదంతము }
5. 1912 లో కాశీయాత్రా చరిత్రము.
6. 1919 లో జీవయాత్ర; ఆధ్యాత్మికకావ్యము.
7. 'మహావిద్యానాటక మను నామాన్తరము కల హంసవిజయము' అను వైదాంతికనాటకము.
8. 1927. పద్యముక్తావళి.
9. 1928. కాళిదాస కృతి కనువాదముగ శాకున్తలనాటకము.
10. 1931. రామాయణకథాసంగ్రహము (సంస్కృతగద్యము)
11. 1935. అంబాస్తవము. 12. 'శైలి' అనుకావ్యము-5000 పద్యములు.

13. అమృతానందబోధసారము. 14. ఆనందసారము. 15. చక్కనికథలు (కథానకములు) 16. తోమాలియ- ప్రాస్తావికపద్యసంపుటి.

అను బహుశో క్తిమయ గురుతరకావ్యపరంపరను వెలయించినవారు.

వీరి వైదాంతిక దృక్పథము వీరి గురుదేవులు అమృతానందస్వాముల యనుగ్రహోపపన్న మగుట వీరి వివరణము కూడ తదనుయాయియే.

వీరి కావ్యములను సవివరముగ విమర్శించు నుద్యోగమునకు బూనినచో నదియే యొక పెద్దగ్రంథమగును; వెదకుద మన్నను, నెక్కడను స్ఖాలిత్య మగు పడక పసవులవోలె నిర్దుష్టము లగు పదభావముల తోడి రచనావిశేషము లీ యమ కృతివిన్యాసములు. వీరి కావ్యములన్నిట మకుటాయమానము లీమె జీవయాత్రా, హంసవిజయములు. జీవుడు బ్రహ్మసాక్షాత్కారము నొంది అం ద్వైక్యము చెందు వఱకు పృథగ్వస్తువుగా పరిగణింపదగునేని, అట్టి జీవుని యైహికాధ్యాత్మికజీవిత యాత్రావర్తనమే యిం దితివృత్తము. ఈ జీవుడే యిందు నిరంజననాముడై పొందుపఱుపబడి యున్నాడు. కావ్యోపదిష్టమైన వేదాన్తమును వివరింప బూనుట కంటె, పఠితలను స్వానుభవానందమునకు నూల్కొలిపి యూరకొనుట యుత్త మము. ''జీవయాత్ర" లక్షణరూపమైయుండ, 'హంసవిజయము' లక్ష్యపూర్వముగా నున్నది. ఈ గ్రంథములయందు అడుగడుగున ఆత్మవిద్యాభిమానము, గురుదేవ పతిభక్తులు నగ్గలముగ నగపడుచున్నవి. ఆత్మసాక్షాత్కారము చరమగమ్యముగ నీమె యీ కృతుల నిరూపించినది. అందును స్వస్వరూపావస్థానలబ్ధియు, అంత శ్చక్షుర్దృష్టియు, అమనస్కానుభూతియు నీమెకు ప్రీతిపాత్రములు.

ఒక్కొకపట్టున దుర్గ్రహములుగా నున్న యీమె తత్త్వము మఱల వీరి వ్యాఖ్యనే కోరుకున్న దని తద్జ్ఞ లందురు.

శివ, రామ కృష్ణుల కభేదాధ్యవసాయము భజించుట యీమె యభిమతాంశము లలో నొకటి.

''రాముం డని, కృష్ణుం డని,
నీ మహిమలు తెలియలేము, నీనామములన్
గామింతురు వేర్వేరుగ
రామా ! శివ రామ కృష్ణ ! రామా ! రామా !"

మీ కిరువురకున్ భేదము
లేకుండుటచేసి యిట్టి లీలలు చేయన్
మీ కే తగు ... ... .... ...''

సోదర స్త్రీలోకమును గూర్చి యెచట వ్రాసినను, చాలా ఉదారముగను ఉన్నతముగను సంభావించి చిత్రించిరి. అట్లని వారి అవినయమును సహింపలేదు.

వేదాంతవిషయముల నీమె యమృతలేఖిని తేజోమయమై యెట్టి మహోదార గంభీర పదముల విహరించినదో, యట్లే వ్యవహారపంధల సులలితమై లౌకిక కుతంత్రముల సునిశితముగ ప్రహరించినది.

మహిళల నేటి విశృంఖల వృత్తినిగూర్చి నాయకు డాడిన మాటలు :-

"చదువ జదువ జదువ సంసారమా లేదు,
వంట లేదు, కడుపుపంట లేదు,
మంట మగని జూడ, మహిళాసభల నుంట
చదువునకు ఫల మగు శాంతి లేదు."

ఇట్లు నాయకుని యీ సందియమునకు మంత్రియు బాగుగ నే ప్రత్యుత్తర మిచ్చెను.

మగవారి చదువును గూర్చి వేరే సందర్భమున :—

చదివినాడు గాని, సంశయమూ పోదు,
చదువ చదువ దెలివి సన్నగిల్లె,
పిదప జూడ వీడు మొదటనే పోలుగా
గుణము కుదుర దేమి కొట్టుకొందు?"

ఈమె పుణ్యాన్న వీని నింతతో వదిలినది. "చదువుకన్న మేలు చాకితనము" అని పంచపాదింజేసి యీ యాటవెలదిచే నీ చతుష్పాత్తును నాడించి విడిచినదికాదు — అని యొకరు చేసిన సమీక్ష బాగున్నది

ఇంక నెన్నో పద్యములయందు సంఘమండలి క్రుళ్లను బైకి దీయుటలో నేమాత్రము వెనుదీయక నిర్భయముగ వెళ్ళగ్రాసినది.

ఇక నీమె యుపయోగించిన యుపమ లన్నియు ననిదంపూర్వములు. అన్యా స్పృష్టములు. లౌకికతంత్రమునుండి గ్రహింపబడినవి.

"జగము మఱచువాడు భగవంతుడా, భక్తు
డా, యనాథుడా, యథార్థ మెద్ది?
పాల గలసి వెంట బైలువచ్చెడు నీరు
పాలొ, నీరొ ? తెలియ బలుక వశమె.

''గురుజనముల సేవింపక
పరమార్థముకొఱకు గ్రంథభాండాగారం
బరయుట వీణె, మృదంగము
గర మర్థించెడు గతి గద గానంబునకై.''

''త్రిప్పి త్రిప్పి త్రిప్పి తిన్నన నిలు జేర్చు
గొడ్డు వెంట నంటి గొల్లవాడు;
త్రిప్పి త్రిప్పి జీవు దిద్ది ప్రోచును గద
తత్పరుండు హరి పరాత్పరుండు.''

ఇట్టి వెన్నో వారి కావ్యముల లెక్కకు మిక్కుటముగా నున్నవి.

ఈమె కావ్యములందు దడవని లోకోక్తులు, సామెతలు భాషయందెన్నో పరిశిష్టములై యుండవు. ఇక శబ్దాలంకారములు, అర్థాలంకారములును దద్గ్రంథమున కెంతో రసపుష్టిని జేకూర్చినవి.

కొన్ని యెడల నీమె భావము లెంత నూత్నములుగనో భాసిల్లినవి. అందు చత్వారము నాధ్యాత్మముతో కూర్చి మెలపినది :—

''చుట్టు చేర్చిన సామగ్రి గిట్ట దింక
దూరదృష్టి బరాత్మను జేరవలయ
ననుచు బోధింప గాబోలు నబ్జభవుడు
దృష్టిభేదంబు నలుబదియేండ్ల కొసగె."

తిరుమలను గూర్చిన వర్ణనము :—

భక్తి హరిని వెదకు బాటసారుల కది
విశ్రమింపదగిన విడిదికాగ
వేంకటేశ్వరుండు వేడ్క నిర్మించెను.''

... ... ... ...

ఇఁక లోకవృత్తమును గూర్చి-
"తెలియ మనుకొనువారలె తెలిసికొంద్రు
తెలిసికొంటి మన్వారలె తెలియకుంద్రు."

ఈమె రచనలో కోరిన శైలి కోరినట్లు బడయవచ్చును. సామాన్య లక్షణము జెప్పవలె నన్న, హిమగిరిశృంగమునుండి జాల్వారు గంగాప్రవాహమువలె గంభీరగమనవేగము కలదై చిన్నారి గీతముననుు, చెన్నారు వృత్తముననుు సమగతి నలరారెడి.

చిన్న పద్యములలో తెలుగు పదములతో అంత్యపదనియమము పాటించిన పట్టులును గలవు. తెలుగుపదములతో శబ్దాలంకారముల సవదరించు టెంత సుకరమో అనుభవజ్ఞు లెరుగుదురు.

"కామి యైనవాడు కల్లసంసారము
లో మునుంగు నాత్మలో గలంగు."
ఇట్టి వె న్నని వివరింపను!

ఇక నీమె శాకుస్తలానువాదము సామాన్యముగ నున్నది. ఒక చిన్న యుదాహృతి. "సరసిజమనువిద్ధం" అను శ్లోకమునకు :---

"జలజము రమ్యమే యగును శైవలసంగత మయ్యు నెంతయున్,
మలినమ యయ్యు జంద్రునకు మచ్చ మఱింతయు లక్ష్మి గూర్చు, వ
ల్కలముల నైన నీ కలికి కాంచు విశేషమనోహరత్వమే;
యిలపయి సుందరాకృతుల కెద్ది యలంకృతి బోలదే కదా."

ఈమె తన హంసవిజయనాటకమున నొక M. A. పాత్రధారిణిని సృష్టించి సంస్కారభావము వెలిబుచ్చినది. టామాటోలీగా దను వానినోట నెన్నియో కుహనాసంస్కారముల దూర్వారఁ బట్టినది. సంస్కృతమునను శ్లోకముల బచరించిరి. జీవయాత్రా హంసవిజయాదుల ప్రధానరస మగు శాంతము బాగుగా పోషింపబడినది. తమిళ, కర్ణాట, మళయాళము లగు దక్షిణదేశభాష లన్నియు నీమెకు వశవర్తులే.

వీరి హంసవిజయమును శ్రీకూచిమంచి సుబ్బారావుగారు హిందీలోని కనువదించిరి. వీరి కొన్ని పుస్తకములు యూనివర్సిటీలలో పాఠ్యగ్రంథములుగా నిర్ణయింపబడినవి.

ఇంగ్లీషుతత్త్వవేత్తలు నిర్వచించినట్లు, **'Poetry is the criticism of life'** అను నుడి జీవయాత్రయందు శ్రీమతిగారు సిద్ధము చేసిరి. 'తదదోషౌ, పరిష్కృతౌ చ వాగర్థౌ ... ... ...' అని విశ్వశ్రేయస్కరకావ్యలక్షణముగా మనపెద్దలును నిర్వచించి యుండిరి కదా'

ఏవం విధ గురుతర కావ్యనిర్మాణము చేసిన శ్రీమతి కనకమ్మగారి వలన, గార్గేయి, మైత్రేయి, సులభాదుల వలెనే భారతదేశప్రశస్తి యినుమడించును.

'నే నెవ్వరు శాసింపగ?
నానారూపాత్మకుండు నారాయణుడే
లో నుండి బుద్ధు లన్నిటి
దానే ప్రేరేప, భ్రమ వృథా నా కేలా!"

అని యామె వ్రాసికొన్న ట్లిది యంతయు భగవత్ప్రేరణవలన జరిగినదే.

ఆమెను గూర్చి శ్రీ చెళ్లపిళ్లవారు వ్రాసినట్లు,

ఇట్టి యెడద యే సాధ్వికి
గలుగు, పున్నెమెంతొ సలుపకున్న?..."

సాధ్వికే కాదు- పురుషులకు మాత్ర మిట్టి యెడద యబ్బునా?

''ఇట్టి దుర్భిక్షకాలమం దెపుడొ పూర్వ
ముపనిషత్తుల వినబడు నువిదల తల
మానికంబును బోలెడు మగువ యొకతె
పుట్టె మన భారతీయుల పుణ్య మనగ."

అనునది ప్రత్యక్షరసత్యము—ఈమెవలె సమకాలీన మహాపండిత ప్రస్తుతి గాంచి యెసగిన మహితురా లింకొకతె కనబడదు. ఎంతటి మహితచరితయయ్యు,

నీ మానిని తనతోడి మగువలగౌరవమును సమయము వచ్చినపు డెల్ల కాపాడుటకై కంకణము గట్టియే యున్నది.

> "చదు వనగా శ్రీ (స్త్రీ) హృదయము
> చదువుట, వేరొండు గాదు చదువులవానిజ
> ముదితల కృప లేకుండిన
> విదితం బగు నెట్లు బ్రహ్మవేత్తల కైనన్?"

తమ తెలుగుల తోబుట్టువుగా నీమెను చెప్పి నిండుగరువమున తలయెత్తి ఈమెకు పండుహృదయమున దల వంచని తెలుగుబిడ్డ లుండరు గాక!



# 57. గుడిపూడి ఇందుమతీదేవిగారు

ఆమె సాధుమూర్తి. మూర్తీభవించిన సుకృతము. పరిణతప్రజ్ఞను తొణికిసలాడని నిండుకుండ. నిరాడంబర యగు నిగర్వశీల. పెద్దకాలపుటువిదల తలపునకు దెచ్చు ముచ్చటగు ముత్తైదువుముస్తాబు! నాసను అడ్డబాసయు, కురులు ముడిచి కూర్చిన యొప్పగు కొప్పు, అన్నిటినిమించి అమాయకత్వమున నందగించు పౌందమ్మిమోము. తెలికాంతులు వెలజిమ్ము కన్నుదోయి, ఫాలమున పట్టెడు కుంకుమబొట్టు, కలుపుగోలుతనముతోడి కమ్మనినేస్తము, సహజసరళము లగు సల్లాపములు, ఒరులమనసు నొప్పింపని మెత్తని మెలకువతీరు, చూచినంత చిత్తమున హత్తుకొను సౌరు గల ఆ పెద్దయిల్లాలు శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి. ఆ పుణ్యాంగన ప్రథమదర్శనము ఇంకను నా కన్నుల నిలిచియే యున్నది. చేరువైనంత చేతు లెత్తి మొక్కజేయునంత మూర్తివాల్లభ్యమునకు మరొక్కమారు మనసార నమస్కరించి సార్వత బంధువునై యామె యాత్మజీవితముతోడను, కావ్య జీవితముతోడను మీకు పరిచయము కల్గింతును.

1 అంబరీషవిజయము, 2 లక్షణాపరిణయము, 3 తరుణీశతకము, 4 రాజేశ్వరీశతకము, 5 నీతితారావళి, 6 నరసింహశతకము, 7 లోకావలోకనము, 8 సోదరి, 9 గోవిలాపము, 10 ఆంజనేయస్తుతి, 11 జన్మభూమి అను పద్యాత్మక కావ్యములను, 12 నర్మద యను నాటకమును, 13 గాంధీకీర్తనలను, 14 రామ కథామంజరి యను గద్యమును రచించిన యీ యుత్తమకవయిత్రి మతుకు మల్లివారి యాడబడుచు. ఈమె తాత నృసింహశాస్త్రిగారు బొమ్మదేవరజమీందారుని ఆస్థానకవి. బహుగ్రంథకర్తలు ఈమె సోదరులు నరసింహశాస్త్రిగారు కూడా గ్రంథకర్తలే. వీరివంశమున ప్రసిద్ధులొకరు కనకశాస్త్రిగా రనువారు మంత్ర శాస్త్రవేత్తలై పాముకరచి చనిపోయినవారిని బ్రదికించిరట. వీరిలో నింకొకరు మాధవశాస్త్రిగారు. వారును కవులే. వారి సతి మాంచాల వాసుదేవకవి కుమార్తె. ఆమెయును కవయిత్రియే.

ఇట్లు వంశరక్తమునుండి పారంపర్యముగను, ఉగ్గుబాలనుండి యుబుసు పోకగను నలవడిన కవితాధోరణితో పచేళిమ మైన హృదయ సంస్కారము కల యీమెను పెండ్లియాడినవారు శ్రీగుడిపూడి రామారావుగారు. వారి వంశమును సుప్రసిద్ధమే. వీరి పూర్వపు వాసస్థానము ఆత్మకూరు. ఇప్పటి యావాసము విజయవాడ, ఇందుమతీదేవిగారొకవర్షము పెద్దగా కనకాంబగారితో సమవయస్కయే. యీయమకలమున పండిన పంట గాక, కడుపున పండిన పంటగా నొక పుత్రిక కలదు.

వీరి కావ్యములలో లక్షణాపరిణయము, అంబరీషవిజయములు ప్రబంధ లక్షణలక్షితములు. లక్షణాపరిణయము నాలుగాశ్వాసములు. అంతయు పూర్వపు పోకడయే. అధునాతన యుగమునందలి స్త్రీలును పూర్వరచనలను బోలిన రచనలు చేయగల రని నిరూపించుటకే యిట్లు వ్రాసిరేమోః రచనలో క్రొత్తపద్ధతి గానరాదు. అట నట భావముల పోకడ మాత్రము విశిష్టముగా నున్నది. ఇది యీమె పదునేడవ యేట రచించినది. "పూర్వగ్రంథపఠనమున గల్గిన అభిలాషతోడుగా వాని ఛాయ లనే కళాయాత్ర సాగించితి" నని వారే గ్రంథాదిని వ్రాసికొనిరి.ఆ మాటలు సత్య ములని కావ్యవిమర్శకు గడంగిన తెలియును.

ఇందు భాగవతకర్త పోతన నెక్కడ పిలిచిన నక్కడ హాఁ! యనుచున్నాడు.

"బాలేందు రేఖ దోచిన । లాలిత యగు నపరదిక్కు లాగున"

అని యున్న పోతనగారి పద్యముం గాంచి——

"అల చంద్రరేఖ దోచిన । వెలుగొందెడు పశ్చిమాశ విధమున"

అను వీరి పద్యమును జూడ నక్కరలేదు.

లక్షణ శ్రీకృష్ణునికడకు చిలుకను పుత్తెంచినపు డా చిలుకను గూర్చి-

"అల శ్రీ ద్వారక కేగెనో ? నడుమ నధ్వాయాసముం దీర్పగా
ఫలవృక్షములయందు నిల్చెనో?......"

అను పద్యము "పోతన్నగారి 'ఘను డాభూసురు డేగెనో ; నడుమ మార్గ శ్రాంతుడై డస్సెనో? ......" అను పద్యమును జూచి వ్రాసినది.

"బొమ్మలపెండ్లిండ్ల పొలుపొందగా జేసి
వేమారు చెలులతో వియ్యమందు."

అను పద్యము పోతనగారి పోత యని వేరే చెప్పనక్కఅయే లేదు కదా !

శైలియందును భాగవతభక్తురాల ననిపించుకొనవలె నని వీరి సంబరము.

"అట్టి త్రైలోక్యనిర్మాత, హరుని తాత,
వాగ్వధూనేత, చిత్త సంభవుని భ్రాత,
ధాత ననిశంబు మదిలోన దలచుదాన..."

శుద్ధఛాందసుడును, మది దప్పిన ముదివేలుపు నైన బ్రహ్మగారు "చిత్త సంభవుని భ్రాత" గా పొగడ్త గన్నారు.

ఇంకను శ్రీనాధ పెద్దనాదుల యనుకరణములును వేంకటశాస్త్రిగారి యనుకృతులును పెక్కులు గలవు.

ఇవి తప్పించిన లక్షణా బాల్యవర్ణన మెంత యుజ్జ్వలమ్ముగా నున్నదో కాంచుడు :---

"చెలులు వజ్రంపు డోలల చెలువ నుంచి
లీల నూచుచునుండ నబ్జాల మెరయు,
నలరు మానసవీచికలందు దూగు
ముద మలర్చెడు రాయంచకొదమ బోలి."

"నన్ను గన్న తల్లి ! నాదు నోములపంట !
నాదు ప్రాణపదమ ! నా ధనంబ !
యనుచు తండ్రి ముద్దులాడిన గని నవ్వు
నమలరదనకాంతు లలమికొనగ."

"మృదుకరము సాచి జనకునిమీది కెగయ,
నాత డానందవారిధియందు దేలు;
కన్నబిడ్డల యాశ్లేషఘనసుఖంబు
కంటె సుఖ మింక నరునకు గలదె ధాత్రి?"

''మిసిమి మీగడ పస మీరు మృదుల వాక్య
ములను దొంత్రిల పల్కెడు పుత్త్రిపల్కు.''
ఎంత మనోహరముగ నున్నదో కాంచితిరా వర్ణనాపద్ధతి !

చిన్న చిన్న జానుతెలుగుపలుకులతో, దిద్ది తీర్చిన గీతులలో, కమ్మని తేనెయూట లెట్లూరించినదో? రసపరిపూత మగుగీతము కన్న వృత్తము పొడిచినదా ? కావ్యశిల్పమనోహరత గలనాడు గీతమైనను, వృత్త మైనను నొక్కటె. అది లేనినాడు రెండును లేనివే. గీతములు వ్రాయుటయందొక యశిక్షితపటుత్వ మీమెచేతియందు కలదు. అది వీరి 'సోదరి' యను చిన్నకృతిని మఱింత శోభా వహముగ గన్పడును. నర్మద– ఇది యారంకములు గల నాటకము. ఇది వీరి యిరువదేడుల వయసున రచింపబడినది. షోడశచక్రవర్తులలో నొక డగు పురు కుత్సునకును, నాగరాజనందిని యగు నర్మదకును జరిగిన కళ్యాణమే యిందలి గాథ. ఇందలి నాయిక యగు నర్మదప్రతాపాదులు చక్కగా పోషింపబడినవి. శైలి ప్రసాదగుణసమంచిత మగు ద్రాక్షాపాకము. రసము వీరశృంగారము. నాయ కుడు ధీరోదాత్తుడు. నాయిక శౌర్యోపజీవియగు శీలవతి. ఇట్లు నాటకము పూర్వోక్త

లక్షణలక్షితమై యున్నది. ఇందు శౌర్యమే నాయికానాయకులకు శుల్కము.
ఇందలి ఉపనాయిక పద్మ తన ప్రియుని వర్ణించిన సొబగు:——

"అక్కట ! యా ప్రసన్నవదనాంబురుహంబు, నేత్రముల్,
చక్కెరవిల్తువింటి నెకసక్కెము లాడగ జాలు కన్బొమల్,
నిక్కు భుజంబులున్, సుహరినీలకచంబులు, దీర్ఘ బాహులున్,
చక్కని పెన్నురంబు మది సొరెకు గన్పడు నేమి సేయుదున్ ?"

"చొక్కపు మేల్మిబంగరపు సోయగముం గని నవ్వు దేహమున్,
చక్కగ దిద్దిన ట్లమరి సంపెగ గేలి యొనర్చు నాసయున్,
చిక్కని పాలు చక్కెరయు జేర్చినటుల్ జవులీను పల్కులున్."

ఇందలి శైలి యంతయు నిట్లే సౌమనస్యము ఘటించినది.

తనయందు విముఖయై క్రోధారుణితవదన యైన నర్మదను తలచి తలంచి చిత్రసేనుడు శోకించిన విధము--

"ఆ యభిజాత్యసంపదయు, నా పటునిష్ఠురవాక్ప్రరోషమున్,
నా యురుధైర్యసాహసము, లా మహితాతిగభీరమానసం,
బా యసమానపౌరుషము, ఆ ఘనరోషకషాయితాక్షులున్
నా యువతిం దలంచిననె హా ! యిదె గుండెలు ఝుల్లు ఝుల్లనున్."

"మండలీకృత ఘనధనుర్దండ మొప్ప
ప్రళయరుద్రుని పగిది రౌద్రంబుతోడ"

అంశుమంతుడు విక్రమించెను.

ఇక నంబరీష విజయమున:- చక్రము వెన్నంటినపు, డాముక్కోపి ముని రాయడు దూర్వాసుని యగచాట్లు:-

తపసియును జక్రజాతవేదనకు నోర్వ
కవని యదురగ, జెమ్మట యల ముకొనగ,
జడలు జీరాడ, కాషాయశాటి యూడ,
తనువు గంపింప, బరువిడె దశదిశలకు."

'తడబడు, నటు నిటు నడచును,
బుడిబుడి పర్వెత్తు రొప్పు పుట్టగ, నిలువం
బడు, వెనుక తిరిగి మఱి దిగ
బడు పల్లములందు, క్రిందవడు, వడి లేచున్."
దండ మొక దిక్కు, మహితకమండలు వొక
దిక్కు, జపమాల మఱి యొక దిక్కుగాగ
సంభ్రమంబున బర్విడు జటిలుని."

అగచా ట్లన్నియు నచ్చుగ్రుద్దినట్లు చూపు నీ గీతము లన్నియు నమృత పాతములుగా నున్నవి. కందము మధురమాకందమే. అది 'డ' ప్రాసతో హ్రస్వాక్షరములతో నుండి అచ్చ తెలుగునుడికారపు సొగసులతో మునిరాజు తడబడుచు లేచుచు పరువిడుచున్నటులే తోపింపజేయుచున్నది.

ఇందు పోతనగారి ''అడిగెద నని కడువడి జను'' అను పద్యచ్ఛాయలు కలవు.

''కాలిబంగరుటందెలు ఘల్లు రనగ
గడగి తెక్కలు నల్లన గాలి వీవ
చిలిపి కన్నుల నవ్వొల్కు చెలువు గుల్క
కలికి కరమున వ్రాలిన రాచిలుక'' ను

''చక్కని య క్కన్యామణి
ముక్కును వ్రాయంగలేక మునినాధుడు దా
చిక్కిరిబిక్కిరి జేసెను,
నిక్కము జెప్పితిని నీకు నీరజనేత్రా !''

అను చిలుక వాక్యమునందలి లక్షణాదేవి ముక్కును ఇందుమతీదేవిగారు పఠితలకు చక్కగా ఉపలక్షింపజేసినారు.

ఇంకను నచ్చటచ్చట విరహవర్ణనములు, శరద్వర్ణనములు మున్నగునవి బాగున్నవి.

'సోదరి' యను చిన్నకావ్యమునందు సామాన్యముగ మన యిండ్లలో జరుగు నిత్యవ్యవహారకాండలోని సంభాషణాదులలో, సంఘటనాదులలో మానవులు చూపు అంగికాభినయాదులను కన్నుల కగపడునట్లు చిత్రించిరి.

అందలి నాయిక తన వదినగారి గయ్యాళితనముచే పుట్టింటికి రాకపోకలు పోయి, అన్నగారి సాధుత్వము పెంపున చాలకాలమునకు జూచుట తటస్థించిన తన మేనగోడలిని నొక గృహిణి యాదరించిన తెఱగు---

"ఒడిని బాల నుంచు, నొయ్యన ముద్దాడు,
శిరము మూరుకొనును, చేత నిమురు,
కనుల నీరు నించు, గనుగొంటి నిన్నాళ్ళ
కమ్మ! ని న్నటంచు హర్షమందు''

చూచితిరా ఈ స్వభావోక్తి! అన్నా చెల్లెండ్ర చిరవియోగానంతరము--

"అన్న యంట, చెల్లె లనురాగవతి యంట,
మానసములు ప్రేమమయము లంట,
చాలరోజులకు సందర్శనం బంట-
ఎట్టు లుంద్రు వార లెంచి చూడ ?

''అన్న చెల్లెలి హర్ష మంతంత గాదు.
చింతగింజను మొలవేసి పంత మొప్ప
పులుసు ద్రాగితి మంచు నుప్పొంగుచుండ్రి.''

ఇంత వ్యంగ్యముతో ఊరుకొనలేక "మెలతలకు పుట్టినింటిపై మెండు ప్రేమ !... ... అని వాచ్యము కూడ జేసిరి. ''సత్యసుందరముగా నున్న స్వభావ వర్ణనలు" మనసున కింపు గూర్చునట్లు వ్రాయుటకు వీరే తగినవా రనిపించును.

రాజేశ్వరీశతకమునందలి పద్యముల కొక మచ్చు:--

మురిపెంపు పెండ్లికూతురవై శిరము వంచి
శర్వుపై దలంబ్రాలు జల్లునాడు
పాపపేరులు గాంచి భయపడ్డ చందాన
నొక్క చెంపను లజ్జ నొదుగునాడు,

పల్లవమృదుపాణిపద్మంబులను బ్రీతి
యొప్పార హరునంఘ్రు లొత్తునాడు,
అర్ధశరీరంబు నాక్రమించియు నండ
బాయక నెవ్వేళ బఱగునాడు,
వీరరౌద్రాద్భుతావేశ మొప్పగ విజృం
భించి రాక్షసుల మర్దించునాడు,

ముగ్ధ శృంగార విస్మయమూర్తి వౌచు
రౌద్రమూర్తి వి నై నవరసము లొప్ప
నానర నొక్కొక్కవేళ నొక్కొక్క రీతి
హర్ష మొదవించితి వయారె ! హరుని మదికి.

తరుణీశతకము--

తొందర జెందకు కోపం । బందకుమా. పరుల దూలనాడకుమా, కాలెందైన జారగా
తీ । యందగు, నిక నోరు జార నగునే తరుణీ.

అను పద్యమును, నీతితారావళియందలి,---

చదివిన లాభ మేమి ? మరి చాన గృహంబును దిద్దు నేర్పు, నిం
పొదవ పతివ్రతాత్వమును, భూరిదయామతి, సత్యభాషలు౯,
మృదు వగు మానసం బలరునేని జగన్నుత యౌను గాదె ? యా
ముదిత సతీవిభూష యన మోదము నందదె ! మంగయాంబికా ?

అను పద్యమున తోడిసోదరీమణులకు నీతి నుపదేశించిరి. తాను దొడ్డ యిల్లాలై యిల్లాండ్ర కింగిత మెఱింగించు టిట్టి సాధ్వికి చెల్లును.

ఈమె కావ్యము లన్నిటిలో చిరుకబ్బ మైన 'సోదరి' కడు హృద్యముగ నున్నది. అందలి గమనవేగము ప్రశంసనీయ మైనది. కథా కథనశక్తి యద్భుతము. వీరును గృహలక్ష్మి కంకణధారిణులే.

ఈయమ కవయిత్రియే కాక, గొప్పవాగ్మి. వినువారి హృదయము లలరు నట్లు పూర్వకవిప్రబంధములనుండి అనేక పద్యముల నుదహరించుచు గంటల తర

బడి యుపన్యసించు ప్రజ్ఞగలదు. విజయవాడ యందలి యే దేశహితకార్యములందాదును నీమె పాల్గొనకుండ నున్నది లేదు.

ఏలకో ఈ నడుమ శ్రీమతిగారు రచనోద్యోగము విరమించిరి. ఏదేని యుత్సాహద్యోతక మగు నితివృత్తమును గైకొని తెలుగు సాహిత్య క్షేత్రమున రాజనముల బండింతురు గాక !

ఈ సాధ్వి సత్కావ్యములు సరస్వతి కెత్తిన దివ్యనీరాజనములన్న నత్యుక్తి గాదు.



# 56· "కవిరాణి" చిల్కపాటి సీతాంబగారు

"ఆజికి దప్పి శత్రువుల కౌదల లొగ్గితి రేని, మే మికన్
గాజుల నూడ్చి కత్తులను కత్తళము ల్గొని వైరిసేనలన్
తేజ మడంచి, యీ భరతదేశము కున్నతి గూర్చి, హైందవ
స్త్రీజన శౌర్యము ల్దెలిపి, చేతులు మోడ్పగ జేతు మిత్తరిన్."

వీరవనిత లగు స్త్రీజనమునకు దళవాయియై హుటాహుటినడల నరివీరుల నెదిరింప నేర్చి పిరికివారి నదలించుచు వారి కుద్బోధము సలుప గల్గుటచేతనే కాబోలు, వీరికి "కవిరాణి" యని యన్వర్థ బిరుదనామము గల్గినది.

ఈ కవిరాణి యేల్బడిని సుఖ ప్రశాంతులు గని భావియశఃకాంతులు గొనిన కావ్యసందోహమును గనుడు:--

అవి---పద్మినీ పరిణయము, క్షీరసాగరమథము అను నాటకము, 'దిలీప' యను నేకాంకిక. అరవింద యను నవల, శూర్పణఖ యను నేకాంకిక, పద్యరత్నావళి యనునవియై యున్నవి. ఇందలి 'శూర్పణఖ' యను నేకాంకిక అముద్రితమై శిథిలబంధ మైనట్లు వీరి యుత్తరములబట్టి తెలియుచున్నది.

వీరు శ్రీమాన్ పర్ణశాల రాఘవాచార్యులకును, నలమేలు మంగతాయారమ్మ గారికిని 1900 వ సంవత్సరమున జన్మించినారు. జన్మస్థానము నెల్లూరుజిల్లా కలికివాయి. చిల్కపాటి వెంకటనరసింహాచార్యుల సతి. కమ్మని కవిత చెప్పగల ప్రౌఢ.

వీరి పద్మినీపరిణయము పూర్వప్రబంధముల యడుగుజాడలనే హవణించినది. అవే నగర్త్వీన శశివర్ణనములు. అదే కథావృత్తము. అదియే భావసరణి.

అయితే, యిందు విరహార్తయై నిశీథమున ఉద్యానవనమున కేగిన రాకుమారి నొక కాపాలికు డెత్తుకొనిపోవుటయు, దేవికి బలి యిడబోవు సమయమున నామె ప్రియుడు రాజసుతు డామెను రక్షించి మిక్కలి సుదూరమున నున్న తన దేశమునకు తీసికొనిపోవుటయు, రాజకుమారి కనిపించక నాయిక చెలికత్తె అపరాధపరిశోధన మొనర్చి రాకుమారిని గనుంగొనుటయు నను ఘట్టములు పూర్వకవిమార్గమున కించుక యెడలై ఆధునిక నవలాసాహిత్యచ్ఛాయల పొడగట్టించుచున్నవి.

కథా విషయమున సౌచిత్యానౌచిత్యములు దడవ బని లేదు. నాయకుడు ధీరోదాత్తుడు. నాయిక ఉత్తమ కులసంజాత. రసము శృంగారము. శైలి ద్రాక్షాపాకము. రచన ప్రసాదగుణము.

ఇక యిందలి యచ్చటచ్చటి మనోహరవర్ణనలం జూతము. ఈ కావ్యమునందన్నిటికంటె నన్ను లోగొన్నది వసంతఋతువర్ణనము. అందీమె ఆదినుండి యంత్యమువఱకును నారామలక్ష్మిని సన్నిహిత వసంతాగమనిరీక్షమాన యగు వాసవసజ్జికగా వర్ణించిరి.

> ''కోమలంబులౌ చిగుళ్ళ గొంచు జీర్ణ పర్ణముల్
> భూమిమీద రాల్చి వేడ్క బూను తర్వు గాంచ, నా
> రామలక్ష్మి యవ్వసంతురాక నెంచి పచ్చనౌ
> కోమలాంబరమ్ము దాల్చుకొన్న లీల గన్పడెన్.

> ఋతురా జేతెంచెడి నని
> మతి నుబ్బుచు నతని కడుగుమడుగుల నిడగా

క్షితికాంత పట్టి పఱచిన
గతి, బచ్చిక యెల్లయెడల గన్పడె గనుమా.

మున్నగు పద్యములయందలి వసంతవర్ణనము వసంతమారుతము వలెనే హృదయంగమమై యున్నది. ఈ సందర్భమున మణిరంగము, మలయజము మున్నగు వివిధచ్ఛందములు గలవు.

''కాటుకచుక్క పెట్టె నొకకామిని పద్మిని చెక్కులందు, బ
ల్మీటు చెలంగ బూసరుల నిండుగ రాసుత కీలుగంటునన్
వాటము గాగ జుట్టె నొక వారిజలోచన, నిల్వుటద్దమున్
దేటపడంగ నొక్క చెలి తెచ్చి రయంబున నిల్పె ముందటన్.

ఇచ్చట పెండ్లికుమార్తె కై సేత లందముగ మేళగించినవి. పద్మిని యొక్క శైశవమును వర్ణించు,

''మించులను మించు నెమ్మేనిమించు దనర
చిలుకపలుకుల నలరించు పలుకు లలర
నెలమి రాయంచపిండుల గెలుచు నడల
గలిగి యాబాల లీలలను నొప్పు''

అను నీపద్యమున ప్రతిమాతయు దమ బిడ్డల శైశవక్రీడలలో పొందు నానందమును సహజముగా వర్ణించి మరల మరల మాతృనుభవమును జ్ఞప్తికి దెచ్చిరి.

కవయిత్రి వైష్ణవి యని ఈ క్రిందిఘట్టములు జెప్పక చెప్పుచున్నవి.

కళావతి యోగినీవేషమున మేననిండ భూతి నలదినను, పూర్ణిమాచంద్రుని గేరు మొగంబున నూర్ధ్వపుండ్ర మంచిన దట. మాధవుని నగుమొగంబునను గీరు నామము గలదు. పెండిలిబువ్వమునకు వచ్చిన వారును పారిభాషికములనె సాపడిరి.

వీరి యీ కావ్యమందలి కొన్ని విషయములు నాకు జిత్రముగ దోచినవి. పురుషకవుల వలె, గణికా పుష్పలావికాది వర్ణనములను శృంగారాంచితముగా నొనర్చుట. జలక్రీడలో—

''కలికి యొకర్తు వెల్లకిలగా బవళించి జలంబులోపలఁ
బలుమఱు నీద, దాని చనుబంతుల గన్గొని నీరజాత కు
ట్మల మనుచు న్దలంచి యొక మత్తమరాళము జీర జేరినన్,
గలగుచు బొబ్బవెట్టి యొక కాంతను గౌగిట జేర్చె భీతిమై''

అను వర్ణనమును పచ్చిపచ్చిగ గావించుటయు, నాయికానాయకుల సమాగమ దృశ్యములు తెరచాటు లేకుండ జేయుటయు, నుచితమా యనిపించుచున్నది. ఒకచో ''ఎక్కడివాడో యక్షతనయేందు జయంత'' అను పెద్దన్నగారి పద్యమున కనుకరణము కన్పించుచున్నది.

విష్ణుమాయావిలాస మను నామాన్తరము కల వీరి క్షీరసాగర మథన దృశ్య ప్రబంధము బాగుగ నున్నది.

"నీలపుఁజాయల నెగడు శిరోజముల్
రాలుచు వెస పాండురత వహించు,
లావణ్యపుంజమై రహి మించు వదనంబు
దంతంబు లూడగా దరుగు వన్నె,
దేహపటుత్వమ్ము దెరలి శుష్కించుచు
కడు రోత పుట్టించు ముడుతలు పడ,
కనులకు వెస పొరల్ గ్రమ్ము, చిత్తంబు స్వా
ధీన మందదు, వాక్కు దిటవు సెడును,
చెవుడు ప్రాప్తించు, దండంబు చేత నమరు,
సతియు సుతులును పరిజనుల్ సరకు గొనరు,
మౌనముద్రయు గైకొను మంచముననుఁ
కష్టముల నిట్టి కాలంబు గడుప వశమె?"

వార్ధక్యమును వర్ణించిన ఈ సీసము స్వాభావికతను సవదరించినది.

''వ్రతము లొనరించినను నేమి? యతులనిష్ఠ
జపము గావించినను నేమి? తపసి యగుచు
జడలు దాల్చిన ఫల మేమి ? జనుని మదిని
కరుణయును శాంతి లేకున్న కలదె ఫలము?"

అను పద్యమును,

కడు భయంబు గూర్చు పిడుగులు పడి గాదె
అఖిలజీవదాయి యైన యట్టి
వర్ష మెదవుచుండు, వసుధ నీ తీరున
కష్టములె శుభముల కారణములు.

అను పద్యమును, అనుభవోపదేష్టలై కావ్యశోభ నినుమడింపజేసినవి.

ఇక దిలీప యను నేకాంకికకు ఇతివృత్తము రఘువంశములోని 1, 2 సర్గలలోనిదే. దేవేంద్రునకు సహాయము వెడలి విజయము నాపాదించి స్వర్గమునుండి తిరిగి వచ్చుచు మార్గమధ్యంగత యగు కామగవి నారాధింపకుంట ననపత్యుడుగ దిలీపుడు శప్తు డగుటయు, తదుపరి తన్నందినిని నారాధించి యపేత శాపుండగు టయు ననునది యిందలి కథానకము.

శైలికి ఉదారభావప్రకృష్టతకు నొక యుదాహరణము--

"నిరతము కొండయేళ్ళదరి నివ్వరిధాన్యము పండించుచు సం
బరమున నెట్టి చింతలకు బాల్పడకే హరి నెల్ల వేళలన్
దిరమున నెమ్మనంబున నుతించుచు శాంతమనస్కులై వనిన్
దిరుగు మునీంద్రచంద్రులకు దీటె మహీశులు? వారి భోగముల్?

ఆకల్మష మగు ప్రశాంతవాతావరణము, అందలి పరమతపోధనులు, కుహనాకల్మషదూషిత మగు ప్రభురాయుల హేయభోగములు చక్కగా నిరూపించు నీ పద్యము విహంగకలఋతమువలె హృదయమును స్పందింపజేయు చున్నది.

ఇంతే కాక, గృహలక్ష్మి మున్నగుపత్రికల ననేక శీర్షికల ప్రచురించిన వెన్నో కలవు.

"కలుగు శ్రీమంతుల గాసి నొందింప
గలుగుదే ? గీష్మమా ! కడు పేదవారి
నలయింప జేతు, వియ్యది మేరె నీకు ?
తలగి పోవమ్మ సంతాపంబు వీడి."

గ్రీష్మ నుద్దేశించి చేసిన యీ ఉపదేశము వీరి "గ్రీష్మము" లోనిది.

వీరి యీ విమర్శమునకు మకుటముగ పేర్కొన్న రసోజ్జ్వలపదబంధ మగు "ఆజికి దప్పి" యను పద్యము వీరి వీరచంద్రావతిలోనిది. పద్య మొక్కటే కాదు, అందలి పద్యము లన్నియు రసపూరములే. ఇంకొకటి వీరి యశోదయు నిట్టిదే:—

"కొంటె గోపాలుడ వటంచు గొల్ల లెల్ల
ఊరకే నిను బలుమారు లుప్పతింప,
యెఱుగవే వెఱ్ఱితండ్రి! నీ తెరగు జూచి
కన్న కడుపు సహించునా! చిన్నతనయ!"

ఇట్టి ఘట్టములు జూచిన వీరి కలము స్వతంత్ర కావ్యరచనయందే యెక్కుడుగ శోభిల్లు నని యేరికైన దెలియక పోదు. వీరింకను నిత్యసౌభాగ్యమహితలై జీవము గలిగి యుక్కుమీరిన రచనలతో 'ఆంధ్రావళి మోదమ్ముం బొరయ' జేయ వలెనని యాశింతును.

ఈ కవిరాణి ఆశుకవిత్వము గూడ చెప్పగలదు. వారి యింట నొకపు డెవరో పండితులు జదివిన సంస్కృతశ్లోకమును విని వెంటనే దానిని తెలుగొనర్చెనట.

'కమఠపృష్ఠకఠోర మిదం ధనుః
మధురమూర్తి రసౌ రఘునందనః
కథ మధిజ్య మనేన విధీయతాం
అహహ తాతపణః ఖలు దారుణః."

దీనికి వీరి రచన–

"కమఠపృష్ఠకఠోర మీ కార్ముకంబు,
సరస సుకుమారుడీ రామచంద్రమూర్తి;
ఎటుల నెక్కడ నేర్చునో? యేమి యగునో?
కటకటా! యేమి శపథంబు కన్నతండ్రి."

వీరికిని కేసరిగారు స్వర్ణకంకణ మిడి సమ్మానించిరి. ఇట్టి భవ్యకవితా మోదమున తన్ను దేల్చు వరపుత్రిక లుండ, నాంధ్రమాత కేమిలోటు కల్గును!

# 57. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఆధునికాంధ్రస్త్రీ వాఙ్మయమున శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు జాతీయమైన భాషను రచనము చేయగలవారుగా కనబడుచున్నారు. శ్రీ కేసరిగా రీమెకు ప్రప్రథమమున స్వర్ణకంకణ మిచ్చి బహూకరించినారు.

గద్య వాఙ్మయమున 'శారదలేఖల' రూపముగా వీరు ఆంధ్రజనులకు బాగుగా పరిచయపడియున్నారు. అట్లని వీరు పద్యవాఙ్మయము వెలయింపలేదని కాదు, కాని వీరి రచనలలో గద్యమునకే ప్రాధాన్యము మెండు. వీరి శారదలేఖలు సంఘమున గల ఆయాకాలపు సమస్యలన్నిటిని పరిష్కరించుచు తమ యభిప్రాయ ముల నొసగుచు వ్రాసినారు. చిన్ననాడు వ్రాసిన రెండు ద్విపద కావ్యములును, కొన్ని కథలును నింకను గలవు.

ఆంధ్రదేశమున శ్రీ వీరేశలింగముపంతులుగారి సహచరభాగ్యము నంది సంస్కారవ్రతము నాచరణలో జూపి, అనుష్ఠాన బ్రాహ్మలని, ప్రాజ్ఞులని,సాధు సత్తములని పేరు బడసిన శ్రీపాలపర్తి నరసింహము పంతులుగారి జ్యేష్ఠసోదరి. సోదరులు శ్రీపాలపర్తి నరసింహముగారు అనుష్ఠాన సద్ధర్ములు. తండ్రి పాలపర్తి శేషయ్యగారు. తల్లి హనుమాయమ్మగారు. 6-10-1896 వ తేదీ వీరి జన్మ వాసరము. శ్రీ కనుపర్తి హనుమంతరావుగారికిని, వీరికి 1906 వ సంవత్సరమున పెండ్లి జరిగెను. బాపట్ల వీరి నివాసము. సోదరులు శ్రీ నరసింహముగారు చిన్న తనమునుండియు తన్ను బుజ్జగించి చదివించిపట్టుసు, శ్రీ నాళము కృష్ణారావు ప్రభృతుల పత్రికలు, గ్రంథాలయములవలన నప్పట దమబోంట్ల చదువు సాములు ప్రోత్సహితములై సాగినవనియు వీరు కొండొకచో వ్రాసిరి.

నిజమున కంతే. ఆనాడు-అనగా ఇప్పటికి సుమారు ఏబదేండ్లకు పూర్వము-స్త్రీవిద్య యన్నచో సంఘమున నెంత వ్యతిరేకభావము లుండెడివో, శ్రీ వీరేశ లింగముగారి కాలమువారికే తెలియవలెను. అట్టి దుష్కాలమున దమ తమ శైశవ ములు గడిపియు శ్రీ నరసింహముగారి వంటి ప్రాజ్ఞుల సాహాయ్యముతో విద్యలు

నేర్పుటే కాక, నేర్చిన విద్యలు సాఫల్యమందునట్లు రచనలు చేసి సంఘములు, సమాజములు స్థాపించి స్త్రీజనసేవ కిట్లెంద రెందరో పాటుబడి రన్న, నిజముగ నది యెంతో సాహసకార్య మన్న నతిశయోక్తి కానేరదు. అట్టివారిలో శ్రీ వరలక్ష్మమ్మగా రొకరు. వారు సుమారు ఇర్వది వత్సరములనుండి బాపట్లలో స్త్రీహితైషిణీమండలి యను నొక సంస్థను స్థాపించి ఏకాధిపత్యముగ పాలించు చున్నారు. వీరు తమ అనుచరవర్గమును తమ మాటపలుకుబడిచే ఎదురు లేకుండ ఏలుకొనఁగల సమర్థత కలవారు. భద్రాచలమందు జరిగిన అఖిలభారత మహిళా సభ శాఖయగు ఆంధ్రరాష్ట్ర మహిళాసభకు అధ్యక్షపీఠ మలంకరించి యుండిరి. కాంగ్రెసుభక్తురాలుగాను, హిందీభాషాభిమానినిగాను వీరు ప్రఖ్యాతి బడసిరి.

శ్రీ వీరేశలింగముపంతులు మొదలగువారిచే నాంధ్రవాఙ్మయమున ఆధునిక గద్యసారస్వతమున బీజావాపము గావింపబడినది. అప్పటినుండి గద్యరచనయందు తమ యోపిన సేవ జేసినవారిలో వీరొకరు. గృహలక్ష్మిపత్రికకు ముందు, శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారిచే నడుపబడిన ''అనసూయ'' పత్రికయందును, వీరికథలు, వ్యాసములు కనబడుచున్నవి. తరువాత గృహ లక్ష్మికి వీరు నిత్యపూజారిణియై, కెసరిగారిచే ''శారదలేఖా రచనమునకు'' స్వర్ణ కంకణ బహూకృతి నందిరి.

శారదలేఖలలో నా యా కాలములకు చెందిన బహువిధ సమస్యలను వీరు సమగ్రముగా చర్చించి జాతీయ మగు తెలుగున రచించుచున్నారు. అయితే, ఒక చిన్న విషయ మేమన, పత్రికలలో లేఖారచనము ఇంగ్లీషు పత్రికలనుండియే మనము నేర్చుకొంటిమి. కాని తెలుగున నిట్టిరచనకు వీరే స్త్రీలలో నాద్యు లని పెక్కురు వ్రాయగా గాంచితిని.

ఇంతేకాక, అపరాధిని, వసుమతి యను సాంఘికనవలలను, వరదరాజేశ్వరి యను చారిత్రకనవలను, 'పెన్షను పుచ్చుకొన్ననాటి రాత్రి' వంటి ఎన్నో పెక్కు కథలను, ప్రహసనములను, సంభాషణములను, వ్యాసములను వీరు నేర్పుతో రచించిరి.

ఇంకను 1926 వ సంవత్సరమున ముద్రితమైన ద్రౌపదీమానసంరక్షణము, సత్యా ద్రౌపదీసంవాదము అను రెండు ద్విపదకావ్యములు వీరివి కన్పట్టుచున్నవి.

'పద్మ' యను నొక నాటకము (ఒకప్పుడు రేడియో వారి పోటీకి పంపినది) 'ఓటు పురాణము'...మహిళాసభల బుఱ్ఱకథయును వీరి ఆధునికరచనలు. ఇవి యింకను అముద్రితము లనుకొందును. వీరు నిరంతర రేడియో ప్రాసంగికురాలుగా నున్నారు.

ఇక ద్రౌపదీమానసంరక్షణ మనునది వీరి ప్రాథమికరచనగా కనుపట్టు చున్నది. ఇది వీరి ముప్పదివర్షముల ప్రాయమున ముద్రింపించిరి.

"ఏకవస్త్రై వైన హీనవస్త్రైన
కొనిపోక మాననూ కోమలీ నిన్ను"

ఇట్టి వ్యాకరణదుష్టములైన అపప్రయోగము లెన్నో కలవు.

"విజ్ఞానవిదు డైన విదురుడూ యంత
దుఃఖమ్ము యొకకొంత.........
ప్రాతికా మేగి యా పాంచాలసుతను..."

పై పద్యములందు గల యాయా సందర్భములు జూచిన, నిది వారి ప్రాథమికరచన మను విషయము తెల్లము కాగలదు. సత్యాద్రౌపదీ సంవాదమునం దిట్టి దోషము లంతగా గానరావు. భాషయందును శైలియందును పరిణతి గానవగును.

"నా చిన్నిసుతులార! నా యన్నలారా!
జూదాన మీ కెట్టి చుమ్మర్లు వచ్చె?
రాజభోగము వీడి- రాజ్యంబు వీడి,
కానల నుందురె కడు దీనవృత్తి?
నారచీరలను గట్టి, నగలను యొలిచి
కాయగసురుతో - కడుపు నింప."

ఇందలి శైలి యిట్లున్నది.

ఒకప్పుడు వీరి రచనలగూర్చి భారతియందు సమీక్షించిన శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాదుగారి పలుకు లొక కొన్ని యిట నుటంకించుట యప్రస్తుతము కాబోదు. "మొత్తముమీద శ్రీ వరలక్ష్మమ్మగారి లేఖిని గద్యమునందే నిరంకుశముగ

విహరించిన దనవచ్చును. వీరి భావము లున్నతములే కావచ్చును. కాని, ఆభావముల నొప్పించు పదముల బిగింపు వీరి పద్యములయందు కొఱవడినది. అంతే కాక, గద్యమునందు సహితము 'నానా తిట్లు, సకలచిక్కులు, మహోరాంపి, నానా భావములు, ఆగ్రహమందలింపులు, సప్తవన్నెలు మున్నగు దుష్టసమాసము లెన్నో కనిపించుచున్నవి. వీనిని వీరు రెండవముద్రణమున సవరించిన బాగుగ నుండును" అని వారు వ్రాసిరి.

కాని, యిటీవల వారు గావించిన పద్యరచనము కేవల మింత గాఢవిమర్శకు పాలు కాదగినదిగా లేదు.

'లక్ష్మి' యను మకుటముతో నొక శతకమును, 'స్వాగతము' అను మకుటముతో కొన్ని పద్యములును, తమకు శ్రీ కేసరిగారు స్వర్ణకంకణము బహూకరణ మొనర్చినపుడు ప్రశంసాపూర్వకముగ చదివిన "ముత్యాలసరములు"ను, ఇంకను అప్పటప్పటి పద్యరచనలును ఎన్నో కలవు.

'లక్ష్మి'యను సంబుద్ధితో నెన్నో నీతుల నుపదేశించిరి. ఆంధ్ర సారస్వతమునకే యిది ప్రధానలక్షణమో యేమో కాని, ఏదియో ఒక తీరున చాలమంది యిట్లు నీతి నుపదేశించిన వారగపడుచున్నారు.

"సర్వమయుడు స్వామి, సర్వమాతని రూపు
సకల మతని యాజ్ఞ సాగిపోవు;
అతని యాజ్ఞమీర నలవిగా దేరికి
నెఱిగియుండు మిద్ది యెపుడు లక్ష్మి !
విడుతు రెల్ల జనులు, విడుతురు బంధువుల్,
విడుతు రాప్తులైన విహితజనులు;
విడువరానివాడు, విడిచిపెట్టనివాడు
దేవు డొకడె సుమ్ము తెలియు లక్ష్మి !
విద్య చూపరాదొ ? వెఱవు చూపగరాదొ !
మఱల పెండ్లి చేసి మనుపరాదొ ?
పతి గతించినంత బాధింపగా నేల ?
తెరువు చూపకుండ తెలుపు లక్ష్మి! "

ఇట్టి వింకను నెన్నిటినో నీతు లుపదేశించిరి. వయోవృద్ధురాలై శ్రీమతి వరలక్ష్మమ్మగారు చేసిన ఉపదేశములను పతితలు ఆచరణయోగ్యములుగా గ్రహించిన బాగుండును.

ధాతవత్సరమున కిచ్చిన శ్రీమతిగారి స్వాగతము బహురుచిరముగ నున్నది.

"స్వాగతము ధాత నామకవత్సరంబ!
స్వాగతము నీకు మనసార స్వాగతమ్ము.
ఆరువదేండ్లకు మఱలి మా యాంధ్రభూమి
పాలనము సేయ పని బూని వచ్చినావు;
హర్ష మయ్యెడు గాని, నీ యాగమనమున
కల దొక భయము మా మది గాఢముగను
-చెప్ప మొగమాట మైనను చెప్పివైతు-
... ... ... ...
ఆరువదేండ్లకు పూర్వ మీ వరుగుదెంచి
తెలుగువారికి తిప్పలు తెచ్చి తంట,
నాటి నీ దుష్ప్రభుత్వంపు మాట దలచి
కలగి వాపోవుచున్నారు తెలుగుజనము,
ఎచట నుంటివో యిన్నాళ్లు నెఱుగ వేమొ
మా సమాచారముల నిసుమంత యైన?
సిరుల కిరవగు బంగారు సీమ కేగె
వాన లెడ యయ్యె, నీటికి వల్ల దయ్యె
... ... ... ...
పొసగ మేల్జేసి వెస సాగిపొమ్ము ధాత!"

అని పేరు జాతీయ మగు కవితామృతముతో ధాతకు మధుపర్కమును సమర్పించిరి.

ఇక వీరి ముత్యాలసరాలతో హృదయము గ్రైసేయవలె నని నేనును మీతో బాటు తమకపడుచుంటిని.

'అస్మదీయ లేఖాసుమాళి కాంధ్రదేశం బన్ని దిశలను
నే మహామహు నాదరమ్మున నీ మహాయశ మబ్బెనో
ఆంధ్రమహిళాభ్యున్నతికి నై యహరహంబును బాటుపడియె డి,
వరగృహలక్ష్మిజనకు డై వరలు నెవ్వాడో,
"ఆ కేసరీమహాశయునకై - అంకితం బొనరింతు లేఖల
నిమ్మహాజన సమక్షమునను సమ్మదంబునన్."

నవ్యకవిత్వ్ఝు లొకరు ముత్యాలసరముల కూర్చుట, అందఱు తలంచునట్లు సుకరము కాక కడు దుష్కర మనియు, అట్టి రచనకు కవిత్వ విషయమున చేయి తిరిగినవారే ప్రయత్నించిన బాగుండు ననియు ననిరి.

వీరినే కాక, తమకు చిన్ననాటనుండి హితచింతకు లైన శ్రీ నరసింహం పంతులుగారిని భక్తిపూర్వకముగా కృతజ్ఞతా స్మేరభావముతో స్మరించినారు. వీరు ఒకచోట తమ భర్తగారికిని కృతజ్ఞతను జూపియున్నారు.

వీరి గద్యరచనకు వాఙ్మయమున నొక స్థానము కలదు. తెలుగునుడికారము, జాతీయములు వీరిరచనలలో తొంగి చూచుచుండును. గద్యరచనమున సుప్రసిద్ధ వాఙ్మయకర్త్రిణిగా పేరొందిన యీమె వ్యాసములు ఆంధ్రసరస్వతి కమూల్య భూష లనుటలో నతిశయోక్తి లేదు.

''వాములు మ్రింగు స్వాములకు పచ్చిగడ్డి ఫలహారమా?" ''ఇచ్చిన వారీగయు, పుచ్చుకొన్నవారు పులియునుగదా !" "కొండంత తండ్రి కంటె ఏకుల బుట్ట యంత తల్లి మేలు." "ఎవరికైన నున్న మాట యన్నరొండి గాల్చుకొని నట్లుండును --'' ఇట్టివి వారి రచనలలో లెక్కకు మిక్కుటము వీరి. యనర్ఘ కావ్య రత్నములు ఆంధ్రభారతి కమూల్య గ్రైవేయకము లనక తప్పదు.

# 60. శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు

# 61. శ్రీమతి పొణకా కనకమ్మగారు

శతాబ్దముల తరబడి బానిసతనమున గ్రుంగుడువడి అజ్ఞానాంధకారచ్ఛటాపరీవృతమైన భారతదేశము బాధలు బాపుటకయి యహింసా వ్రతదీక్షాపరుడయి, సత్యాగ్రహోద్యమము నడిపి, నలుబదికోట్ల జీవరాసుల స్వేచ్ఛాపరతంత్రుల గావించిన యుగపురుషుడు గాంధీజీ అడుగుజాడల ననుగమించి దేశదాస్యశృంఖలల ద్రెంచుటకయి, సేవావ్రతమును స్వీకరించి, ప్రాణము లొడ్డి, పెండ్లిపందిటికివలె కారాగారమున కేగి, జాతికి గరువము దెచ్చిన శుభ్రకీర్తులలో కృతజ్ఞతమెయి స్మరింపదగిన అభినేయములు కల్గిన యీ కవయిత్రీద్వయము రాజకీయరంగముననే కాక, సాహిత్యరంగమునను సమున్నతికెక్కిన జన్మవిశేషము కలది.

గాంధీదేవుని సహచరి పూజ్యమాతృశ్రీ కస్తూరిబా పేరిట నెల్లూరులో బాలికల విద్యాలయము నెకొల్పి నిర్మాణాత్మక మగు సేవ గావించుచున్నారు.
భాషాడంబర మేమియు లేక గాంధిగురుదేవునియొక్కయు, రమణభగవానునియొక్కయు బోధల నిండార దనిసిన ఫలమో యనునట్లు, విశుద్ధమైన అంతరంగమును ప్రతిబింబించు తెల్లనైన ఖద్దరు ఉడుపులను దాల్చి నిరాడంబర వేషములతో ఆ విక్రమపురీ ప్రశాంతారామవాటికలలో పాఠశాలాకార్యము లొనర్చుట చూడ నేత్రకైరవ ముచ్చటగ నుండును.

అణకువ వెలివియు, మచ్చలేని మర్యాదతో వచ్చిన యతిథులకు మనసిచ్చి మాట్లాడు స్వభావము కలిగి వీ రాంధ్రస్త్రీల కాదర్శప్రాయురాండ్రగుచున్నారు,

గీతాకారుడు వాకొనినట్లు, "యోగః కర్మ సు కౌశలమ్" అను నుడి యిట్లు సాహిత్యరంగమునను, అటు సంఘసేవారంగమునను సార్థకము చేసినారు. ఎన్నో

పత్రికలు వీరి రచనలచే నలకృతము లైనవి. వేంకటపార్వతీశ్వరకవులు, తిరుపతి వెంకటకవులు అనునట్లు, స్త్రీలయందు వీరును జంటకవయిత్రులైనారు.

వీరు ముద్రించిన గ్రంథములు కడు కొలఁదిగ మాత్రమే కలవు. అవి యన్నియు రమణభగవత్సంబంధములే. జ్ఞాననేత్రము, ఆరాధన, నైవేద్యము అను నవి ముద్రితములు. అముద్రితము లైనవానిలో చక్కని తేటగీతలు ప్రధానముగా చేసికొని యనువదించిన 'గీత' యు రమణ గీతయు ప్రధానములు. 'ఆంధ్రస్త్రీలు' మున్నగుపొత్తము లింకెన్నో వ్రాయదలచియున్నట్లు వినియుంటిని.

ఇందు జ్ఞాననేత్ర' మనునది 'గీత' లోని శ్లోకముల కప్పటప్పట పత్రికలలో ప్రచురించిన కొన్ని యనువాద పద్యముల సంపుటియె.

'సర్వభూతస్థ మాత్మానం । సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా । సర్వత్ర సమదర్శినః.'

అను గీతాశ్లోకమునకు వీరి యనువాదము.

సకలభూతవితతి సమదర్శనుం డయి
యోగబుద్ధితోడ నుండువాడు
తన్ను నఖిలభూతతతియందు, తనయందు
నఖిలభూతచయము నరయుచుండు.

"అనన్యాశ్చిన్తయన్తో మాం । యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం । యోగక్షేమం వహామ్యహం."

దీనికి వీరి యనువాదము.

ఎవ్వ రితరచింత లేమియు లేకయె
నన్నె సేవ చేయుచున్నవారొ,
సతతయుక్తు లట్టి జనుల యోగక్షేమ
ములను నేనె యోచు పూనువాడ.

పద్యము లెట్లున్నవో పరికించితిరా! పులుగడిగిన ముత్యములట్లు, కాంతి విక్రాంతము లీ చిన్నగీతములు. గీతానువాదము మిగులకష్టతరమైన కార్యమని విజ్ఞు లెఱుగుదురు. అత్యంతదుర్గ్రాహ్యములగు ఆధ్యాత్మికభావముల నాకళించుకొనుటే

మిగుల కష్టము. అట్టియెడ మూలమున కవిరుద్ధముగ రచించుట సిద్ధహస్తులకేకాక, యితరుల కలవి కాని దని వేరే నుడువవలెనా ? పురుషులయందును గీతానువాదము చేసినవారున్నారు. కాని సులభాన్వయముతో సంగ్రహరచన చేసిన వారందును అరుదుగనే యున్నారు. పురుషకృతములలో శ్రీ బచ్చు పాపయ్య శ్రేష్ఠిగారి యను వాదము సుగ్రహముగ నున్నదని కొందరి యభిప్రాయము.

స్త్రీలలో నిట్లు స్తుతిపాత్రముగ, సుకరముగ, సుసఙ్గ్రహముగ, సులలితముగ, గీతానువాదము పచరించిన వారిలో ప్రథమగణ్యత వీరికే ప్రాప్తింపగలదు. విశేషించి వీరి గీతానువాదము విశదమయి యపుడె విచ్చిన విరజాజివలె నున్నది.

"తనకు దనయంత ప్రాప్తించుదానఁ దనిసి
ద్వంద్వముల కతీతుడయి మత్సరము వదలి
సిద్ధ్యసిద్ధుల సమదృష్టి నెందు నతడు
కర్మముల నాచరించియు గట్టువడడు.
హర్ష మొందక ద్వేషమ్ము లంటబోక
శోక మందక యాశకు చోటు లేక
అనయమును శుభాశుభ పరిత్యాగి యైన
భక్తు డెవ్వ డతండు నా పరమహితుడు."

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

"నేనె వైశ్వానరుండనై నిఖిల మైన
తనువులందును నాల్గువిధమ్ములైన
యన్న పానములను జీర్ణ మందజేయు
చుందు సుమ్ము ప్రాణాదివాయువులగూడి"

ఈ అనువాద మంతయు నిట్లే సరళ మయి, మూలమునకు మిక్కిలి సన్నిహితమై, జాళువాపసిండి బోని జానుతెనుగుపసల నెసలారుచున్నది.

అట నట మూలమున కనుగుణ్యముగా దీర్ఘవృత్తములును కలవు.

విశ్వరూపప్రదర్శనఘట్ట మగు ఏకాదశాధ్యాయమునందలి యీ పద్య మట్టిదే.—

"అరవిందాసనసంస్థితుం డయిన దేవాధీశ్వరుఁ బ్రహ్మ ద
త్సరణిఁ సర్వసుపర్వకోటుల ఋషీంద్రవ్రాతముఁ దివ్యమౌ
యురగానీకము లెల్ల భూతగణముఁ నుర్విఁ సమస్త మ్మిదే
యరయం గంటి భవత్స్వరూపమున దేవా! సర్వలోకేశ్వరా!"

రెండవది యగు రమణగీత భగవానులకును ముఖ్యముగ దన్ముఖ్య శిష్యు లగు వాసిష్ఠగణపతి మునికిని జరిగిన ప్రశ్నోత్తరరూప సంభాషణము. ఇదియు ననువాదమే.

చతుర్థాధ్యాయమున జ్ఞానస్వరూపకథనమునందలి యొక ప్రశ్న.

"మునివరేణ్య! అహంబ్రహ్మ మనెడి వృత్తి
యదియె జ్ఞానమ్మొ, లేక బ్రహ్మమ్మొ, నేను
ననెడి బుద్ధియె జ్ఞానమ్మొ యట్లు గాక
నేను సర్వమ్మనెడి బుద్ధి యౌనొ చెపుమ."

మరియు నీ సర్వజగమె బ్రహ్మ మ్మటనెడు
నదియె జ్ఞానమ్మొ? ఈ నాలు గైన వృత్తు
లకును మించిన దగుచు విలక్షణ మగు
నద్దియే జ్ఞాన మగునొ? యెయ్యదియొ తెల్పు.

ప్రత్యుత్తరము:—

ఈ సకలవృత్తులు దలంపు లేను, సంది
యంబు లేదు, తత్త్వజ్ఞాను లైనవారు
శుద్ధమగు స్వరూపస్థితి జొప్పడంగ
నుండుటయె జ్ఞానమని చెప్పుచున్నవారు-

జిజ్ఞాసు హృదయపద్మకుట్మలముల వికచారవిందముల నొనర్చు ఉదయ రాగములవలె నున్న ఈ పద్యముల జూడుడు.

ద్విపదమంజరిలో రమణభగవాను నారాధించినదే 'ఆరాధన' అను కావ్యము.

"కరుణామయమ్ములు, కాంతిపూర్ణములు
అరమోడ్పుకన్నుదామరలలో తొణుకు
వాత్సల్యమధువు లవారిగాఁ గురియ
కమనీయ మగు ప్రేమకలశమ్ము వోలె.

జగములఁ దన్పు తేజస్సముద్రమ్ము
అడుగడుగునకు క్రొత్తయందమ్ము దోప
తనివి దీరని యమృతస్వరూపమ్ము
నిరతమ్ము మాలోన నివసించు గాక!
ఉదయభానుని యట్టు లొకవేళ వెలుగు,
కఱక గగన మట్లొక వేళ నుండు.
అరయ మహాబ్రహ్మ మటు లొప్పు నొకట,
కనపసిబాలునిగతిఁదోచు నొకట,
పూలలో గంధమ్ము పొలుపారునట్లు,
ఆకాశమున వాయు వలరారినట్లు
బహిరంతముల సర్వవ్యాప్తి నొంది
సకలమ్ము తానయై సాక్షాత్కరించు."

ఇందు జ్ఞానకిరణకాంతిచే నెరవిరిసిన వారి హృదయాబ్జముల నుండి తొరగిన భగవద్భక్తి మరందధారాపూరము. "ఉదధు లన్నియు మీరి ఉర్వి చదలును పారి" జగతీరంగమును రసప్లావిత మొనర్చినది.

ఇక తుదను భక్తిరమణు కిడిన నైవేద్యమును మనమును నొకింత ప్రసాదముగ స్వీకరింతము.

"నిలిచి నిన్నుజూడ నిలు వెల్ల వివశమై
యణువు నణువు బొగడ నాళ వొడము
వాక్కు లేల - మౌనవాటిక జేరునో
సచ్చిదాత్మకిరణ ! జ్ఞానరమణ !"
"వాచోనివర్తన్తే యత్రాప్య మనసాసహ''
అను నుడి కిది యుదాహరణము వంటిది.

గాలి లేని దీపకళిక చందమ్మున
అలలు సుడులు లేని యబ్ధిపోల్కి
సర్వకాలములను నిర్వికారుడ వీవు
సచ్చిదాత్మకిరణ ! జ్ఞానరమణ !

చిత్తలయము చేసి, చిద్వీణ సారించి,
ప్రకృతి కేలు మోడ్చి, ప్రణవరవము,
రేయి బవలు నొక్కరీతి నాలాపించు ॥సచ్చి॥

వీరి కావ్యము లన్నియు నిట్లే సహజసుందరములుగను సరళములుగను నున్నవి. కాని యట నట నీషద్దోషములు గానవచ్చుచున్నవి:— "ప్రాపంచమున కెల్ల బ్రహ్మతత్త్వము" "అరుణశైలమ్ము ప్రత్యక్షమైన యంత...... యరుణిమ మ్మయ్యె ననంత విశ్వమ్ము" అను చోట్ల నామవాచక విశేషములకు బదులు, గుణ వాచక విశేషములు వాడబడినవి.

ఇట్టి యలంతు లగు వ్యాకృతిదోషము లు గానంబడుచున్నవి.

ప్రసన్న గంభీరములును, నోజస్వంతము లగు రచనా రామణీయకముల నించిన యీ రమణీమణుల కృతులు రమణీలోకమునకు కీర్తియు, వాఙ్మయప్రపంచ మునకు స్ఫూర్తియు బెంపొందించిన వన్న నత్యుక్తి కాదు.

ఇట్లు స్త్రీలోకానికి తిలకప్రాయులాం డైన ఈ శ్రీమతులలో శ్రీమతి కన కమ్మగారు 1892 లో నెల్లూరుజిల్లాలో మరుపూరు కొండారెడ్డిగారికి రామమ్మగారికి జన్మించిరి. వీరి భర్తగారు ఆగర్భశ్రీమంతులు పొణకా సుబ్బరామరెడ్డిగారు. వీరి కుటుంబ మనాదిగా దానధర్మముల కెంత ప్రశస్తి గన్నదో, దేశసేవయం దంత ప్రసిద్ధి గన్నది. ఈయమ 1921 వ సంవత్సరము నాటి కాంగ్రెసు తొలిదశనుండి నేటివఱకు కాంగ్రెసు సేవకురాలుగా ఉన్న తరుణి. ప్రజోద్యమములలో లక్షలాది ఆస్తి హారతికర్పూరమువలె హరించిపోగా పీడిత రైతులోకమున జీవనజ్యోతులు తిరిగి వెలిగించినారు. వీరి కృషిఫలితమే జమీఁరైతు పత్రిక. 1930 సత్యాగ్రహో ద్యమమునందును మఱియొకమారును జైలు కేగినారు. ఆలిండియా కాంగ్రెస్సునకు తొలి తెలుగుస్త్రీసభ్యురాలు. ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్సునకు తొలి తెలుగు ఉపాధ్యక్షు రాలును నీమెయే. దేశాభ్యుదయమునకు జాతీయవిద్యయే పునాది యని నమ్మి గాంధీజీ ఆదేశం ప్రకారం 1923లో నెల్లూరున శ్రీ కస్తూరీదేవీ విద్యాలయము స్థాపించి నిర్మాణాత్మక మగు కృషి చేయుచు, నా సంస్థను మిక్కిలి యున్నత స్థితికి దెచ్చినారు.

సుమారు ముప్పది సంవత్సరములనుండి వీరికి కుడిభుజమువలె నుండి దీక్షగా సేవాకార్యముల నిర్వహించుచున్న శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు 1904లో పశ్చిమగోదావరిజిల్లా ముత్యాలపల్లె వాస్తవ్యులు. శ్రీ చన్నాప్రగడ సుందర రామయ్యగారికిని, సీతారామమ్మగారికిని పుత్రికగా జన్మించినారు. ప్రస్తుతము జంషెడ్పూరులో టాటా కంపెనీలో ఇంజనీరుగా పనిచేయుచున్న శ్రీ ద్రోణంరాజు శేషగిరిరావుగారు వీరి నుద్వాహమాడిరి. వీరికి శైశవమునుండియు సారస్వతపిపాస మెండు. వీరి కుటుంబమే సారస్వతాభిలాష గల కుటుంబ మన్నను నతిశయోక్తి లేదు. హృదయమును గాయపఱచు సన్నివేశమై ఏకైక పుత్త్రీమరణము తటస్థింపగా, కొన్నేండ్లు రమణాశ్రమవాసము చేసినారు.

ఈమెయు గొప్ప జాతీయవాదియే. మొదటినుండియు సత్యాగ్రహోద్యమమున పాల్గొని సేవ చేసినవారే. కొన్నాళ్లు జిల్లాకాంగ్రెసు సంఘ కార్యదర్శినిగాను, చాలాకాలము ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు మహిళాసంఘ అధ్యక్ష కార్యదర్శిని పదవులతోను వీరు చేసిన కృషి నిరుపమానముగా ప్రశంసింపదగినది.

ప్రస్తుతము నెల్లూరున శ్రీ కస్తూరీదేవీ విద్యానిలయమున నిల్చి దేశ సేవను, భాషాసేవను చేయుచున్నారు.

---

# 62. 'కవికలహంసి' చేబ్రోలు సరస్వతీ దేవిగారు

## సరస్వతీ రామాయణము

సరస్వతీ రామాయణము, సరస్వతీ శతకము, సత్యనారాయణ వ్రత కల్పము, ఆత్మోపదేశము, పతివ్రతాశతకము అను కావ్యముల రచించి సుప్రసిద్ధ స్నేహలతాకవితాసంఘ ఉపాధ్యక్షపదవి నధివసించి తనరిన శ్రీమతి సరస్వతీదేవిగారు చక్కని కవితాగుణ మెరిగినవారు. ఈమె స్నేహలతా కవితా సంఘాధ్యక్షులగు శ్రీ వాజపేయాజుల రామసుబ్బరాయశాస్త్రిగారి శిష్యవరేణ్య. నూజివీడు పురవాసులు శ్రీ చేబ్రోలు రాజగోపాలమునాయుడుగారి సతి. నీలగిరి

నివాసులు, సుప్రసిద్ధ న్యాయవాదు లగు కీ. శే. రాజగోపాలమునాయుడుగారి కుమారి.

చల్లని వాతావరణమున బుట్టి చల్లని గాలి బీల్చుచు పెరిగినందుననే యేమొ, యీమె కవితామృతమును చల్లనై, సరసుల యుల్లము లలరింప జాలిన దని విమర్శకు లనిరి.

కేవల మాంధ్రముననే కాక, ఆంగ్లమున ప్రవేశపరీక్షయందు కృతార్థురాలై, ఆయుర్వేదమున ప్రవేశపరీక్ష నిచ్చి, హిందీయందు రాష్ట్రపరీక్షను కృతార్థురాలై, సంస్కృతమునను ధారాళ మగు సాహిత్యజ్ఞాన మలవఅచుకొని చదువుల సరస్వతి యైనది. ఈయమ భర్త రాజగోపాలముగారు జ్యోతిశ్శాస్త్రమున దిట్ట. వేదాంతమున గడు ననుభవజ్ఞులు. అగుట దనసతిని గూడ శాస్త్రముల ప్రజ్ఞామతింగావించెను. జ్యోతిషమందలి యీయమ ప్రజ్ఞ గాంచినవారు ముక్కుపై వ్రేలిడికొని యబ్బుర మందెద రట.

బాల్యమున కాంచీపురమున శ్రీ కందాడై కృష్ణమాచార్యులకడ పంచకావ్యములు, నాటకాలంకారములు చదివి సాహిత్యజ్ఞాన మలవఅచు కొన్నది. క్రమక్రమముగా ననేకభాషలలో పరీక్షల నిచ్చిరి. కేవలము ప్రదర్శనలకై పరీక్షల నిచ్చుట కాక, జ్ఞానసముపార్జనకొఱకు చదివి కుదురైన పాండిత్యము సంపాదించి, కవితారూపమున నద్దానికి సార్థక్యము గూర్చిన నేర్పరి. ఈయమ సరస్వతీ రామాయణమును నూజవీడు సంస్థానరాజ్ఞి ప్రచురింపించిరి. మద్రాసు విశ్వవిద్యాలయము వారిచే పట్టపరీక్షకు గొన్నాళ్లు పాఠ్యభాగముగా వరింపబడినది. శ్రీ కేసరిగారు స్వర్ణకంకణ బహూకరణము గావించి 'కవికలహంసి' బిరుదము నిచ్చి సంభావించుటే కాక, గృహలక్ష్మి ఉపసంపాదకురాలుగా నొనర్చి యర్హసమ్మానము చేసిరి. ఈమె తన కావ్యమున దన కవితాగురు వగు రామసుబ్బరాయశాస్త్రిగారిని మిగుల ప్రశంసించిరి. కవిత్వము నిర్దుష్టమై జాతీయప్రయోగముల వీనుల విందు గూర్చును.

మొల్లరామాయణము 800 పద్యముల ప్రబంధమై యుండ, ఉత్తర రామ చరిత యేడుకాండములతో నిది 1900 పద్యములు గల రసవత్తర కావ్యమై యున్నది. శ్రీమతి సుభద్రయాంబగారి రామాయణము యుద్ధకాండవఱకే

2000 కు పైబడి పద్యములు గలవు. మొల్ల యెక్కువ నియమములకు దావీయక, సంగ్రహకథాగమనమును నిర్నిరోధముగా నిర్వహించినది. ఈమె వర్ణనలకు హెచ్చు తావిచ్చినది. సుభద్రయాంబగారు కథల కెక్కువ ప్రాముఖ్య మిచ్చిరి. అయ్యల రాజువారిది, మొల్లది కావ్యధోరణి నున్నది. సీరంవారిది పురాణధోరణి. వీరిది కూడా పురాణధోరణి యనియే కొంద రనిరి. కాని, వీరి ఉత్తర రామచరిత్ర ప్రబంధధోరణి నున్నది. సరస్వతిగారి ఉత్తరరామచరితమున శ్రీ సీతారాముల విహారవిలాసములకు హెచ్చుప్రాధాన్య మిచ్చి కథాభాగమును జాల సంగ్రహించినది. లవ కుశుల యాగాశ్వహరణ మిందు ప్రసక్తము కానేలేదు. కడపట సీతాభూమివివరప్రవేశానంతరము శ్రీరామావతారోపసంహారపర్యంతము కల గాథను బెంచి వ్రాసిరి. లోకమున నెక్కుడు వ్యవహారములో నున్న కథకు హెచ్చు ప్రాధాన్యము నియ్య నేల ? లోకమునకు దెలియని కథ కెక్కువ ప్రాచుర్యము నిచ్చి వెలయింపవలె నని తలంచిరి కానోపు ! అయినను కుశలవుల వృత్తాంతమునకు కొంచెము సందిచ్చి తీరవలెను గదా !

ఈ కావ్యరచనమున నీమె కొన్నియెడల క్రొత్తదారులు చూపినది. ఇష్టదేవతా ప్రార్థనముతో బాటు పతివ్రతాప్రార్థనమును పచరించుట యొక ప్రత్యేకత యనవచ్చును.

"సతతము ధర్మచింతనము, శ్లాఘ్యతమం బగు శీలవృత్తులున్,
బుతమృదువాక్కు, నెందును జలింపక నిల్చెడు దైవభక్తియున్,
హిత మగు రూపసంపదయు, హెచ్చిన ప్రేమరసంబు మీరగా
పతిపదసేవలన్ మెలగు భవ్యచరిత్రల కేను మ్రొక్కెదన్. "

"అమలశశాంకబింబముఖ మశ్రుకణంబులు నిండి యుండ, న
క్కమలసుగంధి రామపదకంజములం బడి యార్తచిత్తయై,
నిముషము నిన్ను బాసి యిట నిక్కముగా వసియింప జాల, నీ
సమముగ శోకభోగముల సందడి నాకును భాగ మీయవే.''
అన్న సీతాసాధ్వి వాక్యములు సరళ సహజముగ నున్నవి.

ఈ కావ్యమునందలి చక్కని పద్యముల మచ్చునకు :—

నల్లనిమేనివాడు, చిఱునవ్వులు చిల్కెడు మోముతోడ శో
భిల్లెడువాడు, చక్క నగు పీవరవక్షమువాడు, సోగలౌ
పుల్లసరోజపత్రముల బోలు కనుంగవవాడు, లోకముల్
జల్లగ నేలువాడు, కరుణాఖని శ్రీరఘురాము డమ్మరో."

''ఎక్కడి వానరాధముడ ? పీవిటు రాదగు హేతు వెద్ది ? నీ
కిక్కడ నాప్తు లెవ్వ ? రెటు లీవు మహాంబుధి దాటితో ? సుధా
భుక్కులు గూడ లంకమొగముం గన నోపరు, జీవితేచ్ఛ లే
కిక్కరణిం దెగించుటకు నెవ్వడొ నీ కిట నండ? తెల్పుమా."

''పద్యములు సరళముగ బాగుగనే యున్నవి. కాని, యాయాయి పట్టులలో వారు కొంత అశ్రద్ధ చేసి మెలకువతక్కువతనము చూపిరా యనిపించుచున్న" దని యొకరు విమర్శించిరి. "నల్లనివాడు." అను పద్యముతో హరిస్తుతి సేయుట పోతన తరువాత పరిపాటి యైపోయినది.

సీతను భయపెట్టిన పద్ధతి ప్రాతపంథయే:—

చంద్రశాలలయందు చలువవెన్నెల గాదు,
చండమార్తాండ ప్రచండలక్ష్మి;
పసిడి యుయ్యెలమీద పండి యూగుట గాదు,
కాంతార కంటక కఠినభూమి.''

ఇట్టి పద్యరచనకు పోతరా జాద్యుడు.

''సమదపుష్పంధయ ఝుంకారములు గావు,
భీషణకుంభీంద్ర బృంహితములు.''

ఇట్టి భావమునే శ్రీ చిలకమర్తివారు అచ్చ తెనుగులో అందగించియున్నారు.

"కదలు కొండల బోలు గజతండములె కాని,
గండుకోయిల పిండు లుండ వచట"

ఈ కవికలహంసి పై రెండింటిలో గల ఉభయభాషల పల్కు పరువమును సమపాళముగా తన కవితలో మేళగించినది. సాధారణులైనచో ఒక పాదము

సంస్కృతము, ఒక పాదము తెలుగునుగా నొనర్చిన సమమగు పాకము కుదురక తూకము చెడును.

వీరి పద్యమున నట్లు గాక, సంస్కృతాంధ్రముల రెంటను ఒకే విధమగు తూఁగు కుదిరినది. కాని ప్రథమపాదము 'చలువవెన్నెల గాదు' అని కర్తృపద ముతో ముగించినపుడు, రెండవపాదమునను ''ఉయ్యేల కాదు" యనికర్తృపదము తోనే ముగించవలసియున్నది. కాని వీరట్లుగాక, రెండవపాదము "పండి యూగుట కాదు" అని భావార్థకముతో ముగించిరి. సీసములలో వీనిని ప్రక్రమభంగ మందురు. ఆ రెండవపాదము "పవళించి యూగగా పసిఁడియుయ్యేల కాదు" అని కూర్చినచో సరిపోయెడిది. కవితామహనీయహృదయు లగువారి కిది తోచలేదని కాదు మా యీ సూచన !

ఏదో వారు దీనిని గమనించి యుండకపోవచ్చును.

సీత రాముని వెదుక లక్ష్మణుని పొమ్మనినపుడును, రావణు డంతిపుర కాంతలతో విహరించి రాత్రి పరున్నవిధమును జూచి, ఆంజనేయుడు వర్ణించు ఘట్టమునను,కాసుకారావమానమును సీతాసాధ్వి పతికి దెల్పు ఘట్టమునను ఔచిత్యము పాటించి తత్తదుచితవర్ణనముల వెలయించిరి.

పతిప్రాణ యగు సీతాదేవి ప్రణయసందేశము:—

మవ్వమున జంట బాయని గువ్వలకును,
సారసంసార మెఱిగిన జాణలకును,
ప్రణయబంధములో నున్న రసము తెలియు...

కాని ఇతరులకు తెలియదు. అట్టియెడ ప్రణయపరాకాష్ఠ జెందిన ఆదిమ దంపతులమై భూమిని ప్రేమరసప్లావిత మొనర్చుటకై యేతెంచి, నేఁటివఱకు ''మవ్వమున జంట బాయని గువ్వలవలె'' నున్న మాలో మాకు విరహము కల్పించుట కా రాముని కెట్లు మనసొప్పినది ? అనునంత గంభీరార్థము వెల్వరించుచు పేర్చిన యిచ్చట పద్యముల పేర్పు బాగుగనున్నది.

సీత రాముని గూర్చి లక్ష్మణునితో నింకను నే మనునో —

''వా కెక్కటు లాడెనో ? మనసు వజ్రమయం బయిపోయెనో ? కటా !
మక్కువ మాయ మయ్యెనా ? కుమార ! స్వసౌఖ్యము గోరియైన న

న్నక్కడ నిల్ప డయ్యెగద హా! యిక నేటికి మేనఁ బ్రాణముల్?
వ్రక్కలు గాదె నాదు మది వజ్రమొ యిట్టి కఠోరవార్తకుఁ?''

ప్రపంచమున నెలుగెత్తి ప్రణయప్రచారము చేయవలసిన రామునకు 'మక్కువ మాయ మయ్యె' నని యామె కటకట బడినది.

సీతారాములు జలవిహార మొనర్చిన సరస్సు:—

"నవజాత వనజాత నవసీధురసపీత
మధుకరకులజాత మధురగీత
మిందీవరోత్పల బృందావలంబిత
కోక కోలాహలాకులిత కూల
మాలోల బిసరుహనాళాదనా మత్త
కలహంసకలరవ కలిత కవిత..."

మై, భట్టుమూర్తిగారి సరోవరముతో సఖ్యము నెఱపజూచినది. కాని, సీసమున అసాంత మీతూగు సాగిన బాగుండెడిది.

ఉత్తరరామాయణమున శ్రీ సీతారాముల ప్రణయవిహార విలాసమాయమ రచనయందొక వింతభంగిమములతో హరువు సూపినది.

''తళుకారు వాలుజూపుల బెడంగులు కాక,
సన్నకాటుకరేఖ వన్నె గలసె;
నకలంక చంద్రబింబాననంబే కాక,
దరహాసచంద్రికల్ దళముకొనియె."
"చెలి! దాహ మయ్యె, నీ చిగురుమోవి యొసంగి
తనివి దీర్చిన నీదు తపము పండు."

అను పద్యములు ప్రబంధధోరణిని విహంగి కలఋుతమువలె, కోయిల కూజితములవలె మధురములై యున్నవి. కాని, యా యాదిమ దంపతుల విహారముపట్ల నిట్టి గంభీరహీన వర్ణనలు కూడునా?

ఈ పట్టున పరితల కా దేవదేవులపై గల భక్తిగంభీరభావము చెడలేదా? యని యనుమానము. కాళిదాసంతటివాని నిట్టి వర్ణనల విషయమున నానందవర్ధనుడు తడవక విడువలేదు. ఇది ఆలోచింపదగినదే.

అచ్చటచట "మణిని బాసిన ఫణిరాజు ఫణములట్లు" అనునట్టి యుపమలు కలవు.

ఇట్లు సమ్మోదసంధాయకముగా సమలంకరించి రామాయణమును సరస్వతీదేవి కుడుగర బెట్టినది.

సరస్వతీరామాయణమును శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారును, శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారును, నింకను పెక్కురు సమకాలీన కవయిత్రులును సన్నుతించిరి.

"పూలతేనె చుక్కల గురియించు మేలయిన కైత నీక సెల్లెడుఁ"

"పోలిక లేని మేలయిన పోకల బోయెడు నీ కవిత్వపుం
జాలు సుధారసాల నగజాలు, పదా లిక జాజిపూ లనం
జాలును, సొమ్ము లన్న సహజాలు, వరాలసరాల నేలు, చే
బ్రోలు సరస్వతమ్మ! నిను బోలిన మొల్లయె పోలెడుం జుమా."

ఇవియే కాక, వీరు ప్రచురించిన బాష్పాకులిత, మదయంతి, తెలుగుతల్లి మున్నగు శీర్షికల పద్యములు బాగుగ నున్నవి.

బాష్పాకులిత:—

తే రెక్కి దశదిశల్ తిరుగాడు బలగుణ
మాన్యుండు ధన్యుండు మామగారు
సకలారిషడ్వర్గజయశీలు, డనఘుడు,
ప్రేమవారాశి నా ప్రియజనకుడు
పక్షపాతము లేక రాక్షసకుల మెల్ల
బట్టి కూల్చిన మహాబలుడు విభుడు
మేఘనాదుని గూల్చి మేదిని విఖ్యాతి
బడసి వర్ధిల్లెడువాడు మఱది
కోటిబలగంబు లుండియు మాట కైన
దోడు లేదాయె నక్కటా! తుట్టతుదకు
నడవి పాలైతి నీ గర్భమందు బుట్టి;
యిన్ని యగచాట్ల కైతి నే కన్నతల్లి.

ఇది సీతావచనమే.

"పువ్వుల బోలు నంగములు పొ ల్పెసలారగ, రాగమాలికల్
నవ్వులవెన్నె లై నవవిలాసము దోపగ, మందయానయై
క్రొవ్విరిగంధి దా నచటకుం జనియెన్ మదయంతి, మాలతీ
పువ్వుల గోయు వ్యాజమును బూని మరందుని జూచు వేడ్కతో".

సరస బెరిగిన పూపొదచాటునుండి
స్వాదుమధురోక్తు లెన్నియో సంభ్రమమున
వరల దొడగెను భావనాభరిత మగుచు
ప్రకృతిసహజంబ కాదె యీ ప్రణయరసము.

ఇది మాలతీమాధవకథయందలిదై యుండును.

పీరి సరస్వతీశతకము ప్రశస్తముగ నున్నది.

"విలసిత మైన ఫాలమున వేడుక మీరగ కమ్మవజ్రపుం
దిలకము దిద్ది, కన్నులకు తీరుగ కాటుకబెట్టి, యందమౌ
వెలగల యాణిముత్యముల పేరు లురంబున చౌకళింపగా,
పలుకువెలంది ! నీ ముఖము భావన చేసెద శ్రీ సరస్వతీ."

''అనవరతంబు మోహమున కాస్పదమైన భవాబ్ధి జిక్కి, నే
వినయవిధేయతాగుణము వీడి, తమోమయతత్త్వమందు పూ
నిన మతిచేత దివ్య మగు నీ పదచింత యొకింత లేక, నా
జననము వీట బుచ్చితిని, శారద! ప్రోవుము శ్రీ సరస్వతీ."

పీరి ఆత్మోపదేశ మన్నిటికిని తిలకాయమానముగ నున్నది.

"జనితానందరసాబ్ధి దేలుచును సంసారంబులో జిక్కి, యొ
క్క నిమేషం బయినన్ బరార్థమును నాకాంక్షించి, వేదాంతవే
ద్యుని భావంబున నిల్పి కొల్వకయె సాయుజ్యంబు చేకూరునే?
మనమా! యేటికి జీవితంబు? కనుమా మాయాపహారిన్ హరిన్".

"ధనకాంక్షన్ మొదలంట వీడు మిక, సద్ధర్మానురక్తిన్ వెసన్
జనకాదుల్ మును బోయినట్టి పద మాస్థం బట్టి పొమ్మింక, లో

గనుమా యిచ్చ జరింపగా వలదు, భోగం బంత నిత్యం బొకో?
మనమా! ... ... ... ...

ఈ పద్యముల మకుటము శ్రీ తిరుపతివేంకటకవుల శ్రవణానందములోని 'మనమా! వద్దిక నాదుమాట వినుమా! మర్యాద గాపాడుమా!' అను మకుటమును పోలియున్నది.

పీయూషారసధారల గురిసి లోకులచే విరులసోన గురియించుకొన్న సరస్వతీమతల్లి చల్లని కవితలు సరస్వతీ సమ్మాన్యములే.

---

# 63 శ్రీమతి వాజిపేయాజుల మహాలక్ష్మమ్మగారు

శ్రీమతి సరస్వతీదేవిని గూర్చి వ్రాయగానే, స్నేహలతాకవితా సంఘాధ్యక్షులు, జటప్రోలు సంస్థాన కవీశ్వరులు నైన శ్రీ రామసుబ్బరాయశాస్త్రిగారి ధర్మపత్ని శ్రీమతి మహాలక్ష్మిగారు స్మృతిపథమునకుందట్టుచున్నారు. వీరు ఏవో కొన్ని కావ్యములు రచించిరట. కాని ఇంకను నవి యేవియు అచ్చుపడలేదు. వీరు ప్రచురించిన పోతనభక్తివైరాగ్యములు, భారతనీతులు అను గ్రంథములయందలి యీక్రింది పద్యముల వలన వారి కవిత్వము తెలియగలదు.

"భక్తిన్ భాగవతంబును
శక్తి కొలందిని పఠించు శాంతాత్ములకున్
ముక్తి సు సులభం బగు, వే
దోక్తం బగు మార్గ మిది– బహూక్తు లికెలా?"

"సారము లేని సంసరణసంగతి గాలము బుచ్చబోక, వి
స్తార కథాసుధామధురసారము జిల్కెడు భారతంబులో
నేరితి గొన్ని నీతులను నేర్పడునట్లు జగద్ధితంబుగన్;
నేరవు చాలకున్న జననీ ! నిరసింపకు మమ్మ శాంకరీ."

ఈ సతీతిలకము భర్తగా రగు శ్రీ రామసుబ్బరాయశాస్త్రిగారు ప్రస్తుతము కొల్లాపుర ఉన్నతపాఠశాలాంధ్రోపన్యాసకులుగా నున్నారు.

## 64. శ్రీమతి ఇనగంటి సరస్వతీదేవిగారు

ఈమెయు జటప్రోలు సంస్థాన కవయిత్రియే.

"ప్రబోధ" మను ఖండకావ్యమునందలి వీరి పద్యములు.

"పడతి పుట్టుకతోడనె పరునిసొత్తు,
నీట ముంచిన, పాల ముంచినను, ప్రాణ
కాంతుడే దైవ మంచు నెక్కాల మెంచి,
యతని మెప్పించి మెప్పొంద నగును సతికి."

"అత్త మామ లెంచగ గరినాత్ము లైన,
మించు వేడుక భర్త ప్రేమించెనేని,
పుట్టినింటాసకై లోనఁ బొంగఁ బోక,
కష్ట మెంతైన భరియింపగలదు కొంత."

"అరయ బుట్టింట పంచభక్ష్యపరమాన్న
మారగించుటకంటె, సౌఖ్యం బెసంగు
నబల నొక్క కబళ మైన న త్తగారి
గృహమునందు స్వాతంత్ర్యమై యెసఁగు గాన."

ఇ ట్లున్నది వీరి కవిత్వము.

---

## 65. శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు
## 66. శ్రీమతి జొన్నలగడ్డ శారదాదేవిగారు

జంటకవయిత్రులై దంటతనమున వాఙ్మయరంగమున స్వేచ్ఛావిహారము సల్పిన శ్రీమతులు గిడుగు లక్ష్మీకాంతమ్మ, జొన్నలగడ్డ శారదాంబగార లిర్వురును వదినా మరదండ్రు.

ఇందు మొదటివారగు లక్ష్మీకాంతమ్మగారు రాజమందిరమున 1908 ఫిబ్రవరినెల మూడవతేదీనాడు శ్రీవక్కలంక గవరరాజుగారికిని, శ్రీమతి చెల్లాయమ్మగారికి జన్మించిరి. వీరి నాన్నగారి పూర్వులు చాల ప్రసిద్ధి గన్నవారు. తాత కామరాజుగారు జిల్లాకోర్టు మునసబుపని చేసినారు. వీరి మాతామహులు రాయవరపు అప్పారావుగారు సంస్కారప్రియులు. వీరియింటియందే శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహపంతులుగారు చిరకాలము కాపుర ముండిరి. బాల్యమున మేనమామల యింటఁ బెరిగిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు రసవత్కవిత్వ వాతావరణమున కమ్మని వాసనల నాహరించిరి.

చిన్నతనమున రాజమందిరమున ఉన్నతబాలికాపాఠశాలలో IV form వఱకు చదివి, ప్రతిసంవత్సరము చిన్నపెద్ద బహుమతులు పొందియున్నది. కాని, ఆపుడే జరిగిన వివాహమువలన విద్యావిఘాతము జరిగినది.

వ్యావహారికభాషాబ్రహ్మలగు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి అన్న కుమారులు వెంకటరామమూర్తి పంతులుగారీమెను పెండ్లియాడిరి. శ్రీ పంతులు గారు చక్కని భాషావేత్త. కవిసత్తముడు కూడ. వీరి సోదరీమణియే జొన్నలగడ్డ శారదాంబావిదుషి. శ్రీ పంతులుగారు బాల్యముననే అత్తింటికి వచ్చిన భార్య లక్ష్మీకాంతమ్మగారికిని, చెలియలు శారదాంబగారికిని కవిత్వాభ్యాసము చేయించి నారు. అప్పుడు మొదలుగా సంస్కృతకావ్య పరిచయము చేసి పండితురాలి నొనర్చినారు. వదినా మరదండ్రు అవధానము చేయు శక్తి సంపాదింప జూచి, తన శిష్యురాండ్రింత వారైనారు గదా యని తలపంకించి హర్షించినారు. కావ్యకాంతా రస గ్రహణపారీణులును, కాంతాకావ్యరసపరిగ్రాహకులునైన శ్రీ రామమూర్తి పంతులుగారు నిజముగ సుకృతియే.

వారి చెలియలు శారదాంబను సుప్రసిద్ధవక్తలు, బహురచనా దురంధరులు, బహుభాషావేత్తలు, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణ M. A., L. T., B. L. గారి కిచ్చి పెండ్లిచేసిరి.

లక్ష్మీకాంతమ్మగారు స్కూల్సు ఇన్స్పెక్టరుగా బనిచేయుభర్తతో చీటికి మాటికి నూళ్ళు దిరుగుచు "అంతలు నింతలు నగు సంతానము వెంటనంటి సందడి చేయగా సంసారము నొడిదుడుకులు లేక సరిదిద్దుకొనుచు, నీ యతులిత కవితా

వ్యాసంగమున దవిలి, కావ్యరచయితగా పేరొంది రన్న నది నిజముగా ప్రస్తు తింపఁదగినది. అనురక్తుడైన భర్త తానై ప్రోత్సహించుచుండగా, నిటు లాత్మ సంసారమును, అట కావ్యసంసారమును నేలుకొనుచున్న శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారికి పరీక్షార్థమో యనునటుల, భగవానుడు కష్టములు కల్పించి, 1942 వ సంవత్సరమున భర్తను, అన్నింట చేదోడు వాదోడుగా నున్న మఱదలిని శారదాం బను 44 వ సంవత్సరమునందును మాయముచేసి యెత్తుకొనిపోయెను. ఇట్లొక్కుమ్మడి క్లేశపరంపర లెత్తివచ్చి చీకాకు చేసినను, మిక్కిలి యోర్పుతో సహించి శ్రీమతి యట్లె విడువక కావ్యోద్యోగము సాగించుచునే యున్నారు. ఇట్టివారికేకదా, ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీప్రజ్ఞానిధుల్..." అను వాక్య మన్వర్థ మగును.

ఇట్టి సాధుమతికి, ఆదర్శగృహిణికి శ్రీ కేసరిగా రీ వత్సరముననే తమ స్వర్ణకంకణ మిచ్చి బహూకరించినారు. వీరి ప్రస్తుతనివాసము మద్రపురి.

ఇక వీరి గ్రంథావళి నరయుదము. నూజవీడునందున్నపుడు వీరు 1. లక్ష్మీశారదాగీతములు, 2. లక్ష్మీశారదాశతకములు, 3. లక్ష్మీశారదా సుభాషిత ములు, 4. ఆరోగ్య సామ్రాజ్యము, 5. పితృస్మృతి, 6. మానస సామ్రాజ్యము, 7. కుమారీ నీతి, 8. లేఖదూత అనువానిని ప్రచురించిరి.

ఇవి కాక, 1. తిరుపతివేంకటేశ్వరశతకము, 2. రామచంద్రశతకము, 3. కన్నీరు అనునవి యింకను నముద్రితములు.

వీనిలో 'కన్నీరు' అనునది పతివియోగ దుఃఖమున గట్టిన కాలువ.

లక్ష్మీ శారదా సుభాషితములు సంఘదురాచారముల ద్రెవ్విపోయుచున్నవి.

"ధర బరార్థపరుడు చరితార్థు డగును,
స్వార్థరహితుండె మహిని యశమ్ము గాంచు,
తావి వెదజల్లు పుష్పమ్ము దాచుకొనుము;
జనులు తలదాల్తు రద్దాని శారదాంబ !

"కాన బండిన పండు లక్కఱకు రాక
ఎండి తమయంత బడిపోవుచుండునట్లు,
ధర్మయుక్తంబు గానట్టి ధనచయంబు
లూరకే కాలగతి బోదె శారదాంబ !"

ఇట్లే, యిందలి సుభాషితములు క్రొంబసిడిపూదెలవలె తీర్చి దిద్దినట్లున్నవి. ఏలకో యీ యుగమున ఉపదేశశతకములు హెచ్చుగ గానంబడుచున్నవి. నైతిక దారిద్ర్యమున కుంటువడియున్న సంఘమును చైతన్య సంపదతో సరిదీర్చవలె నను నుబలాటమే యీ యధికసృష్టికి కారణ మేమో ? కాని, ఇంతకంటె రమణీయ కావ్యసృష్టి పొనర్చిన మే లని నా తలంపు.

'లక్ష్మి శారదా కుమారీనీతి' యను గ్రంథమున నపుడపుడు తన కుమారికల నత్తింట్ల కంపునపుడు, చేసిన హితబోధములు —

"ఆర్తిని జెందు బీదలకు నన్నము వెట్టుచు దృప్తిజేసి, నీ
భర్త మనోగతంబు లగు భావములే గ్రహియించుచున్, సదా
వర్తిలి, నీ గృహంబునకు భవ్యశుభం బొనగూర్చి, నీ మనో
హర్త ముదంబులన్ గనుచు హాయిగ నుండుము కన్నతల్లిరో!"

పతి పెడత్రోవల ద్రొక్కిన
ధృతి చెడి కలహింప కమ్మ, తిన్నగ నతనిన్
జతురమతి ద్రిప్పజూడుము,
బ్రతిమాలుమ గతి యటంచు బ్రాకటభక్తిన్.

చెప్పిన నీతులలో క్రొత్తదనము లేకున్నను, చెప్పినపద్ధతిలో క్రొత్త లేకున్నను, వీరు ఏదో ఊహాపథాంతరవర్తులగు భావములను బడలాగి "మేమును కావ్యము చేసితి" మని వేడబము పడు కొందఱవలె గాక, సాధారణజీవితమునందలి నిత్యసమస్యలనే యెంచుకొని కావ్యముల నించుకొన్నారు. ఈ యభిప్రాయముతో శ్రీ కేసరిగారును నాతో నేకీభవించిరి.

కొమరితల నత్తింటికి బంపుచు ప్రాచీనాచారము ననుసరించి యుద్బోధించిన తల్లిమనసు తత్త్వమును దెలుపు నవిగా నివి నిలుచును. ఈ పద్యములందు వ్యర్థ పదములు కొంచెము హెచ్చుగా కనబడుచున్నవి.

లక్ష్మి శారదాశతకములయందు 'శారదాపతి, రమాపతి' యను రెండు శతకములు కలవు. మొదటి దానిని శ్రీమతి శారదాంబగారును, రెండవదానిని లక్ష్మీకాంతమ్మగారును రచించి రని చదువరులు గ్రహించియే యుందురు.

ఇందు లక్ష్మీకాంతమ్మగారి శైలిలో తేట తెలుగు పా లెక్కువ; శ్రీమతి శారదాంబగారి కవితకు సంస్కృతపదసంచయముపై మక్కువ. మచ్చునకు;-

చిక్కనిపాయసం బనగ జెల్లెడి నీ కథలే వినంగ, నీ
చక్కని నామ మేను మనసారగ గ్రోలగ గల్గుచుణ్, సదా
మక్కువ దీర నాదు మనమారగ సంతస మందుచుండగా,
తక్కిన వేల్పు లెందులకు ధారుణి నా కిక? శ్రీరమాపతీ.''

''శతకము జేసిన న్మనము శాంతిని బొందగలేదు నాకు, నా
గతభవసంచితంబొ ? నను గావగ నీమది చింత లేదొకో?
సతత మనంతవంత లవి స్వాంతముననన్ గృశియింపజేసె, నీ
వితరణ మేల జూప విక? వేడగ లే నిక శారదాపతీ!''

మూడవపాదమందలి 'అనంతవంతలు' అనునది దుష్టసమాసశ్రేణిలోనిది.

ఏ పోకడ పోయినను, వీరి కవితాధార యిట్టులే చిరుగాలితో పరుగులిడు సెలయేరువలె నుండును. కాని, అచ్చటచ్చట వ్యర్థపదములు మెండుగా గనపడు చుండును.

వీరి 'లేఖదూత'ను వీరి యన్ని కావ్యములలో నుత్తమముగా శ్రీ కేసరిగారు పరిగణించిరి. ఉద్యోగధర్మమున దూరముగ నున్న భర్తకును, భార్యకును జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు. ఇవి లక్ష్మీకాంతమ్మగారికిని, శ్రీ వెంకట రామమూర్తి గారికిని నడుమ జరిగినవి. సాధారణసాంసారిక శృంగారరసభరితములైనా యా యెడ జరిగిన సంఘటనల నివేదనముతో బతితల కుల్లాసమును ఉబుసుపోకను

కల్పించును. కట్టకడ వరకట్నముల విషయమున, వియ్యపురాండ్రకు జరిగిన పద్య లేఖలు కూడ కలవు.

"వనటను జెంద నేల , మఱి వారిజనేత్ర ! విదేశమందునన్
దనయుల బంధుమిత్రులను దారను వీడియు నొంటి నుంటి నం
చనయము చింత మాను మిక, నా జగదీశుని ప్రేమ కల్గినన్
శని గిని యేమి సేయు ? నిక సందియ మేలను శ్రీ మనోహరా."

అను పద్యమున దాను భర్త యెడబాటున కోర్వని దయ్యు, దనపతికి ధైర్యము నూల్కొలుప జేయు సాహసము పూనిన యీ సతి సాధ్వీధర్మము ప్రశంసనీయను కదా !

వేగమె వత్తు నం చిటకు ప్రీతి లిఖించిన పద్యరత్నముల్
నే గనుచున్ బఠింప విని, యెంతయు నీదగు ముద్దుబిడ్డలున్
న్నే గడియన్ దలంచుచును "నెప్పుడు వచ్చెద రమ్మ" యంచు మీ
యాగమనంబుకై యెదురు నందఱు చూచుచునుంద్రు నిత్యమున్.

తండ్రికడనుండి లేఖ రాగానే "అమ్మా! నాన్న ఎపుడు వస్తారమ్మా" యని గందరగోళము చేయు పిల్లల నొక్కమా రీ పద్యమున భర్తకును, పఠితలకును ప్రత్యక్షము చేయజాలినది. అన్నిటిని మించి నా కీ పద్యము మిగుల మనస్సునకు హత్తుకొన్నది.

"పిల్లలకోడి నోట తెరపించుక లేదిక, నేమి సేతు? నే
నిల్లును దిద్దుకొంచు నొక యించుక తె న్నొక టబ్బెనేని, నే
నుల్లస మంది యత్తరిని నోపిక దెచ్చుక కొన్నిపద్యముల్
జల్లగ వ్రాయ జూతు సుమి! చారుగుణాకర! శ్రీ మనోహరా."

సారస్వతము చవు లెఱింగిన గృహిణు లెల్లరును నిది యాదర్శముగ గైకొని యిట్టి వ్యవసాయము సేయ దలంచుచో, నీపాటికి స్త్రీ సారస్వతము బండ్లకెత్తెడు పాటిదై యుండెడిదే. తెలుగున నిట్టి పద్య లేఖా సాహిత్యమును వెలయించిన స్త్రీలలో వీరిదే మొదటి వ్రాలనుకొందును.

వీరి 'కన్నీరు' కావ్యము శోకవిధురమై, సాహిత్యమునందు కరుణామయము లగు కావ్యములు వ్రాసి స్థిరకీర్తి బడసిన శ్రీ వడ్డాది సుబ్బరాయకవిగారి కావ్యము, శ్రీ నాళము కృష్ణరావుగారి (పాపాయి) కావ్యము వలె నున్నదని విమర్శకులు వ్రాసిరి.

ఇట్లు స్వాభావిక కవితనే సరళ పేశల మృదూక్తుల జొనిపి, శారద నల రించిన వీరి కవితలు కమ్మని తావుల వెదజల్లు విరులసరులవలె నారీజన శిరోలంకా రములే.

---

# 67. శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మగారు

కవిసార్వభౌమ, కళాప్రపూర్ణాది బిరుద విభ్రాజమానులును, ప్రభుత్వాస్థాన కవీశ్వరులును, శతాధిక కావ్యజనకులును, శ్రీకృష్ణభారత, భాగవత, రామాయణాది మహాకావ్య రచనాపటిష్ఠులును నగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి పుత్రిక, శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మగారును కవయిత్రియే. తండ్రిరక్తము పాలుపంచు కొన్న యాపె కా మాత్రము నబ్బు టరిదియా! 1901వ సంవత్సరమున వీరి జననము. నెల్లూరివాసులు శ్రీ కల్లూరి సుబ్బరాయుడు గారు వీరిని పెండ్లియాడిరి.

ఈమె చంద్రమతీచరిత్రము, దమయంతీచరిత్రము, స్వరాజ్యలక్ష్మీ పరి ణయము నను కావ్యములను, భారతకథామృతము అను పౌరాణిక కావ్యమును, వానినే వచనకావ్యములుగను రచించిరి.

రచన యంతయు పురాణధోరణి.

దమయంతీ చరిత్రమును, చంద్రమతీ చరిత్రమును నతి సామాన్యధోరణి నుండి, యవి యామె బాల్యకవిత్వము లని చెప్పకచెప్పుచున్నవి.

చంద్రమతీ చరిత్రమందలి యొక పద్యముం గాంచుఁడు;—

'పతి భుజియింపక పూర్వము
సతులు భుజియింపరాదు క్ష్మాతలమందుఁ;
బతి భుజియించిన పిమ్మట
సతి భుజియించుటయ మేలు జపివరశిష్యా?"

దమయంతీచరిత్రము ఆమె పదునైదేండ్ల వయసున వ్రాసిరి. చంద్రమతీ చరిత్రముకంటె ధారాళముగా నున్నది.

"శ్రీరమణీమనోహరుని, జిన్మయరూపుని, నీలగాత్రునిఁ,
సారసపత్రలోచనుని, సజ్జనసన్నుతు, నమ్మహాత్మునిఁ,
ధారుణి నేలు రక్షకుని, దైత్యవిరోధిని, జక్రపాణినిఁ
గోరి భజింతు నా మదిని గోరిక లీరిక లెత్తునట్లుగఁ!"

"ఓయి మహారాజ ! ఓ దయాగుణసాంద్ర !
యో పరాక్రమశీల' యో నరేంద్ర !
నిషధపురీధవా! నిత్యసత్యవ్రతా!
సుందరాకార! యో సుజనవంద్య!
వినుము విదర్భలో భీమమహీజాని
కూర్మినందన, సుమకోమలాంగి
దమయంతి నా నొక్క తలిరుబోడి గలదు
సాధుస్వభావ, ప్రజ్ఞాధురీణ

శైలి యీ పైరీతిగా నున్నది.

కథాగమనమునం దీమెలేఖిని కడు శీఘ్రగామియై, పిల్లలకు కథలు చెప్పినట్లు అల్లుకొనిపోయినది.

"కలియాజ్ఞఁ నిరసింపరా దనుచు నా కాంతారమధ్యంబులో
పల నున్న న్నను జూచి నీవు కరుణఁ, బ్రార్థించితిన్ నిన్ను, 'నఁ
దలపఁ నీదు సురూప మిత్తు' ననుచుఁ దథ్యంబుగా బల్కు నిఁ
దలతుఁ నాదు సురూప మిమ్ము ఫణినాథా ! నేడు కర్కోటకా !"

భారతకథామృతాదులలో రచనాపరిణామము కనబడుచు బాగుగా నున్నది.

భారతకథామృతమున, తన్ను గోరిన పరాశరునకు సత్యవతి—

తపము చెడును గాదె తాపసేశ్వర! నన్ను
నీవు గోరునంత నిమిషమంద ?
తపము చెఱుప నేల? తప్పు సేయగ నేల?
నీదు త్రోవ జనుము నీవు తొలగి."

మిక్కిలి సరళమైనరీతితో చక్కనై గభీరమైన నీతి నుపదేశించినది.
శంతనుడు గంగను జూచి,

"ఎవ్వరిదాన వెవ్వతెవు? ఇచ్చట నెందుల కుంటి వొంటిమై?
నివ్వనభూమి జేరుటకు నేమికతంబొ? జలేజనేత్ర! యో
జవ్వని! నాదు మానసము చయ్యన దొంగిలియున్నదాన, వీ
వెవ్వరో నాకు దెల్పు మన, నిట్లను నాయమ నవ్వుమోమునన్."

ఈ పద్యము మనుచరిత్రను మనసున నుంచి రచించిన ట్లున్నది. ఇంకను ననేక ఘట్టముల భారతచ్ఛాయలు కలవు.

రచన సామాన్య మైనను, రుచిరమును నిర్దుష్టము నగు శైలిని రచించి, వీరు శక్తిని తండ్రికి దగిన తనయ యనిపించినది.

## 68. శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

కవితాసౌరభ్యలహరీ సంవాసితహృదయయై, 'చంద్రకళావిలాసము' రచించిన శ్రీ కర్రాసుబ్బలక్ష్మమ్మగారికిని, శ్రీరామశర్మగారికిని అనంతపురముజిల్లా తాడిమర్రి గ్రామమున 20-12-1910 వ సంవత్సరమున జన్మించిరి. కడపజిల్లాలో

ప్రొద్దుటూరు తాలూకా ఎఱ్ఱగుంటపల్లె శ్రోత్రియందారు గంటి సుబ్రహ్మణ్యము గారి జ్యేష్ఠకుమారులు గంటి వెంకటసుబ్బయ్యగారిచే పరిణీత యైనది. ఈమె తాతలు దివాన్ పేష్కార్లుగను, ప్లీడర్లుగను, ఆస్థానపండితులుగను జీవితము గడిపిరి.

ఈమె భర్తగారు వెంకటసుబ్బయ్యగారు ఆంధ్రభాషాభిమానులే కాక, ఆంధ్ర కవిత్వసారము దెలిసిన గఱ్ఱులు. బాల్యమున నీమెకు తెలుగన్న చులకనగను, రోఁతగను నుండెడిది. తిరుపతిలో నుండగా, ఆంధ్రము నభ్యసింపు మని నాగపూడి కుప్పుస్వామిగారును, వీరి తాతగారును మందలించెడువారు. కాని యామె కప్పట నా హితవు రుచింపలేదు. పిమ్మట భర్తగారికి పట్టపరీక్షయందు బహుమానముగా వచ్చిన మనుచరిత్రాదికావ్యములను జూచి వేడుకగా చదువుకొనని మ్మని యడిగినది. కాని "తెలుగన్న నిష్టము లేని నీ కెందులకీ పుస్తకములు? నీ కర్థమగునా?" యని యాక్షేపింపగా, నపుడభిమానము చెంది, పండితులకడ తెలుగు నేర్చి పద్యముల జెప్ప నేర్చిరి. ఏమైనను, నిట్టి వన్నియు నిమిత్త మాత్రములు కాని, కవు లగువారు పుట్టుకతోనే కవులుగా నుందురు. ఇంతే కాక, చిన్నపుడే కన్నడము నేర్చిరి. భర్తతో ఉద్యోగధర్మమున బొంబాయి మొదలగు పట్టణముల కేగినపుడు, హిందీ మహారాష్ట్రములను శాస్త్రవిధిగా నభ్యసించి, యాభాషలయందును నసి యైన యనుభవము సంపాదించిరి. బొంబాయిలో నున్నవుడు, వార్ధావిద్యాపీఠమున 'హిందీభాషాకోవిద' గౌరవపత్రము కూడ పొందిరి. ఈమె కిర్వురు బిడ్డలు. ఇట్టింత సుఖసామగ్రీసముల్లాసముగా సంసారము దిద్దుకొనుచు,

"మును నా యిందిరకోడలైన రతియుం, బూతాత్మ సావిత్రియున్
ఘనమౌ దీర్ఘ సుమంగలీత్వమును నీ కారుణ్యభాగ్యంబునన్
దనియం గల్గిరి, నాకు నట్టి వర మత్యంతానుకంపామతిన్
జననీ ! యిమ్ము నినున్ భజింతు నెపుడున్ జ్ఞానప్రసూనాంబికా!"

అని యంబికను ప్రార్థించి యున్నను, నాదేవి యామె ప్రార్థన మాలింపక, 1940 వ సంవత్సరమున భర్తను, 42 వ సంవత్సరమున దల్లిని, అక్కగారిని ప్రమింగివైచెను.

కష్టములు విడిగా రావు గదా! ఇట్లిన్ని పాట్లుబడిన యనంతర మా దుఃఖభర మోర్వక కాబోలు, పోలీసుశాఖోన్నతోద్యోగు లైన వీరి తండ్రిగారు సన్న్యసించి కాళహస్తియందు విమలానందతీర్థ లను పేర కాలము గడుపు చుండిరి.

ఇన్ని కష్టముల నొంది యనదయై కుయ్యిడుచున్న వీరిని సమీపస్థు లోదార్చి "ఏదైనా చదువుకో, చదువుతో వ్రాతతో శోక ముడుగు"నని యుప దేశించిరి.

అంత తన భర్తగారు వ్రాయుచు విడిచిన "కౌలుట్లాధిప చెన్న కేశవశత కము"ను పూర్తి చేసిరి. అక్కగారిజ్ఞాపకార్థ మామె పేరున 'జ్ఞాన ప్రసూనాంబిక' శతకము రచించిరి. చిన్నతనమున కుమారసంభవము చదివినపుడే, 400 పద్యములతో 'గిరిజాకళ్యాణ' మను పేర నొక ప్రబంధమును రచించిరి. ఇవి కాక, సైరంధ్రి, నిర్వేదము, స్థైర్యము, తెలుగుతల్లి, పవనదూత్యము మున్నగు ఖండకావ్యముల నెన్నింటినో గృహలక్ష్మి ముఖమున బ్రచురించిరి. జ్ఞానప్రసూ నాంబికాశతకమును శ్రీ కేసరిగారే ముద్రించిరి. గిరిజాకళ్యాణ మింకను నముద్రి తము.

జ్ఞానప్రసూనాంబికా శతకము ఛాందసధోరణికి పేరు బడసిన శతకధోరణి నుండక, కాంత్యుజ్జ్వలసమంచితశైలి నలంకృతమై యున్నది.

"కైలాసాచలవాసినీ! గిరిసుతా! కళ్యాణసంధాయినీ!
కాళీతాండవలాస్య కేళిరసికా! కౌమారి! కాత్యాయనీ!
హేలాలోలకురంగశాబకధరీ! హ్రీంకార బీజావృతా!
కాలాంభోధర నీల దేహలతికా! జ్ఞానప్రసూ..."

అంతయు సంబోధనపట్టిక యైనను నెంచుకొన్న పదములబట్టియు, సంబోధనల సన్నిహితత్వ మెఱిగి కూర్చిన కూర్పునుబట్టియు నామె హృదయ మెంత రసోత్కరమో యూహింపనగును.

"అరయన్ బార్థునిపై, మృకండుసుతుపై, నబ్జారిపై, బాణుపై,
గరిపై, శ్రీపయి, భిల్లవంశపతి యౌ కన్నప్పపై, కాకుపై

బరగం గల్గు కృపారసం బిపుడు నాపై జూప నీ నాథుతో
కరుణావార్నిధి ! తెల్పరాదె? జననీ ! జ్ఞానప్రసూ...''

అను నీ పద్యము పోతన్నగారి యీ క్రింది భాగవతపద్యమును జ్ఞప్తి కెలయించుచున్నది. అది– 'ఆదిన్ శ్రీ పతికొప్పుపై......." అను పద్యము. ఇంతే కాక, ఇట్టి పద్య మింకొకటి ఆంధ్రుల వ్యవహారమున నున్నది:

''అరయన్ శంతనుపుత్త్రిపై, విదురుపై నక్రూరుపై, కుబ్జపై,
నరుపై, ద్రౌపదిపై, కుచేలునిపయిన్, నందవ్రజశ్రేణిపై,
బరగం గల్గు కృపారసంబిపుడు నాపై గొంత రానిమ్ము, నీ
చరణాబ్జంబులె నమ్మినాడ జగదీశా ! కృష్ణా ! భక్తప్రియా !"

పోతనవలె పద్యము వ్రాయవలె నని యత్నించి యనుకరించి తన్నిర్వ హాణమున చరితార్థయైన దనుకొందును.

''ఏ పాదమ్ములు మోక్షదాయకము లం చేవేళ మౌనీంద్రులు,
న్నే పాదంబులు సర్వశక్తిదము లం చేవేళ బ్రహ్మాదులు
న్నేపారంగను గొల్తు, రట్టి పదము ల్నే గొల్తు నే వేళలన్
నా పాపౌఘము బాపి ప్రోవ గదవే జ్ఞాన..."

ఈ శతక మంతయు నిట్లే రసవంతమై, జిలుగుదువ్వలువల కై సేసిన పుత్త్రికబోలె నున్నది.

కొలుట్లాధిప శతకమునం దొక పద్యము :—

"వేలున్ లక్షలు లెక్క లేక పలుకున్ వేమారు లీ జిహ్వ, తా
నేలా బల్కదొ యక్షరద్వయము నీ యింపైన నామం? బదే
మూలంబై యలరారు మోక్షలతకున్ ముంగొంగుబంగార మై
కొలుట్లాధిప! చెన్నకేశవ! రమాకాంతా మనోనాయకా."

కృష్ణుని విడిచి విరహవేదనా దోదూయమానస యైన రాధ వేకువజామున మలయానిలుడు మెయి సోకి తన్ను గాసింబెట్ట, నా పయ్యేరకుమారునిచేతనే శత సహస్రగోపీ నవమన్మథుండైన నందబృందారకున కంపిన రాయబారమే 'పవన దూత్య' మను ఖండకావ్యము.

"అల్పు డైనవాని యాచించి మది నభీ
ష్టంబు గొనుటకంటె, సకలవిధుల
గొప్పవారి వేడి కోరిక లీడేర
కున్న, దాన నేమి కొదువ గాదు"

కాళిదాసుని 'యాచ్ఞా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా' అన్నమాట కిది తెలుగుబాట.

''వినుమా పవనా ! నా మొర
జనుమా మధురాపురంబు సత్వరముగ, నీ
వనుమా నా వచనంబుల
ననుమాన మొకింత లేక యాతని మ్రోలన్."

"నల్ల నైనవాడు, నగుమోము గలవాడు,
చూడదగినయట్టి సొగసుకాడు,
కంబుగళమువాడు, కంజాతనేత్రుండు,
సుందరుండు, నందనందనుండు."

"అలసి యుండెనేని, యల్లన మెయి సోకి
సేద దేర్చి, యవల జెప్పు మయ్య''
"పోవునప్పుడు, హిమకణపూరితంపు
కమల మొక్కటి కొని చని కమలనేత్రు
పాదములచెంత నిడి, 'నిన్ను బాసి యున్న
ప్రణయసఖి రాధ మో మిట్లు వరలు' ననుమ."

''వినవా నా మొర లించుక?
కనవా నా కూర్మి కృష్ణ ! కరుణానిధి! నీ
కనువా యీ గతి నేచుట ?
వినువారలు నవ్వ రొక్కొ? వినుతగుణాఢ్యా!"

అరవిరిమొగ్గలై యందములు గురియుచు సుగంధములు నలుకెలంకుల జిమ్ము మల్లికాదామమువలె శోభిల్లుచున్న దనిన నత్యుక్తికాదు.

అపుడపుడు గృహలక్ష్మియందు ప్రచురించిన ఖండగీతులలో 'స్మృతి పథము' అను శీర్షిక క్రింది 'హంపీశిథిలస్మృతి' రసోదంచిత పదాంచితమై వరలినది.

"తన మహోదగ్ర ప్రతాపారుణచ్ఛటల్
ఖండాంతరముల కీరెండ గాయ,
తన దిగంతక్రాంత ఘనయశశ్చంద్రిక
లెల్ల లోకములకు వెల్ల వేయ,
తన మహాపాండిత్య ధారణాగరిమంబు
కవిచంద్రులకు కల్పకంబు గాగ,
తనచేతి శితమహోదగ్రఖడ్గప్రభలు
ప్రతిపక్షులకు గుండెబరువు గాగ,"

వెలసిన శ్రీకృష్ణదేవరాయలు పాలించిన సామ్రాజ్యము పేరునకైన లేక కాలగర్భమున గలిసిపోయినందుకు కన్నీరు కార్చినది. కార్పించినది కూడా—

ఈమె వ్రాసిన తెలుగులేఖిని కూడ ఇట్లే శక్తిమంతమై యున్నది

ఇక వీరి గిరిజాకళ్యాణ మున్నది.

వీరి కృతులలో నిది యొక రసవత్తర ప్రబంధము. ఇందు ఉదాత్త శృంగారము రసము. గిరీశుడు నాయకుడు. గిరిజ నాయిక. నాయికా నాయకుల ఔచిత్యము, రసము కావ్యమునందు బాగుగా పోషింపబడినవి. చంద్రోపాలంభ, పుష్పలావికా, విరహాదివర్ణనములతో నిది మహాకావ్యలక్షణలక్షితమై యున్నది. కాని విరహవర్ణనాదుల పట్ల మరింత అనౌచిత్యమునకు పాలుపడకుండుట 'బ్రతుకు జీవుడా' యనిపించినది. కావ్యమంతయు ప్రాతపద్ధతియే. కాని, రచనామార్గమున మాత్రము కొన్ని క్రొత్త పోకడలు కనబడుచున్నవి. ఆధునికపద్ధతిని కొన్ని వర్ణనములు, కొన్ని సంభాషణములు నుండి కావ్యనవీనత్వమును స్ఫుటపఱచుచున్నవి. శైలికి—

రజతాచలేశుండు, రాకేందుధరమౌళి,
పరమేశ్వరుడు, భక్తపాలమౌళి,
కాంచనాచల దివ్యకార్ముకహస్తుండు,

గంగాధరుడు, నీలకంధరుండు,
పురమర్దనుడు, లోకపూజ్యుడు, శంభుండు,
మూడుమూర్తుల కెల్ల మూలబలము,
అసురాంతకుడు, దేవతారాధ్యచరితుండు,
భూతనాథుండు, విభూతికరుడు,
సృష్టిస్థితిలయకరుడు, శిష్టనుతుడు,
శాశ్వతానందకరుడు, ప్రశాంతయశుడు,
అగజ తమకమున నుప్పొంగ, నద్రిరాజు
నడుగ బంపెను పరిణయం బాడ దలంచి.

దీనిని బట్టి, కావ్యము కాంతియుత మని తెలియనగును. అటనట నచ్చ తెలుగు సొబగులును కానంబడుచున్నవి. అట్టి పట్టుల గూడ ధార యొకే విధమున పరిపుష్టమై యున్నది.

"గిత్తత త్తడి గాని కత్తలానులు లేవు
ఎక్కుట కాతని కిందువదన !-"

అను నీ సీస మాసాంతము అచ్చతెలుగు అందమునే ప్రస్ఫురింపజేసినది. తపోఖిన్న యగు గిరిజకడ కపటబ్రహ్మచారి యామెను పరీక్షించుటకై శివునిగూర్చి యాక్షేపించెను. అందుల కా తపోకృశాంగి యిడిన ప్రత్యుత్తరము.—

"కట్టుపుట్టము లేక కట్టడా, కైలాస
మతనికి శౌర్యచిహ్నంబు గాని"

అని అతని యాక్షేపణ లన్నిటిని నిరాకరించి సమాధానము చెప్పినది. ఆత డెంతటికిని నా శివనింద మానకపోవు సరికి,"శివనిందలు సేయకుమో యన్న! నేను వినలే'' నన్నది. ఇట్లు నాయికను చక్కగా పోషించిరి.

ఇందు ప్రబంధపు పోకడ లెన్నియో కలవు. హిమవంతుడు వసంతమున నుద్యానమున మేనకతో విహరించుచు,

''పల్లవంబు లటంచు భ్రమసి గిల్లగబోవు,
భామకెంగే లంచు పట్టి యుబ్బు."

నట శయ్యాగృహమునకు గిరిజను బంపుచు, చెల్మికత్తెలు

"కలికి నీ వెన్నొసల్ గనినంత సిగ్గుచే
శశిఖండ మభవుని జడల బడదె ?"

యని యగ్గించిరి. అంతేకాక, గిరిజబాల్యమును, మేనక గర్భ దౌహృదమును స్త్రీ సహజముగా వర్ణించిరి.

"పుల్లని నిమ్మపండ్లు దిన బుద్ధి దలంచు, మరెవ్వరేని ద
న్నుల్లస మాడ జూతు రని యూరక మూర్కొని పారవైచు, నే
పల్లవపాణు లైన పసిపాపను గందు వటన్న, సిగ్గుచే
నుల్లము పల్లవింక నిక యూరకయుండు డటంచు నవ్వెడిన్."

ఇందలి రెండు నాలుగుపాదములలో స్త్రీ సహజ మగు ఉచితలజ్జ ఎంతయో స్వాభావసుందరముగ చిత్రింపబడినది.

వీరి వసంతఋతువర్ణన మొక ప్రత్యేకఘట్టము:—

"వనిత వనలక్ష్మికిని వసంతునకు బెండ్లి
సమయమున జేయు సంగీతసభ లనంగ,
క్రొవ్విరుల దేనియలు ద్రావి క్రొవ్వియున్న
తేటిగీతంబు లెల్లెడ నీటు గులికె... "

నట— వనలక్ష్మి వసంతుల పెండ్లికి కానీ ఖర్చు లేకుండగనే గానసభ యేర్పాటు చేసినారు శ్రీమతి కృష్ణవేణమ్మగారు ! ఎంత బాగుగనున్నదీ యుక్తి కల్పనము ! ఇట్టి పట్టుననే కవిహృదయభావవిశిష్టత గాననగును ! ఈ ఘట్టమున వీరు వివిధచ్ఛందములను వాడియున్నారు.

ఇక స్త్రీసహజము లగు వేషభాషలు; భూషాడంబరములు, అలంకరణాటో పాభిలాషములు, కడు మనోజ్ఞముగ చిత్రించినారు:—

"శంకరు దోడితేవలయు, జా గొనరింపక రండు పోదమే
యింక నిదేమి టమ్మ యిటు లీ కయి సేత లటంచు నోర్తనన్,
శంక యొకింత లేక యతిజాణతనంబున నమ్మ బల్కె దీ
వింకను బొట్టువెట్టకయె యేటికి వచ్చితి వమ్మ? నావుడున్."

"చెదరెనొ నాదు నెన్నొసటి సింధుర మం చొక బాల పల్కగా,
కుదురుగ నున్నదమ్మ, యిక గొబ్బున రా గదవమ్మ, జూచు నా
మదకరి నెక్కి వచ్చు హరి మానక నీదెస నంచు బల్కుచున్,
మదవతి యోర్తు బోయె నల మన్మథ శాతకృపాణమో యనన్."

మగవారైనచో, నీపట్టు లింత రసవంతముగను సహజముగను నుండవేమో యనిపించినారు. వీరి ఉపమలు చక్కనివి:—

"పార్వతీదేవితలబ్రాలు పరమశివుని
మస్తకముపై వెలుగగ, సమస్తజనుల
కనుల కప్పుడు దోచె చుక్కలుగ, నదియు
సొబగుగా నుండె వ్యోమకేశుండు గాన."

"పద్మములకు మూగు భ్రమరంబులట్టుల,
గిరిజ శివుని పాదపరసిజముల
కెరగునప్పు, డలక లింపార శంకరు
పాదయుగళిపైన పరిఢవిల్లె."

హరిహరుల హాస్యప్రసంగములు సముచితముగ నున్నవి.
ఇవిగో చూడు డా ఘట్టమును:—
"విసము దిన్న నోట కస టయ్యె గాబోలు,
భక్షణంబు లెల్ల పార్వతీశ!
అట్టి దివ్య మైన ఆహారములు లేవ
టంచు బల్కె విష్ణు డభవుగాంచి."

"నిక్కము నీవు బల్కినది నీరజనాభ! యిటెందు భ్రమిచ్చిలన్
జిక్కదు వెన్న, దెత్తు మన జిక్కవు ఎంగిలి గాయ లెందు, నీ
చక్కట నీకు నట్టి కెలసంబును దీర్చెడి వారు లే, రిక
న్నెక్కడ దెత్తు మయ్య యవి యిప్పు డటంచు శివుండు నవ్వెనన్."

సరసప్రబంధరచనాధురీణయై, రసజ్ఞుల మెప్పులు వడసిన శ్రీమతి కృష్ణవేణమ్మగా రెంత ప్రశంసార్హలో రసలోకమే నిర్ణయించు గాక !

# 69. శ్రీమతి రావూరు వెంకటసుబ్బమ్మగారు

ఆధునిక వాఙ్మయప్రపంచమున వివిధశాఖల వెలసిన నాటకములు, నవలలు, ప్రబంధములు, కావ్యములు, ప్రహసనములు, ఉపన్యాసములు, అన్నియు వ్రాసి శ్రీ వీరేశలింగంపంతులుగారికి పిదప నంతటివారని మంతు కెక్కిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారే ''ముదితల్ నేర్వగరాని విద్యకలదే ముద్దార నేర్పించినన్'' అను పద్యము మూలముగ మహిళాజనబంధువు లగుటయే గాక, ఆచరణలో సహితము అతి సుసాధ్య మని నిరూపించినారు శ్రీ లక్ష్మీ నరసింహముగారు. దృశ్య ప్రబంధములు రచించిన శ్రీరావూరి సుబ్బమ్మగారు వారి మేనగోడలే కాదు, వారి శిష్యురాలు కూడ.

శ్రీ చిలకమర్తివారి రెండవచెల్లెలు అచ్చమాంబగారికిని వీరవాసర గ్రామ స్థులు మధునాపంతుల రామస్వామిగారికిని అరువదియేండ్లనాడు జన్మించిన ప్రథమ పుత్రిక. చిన్ననాటనుండి మేనమామకడ బెరిగి, వారి కడనే విద్య నభ్యసించి, వారి ప్రోత్సాహముపైననే ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి ఉభయభాషాప్రవీణయం దుత్తీర్ణురాలైరి. రాజమందిర మందలి బాలికా ఉన్నతపాఠశాలయందును, మద్రాసు క్వీనుమేరీ కళాశాలయందును తెలుగుపండితురాలుగా పనిచేసి, కొలది కాలముక్రిందనే ఉద్యోగవిరమణ చేసి, ప్రస్తుతము రాజమందిరము దానవాయి పేటలో విశ్రాంతి గైకొనుచుండిరి. వీరి కొక కుమార్తె. వీరు రాజశేఖరకవి "కర్పూరమంజరి" యను సట్టకమును దెనిగించిరి. 2. ఉదారపాండవము, 3. బాణ కృతహర్ష చరిత్రాంధ్రీకరణము ననునవి వీరి కృతులు. అంతేకాక, ప్రాస్తావి కము లగు పద్యము లెన్నో యున్నవి.

ఇందు కర్పూరమంజరి యనునది రాజశేఖరకవిచే రచింపబడినది. ఇతి వృత్త మంతయు కాళిదాసుని 'రత్నావళి' నాటకము వంటిది. అనువాదగ్రంథ మగుటచే, రసౌత్కట్యాదుల గాని, పాత్రపోషణవిషయమున గాని, వేర వివ రింపవలసిన పని లేదు.

ఇక వీరి శైలి యన్ననో, ఓజోగుణప్రధాన మైనది.

"అంతఃపురీలసత్కాంతవిలోచన
  ప్రతతి కమేయ లావణ్యవార్థి,
మానసరంజక మందహాసాది వి
  లాససంతతులకు వాసనగరి,
సకలసౌభాగ్యలక్షణముల సరిహద్దు,
  దృష్టి కైరవముల దిగుడుబావి,
సరస శృంగారరసమునకు సంజీవి,
  నలరువిల్కానికి నాయుధంబు"

ఈ కావ్యనాయిక నాయకుని మనస్సు నాహరించినది. ఇట్లు "సరిహద్దు, దిగుడుబావి" మున్నగువానితో పోల్చిన పోల్కివంటివియు, నింకను లక్షణము లైనవియు నైన వర్ణన లా కావ్యమున నెన్నో యున్నవి.

"వెలదుక తీవ్రచంచల సువీక్షణమందు త్రిభాగ మేనిపై
నిలుచునొ, వాడు కామమధునీరజవైరులబారి కగ్గమై
పొలియును, వేనిపై నిలుపు బూర్ణముగా దనదృష్టి, వానినిఁ
జెలులును జుట్టముల్ విడువ జెల్లు దిలోదకముల్ విషణ్ణులై."

ఇందు భావములు రాజశేఖరునివే యైనను, శ్రీ సుబ్బమ్మగారు ఆ భావములను దెలుగున గ్రథించిన నేర్పున కట్టివి యుదాహరణములు. శైలికి:—

అమితలావణ్యపూర్ణ మైనట్టి మేను,
వీనుదోయిని దాకెడు వెడదకనులు,
చారుతరమైన పీనవక్షస్స్థలంబు,
పిడికిటం బట్టదగినంత పిన్ననడుము.

''సురుచిర కాంచికావలయ సుందర మందిరవాస లక్ష్మి స
న్మరకత రత్న గుంఫిత సమంచిత హారనికేతనం'' బై

వీరి రచన సద్రత్న కాంతిపూరమో యనున ట్లుండును.

ఇక మూలమునకు వీరి యనువాదమునకును పోలికల నరయుదము:—

"యా చక్రవర్తి గృహిణీ జనగేహినీవా
ప్రేమ్ని తయో ర్నతిల మాత్ర మపి విశేషలాభః
జానే శ్రియా యదిక్రియతే కోపిభావః
మాణిక్య భూషణనివసనకుంకుమైః''

అను శ్లోకమునకు వీరి అనువాద మెంతగా సన్నిహితముగా నున్నదో చూడుడు :—

జగతి సామాన్యు నింతికి, చక్రవర్తి
గృహిణికిని భేదమే లేదు ప్రేమయందు,
మణివిభూషణ కుంకుమాంబరగణంబె
భేదభావంబు గలిగించు, లే దితరము."

వీరి కావ్యమున సూర్యున కొక క్రొత్తబిరుదము తగిలించినారు.

"వాసరజీవపిండ మయి భాసిలుచుండెడి భానుమండలం"బు. అంతేకాక, వీరు తమ బాల్యసఖియు, ప్రియమిత్రమును, సహాధ్యాయినియు, రాజమందిర మందలి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలాధ్యక్షిణియు నైన శ్రీమతి కామాక్షమ్మ గారి షష్టిపూర్తి సమ్మానసమయమున ప్రచురించిన పద్యములు కడు హృద్యముగా నున్నవి.

"సదనము సదన మ్మనుచును,
మది నెప్పుడు కుదురు లేక మసలుదు వౌరా!
సదనమె నీ కొసగిన దీ
యదనున చేకొ మ్మటంచు నక్షయపాత్రన్.

''లేదు లే దను శబ్దంబు లేదు నీకు,
కాదు కా దను నుడి నీకు కానివావి,
వలదు వల దను వాక్కు నీ కొలది గాదు,
ఉన్న దే మున్నదో తెల్పు మొక్కమాట."

ఆగ్రహంబు నసూయయు నసలె లేవు,
పక్షపాతంబు లే దింత పరులయెడను,
లేదు సుంతైన స్వార్థంబు, లేదు విసుగు,
ఉన్న దేమున్నదో తెల్పు మొక్కమాట.''

"కాపురం బన నేమొ కని విని యెఱుగని
లలనకు గొప్పయిల్లాలితనము,
కడుపున నొకబిడ్డ గాంచ నోపని యట్టి
తన్వికి వెలలేని తల్లిప్రేమ,
ఏ వృత్తి చేపట్టి యెఱుగని యింతికి
వివిధసంస్థలలోని పెద్దతనము,
వీధిగుమ్మము దాట వెఱచు వెలందికి
దేశాటనమునందు దిట్టతనము,

కలుగ జేసిన యీ సంస్థ కడుపుచలువ
గలిగి, విజ్ఞానవతులను గనియు, మిగుల
స్థాపకుల కీర్తి యిల చిరస్థాయి కాఁగ
వర్థిలును గాత పదివేల వత్సరములు!"

ఇట్లు కవితాపద్ధతులు శయ్యాపాకముల చవులెఱింగిన వీరు స్వతంత్ర కావ్యరచనతో నాంధ్రుల సరస్వతి నలరింతురు గాక! యని కోరుచున్నాము.

---

# 70. శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

పావన గౌతమీతీరమున శ్రీయుతులు నాళము రామలింగయ్యగారిచే స్థాపింపబడి, సంతత సేవానురక్త సరళస్వభావ యైన శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారిచే పాలింపబడుచున్న ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలయందు చాలా కాలము సహాయాంధ్రవిదుషీమణిగా పని చేసి, ననుబోటి శిష్యురాండ్ర నమిత

వాత్సల్యమున తీర్చి దిద్దిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని గూర్చి ప్రశంసించు శుభతరుణము దరిసినందులకు నా లేఖిని మిగుల నానందముతో గంతులిడుచున్నది.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు రాజమండిర పురవాసులు శ్రీ కందర్ప తిమ్మ రాజుగారి కొమరిత. సుమారు అరువదికి పైబడిన వయస్సుండ వచ్చును.

వీరు ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలయం దధ్యాపకురాలుగా బని చేసినపుడు, అచ్చట ప్రధానోపాధ్యాయులుగా బని చేసిన శ్రీ వారణాసి లక్ష్మీ నారాయణశాస్త్రి వరేణ్యుల కడ కావ్యాధ్యయనము, కవిత్వాభ్యాసమును గావించి నారు. అది మొదలు వారు ఎడనెడ నేదో వ్రాయుచునె యున్నారు. అట్లపు డపుడు వ్రాసినవే పుస్తకరూపములై, భీష్మస్తవరాజము, భారతకృష్ణశతకము, భగవద్గీతానువాదము అను పేరున వెలసియున్నవి.

అన్నింటియందును "భీష్మ స్తవరాజ'' మను చిన్న పొత్తమున భీష్ముడు మరణశయ్యపై నుండి చేసిన కృష్ణస్తవము నా మనమును జూర గొన్నది. పొత్తము చిన్నది. అందు గైకొన్న ఛందము చిన్నది. మూర్తి చిన్న దైనను, కీర్తి గొప్పదై విలువ బలికినది.

"అతనికిని దుల్య మైన దేహంబు గలిగి
పీతకౌశేయవాసియౌ వేదపురుషు
నాశ్రయించినవారల కఖిలపాప
భయములు నశించు, గలుగు నవ్యయపదమ్ము.''

"నరకభయమును బాపు విన్నాణి యెవడు?
ప్రబల సంసార నిమ్నగావర్తతరణ
తరణి యెవ్వడు, వాని జిత్తమున నిలిపి
ప్రస్తుతింతును భక్తి సంభ్రమము లొప్ప."

మిగుల పచ్చని కన్నులు, మేటి సటలు,
లలిత దంష్ట్రానఖాయుధంబులును గలుగ,
నెవని రూపము దైత్యుల నే పడంచు,
నట్టి దృప్తస్వరూప తుభ్యం నమోస్తు."

కప్పురపు పలుకులో, కలకండచిలుకలో యనున ట్లున్న యిట్టి పద్యముల తోనే నిండియుండి విషయభారముచే గురుగభీరమై యున్న యీ చిన్న కావ్యమున చక్కని యుపమలు ఎన్నో కలవు.

''తంతుసంబద్ధ మగు పూలదండ వోలె
సదసదుపబృంహితం బగు జగ మశేష
మే మహామహునందు నిర్వృత్తి గనునో.''

భీష్ముడు తన యవసానసమయమున :—
''మోక్షమార్గాభిలాషులౌ మునివృషభులు
తన్ను వేష్టించియుండ, శంతనభవుండు
సరస నక్షత్రసముదాయ సహితు డైన
యోషధీశుని భంగి బేరోజ నొప్పె.''

అం దిట్టి విం కెన్నో కలవు.

భారతకృష్ణశతకమున వీరు భారతగాథ నంతను సులభశైలిని కందము లలో వివరించిరి.

ఇంక స్త్రీ విద్య యను ఖండకావ్యమున :—
నీతిన్ వీడక శీలరక్షణకు నై నిర్భీతితో బ్రాణముల్
ప్రీతిఁ వీడిన భారతాబ్జముఖులఁ బేర్కొన్న చారిత్రముల్
చేతోమోదము గాగ బాల్యముననే చెప్పందగుఁ స్త్రీలకున్.''

''కాలను వ్రేల దున్నుకొను గాక, ధనంబు, నగల్ సమృద్ధిగా
దాలిచియుండు గాక, వివిధం బగు విద్యలు నేర్చు గాక, దు
శ్శీలపథంబు పట్టుబడు స్త్రీలకు గౌరవ మబ్బకుండ స
చ్ఛీలము ముఖ్యమైన దని చెప్పుట ధర్మము విద్య నేర్పుచోఁ.''

వీరి స్త్రీవిద్యాపద్ధతి యిటు లున్నది.

ఇంకను గృహలక్ష్మిలో అప్పటప్పట ప్రచురింపబడిన సేవకా వృత్తి, భగవద్గీతా మాహాత్మ్యానువాదము ననునవి సముచితములుగా నున్నవి.

‘కవితిలక’

# 69. శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

“విక్టోరియాక్రాసు” అను యుద్ధసంబంధ మగు నితివృత్తముతో నవల రచించి ప్రసిద్ధి కెక్కిన శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు రాజమహేంద్ర పురవాసులు. వీరి తండ్రి కంచర్ల కామరాజుగారు B. A. తల్లి సీతారత్నమ్మ గారు. వీరి మామగారు పులవర్తి సుబ్బారావుగారు సర్కిల్ ఇన్స్పెక్టరు. వీరి భర్త మాణిక్యాల రావుగారు.

చిన్నితనమునుండియు తరుగని కావ్యరచనతో సారస్వతసేవ చేసిన చిరస్మరణీయలలో వీ రొకరు.

1. కుముద్వతి, 2. రాధికాచంద్రావళులు, 3. విజయభాస్కర విజయము, 4. మీర్ జుమ్లా, 5. విక్టోరియాక్రాసు, 6. తిలోత్తమ-పాపయ్యశర్మ, 7. వీరభారత కథామంజరి, 8. పుళిందకన్య, 9. క్రీస్తుచరిత్ర, 10. మొండిశిఖండి, 11. అబిసీనియాయుద్ధము, 12. వాసవీవిజయము, 13. రాణీప్రమీల, 14. విద్యుత్ప్రభ- మున్నగుపెక్కు పొత్తముల రచించిరి. ఇందుకడపటివి మూడును నముద్రితములు. వీరిరచనలలో కొన్ని నవలలును, కొన్ని నాటకములును గలవు. ఇన్నిగ్రంథములు రచించినను గ్రహచార వశమేమో వీరియొద్దను గూడ వీరి పుస్తకములు దొరక కున్నవి. ఇంతే కాక, అనేక పత్రికారాజములలో వీరు వ్యాసములు, పద్యములును వ్రాయుదురు.

1936 సంవత్సరమున శ్రీ కేసరిగారు వీరికి స్వర్ణకంకణ బహూకరణ మొనర్చిరి.

తిక్కనజయంతి బంగారుపతకము కూడ వడసియుండిరి. పెద్దాపురమున నొకపుడు జరిగిన వైశ్యసభలలో స్వర్ణపతకము కలెక్టరుగారిచే బహూకరింపబడుచే

కాక, "కవితిలక" బిరుదముచే సమ్మానిత లైరి. వీరి కుముద్వతి యను నవల యొకపుడు స్కూలుఫైనలుకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడినది.

బహుళసంతానవతి. ఏడుగు రెనమండ్రు సంతానముతో సంసారము దిద్దుకొనుచు, నిట్లింత వాఙ్మయము నభివృద్ధిచేసి రన్న, వారి శక్తి నిజముగ ప్రశంసింప దగినదే. కొన్నినాళ్లు వీరు రాజమందిర ఆంధ్ర యువతీసంస్కృత కళాశాలా కార్యనిర్వాహక సభ్యులురాలుగా నుండిరి.

వీరి ప్రస్తుత నివాసము చీరాల.

---

# 70. శ్రీమతి సీమకుర్తి సత్యవతీదేవిగారు

నానాక్షేత్రసందర్శనము, భక్తిరసామృతము మున్నగు గ్రంథములు రచించిన శ్రీమతి సీమకుర్తి సత్యవతీదేవిగారు ఆంధ్రరవివర్మయను ఖ్యాతి గాంచినట్టియు ననేక గ్రంథములు రచించినట్టియు శ్రీయుత ఆత్మూరి రామమోహనరావుగారి కుమారీరత్నము. మద్రాసున మేనమామ లగు క్రిస్టియన్ కాలేజి ప్రొఫెసరు శ్రీకొల్లిపర సీతారామయ్యగారింట 14-3-1895వ తేదీనాడు జన్మించిరి. వైశ్యలోకమునకంతకు కీర్తి సంపాదించి దేశప్రఖ్యాతి గాంచినట్టివారు. వేద వేదాంత పురాణేతిహాస గూఢార్థప్రతిపాదకులును, సంస్కృతాంధ్రాంగ్లేయ జర్మనీ భాషాప్రవీణులు, B. A., B. L., D. G. W., C. T. ఇత్యాది పట్టభద్రులును, యజ్ఞయాగాది క్రతువు లొనరించిన మేటియు నైన శ్రీ ఆత్మూరి లక్ష్మినరసింహ సోమయాజుల వారి పౌత్రి. నీతిదాయకములగు కావ్యముల రచించి, నివురు గప్పిన నిప్పువలె ప్రచ్ఛన్న కవయిత్రిగా నుండిన అన్నపూర్ణమ్మగా రీమె జనని. సనాతనదీక్షా పరతంత్రులును, సుప్రసిద్ధులును, గర్తపురీనివాసులు శ్రీ సీమకుర్తి బసవయ్యగా రీమెను పెండ్లాడిరి. ఇట్లు వీరి పుట్టినింటివారు, మాతామహవంశమువారును, మెట్టినింటివారును విద్యావంతులే.

ఏవంవిధ మహనీయవంశ పరంపరాగత మగు విజ్ఞానము, కవితా వ్యాసంగ మును, ప్రీతియ మగు సంపత్తివోలె వీరి వశంవదమై. రసరూపమున వీరి భక్తి రసామృతమున జాలువారినది. ఈమె చిన్నతనము మిగుల స్మరణార్హ మైన స్పృహ ణీయమైన కథానకములతో నాదర్శప్రాయముగనున్నది. సుమారు పంచవర్షప్రాయ మున నున్న యీమెకు తల్లి అక్షరాభ్యాసముచేయగా మొదలిడిరి. ప్రథమదివసముననే చూపిన ప్రతిఅక్షరమును గ్రహించి, యీ మఱునాటికే యక్షరమాల నంత టిని అప్పగించివేసిరట. శైశవమున మాటలు నేర్చినప్పటినుండియు పాటల కూర్చుటయు, విద్యల నెఱిగినది మొదలు పద్యములు దీర్చుటయు నీమెకు బాల్య క్రీడాచాపలములైన వనుటయీమె ధిషణాశక్తికిని, ప్రతిభోన్మేషములకును దార్కా ణములు.

నెల్లూరువాసులు శ్రీ చుండూరు వెంకటకృష్ణయ్యగా రను కవివరేణ్యు లీ బాల సహజపాండితీగరిమను, అబ్బురమగు కవితాస్వభావమును గాంచి యీమెకు పద్యములలోనే లేఖలు వ్రాయుచు, నామెచే పద్యములలోనే ప్రత్యుత్తరముల బడ యుచు, నామెయందలి అంతర్నిహితశక్తి నుద్దీపనము గావించి, తెలుగుభారతి కొక దివ్యారాధకురాలిని, తెలుగుదేశమున కొక దివ్యాభరణమును ప్రసాదించిరి. కేవల కవిత్వముకాక, చిత్రలేఖనము, కుట్టుపనులు మొదలగు నితర లలితకళలకు నీమె పుట్టినిల్లు. ఆ యా కళలయం దెన్నో బహూకరణముల గూడ బడసియున్నది. అనేక సభలకు సమావేశములకు నధ్యక్షస్థానమును గూడ పొంది సమ్మాన్యులైరి. ప్రస్తుతము వీరి నివాసము విజయవాడ. తాతగారి బహుభాషాపాండిత్యము, తండ్రి గారి కళానిపుణత, భర్తగారి వైదికాచారసంపత్తియు నీమెయందు వికాసము గావించినవి.

'భక్తిరసామృతము' వీరి పదునొకండవ యేట రచింపబడినను, నిరవద్యమై వికసించిన బొండుమల్లియలదొంతరల వలె ప్రకాశించు భగవన్నుతి పద్యావళితో సురుచిరముగ నున్నది. అనర్గళమగు ధారాశుద్ధికి—

"ఎంతయు వేడిన నీ దయ
యింతయు నాపైన రాదు, చోద్యము గాదే?
యింతటివాడవు నీ వని,
స్వాంతమునం దెన్న దెలుగజాలను తండ్రీ."

అంత్యప్రాసనియమముతో నడిపిన యీ క్రింది చిన్నగీతమును జూడు డెంత శోభావంతమై యర్థగంభీరముగా నున్నదో!

''జన్మజన్మంబు లెత్తి వేసార జాల,
నింక నైహికవ్యథల భరింప జాల,
ముక్తి నీవె, నే నింక నశక్తురాల;
నన్ను మన్నింపవే కరుణాలవాల!''

భక్తిరసామృతమున భగవానుని ప్రార్థించుచు, ప్రపంచవృత్తము, వైరాగ్య పద్ధతి తెలియజేయుచు రచించిన పద్యము లెన్నో కలవు

మిక్కిలి యాశ్చర్యకర మైన విషయ మేమన, ఛందశ్శాస్త్రమును సరిగా నెఱుంగుట కైన నవకాశము లేనియంత పిన్నవయసున రచించిన యీ గ్రంథమున సుమారు 30, 40 వింత ఛందములు గల ప్రార్థన లున్నవి. పంచచామరము, కుసుమవిచిత్రము, పాదపము, సుముఖి, మేఘవిలసితము, పద్మనాభము, తోటకము, భూతిలకము మున్నగునవి యందలి ఛందములలో కొన్ని.

తన పతి నామాంకములతో రచించిన పద్య మొకటి భాగున్నది. కవయిత్రు లలో పెక్కురు తమ నాథులనామముల గూర్చి పద్యములు చెప్పిరి. కాని వీరి పద్యము అంత్యనియమముతో సుభగముగా నున్నది.

''బహుళనిర్మలతరకీర్తి, భవ్యమూర్తి,
సత్యపథవర్తి బంధుపోషప్రవర్తి,
వరలు మద్హృదయాంబుజ భానుమూర్తి,
యనగ బేరొందు మన్నాథు నభినుతింతు.''

ఈ గీతము నాలుగు పాదములలోని మొదటి యక్షరముల జేర్చిన తన భర్తనామ మగును. అంతే కాక, ప్రసక్తానుప్రసక్తముగ తండ్రిగారిని, తాత గారిని, కృతజ్ఞతమెయి వందించిరి.

దివ్యక్షేత్రసందర్శనమున అచ్చటచ్చట కొన్ని విచిత్రభావములకు దా వగు కొన్ని పద్యముల జూపుదును. విఘ్నేశ్వరుని వర్ణించిన పద్ధతి :—

"ఎటు భరియింప గల్గితివొ యింతటి బొజ్జను? నిట్టి రూప మె
చ్చట గన లేదు, విఘ్నముల శాంతి యొనర్చెడి దేవు డంద్రుడు నిన్,
కటకట! కాలసర్పమున గట్టి రి దేల భయంబు లే దొకో!''

ఇంక అన్నపూర్ణను ప్రార్థించిన తీరు :—

"స్వర్ణరూపంబు దాల్చి నీ సరస నిలిచి,
రజతగిరినాథుడైన నీ ప్రాణనాథు
డీశ్వరుడు గూడ నిన్నె యర్థించుచుండ,
తనయలము మేము, మా పాలి తల్లి వీవు,
నిన్ను యాచించు టొప్పదే యన్నపూర్ణ?''

అహో కల్పన ! స్వామిరూపము స్వర్ణ మట ! నివాసము రజితగిరి యట ! అయినను, నా యంబను యాచింపక తప్పదట. ఇక మనబోటులము యాచించుట తప్పెట్లగును !

ఈశ్వరు నంతవానిని నిలువదీసి యె ట్లడుగుచున్నదో యీమె :-

ఎత్తైన కొండపై నెక్కినంతనె నిన్ను
జేరలే నని చింత జెందబోను,
పులిచర్మమును గట్టి బూచుల తేడవై,
జడలు దాల్చుట చూచి జడియబోను,
కైలాసమును వీడి కాటిలో నివసించు
బిచ్చగా డని నిన్ను విడువబోను,
సన్యాసి పగిది వేసము దాల్చినంతనే
వర మీయ లే వని వదలబోను,

తనయలము మేము, మాకడ దాచ నేల ?
యెఱుగమే తండ్రి! నీ దివ్యచరిత మెల్ల!
దర్శనం బిచ్చి మ మ్మేలదగును గాక,
మాయచే మోసగింపంగ న్యాయ మగునె ?

ఆహా! యెంతటి భావౌజ్జ్వల్యము! ఏ తొలిబాము నందలి సుకృత విశేషమో, కాకున్న నింతటి ప్రదీప్తభావప్రకర్షతోఁడి కవితా సౌభాగ్యమలవడునా! ఈమె తన లేఖినిని భక్తి రసామృతపూరమున పూర్ణముగ ముంచి కాని యేమియు చేయ నొల్లదు. అగుట, నీమె కవితకు ప్రాతిపదికయు, సందర్భమును, రసమును నంతయును భక్తి మయమే.

చిన్ని పద్దియములు సహితము చిక్కని యల్లికతోను చక్కనియూహలతోడను శక్తిమంతములై యున్నవి.

"ఉన్నాడో లేడో యని,
మున్నాతడు బిలిచినంత మోక్షం బీవే ?
నన్నేల వెతల బెట్టెదు ?
ఉన్నా వని నిన్నె నమ్మి యుంటిని విఠలా!"

లాగి విడిచిన యమ్మువలె, దూసిన చిరుకత్తియపోలె, జంకుగొంకులు లేక పద్యమాలతో న్యాయనిష్ఠురముగా భగవాను నెట్లు సవాలు చేయు చున్నదో!

ఇంతే కాక, వీరి చందమామ, వేణుగోపాలుడు మున్నగు ఖండకృతులును చక్కగా నున్నవి. భగవన్నుతి యను ఖండకావ్యమున:—

చల్లగా వర్షించు జలధరమ్ములలోన
 పిడుగుల నేల గల్పించినావొ?
రమణీయతర మైన రత్నాకరంబున
 బడబాగ్ని నేల యేర్పఱచినావొ?
ఫణిఫణాదులలోన మణుల నమర్చియు,
 కూ9రమౌ విష మేల గూర్చినావొ?
విషయభోగములందు వివిధసౌఖ్యము లిచ్చి,
 విరివిగా వెత లేల బెట్టినావొ?
"బురదలో కల్వ పూలెట్లు పూయు నొక్కొ?
ముండ్లలో గులాబీ లెట్లు పూయు నొక్కొ?
...   ...   ...

అను పద్యమున చీకటి యున్ననే వెలుగునకు విలువ యెక్కుడనియు, "కష్టసుఖములు, కలిమిలేములు, కావడికుండలు" అను పరమసత్యమును కావ్యకళాశిల్పసౌందర్యమున నందముగ పొదిగి మన కందించినా రీ కవయిత్రీమతల్లి.

సుభగంభావుకురాలై, సుందరతర కవితాసృష్టి నొవర్చి, ఆంధ్రవాఙ్మయ నందనోద్యానమున పరిమళపారిజాతమై కళాభిజ్ఞుల మన్ననలందుకొనజాలిన సత్యవతీదేవి కివే మా జయవాదములు'

---

# 71. శ్రీమతి ఆతుక్కూరి అన్నపూర్ణమ్మగారు

శ్రీ సత్యవతీదేవిగారి యట్టి సరసకవీశ్వరిని కడుపార గని పెంచిన సాధ్వి శ్రీ అన్నపూర్ణమ్మగారును గడిదేరిన కవిత చెప్ప నేర్చిన కాంతారత్నమే. 'కుమార సుగుణబోధిని' యను పేర నీమె యొక చిన్న పొత్తమును రచించిరి. దీనిని వీరి పుత్రికారత్న మగు శ్రీమతి సత్యవతమ్మగారే వెలయించిరి. ఈ గ్రంథకర్త్రి చక్కని జాతీయ మగు కవిత్వము వ్రాయనేర్చినవా రయ్యు, భారతసహజలక్షణ మగు స్త్రీలజ్జాసాధ్వసముల పెంపున దమ నామమును ప్రచురించుటకియ్యకొనరైరి. ఈ యమ మద్రాసులో తహసీలువారుగా నున్న తమ తండ్రి కొల్లిపర శ్రీరాములు గారియింట 1875వ సంవత్సరమున ప్రభవమందిన పూతచరిత్ర.

లోకమున కడు ప్రాకటముగ ప్రాకి చిక్కని పరదాలై, పందిళ్లై, లోకము వెలుగే చూడనీయక సముచితమగు స్వాతంత్ర్యమును సహితము హరించు పురుషులు రచించిన కుమారీనీతులు, స్త్రీశతకములు చదివి చదివి, యామె కొక యూహ దోచినది.

"పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చలవిడి వేయునట్లు, విరివిగ సుకవుల్
హెచ్చుగ విద్యల నేరిచి
వచ్చిరె స్త్రీనీతి గఱుప ? వసుధ కుమారా."

హెచ్చుగ విద్యల నేర్చిన ఫలము పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్నట్లు, బొడ్డూడకున్నను, పురుషుల మను పేరిట పల్కబడి చెలాయించుచు, స్త్రీలకు నీతులు గఱపువారే కాని, యెంత దుష్టులైనను పురుషులకు నీతులు గఱపువారు లే రని యామె కటకటంబడినది.

"తప్పు లెన్ను వారు తమ తప్పు లెఱుగరు'',
అని వచించు సామెతను దలంచి,
నీదు దప్పు లెఱిగి నేర్పున సవరించి.
సఖుల నీతి గఱప జను కుమార ''

ఇట్లు మొదలిడి బారున చెయ్యెత్తి వీరు దుర్జను లగు పురుషులపై రవాళింపు మొదలిడి యొక దుమారము లేవదీసిరి.

కంకణము గట్టి లోకపు
వంకరలను దీర్తు మను నవనవ్యపజ్ఞుల్
శంకింప కింక సానుల
వంకరమతి మాన్ప రెట్టివారొ ? కుమారా!"

''సిరులు గలిగె నంచు సరగున గర్వించి
చిత్రముత్రు లాడి చెడకు మయ్య!
ప్రజల కష్టములను బాపని సిరి యేల ?
నరుల వెంట రాదు సిరి కుమార !"

నీ సతియ నీకు మిత్రము,
నీ సతియే నీకు దోడు, నిజముగ సుమ్మీ,
రోసమున సతిని దూరిన,
మోసము నీ సౌఖ్యమునకు ముందు కుమారా !"

రుసరుస లాడుచు, దిట్టుచు
గసరుచు గోపింప సతుల గ్రక్కున వశులై,
మనలుదు రని తలపోయుదు
రసురుల వలె దుష్టపురుషు లవని గుమారా !''

ముదమున బతంగనివహము
వదలక ఫలరసములకును బరుగిడు కరణిన్,
మృదుహృదయుడవై మెలగిన
సుదతి నినుం బొంద దలచు జూవె కుమారా !''

సరసము లగు భావముల కూర్పుతో, సలలిత మగు పదముల పేర్పుతో, ఏర్చి తీర్చిన ఈమె పద్యములు తిన్నగా పఠితల హృదయమును దూరి సన్నగా పనిచేయ జాలినవిగా నున్నవి.

చల్లనైన జీవముతో మెల్లగా నర్తించు నదీమతల్లియొడిలో ముక్కుకు సూటిగా చుక్కాని ద్రిప్పుకొనుచు, నొడిదుడుకులు లేక జీవనపథము నొక మధుర యాత్రగా సాగించి, తుదకు పరమాత్ముని పదపల్లవముల భజింపు మని యీసాధ్వి పురుషులకు, బాలురకు, కుమారులకు నుపదేశించినది.

ఇది యెంతయు నిజము ! పవిత్రముగా నిర్వర్తింపవలసిన బ్రదుకును బడబాగ్నిపాలు గావించుటకు మున్ముందు పురుషులే సాహసింతురనవలయును. అట్టియెడ పుంలోకము జంకు గొంకులు లేక స్వేచ్ఛామతులై అవినీతిరతులై విహరించుచుండ, సమాజమున నీతి యను పదమును దలచుటకు మాత్రము తా వేది ?

ఇట్లు మఱికొందఱు సాహసించి పురుషసంఘమును సంస్కరింప బూనిన, యావత్సంఘమును దనంత దానే బాగుపడును.

స్త్రీజాతి జీవితసార్థక్యము గల్గించు నిట్టి పూన్కికి దొరకొనిన యీ సదుద్యమశీలకు స్త్రీలపక్షమున నివే మా సాధువాదములు !

---

# 72 శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

కాంతాశతకమును రచియించి కావ్యజగద్వీథిని పౌరసత్వము నిర్వహించిన వారు శ్రీమతి భారతీదేవిగారు. పాఠశాలల కేగి, కళాశాలల కేగి విద్య నభ్యసించి పండితురాండ్రుగను, కవయిత్రులుగను పేరు గాంచుటలో వింత యేమున్నది ? ఇంటియందే యుండి, కవిశ్రేష్ఠుడగు తండ్రి కనుసన్నల కవితాసతి సౌందర్యము మన్నించి యల్లన మెల్లన కావ్యము నల్లు మెలకువ సంపాదించిన సాధ్వి మా సోదరి భారతీదేవి! వారసత్వముగ సిరు లబ్బనచ్చును. సంపద లబ్బవచ్చును. కాని కవిత్వ మబ్బునా? అది పూర్వపుణ్య తపఃఫలము గాక !

శ్రీ భావపురీక్షేత్రమున ప్రసిద్ధ న్యాయవాదులుమ, నంతకంటె ప్రఖ్యాత కవిశేఖరులును నైన శ్రీ చంద్రమౌళి చిదంబరరావుగారికిని, అన్నపూర్ణమ్మ గారికిని బొడమిన ఏకైకపుత్రిక. వీరి తల్లిగా రగు అన్నపూర్ణమ్మగారు వారి యౌవనకాలమున బాపట్ల గ్రామమునకు మొదటి మహిళాసంఘ సంస్థాపకురాలుగా ఖ్యాతి గాంచిరి. శ్రీ భారతీదేవిగారి మామగా రగు శ్రీ దేశరాజు రంగారావు గారు భావనారాయణ దేవాలయ ధర్మకర్తగా నుండి, యా పురాణదేవాలయము నెన్నో విధముల యుద్ధరించిరి. వారు సమర్థు లగు యుపాధ్యాయులుగ వారి కాలమున పేరొందిరి. వారి కుమారులు శ్రీ రామచంద్రవురాగారు శ్రీ భారతీదేవి గారిని పెండ్లాడిరి.

బాపట్లయందలి స్త్రీ సంఘకార్యములలో శ్రీమతి భారతీదేవిగారి పద్యములు లేకుండ నడచు వేడుక లేదు.

గృహలక్ష్మి ప్రముఖరచయిత్రిగా ఆంధ్రులకు వీరు పరిచిత పూర్వులే. వీరి రచనలు బహుముఖములు.

కాంతాశతకము అను పేరిటి వీరి శతకమును శ్రీ కేసరిగారు ప్రచురించిరి. దీనిని శ్రీ భారతీదేవిగారు తమ జనకులకే యంకిత మిచ్చి, తమ ఋణ మీగి వారికి పుత్రులు లే రన్నకొరత దీర్చిరి.

ఇంతే కాక, 'ముక్తాంబ' యను నాటికను రచియించి, యందు కొన్ని భాగములు గృహలక్ష్మియందు ప్రచురించిరి.

వీరు తమ శతకమున సాధారణముగ నందరును జేయు,

"పతి జగతి పరమమిత్రుడు,
పతి భువి నీ కేడుగడయు, పతి బాంధవుడున్,
పతిరత యగు సతి కిహపర
గతులకు నే కొఱత లేదు గదవే కాంతా."

అను పాతివ్రత్య బోధ యొనర్చుటే గాక, దేశసేవ, ఖాదీధారణ, కవిత్వా భ్యాసము మున్నగు విశిష్ట విషయములగూర్చి బాలికలకు, పడతుకలకును పులు గడిగిన ముత్తెములవంటి పద్యములతో చక్కని యుద్బోధము చేసిరి.

"చదువుము దేశ చరిత్రల్,
చదువుము మహనీయులైన జనుల చరిత్రల్"

"భావింప విశ్వమానవ
సేవ యొనర్చుటయె దైవసేవ యటంచున్
భావింతురు పెద్దలు భువి......"

"మొల్లవలె గైత జెప్పిన,
మల్లెలవలె స్వచ్ఛమైన మంచి యశంబున్
కొల్లగ గాంతువు, గనుమా
సల్లలిత కవిత్వ మల్లు సరణిన్ గాంతా."

ఇంతే గాక, భృత్యులను దయతో జూడు మనియు వీరు ప్రత్యేకించి ప్రబో ధించినారు

ఇక గృహలక్ష్మిలోను, ఇతరపత్రికలలోను అప్పటప్పట ప్రచురించిన పద్యము లెన్నో మకుటములుగ నున్నవి. అవి యన్నియు ప్రచురించిన నొక ఖండకావ్యముల సంపుటి యగును.

రమణభగవానున కొసగిన పుష్పాంజలి:—

అరుణాచలస్వామి కరుణామృతరసంబు
తనివార కడుపార ద్రావినాడు,

పరమ చిదంబరస్వామి శ్రీ నటరాజ
 పదపద్మమధు సేవ బడసినాడు,
శుద్ధుడై మధురలో సుందరేశ్వరు పాద
 వందనాసక్తుడై బరగినాడు,
జన్మాంతర సుకర్మసంస్కార సంజాత
 జ్ఞానంబు నొందగ జాలినాడు,

చిత్తశుద్ధి తపస్సిద్ధి జెందినాడు,
అరుదగు మహర్షివిఖ్యాతి నందినాడు,
స్వస్వరూపానుభూతి నొసంగినాడు,
అనుభవానందయోగి రమణమహర్షి.

పూజ్య బాపూజీ అస్థినిమజ్జనమును గూర్చి వ్రాసినది కూడ యిట్లే ఉజ్జ్వలముగ నున్నది.

పరమ ప్రేమనిధానుడై, విపుల విశ్వవ్రాత సంపూజ్యుడై,
తరణోపాయ విధాన కార్యరతుడై, తత్వార్థ నిర్ణేతయై,
దురితక్ష్మాజన పంకశుద్ధికరుడౌ ధుర్యుండు శ్రీ గాంధిజీ
వరదేహాస్థిక దాల్చు భాగ్య వట కృష్ణావాహినీ ! పావనీ.

రవీంద్ర కవిచంద్రుని యస్తమయముం గూర్చి వీరి లేఖిని బహుధా వాపోయినది.

జగదేకకవీశుడవై,
అగణితవిఖ్యాతి భారతాంబకు నార్జిం
పగ జాలిన మేటి రవీం
ద్రగురూ ! కాలనియతి దప్పలేదే నీకుఁ ?
వంగమే కాదు, ని న్నెంచి పొంగిపోవు
నఖిల భారతరాష్ట్రంబు లనవరతము;
నార్యవిజ్ఞానకవితల నరసి తాము
గర్వమును బొందుచున్నారు గాదె కవులు.

స్వర్గలోక ద్వారపటలి తటాలున
దెరువంగబడియె సుధీవరేణ్య !
దేవర్షివరులు సంఖావింప నెదురుగా
వచ్చుచున్నా రదే పరమతేజ !
దశదిశాంతరములు ధన్యవాదములు ప్ర
తిధ్వనించెడు నదే దివ్యపురుష !
పుష్పాంజలులతోడ పొంగుచు భక్తులు
యోగు లదే నిల్చి రుజ్వలాత్మ !

స్వాగతశ్లోక సంగీత సరస మధుర
వాక్సుధాధార ప్రస్థానభరము దీర్చ,
నమరకాంతలు నీకొఱ కరుగుదెంచి
రదిగొ విశ్వకవీ ! నీకు మర్యాద సేయ."

ఆర్ద్రమ లగు పదార్థముల కలయికతో పూవును, తావియువలె పొలుపొందిన యీ పద్యబంధమును గాంచి యభినందింతము—

"ముద్దుకృష్ణ గోవిందకృష్ణ" యను మకుటమున శతకము కాబోలు వీ రిపుడు రచించుచున్నారు. ఇంకను నది యసంపూర్ణము.

"పాలమున్నీటి తరగల బాపపాన్పు
రోసి, వ్రేపల్లెవాడ విచ్చేసి, పసుల
కొట్టములలోన వసియింప గోరి.........."

పసిపాప ముద్దుకృష్ణుని లీలాసౌందర్యమందు తేట తెలుగున నుడికారము నీటు గొలుపు—

"తల్లి కెంగేలు మాటికి దడవి తడవి,
పట్టుకొనుచును, కాళ్ళకు జుట్టుకొనుచు,
రాకు మన్నను వచ్చి మారాము సేయు
మురుపు నొకసారి జూపరా ముద్దుకృష్ణ!''

"చద్దిముద్ద చిక్కాలు బుజాన బెట్టి,
నెమలిపింఛంబు శిరముపై నమర బెట్టి,
నాల దోలుచు వని కేగునట్టి వింత
వేషమును జూడ వలతు గోవిందకృష్ణ!"

గోపికలతోడ చల్దుల గుడిచినావు,
పెరుగుకుండలకుం దూట్లు బెట్టినావు,
ఈడుచేడెల గోడిగా లాడినావు,
పెద్దమనిషివె నీవు గోవింద కృష్ణ?"

అని కృష్ణలీలలను గీర్తించిరి. చికిలి యొనర్చిన చిన్నిరతనములవలె చెన్ను మీరుచు నటనట వ్యాజస్తుతిపరముగ కూడ నీపద్యము లందగించినవి.

భారతాంబ యని, తిక్కన యని యింకను ననేకకృతు గలవు. రాష్ట్ర ప్రబోధము అను మకుటమున కొన్ని ముత్యాలసరాలు గలవు. వీరి సంక్రాంతి, దసరాదృశ్యములు కడు మనోజ్ఞములు.

కవిశేఖరుల పుత్రియై, స్వయముగ కవయిత్రియై, రసములు చిప్పిలు పదబంధములతో పద్యసుమముల నంధ్రసరస్వతి నర్చించిన మా సోదరి భారతీదేవి యభివంద్యయే.

ఆధునికాంధ్రవాఙ్మయ మనబడు
మూడవ తరము సమాప్తము.

---

# ఆంధ్రకవయిత్రులు

నాలుగవ తరము

---

అద్యతనాంధ్రయుగము

## 73. శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

''శ్రీ మదోంకార పంజరాసీన శుకము
ప్రాంచ దుపనిష దుద్యాన పరభృతమ్ము
ఆగమారణ్యవీథీ మహా మయూర
మైన కాత్యాయనీ దేవి నాత్మదలతు"

అమృత రస భాండార మైన మానసతరంగిణినుండి యుద్భూద్ధమైన తలపు విరిదమ్మినుండి తొరంగిస తీయని తేనెవాకలే సోదరి రుక్మిణమ్మగారి కృతీ సౌభాగ్యములు.

పొలివోని జీవరత్నములై, ఆంధ్రుల యదృష్టరేఖలై, పొలుపు మిగిలిన కృతిరత్నముల వెలయింప జేసిన ఈ కుంకుమశోభిత నుద్వాహమాడినవారు విశాఖ పురీవాసులు శ్రీ స్థానాపతి సత్యనారాయణగారు. వారును కవిశేఖరులే. నిడదవోలునందలి శ్రీకాకుళపు పురుషోత్తముగారు, గరుడమ్మగారు అను వారు ఈయమ తల్లిదండ్రులు. 1915 వ సంవత్సరము వీరి జన్మవర్షము. ప్రస్తుతము వీరి నివాసము విశాఖపురీ కన్యకాపరమేశ్వరీ పూజా ప్రాంగణము. శైశవమున పుట్టినింటను సంస్కృతకావ్యపఠనశ్రవణముతో కనులు విప్పి కాలకృత్యముల

నెఱవేర్చెడివారు. యౌవనమున మెట్టినింటను పలుకుపసదన మెఱిగ గర గర నౌ కావ్యవితానముల గ్రుచ్చి విరిమాలలుగ పరమేశ్వరి నలంకరించు పతిదేవుని కడ, నిటు సాహిత్యశిక్షణమును, నటు సంసారశిక్షణమును సాగించెడివారు. ఒక ములువాసి హెచ్చుగా సాహిత్యశిక్షణకే కాలము వెచ్చించి రేమో యున్నను పరామరిక లేని పలుకే.

శ్రీ స్థానాపతి గారు సాహిత్యగురువు లని మా సోదరి తన జీవనస్వామిపై గౌరవము బ్రాయలేక యూఁది యూఁది పలుమరు పలువరించుటే కాని, నిజమునకు వెలలేని తులలేని కావ్యరత్నముల హృదయకోశమునుండి వెలువరించి రసలుబ్ధు లగు ఆంధ్రుల మ్రోల పలుకు పలుకునకు బేహారము పఱపి విలుచుకొన్న యశోధనముల నుగ్రాణములు నించి కుటుంబ గౌరవము పెంచిన ప్రతిష్ఠ మా సోదరిదే.

చెంపకు చేరెడుకన్నులు, విజ్ఞానపు వెలుగు తొలుకాడు చురుకు చూపులు, తొలకరి మబ్బువలె కనుల దళ్కొత్తు విగ్రహముతో, తొలి పలుకరింపుననే "చెల్లీ" యని మనసిచ్చి మాటమచ్చిక నెఱపు మంచితనము సోదరి రుక్మిణమ్మకే చెల్లినది.

అందాలు చిందు చెందామర తంపర వంటి వారి కావ్యపరంపరలో నొకింత ప్రొద్దుపుత్తము:---

(1) పూలమాల (2) దేవుడు (3) వత్సరాజు (4) దూతఘటోత్కచము (5) దయ్యాలు (6) ప్రార్థన (7) ఊర్మిళ (8) ప్రతిజ్ఞ (నాటకము) (9) ఛాయ (నవల) (10) పూర్వగానము (ఖండకావ్యము) (11) లీల (కావ్యము) (12) దేవీభాగవతము (ఆంధ్రానువాదము) (13) కాదంబిని (ఖండకృతుల సంపుటి) (14) చారుదత్త (నాటకము) ఇవి వీరి ముద్రిత గ్రంథములు. (1) సప్తశతి (2) నీలాటి రేవు (3) యుక్తిమాల అనునవి యింకను నముద్రిత తములు. ఇందు దూతఘటోత్కచము, వత్సరాజు, చారుదత్తము అనునవి భానుని కావ్యశ్రవణమున పూరించుకొన్న రసభావములతో పొదిగి తయారుచేసిన దృశ్యకావ్యములు. నీలాటిరేవు, దయ్యాలు, యుక్తిమాల అనునవి కథానక

ములు. సప్తశతి అపుడపుడు వ్రాసిన ఏడునూర్ల పద్యముల సంపుటి. "దేవుడు" "ప్రార్థన" యనునవి వివిధోపనిషత్తుల నుండి యేర్చి కూర్చిన దైవత్వ ప్రతిపాదక సూక్తి సమన్వితములు.

వీరేశలింగముగారినుండి యేపు జెందుచు వచ్చిన ఆధునిక ఆంధ్రవాఙ్మయ రసాలము శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు మున్నగు రససిద్ధుల భావామృతసేచనముచే బలుపు జెంది మధుర మాకందముల నందించినది. జాతీయతా భావముల ప్రాపుతో క్రొత్త చివురు దొడిగిన యీ రసాలమున దేశభక్తి, రాష్ట్రోద్బోధము మొదలగు ఫలములు రసికహృద్వి పణిని బాగుగా ప్రచారమునకు వచ్చిన దీ కాలముననే. శ్రీ గురుజాడవారే యీ తీరు కవితలకు గణపతిపూజ గావించినను, శ్రీ రాయప్రోలువారి యాచార్యకత్వము నంగీకరించిన తదుపరియే వీని పలుకుబడి హెచ్చినది.

ఇట్టి పరిణామప్రవాహమున పరవశులై తోడి కవిలోకము పూర్తిగా మునిగి తేలగా, కవయిత్రిలోక మా జలమును శిరసుపై సంప్రోక్షణ సేసికొనుటతో మాత్రము తనివి చెందిన దనవచ్చును.

అట్టి యద్యతనాంధ్ర సారస్వతరంగమున నభిషిక్తయైన రసజగద్రాజ్ఞి యీ సోదరియే.

పూవు పుట్టగనే బరిమళించు నట్లు, వీరి తొలికబ్బ మగు 'పూలమాల' యందే చందమామ యెట్టివాడుగా ప్రకాశించుచున్నాడో గాంచుడు: —

"మల్లిపూదోట దిరుగాడు మాలి వోలె
చల్లగా నెటు పోదువో చందమామ !"

ఉత్తమకావ్యలక్షణ మగు ధ్వన్యాత్మకమైన ఈ యొక వాక్యమే యొక కావ్య మన నగును.

"కవిత, గుమ్మడు, కుంతిసందేశము, కృష్ణునితో పాంచాలి, సుమన శాంతిలి" యను నొక కొన్ని మకుటముల క్రింద నీ వరవర్ణిని సుధానిష్యందిలేఖినితో పూలమాల కూర్చినది.

"గుమ్మడు" అనే కావ్యమున "వెలలేని రతనాల నలరారు బహువిధరత్న కంకణమ్ములు ఘల్లు ఘల్లు రనగ, ఘుమ్మ ఘుమ్మ మని పెరుగు తఱచు యశోదమ్మ" లో రూపొందిన స్త్రీత్వమును మనకు ప్రత్యక్షము జేయుచు, స్త్రైణ ధర్మపరిపాలనాగౌరమును నేటి నాగరిక యువతీలోకానికి హెచ్చరించినారు.

"కవి" యను కృతియందు కవి నిరంకుశతా విహారమును, సర్వతంత్ర స్వతంత్రతను, అప్రతిమాన ప్రతిభను ఒకచక్కి ప్రశంసించుచునే

"అన్య దేశాల సంచార, మన్యదాస్య,
మొక్క భార్యకు నేవురు నొప్పు మీర
భర్తలై పాండవులు కీర్తి ప్రబలి యుంట
వ్యాసకవిసార్వభౌము నిర్వ్యాజకరుణ ! "

అను పద్యమున "కవిసార్వభౌముని కలముపోటుచే స్త్రీజాతికి గల్గిన మాయని యవమానమునకు కలంగిన మదితో పరమాభిమానినియై కవయిత్రియైన దానును ప్రతీకారముగ వ్యాసున కొక్క కలముపోటును చురుక్కున దగిలించి మఱి విడిచినది: —

" నిబిడ నిద్రాభిముద్రితమైన యట్టి
" మహిత హేమంత శర్వరీ మధ్యజగతి " ని

జ్యోత్స్నా విహాయసము నరయుచు, "పసిడిజిలుగుల రతనాల పాత్ర నిండ మధురద్రాక్షాసవము తనివి గదుర ద్రావి—"

ప్రణయ రాహస్యగీతాల వలపు దెలుపు
తేట వెన్నెల జీవంపు బాట నిలిచి
చలువ తెమ్మెరకెరటాల గళము నిలిపి

......భువనాలు పల్లవింప........శరీరాలు మఱచి, యేకమై పాడుకొనుచు, రసజగతిని మధురకవితా పరీమళమార్గ నిత్యయాత్రికులై యనంతపథమున సాగిపోవు ప్రణయియుగళమును మనమ్రోల సాక్షాత్కరింపఁ జేయుచు, సీమె తన కాదంబినిని చవిఁ జూచుటకై యిపుడే క్రొత్తగా తెలుఁగుల కందించినారు.

కుమార్గవర్తనలై, పతిప్రాణ లగు పల్లవాధరలను బాధించు కూళలను "ఓయి మధువ్రతా! నిలువుమోయి" అను నదలింపుతో నదుపునకుఁ దేఁజూచిన ఈ కవిరాణి పదగౌరవమును, పలుకుబడిని గమనింపుడు.

"ఓయి మధువ్రతా ! నిలువు మోయి ! నిశీథపువేళ కూర్మితో
ప్రాయపు నా విముగ్ధహృదయాసవ మంతయుఁ గ్రోలి విస్మృతి
చ్ఛాయ మునింగి యీయెడ తుషారతిరస్కరణీనిబద్ధ మీ
తోయజమంచు దుర్వ్యథల ద్రోసి కనుంగొన వేల సుంతయుఁ.

సాంద్ర శిరీష బంధుర విశాల రసాల కదంబ కుంద మం
దార సుమాంతరాళముల దైవవశాన మధువ్రతమ్ము సం
చార మొనర్చి నీదయిన సాంద్ర పరీమళ నూత్న సద్గుణాం
కూరములే తలంచుఁ జుమి కొందల మేల సరోజరాజమా !

రసాభ్యుచిత పదాంచిత మైన పదబంధమున నవనాగరికుల విభిన్నజీవితమార్గము నెట్లు ధ్వనివ్యంజకముగ నిరాస మొనర్చిరో చూచితిరి గదా! ఇచట "సరోజరాజమా!" యనుట కూడనిది, 'సరోజభామినీ' యనుచో బాగుండెడిది. ఇంతే కాక, ఒండు రెండుగా మాత్రమే కానంబడు నీ క్రిందిచోట "పోసి తే తెమ్ము మధురద్రాక్షాసవమ్ము" మున్నగు పాదాలలోని ఛందోభంగాదులను సవరించిన బాగుండును.

'అమృతబిందు' అను మకుటమున నీయమ ఆధ్యాత్మికోపదేష్టగా మన పరిచయము పొందుచున్నారు.

"రంగు రంగుల వెలయు గోరాజి కాని,
వాని పాల రం గొక్కటై పరగుచుండు;
జ్ఞాన మాపాల రీతిగా గానుపించు
లింగసకలమ్ము నావులరీతిఁ దోచు.

అని యామె వ్రాసినట్లు ఉద్దిష్టవస్తువు ఆధ్యాత్మికమైనను శృంగారమైనను కవయిత్రి లేఖిని మాత్ర మెప్పుడు నొకే విధముగ తేజోమయమై యమృతమునే కురియుచుండును.

''చారు సుకర్ణ కల్పిత విశాల వినూత్న రసాలమంజరీ
పూరిత పంజరీకృత కపోల విరాజిత గోపికామనో
హారుని గాంచి......తరళాంబుజలోచన తప్తబాష్పవాః
పూరము నించు కన్గొనల భూరివిషాదవిఘూర్ణి తాత్మయై."

రాధ విరహ మిట్లు సుదీర్ఘసంస్కృతసమాసముతో బాటు, తెగసాగి నిష్ఠుర మైనది.

చారుదత్తములోని శకారుని యీ యభిభాషణ మందలి యౌచిత్యము నారయుడు;

"మనము వెనువెంట తగులంగ జనెడు నవిగొ
కుక్కలు తఱుమగా నాడు నక్కవలెను,
చక్కిలము వోలె నామది స్రుక్కఁజేసి —''

పాత్రోచిత భాషతో నిట్లు చారుదత్తము సాగించినారు రుక్మిణమ్మగారు.

'సతసయి' (సప్తశతి) యందలి యీ పద్యముల జూడుడు.

" నగలు ధరియింపగా నేడు నాదు మనసు
మోజుపడ్డది, తీర్తురా మోజు నాధ!
సారసాహ్లాదకరుఁడదే చందమామ !
కాంచు సుందరీ వానికి గలవె నగలు?

సామాన్యకుటుంబమందలి యాలుమగల సంభాషణయందును దొంగిజూచి వ్యంగ్యము తీరుతీయములు ఎంత సుందరము. సాధారణముగ ప్రతి పురుషుడును భార్య నగ లడిగినపుడు చెప్పు సమాధానమును చందమామతో పోల్చి చెప్పుటలో గల శోభను గాంచితిరి కదా!

''విక్రేతుకామా కిల గోపకన్యా...మాధవార్పిత చిత్తవృత్తిః దధ్యాధికం మోహవశా రవోచత్ గోవింద దామోదర హే మాధవేతి" అను గీతమును స్ఫురణకు దెచ్చుకొని వ్రాసిరి కాటోలు ఈమె. యీ పద్యమును గాంచుడు.

" కూరగాయల గొన నేగి కోవిదుండు
చారుపద్మమ్ము నూతన చంపకమ్ము
వికసితేందీవరమ్ములు విద్రుమమ్ము
మంచి ఫలములు పరికించి మరులుకొనియె!''

ఆ రసవత్తర శ్లోకమున కీ పద్యము పోలిక యని కాదు, కాని భావ మట్టిదే యని చెప్పుటే ఇచట నభిప్రేతము.

ఇక వీరి నాటకము లన్నియు భాసకృతుల కనువాదములు. దూతఘటోత్కచము నందలి ''దురమున బాలు నభిమన్యుఁ జంపిన దుర్యోధనాదులను ధృతరాష్ట్రుడు —

'' కరుణాహీనుల్ లనేకులు
పరిగొని యేకాకి యైన బాలుని దునుమన్,
పొరి నద్దురితాత్ములు కర
చరణంబులు గూలి యేల చావఁగలేదో!"

అనగా, దుర్యోధను డిడిన ప్రత్యుత్తరము సమంజసముగ నున్నది.

" ముసలి భీష్ముని మిషజేసి యుసురు గొన్న
వారి బాహువుల్ పడలేదు, బాలు డయ్యు
ఘోరసంగ్రామ కేళీవిహారు డతని
యుసురు దీయంగ మా చేతు లూడి పడునె,''

పద్యము చిన్నదయ్యు, మూర్తిని చిన్నదైనను, కీర్తిని బెద్దదైన రుక్మిణమ్మగారి వలె, నూర్జిత మైన పదవిన్యాసముతో నుల్లము బల్లవింప జేయుచు, నీ కావ్యము భాసుని కవితను భాసమానము చేసినది.

రాయబారము విఫల మైనప్పటి ఘటోత్కచుని కోపము-

'' ఎవరు యమమందిరమున కేగ దలచి
యుండిరో, వారు వేవేగ లెండు లెండు

పండ్లుకొఱుకుచు బిడికిలి బట్టి కూరు
చున్నవాడు గ్రమముగ నీ ఘటోత్కచుండు.

ఇందు కోపవిస్ఫూర్తి చక్కగా నగపడుచున్నది. కాని యీ కోప ప్రదర్శనమున కీమె యితరకవులవలె కటుశబ్దపూరితములగు నిష్ఠుర పదముల నాశ్రయింపక, కేవలము నుగ్రమగు నర్థము శక్తిచేతనే తద్రస స్ఫూర్తి కల్గించి "తలపులోతుల నర్థ మందలవరించు'' మహాకవి యనిపించినది. ఈమెను శ్రీ కేసరిగారు 5 మార్చిలో స్వర్ణకంకణ మిచ్చి గారవించిరి.

ఇటులే యనన్య సామాన్యప్రతిభతో నద్వితీయ కవితా ప్రకర్షతో కవిత్వ మొక యుపాసనగ, రచన మొకి పవిత్రదీక్షగ. కావ్యోద్యోగ మొక నియత జీవనవిధిగ భావించి ''క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదంతి" యను నుడికి సార్థకత భజించి సరస్వతీప్రియ సేవికయై తనరారిన మానెచ్చెలి లేఖిని యమృతనిష్యందిలేఖినియే.

---

# 74. ఓలేటి నిత్యకళ్యాణమ్మగారు

''పురుషుండ వికసించు పుష్పరాజమ్ము, మానిని తద్భవ్య మకరంద కణము'' అని తేనె లొలుకు పలుకులతో గృహిణీగృహస్థుల పొందికను పద్ధతిని పొసగించిన శ్రీమతి నిత్యకళ్యాణమ్మగారికి కవయిత్రీ లోకమున గల విశిష్ట స్థానమును విజ్ఞులెపుడో గుర్తించి యామె నాదరించియె యుండిరి.

ఆంధ్రవాణీ పదారవిందాగ్రవేదీ వితానములకడ తన సాహితీ జీవితము నంకితం బొనరించిన యీ చిరయశస్వినీ జీవితవిశేషము లేవియో యెంత ప్రయత్నించినను నెఱుకగాకున్నవి.

గృహలక్ష్మి యందు ప్రచురింపఁబడిన తేజోవంతము లగు రచనావిశేషము లచేతనే యీయమతో నంధ్రసోదరులు పరిచయ భాగ్యము బడిసినారు.

"లలితవసంతకాల మనోజ్ఞ వేళ
తేనె పూపులు నవ్వు సోనలో నీదు
విమల తేజస్వి జీవితకాల మెల్ల
ప్రాణకాంత కుపజ్ఞ పచరింపు మయ్య."

"ప్రబల నైదాఘతాపమున శోషిల్లు
పూరేకు దడుపు మో పుష్పరసంబ
కష్టాలదశయందు కాంతుని హృదిని
మోదరసార్ద్రంబు మొనరింపు గృహిణి."

గృహిణీగృహస్థుల కర్తవ్యౌచిత్యమును ఉచితముగ నిర్వర్తించిన యీమె యున్నత భావసంపదను గాంచి తలయూచని వా రుందురా?

'కవి' యను కావ్యమున నీమె భావములు మిక్కిలి యుదారము లై యున్నవి.

"తావక లేఖినీ నవ సుధా తరుణాక్షర దివ్య భావ పు
ష్పావళి తేట తేనియల జల్లుల తీయదనాలు గ్రోలి యీ
భూవలయంబు మైకమున ముగ్ధత దాల్చి సుఖాలయంబునం
దే వసియించు సంతతము నెంతటి శక్తియుతుండవో కవీ!!

లేతవేకువ సుధాలీల రసాల ప
ల్లవ శయ్య కోయిల లలితగీతి
నరమోడ్పు కనుదోయి దరహాసముల గల్వ
సకి పంపు ప్రేమవాసనల గముల
నమల ప్రణయ జీవులౌ సుఖచక్రవా
కద్వయంపు సొబగు కౌగిలింత
నలరు పిపాశి చూపుల గల్వ హృది బెల్పు
నెలవంక శ్రీ ప్రేమసందేశ వితతి

లలితభావ మారుతకిశోరమ్ము తిరుగ
నవసుఖానంద జీవివై పవలు రేలు

ప్రకృతి ధామమ్ములో విహారమ్ము తోడ,
గడపు...'

ధన్యమూర్తి యైన కవికుమారు నెంతో యాదరముద ప్రశంసించినది.

"నీ కవితాభ్రవీథి రమణించెడు మంజులభావతారకా
నీక తుషార దృగ్గళిత నిర్మలరోచులలోన నైక్యమై
నాకపు సౌఖ్య సంపద ననారతమున్ హసియింతు సత్కవీ
యీ కలుషావనీ భయద వీక్ష నినున్ స్పృశియింప నేర్చునే!!

ప్రకృతికి భాష్యప్రణేత యైన కవిహృదయము పాలకడలి యట్టిది. లచ్చిని, యుచ్చైశ్రవమును, నైరావతమును. శీతమయూఖుని, కల్పవృక్షమును, కామధేనువును ప్రసవించిన క్షీరోదధివలె, బహువిధ భావ శబలిత మైన కవిహృదయము మిగుల పవిత్రమైనది. అట్టి మహనీయుడగు కవిని "కలుషావనీభయద వీక్ష" స్పృశియింప సాహసించునా? నిజము! నిజము!!

ఆ యా యీ ఋతువుల ననుసరించి చేసిన ఋతుగానము, స్వాతంత్ర్యలక్ష్మి, శరద్వేళ, వర్షర్తువు మున్నగు మకుటములలో ప్రకటితములైన వనేకములు గలవు. "కళ్యాణగీతి" యను ముత్యాల సరములలో స్త్రీ హృదయసహజ లాలిత్యమును చక్కగ రూపొందించినది:—

"ఇది శుభోదయ విజయ వాసర హృద్యబాల ప్రత్యూషానిల
భృంగ సంభృత దివ్యమోదా క్రాంత సమయమ్ము"
ప్రథితమోహనయౌవనాగత బాలికామణిపగిది విశ్వ
ప్రకృతి నూత్న విలాససంపద రాగదృష్టి లసించెడున్.
విజయ వాసర మంజుగీతా, ప్రేమ యౌవన పరిమళంబులు
దివ్యమోద శ్రీ లొసంగుచు, దిరిగి ప్రబ్బెడున్.
"మేలుకొమ్మో యాంధ్రబాలిక! మెఱుగుచూపుల బండుగకునై
సరవి వచ్చిన ప్రాణకాంతుని, నరసి మురియంగన్"

నవోఢలజ్జాప్రకృతిని మేళవించి చేసిన యీ ప్రకృతిసమీక్ష యెంతయు రాగరసభరితము గదా!

"ఆంధ్రబాలిక నవ్యనీల దృ
గంచలంపు టమాయకత్వము
సుగుణ మంజుల కీర్తివల్లిక
సొబగు నిడు గావుతన్"

అని యాంధ్రబాలికా విశిష్టగుణము లగు అమాయకత్వమును ఆశీర్వదించి నారు తమ "ఆశీస్సు" అనే కృతిలో.

అందరిదే యగు ఈ క్రింది
భారతీసతి గుండెలందున
పల్లవించిన స్వేచ్ఛభావము
సిత్కలోకామోద మగుచును,
'నెగడు గావుత లీలగన్'

ఈ పద్యమునుబట్టి వీరికద్యతనాంధ్రకవితాపరిణామ రేఖపై గల యభి మానము వ్యక్త మగును. అయినను వీరి కాద్యభాషపైగల మోజు ఏ మాత్రము తరుగనిది. సంస్కృతోక్తి బహుళమై వీరి కవిత్వము బిగువు సడలని పదబంధ ములతో, చిక్కని యల్లికతో, జాజి పూపొదరింటివలె కమ్మతావుల గుబాళించు చుండును.

కాళిదాసు ననుకరించి చేసిన యా శ్రావణప్రకృతి వర్ణనముం గాంచుడు:—

బింబాధరమునందు ప్రిదిలియు లోచనేం
దీవరోష్ఠాశ్రులు నేలరాల
కటిక చీకటిపూత కబరీభరము పీడి
యంసభాగమున వ్రేలాకుచుంత
వరకాంతి యుత బహు రత్న రాజిత
మండనశూన్యమై మది చెమర్ప
కస్తూరికాగరు గంధాది లేపన
శ్రీ లేమి గాత్రంపు జిగి నశింప
జిలుగు వసనంపు పయ్యెద మలిన మొంద
కమలనేత్రాల కావి రక్తిమలు నిండ

ప్రాణనాథాగమనంబు దుర్లభంబు గాన
కుములుదురు ప్రవాసీప్రియప్రమద లిపుడు.

క్ష్మాతలనాట్యరంగమున కమర్చిన
నీలిడేరా వోలె నింగి దనర
చిమ్మచీకటి రేయి బమ్మరక్కసి యులి
వట్లు మేఘారవం బతిశయిల్ల
నీటిమబ్బులయందు నిల్చి కన్నులు మూత
వడజేయు శంపలప్రభ లెసంగ.

హృదయమున నించుకేని జలింపబోక
మోహమున ప్రియు సంకేతభూమియందు
నరయగా నభిసారిక త్వరితగతిని
తరలు శ్రావణశర్వరీధ్వాంతవీధి.

ప్రాణనాథాగమము దుర్లభ మైనందున కుమిలెడు ప్రవాసీ ప్రియప్రమదలను, ప్రియులను సంకేతభూమియం దరయగా నేగు నభిసారికలను దన గర్భమున దాచి వారిని ప్రోత్సహించిన శ్రావణ శర్వరీ ధ్వాంతవీథిని మన కన్నుల కగపడు నట్లు చిత్రించుటలో వీ రాశ్రయించిన యా యా పదముల గుర్తింపుడు.

తన మనసున నుద్దేశించిన వర్ణ్యాంశమునకు సరి యగు ప్రతికృతిని కల్పింప జాలిన ఈ క్రింది పద్యము గూడ పరికింపదగినది :—

"జాళువా నెమ్మేన లీల సింగారించు
తెలిపట్టుచీర సొంపులు వెలార్ప
తలిరుచెంగావి రంగుల ఫాలతలమున
గ్రమమోహనతిలకము రహింప
గాత్రహేమాభతో గలసిపోయిన కంక
ణంబు లమృతనిస్వనము లొనర్ప

పాణిచే నొక్క కుంకుమభరిణె బూని
యరుగుచున్నది యొక్క కన్యాలలామ

గొనబుగా దీర్చు బొమ్మల కూటమునకు
సమలహృదయమ్ముతో బేరటాంధ్ర బిలువ"

ఇట్టి వస్తుప్రత్యక్షీకరణశక్తి (Picturesbueness) చాలమంది కవులలో తరుచుగా నుండదు.

శ్రావణమేఘముల వర్ణించిన ఈ క్రింది సీసము నిట్టిదే—

శుభ్రనీలోత్పలస్తోమవిలాసభా
గ్యోన్నతిఁ జూపించి యొక్క చక్కి
లేజవరాలి మై లీలల కాటుక
నోసరించుచు నుండె నొక్కమూల
పసిమిసిలిమ సొంపు మిసిమిరేకులచాలు
నోడిగిల్లుచు నుండె నొక్క దెసను
శక్రచాపపు గళాజాలమధ్యంబున
వికచరోచుల నీని యొక పథాన

చాతకహృదంతరమ్ములు ప్రీతి నించి
వింత వేసాలతోడ త్రుళ్లింతలాడి
సౌరులను నించు నీరద సమితి సతము
శ్రావణ విలాస లలిత వాసరము లందు''

ఇట్లు వీ రేది వ్రాసినను, నందు ప్రకృతి విలాస రేఖలయందలి ప్రతి విన్యాసమును అచ్చు గ్రుద్దినట్లు తమ లేఖినియందు పొదిగి యందించుచుదురు—

''నీ వొక యాంగ్లదేశరమణీమణి వైన నుదార బుద్ధి హిం
దూవరమాతృకాప్రజ కనూనముదం బెద నుప్పతిల్ల స్వే
చ్ఛావిభవంబు కూర్ప నిజశక్తిని సర్వము ధారవోయ జు
మ్మీవు మహాత్మ నొద్ద కరుదెంచితి వో జననీ శుభాంఘ్రుణీ!''

యని వీ రొకప్పుడు మీరాకన్య నభినందించి యున్నారు.

పదునైన మేధస్సుతో, పక్వమైన పాండిత్యముతో, చక్కనైన సంస్కృత సాహితీ సంస్కారముతో నచ్చువడ, చిక్కనైన ప్రకృతికవితా శిల్పము వెల యించిన యీ మనీషి కల్పించిన మనోహరసృష్టివిలాసములు ఆ నలువరాణికి విహారభూములు.

---

# 75. శ్రీమతి మదమంచి యనంతమ్మగారు

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః"—కాళిదాసు.

చక్కని దృశ్యము చూచినను, తియ్యని శబ్దము విన్నను, రసాలింగితమై సున్నితమైన మనస్సు మీటిన వీణె తీగెవలె మొరయుచునే యుండును.

అనంతమ్మగారి కవితయు నిట్టిది.

శ్రీమతి అనంతమ్మగారు నిజమైన కవయిత్రి. ఈ సోదరి పసిడిగంటము పూచిన పూతలు కవితాప్రియుల మనస్సు నుయ్యాల లూగింప గలవి. మెడ మెలిచి తెచ్చినట్లు గాక, మొక్క మొలిచి వచ్చినట్లుండు వీరి పద్యములు పాఠకులను చల్లగా మెల్లగా పలుకరించిన ట్లుండును. రచనలో మెత్తని యూగు, పదములలో కమ్మని తూగు, భావములలో క్రొత్తసోయగము నిండి వీరి కృతులు రసమధురములై ధ్వనిమంజులములై భాసించును. పలుకు, పలుకు పొంకము సెడకుండ బింకముగా నతుకు పనితనమందే కాదు, పసిడితీవెను కమ్మచ్చున లాగినట్లు, భావమును సాఫీగా సాగించుటలో కూడ నీమె మంచి ప్రతిభాశాలిని. ఈ శ్రీమతి కబ్బపుఖజానాలో పస గల పలుకుకలిమి గాక, మోటుగా మ్రోగు పూటా సరకు గాని, అరిగి మెరుగు మాసిన చెల్లని నాణెములు గాని చెదురువాటుగానైన దొరకవు. అగుటనే, సారస్వతరసాపణమున నీమె ఖండకావ్యముల కింత గిరాకి. దీని ఫలితముగా కళారసికుల హృదయకేదారముల పండించుకొన్న కీర్తిపంటల నీమె గాదెలకు బోసినది.

ఈమెలేఖిని నే యమృతసంజీవనీవిద్య నిక్షిప్తమై యున్నదోకాని, పరిగ్ర హించిన వృత్తము శృంగార వీరరసాలింగిత మగు "మాంచాల"యే యగుగాక, శాస్త్రరసవిస్ఫారితమ్మగు "నాయకురాలే" కానిండు, మధురకథావిధాయి యగు "సీతమ్మపెండ్లి" యే యనుడు, ప్రకృతిశోభావిలాసశ్రీ యగు "వర్షర్తువు" అయి నను, ముగ్ధమనోహరభావవితానకము లగు "పల్లెపదాలు", కానిమ్ము, అందము చిందు చిత్రరాజమువలె కైసేసి, ప్రాణములు వోసిన పసిడి పుత్తళికలవలె పఠితల సన్నిధి నిల్పును. స్వతస్సిద్ధ మగు నీయమ శక్తి కంధ్రరసజ్ఞ లోకమున ఐదు పది సేయని వా రెవరు? ఇంతపట్టు నా పలికిన పలుకులు అవితథములు గావని తెలియ దలచు చదువరులను గండువారి దివాణమునకు కదిలించుకొనిపోయి 'మగువ మాంచాల' మాట వినిపింతును. అదిగో వినుచున్నారా—

"కాకెమపూడి యుద్ధమున కాసలనాటి పసిండికోటపై
సాకెకు వెల్మబావుట ప్రచండమరున్నద దంతరిక్షమై
హోరున నార్చుచున్నది, మహోద్ధతి బోరు కలంగె భేరికా
రావము, ప్రాణనాథు డిటు వచ్చునా ? పాశెము పట్టి పోవునో?"

అని మాంచాల చింతాసంశయడోలాందోళితయై, తగటు దీర్చి చెక్కిట చేయిజేర్చి ఉపస్త్రలికము పుక్కిలింతలు కాగా, ముత్యాలసరకమ్ము మురువారబెంచిన సయనాశికకుచి 'కిన్నెమసాని కన్నులవెన్నెల' బ్రహ్మనాయుడు బిగ్గపట్టి చెక్కిలి నొక్కి పసపల్చువాడు, నాయకురాలు లోలో క్రుక్కునటువంటి తన నాణెకాడు, మోజుకాడు, వన్నెకాడు నగు బాలచంద్రునికై ప్రతీక్షించుచున్నది. పాప మా చిర విరహవ్యథాకీన్నరాలికి తన ప్రాణనాథుడు వచ్చు నను నాశ యొకమూల మినుకు మినుకు మనుచున్నను, పగయెత్తినట్లున్న ప్రకృతిమోము జూడ సందియమే మిగులుపడినది.

"జయ జయ చెన్న కేశవ యను ధ్వనులతో
నావులించినది వియత్తలమ్ము
బారు జీబెల పరస్పరఘట్టనలచేత
అంతరాళంబు నిప్పంటుకొనియె"

ఈ దుశ్శకునములతోపాటు 'కాళరాత్రి మీద గాలివాన ముసురు'లో క్రొత్త సౌధమునకు గురుతు వట్టి రాగలడో లేడో!! రప్పించి చెప్పెడి వీరబోధ సుంత వినునో వినడో ! ఇట్లుసందియ మందుచునె యింతకును దన్నంత చులకున జేసి వెలిచవులు మరుగుటకు హేతువు చెప్పుడుమాటలే. కావుననే పెంటి కెడమైన జంట పురుగువలె నాక్రోశించుచు నట్టికొండెములు చెప్పి మతి విరిచిన యామతకరిపారుని బట్టి శపింప నారంభించినది:—

"మాదువదిన మగువ మాంచాల తలదుబ్బు
దోనెకడుపు చెవులు దొప్ప లనుచు
పలుక కారణ మేమోయి బ్రాహ్మణుండ
ఆడుతోడున పుట్ట వే మయ్యా నీవు?
సానిసబ్బాయి నీ కేమి సారె బెట్టె ?
పక్కు మని తల వ్రక్కలై పగులు గాక!!"

అని దుమ్మెత్తి పోసినది. ఇఁక నాపగ తీరినది!? అంతలో తన దీనస్థితి జ్ఞప్తికి వచ్చినది. "జగతిపై బుట్టి నిర్భాగ్యజన్మ నైతి-భర్త మెచ్చని యీ భోగ్య భాగ్యమేల?" యని వెచ్చనూర్చినది మాంచాల. అంతలో కోపము, అంతలో ద్వేషము, అంతలో ఈర్ష్య, అంతలో దుఃఖము అన్నియు కలబోసిన కళ్ళమైనది మాంచాలమనసు!! ఇది యెంతయు స్త్రీజనోచితము గదా! పగ, పట్టుదల తీరుటకు వెరవులేని యిల్లాంద్రకు చింతలు, వంతలు మనసుననే శతధాపుట్టి వితధాయగును. వివిధరససమ్మిశ్రణములై క్షణ క్షణ పరిణామ బంధురము లగు భావభంగిమల అనంతమ్మ గారెట్లు శబలీకృతము చేసిరో చూచినారే కదా!

''ఆవులించినది వియత్తలమ్ము'' ''అంతరాళమున నిప్పంటుకొనియె'' ఇవి యెంత భావుక ప్రయోగములు!! తెలుగువా రెఱిఁగినంత వఱకు ''చీరె సారె వెట్టుట వెలదులకే యైనను, కోపమున త న్నెరుగని మాంచాల బ్రాహ్మణుని బ్రాహ్మణిచేసి సానిసబ్బాయిచే సారె బెట్టించినది! 'ఆడుతోడున బుట్టని' యీ వెడనోటి కొండె గాని కా శాస్త్రీ కావలసినదే! పైగీతముల నుడికారపుబరువూ పరువూవిజ్ఞులకు విశద మొనర్ప బనిలేదు.

కడకు కన్నతల్లి 'ఐతాంబ' మాట మన్నించి భార్య 'మాంచాల' యొద్ద రణమున కేగుటకై సెల వడుగ వచ్చినాడు బాలచంద్రుఁడు. వచ్చి కట్టెదుట తన సొగసుల రాణిని చూచి—

"కేలిడి ముక్కుమీద తులకించెడి రూపము నట్టెగాంచి మాం
చాల విరూపిగా దలచి సానిగృహంబున కేగినాడ...
... ... ... ... ...
గాలికుటీర మందు కచుగానక నే వసియించినాడనే"

యని యంగలార్చినాడు. ఎత్తుగడలోని సొగసు నీపాటికి గమనించియే యుందురు. ముక్కున కే లిడుట గిన్న ప్రే లిడుట సాజముగదా! గాలితో కట్టు కొన్నపుడు కుటీర మేమికర్మము? సౌధమే కట్టవచ్చును. ఇచ్చట 'మేడ' యన్ననే హెచ్చు నిండుదనము చేకూరి యుండెడిది.

అంతవఱకును పతికై పలవరించిన మాంచాల వచ్చిన వల్లభుని కాంచి మాటాడగా కొంత యుంకించి తేరి చూడలేక తిరిగిపోయె నట. ఓహో! నవో ఢామౌగ్ధ్యములోని యౌత్సుక్యముచే మాట్లాడించ వలయు నని ప్రయత్నించిన దట! సమయమునకు చక్క చనుదెంచిన సిగ్గు తేరిచూడనీయక త్రిప్పి పంపిన దట!!

ఒక్క చిన్న తూలికావిలసనముతో లోతైన భావము నెంత యలవోకగా చిత్రించినారో యీ కవయిత్రి!

ఈ క్రింది 'మాంచాలా బాలాచంద్రుల' వాకోవాకముల చిందిన అందాల చెరివికొందము రండు—

"తివిరి తేటనీరు దెచ్చి దక్షిణపాద
కమల మొకటి గడిగె కాంతునకును"

ఈ భావరహస్యము నెఱుగని బాలుడు "మాంచాల! రెండవది మానినా వేమి? గండువారాచారకాండ గాబోలు" నని మొత్తముగా నత్తింటివారి నెత్తి పొడిచినాడు.

"పల్నాటివీరుఁడా! పరిగణింపవ దేమి?
సానిసబ్బాయి దా చరణంబు గాదె?"

భార్య యెదురుదెబ్బ కొట్టి తన కక్కుర్తిని వెక్కిరించుటతో కిమ్మనక పెడదారిని—

"కోమలీ యిది యేమి కుడిపైట వేసితివి
శీలము వారి దాసీ కైన లేదె?"

అని యక్కసు తీర్చుకొన్నాడు.

"గండువారింటిలో గాలిసైతము గాని
కుడివైపుగా వీచు కోల్పోదు పటిమ."

మాటకు మాటవంతు తీర్చినది మాంచాల. ఆ తరువాత

"తములపాకు రెండు దరుల జీల్తు వ దేమి
వేరుబంధము జేతువే వీరపత్ని?"

అన్న పతిదేవు నెంత సూటిగా నీటుగా మందలించి మరులు కొల్పుకొను చున్నదో—

"సాని దా తుంపు, నీసతిది యీ తుంపు
వీనె లాగున నిన్ను వెదకి తీసితిని"

ఇరువురిమధ్య నిరుకున బడ్డ బాలుని చూచిన నెవ్వరికైన నవ్వురాక మానదు. నవ్వినాడు బ్రహ్మనాయని కొడుకు. మాంచాల రెప రెప మరుగున కేగి నది. సహజలంపటు డైన బాలచంద్రుడు శృంగారరస సాగరమున బడి తెప్ప విడిచి మునిగి తేలుచు నొడ్డెఱుగకున్నాడు. మాంచాల మనసు మలుపుకొన్నది. ఆ వింత ప్రకృతి నాలోచింపుడు. భర్త వచ్చెడు దాక ప్రాకులాడి ప్రాల్మాలినది; పరితపించినది. వచ్చిన వల్లఁభుడు తన కౌగిళ్ళలో నొండెఱుగక శృంగారస్వర్గము సృష్టించుకొనుచు నానందరస రాజ్యశ్రీల నేకచ్ఛత్రముగ నేలుకొనుచుండగా, చూచి యూరకొన లేకపోయినది. తనకు కావలసిన బాలచంద్రుడు విషయభోగి కాడు, వీరభోగి. తన బాలచంద్రుడు వీరాధివీరచంద్రుడై లోక మెఱుగని ప్రతాప

దర్పము తెలయింపగా, తా నా నాడు వెలదుల సిగపూవై వీరపత్ని కావలయు నని కనిపెట్టుకొని యున్న కాంక్షలు చిటిలిపోయినవి. అది యా వీరకాంత కోర్వ నిది.

అద నెఱిగి పనిమఱచిన పతి కెట్లు రాచబాట చూపుచున్నదో?

"పల్నాటియుద్ధమే పచ్చీసు నీకు
త్రోసిరాజులు నీకు తోడిమార్బలము"

పచ్చీసులో పావులే కాని, త్రోసిరాజు లుండవు. అవి చతురంగమున మాత్రమే.

"బ్రతికిన, పలనాడు రతనాల మేడ
చచ్చిన, పలనాడు పచ్చలబీడు"

"విసురుమా నీవెల్మ బావుట
వింటికిని మంటికిని హోరుగ
కరుడు గట్టిన రక్తధారలు
తిరిప మిచ్చుచు పిరికివారికి".

యని యురిమినది. కాని శృంగారజడు డగు నీతని కీ వీరవిధి వెగటు తోచినది. ఎంత బేలగా జాలిగా బయటపడుచున్నాడో—

"కారెమపూడి కే కదల మాంచాల!
రాజ్య మేలను నేను రాజు గా నేల?
నీదు సౌఖ్యాంబుధి నీదులాడకయె
కనికరింపుము నన్ను కలికి మాంచాల"

ఇది విని వివేకవతి యగు నా వెలమబిడ్డ యాతని మతి విరచి గతి తెరచు నయగారపు పలుకులతో మొదలిడి పోను పోను నెట్లు తీవ్రత పెంచి నిష్ఠురము లాడినదో:—

"మధురజీవన! యెంతమంది పోలేదు?
షట్చక్రవర్తులు చావకున్నారె?"

... ... ...
కష్టసుఖములు తప్పగలవె జీవులకు?
ఉన్నది పోదు, లేకున్నది రాదు
... ... ...
కర్మభాజనుడవై ఖడ్గమ్ము బట్టి
త్రుంచి తూటాడుమీ దొడ్డడికాంద్ర.
... .. ...
పడతుల చేతిలోపల బొమ్మ లైన,
పలనాడు మీచేత పాలితం బౌనె?"

నశ్వరమైన జీవనవిభూతి నిట్లు తేటతెల్లము చేసి, చివర కతనిని "పడతుల చేతిలోని బొమ్మ"వని కవ్వించి, "యాతని కసుమాలపు వలపు తగులాటము" తనకు సహింపరానిది కాగా, యింకను కదనరంగమునకు కదలి పారని వానిపై గాంద్రు మని యాడుపులివలె యెట్లు చుముకుచున్నదో --

''శీలమువారివంశమున ఛీ యిటువంటి నికృష్టు డైన రా
చూలి జనించెనే వెనుకచూపును వెన్నున తూపు జన్మజ
న్మాల కెఱుంగనట్టి పలనాటి మహాత్ముల రక్తధారలో
కాళిమ నేడు కన్పడియె, గట్టిది నా మెడ తాళి యింతకున్"

పై పద్యములోని కూర్పు ఎంత శక్తిమంతము గా నున్నదో? పదును బెట్టిన బాకుల వంటి పదముల పచరింపు గాంచితిరా?

''గట్టిది నామెడ తాళియింతకున్'' యనుట లోని వ్యంగ్య వైభవము విమర్శకుల కందని యెత్తున నున్నది తండ్రులు నన్నలు నైన వారందఱు ననిమొన నిలిచి దేశరక్షణకై తెగుచుండగా, నిట్లు కోమలి కొంగు పట్టుకొని కులుకు పిఱికివాని పెండ్లాము మెడబరువైన తాళిబొట్టునకేమియు భయము లే దనుట కన్న, రాచపుట్టువు పుట్టినవాని కేమి కావలయును?

మాట మందువలె పని చేసినది. ''చివరిమాట వినియె శీలము సింహమ్ము-దుమికెబయటి కొక్క దూకులోన" అమ్మయ్య! ఆయిల్లాలు అనుకొన్నపని సాధించినది! కావుననే

"నవ్వుకొన్న దపుడు నాజన్మఫల మేమి?
వీరపత్ని నంచు ధీరురాలు''

'మదమంచి' వారి 'మాంచాల' రసపాంచాలికయే యగును. శ్రీ అనంతమ్మ గారి వాసస్థానము పలనాటి యందలి పెదకూరపాడు. కాగా, నాగులేటి నీరుద్రావి, పల్నాటి గాలి పీల్చిన వీరికలమున గూడ తెనుగుల యా తెగువమగటిమి గూడు కట్టుకొన్నది. ఈ కలము చిందిన యింకొక రక్తబిందువే ''నాయకురాలు!" అదియును నిల్లే శౌర్య రసోద్గారితమై యున్నది.

వీరి "నాయకురాలు" కావ్యమొక పరిమళ కర్పూరఖండము. అబలయై మంత్రాంగమున పగవారిని మగవారిని వెలివేసిన జాణ నాయకురాలు నాగాంబ, తన మాట రాజముద్రికగా నాయని యాట కట్టించి నలగాము నేలించినది, మూడు నాళ్లైనను నెరురు లేక నడిచినది. పౌరుషముతో స్త్రైణము, పరువముతో స్థైర్యము, అధికారముతో నాలోచన, పంతముతో పట్టుదల జంటతీవెల పూచిన యొక పువ్వే నాయకురాలు. నాయకురాలి మగసిరి, మన స్తత్త్వము వర్ణించుటలో మదమంచి వారి లేఖిని స్వారి తీయు గుజ్జుపుఖదనుతో సాగిపోయినది. ఈ కావ్యరచనమున నామె పరవశురాలై పచ్చిరక్తము జిమ్ము పసిచిత్రాలతో గైసేసినారు.

తగరు దూకిన చుట్టు వగిలి బావురు గొల్పు
గొరిజల పసగుత్తి కొండబెళము.
... ... ... ...
రత్నభాండరముల వెల్లి రానినాఁడు
మొనసి ముత్యాలకోవలు మూల్గునాఁడు
వీరనాయకురాలితో వీగిపోయె
మచ్చుకైనను లే రీమె మాత్ర మిపుడు"

అని గతవైభవ మొక్కసారి కన్నుల మెరసినట్లుగా నై యానాడు 'వీర నాయకురాలితో వీగిపోయె' నని వాపోయినారు.

రవి తిర్గ లేనంత రాజ్యాన సత్కీర్తి
గేల గీలించిన గేస్తురాలు

పలనాటి పసిడికోటల గావు లెత్తించి
సారె భూపుల కంపు ధీరురాలు
నాయనిప్రక్కలో నాగుబామై నాడు
మంత్రిగా నెగడిన మాన్యురాలు
కనుల జేవురునిప్పుకలు రాల్చి కనుమల
వలస బంపిన బలవంతురాలు"

అంతే కాదు- అట్టి నాయకురాలి "పేరు వాడిన గురజాలకోరులందు, చంటిబిడ్డడు పాల్ద్రావ జంకుచుండు" నట! అట్టి నాయకురాలిని "మాన్యురాలు, గేస్తురాలు, బలవంతురాలు, ధీరురాలు'' అని మనసు దీర నామంత్రణము జేసియు తనివోక వీరరసస్ఫూర్తి గల నామె మూర్తిని పలుకుపోగరతో చెక్కి, వన్నెవెట్టి, యూపిరి వోసి, ప్రత్యక్షము చేయుచున్నది.

"పాట్నా గులాబిపావడక్రింద జెలువారు
బిళ్ళాణి నటు నిటు బెట్టుకొనుచు
జిలుగురత్నాల పోసీలు ముంజెయిమీద
మాటికి ముంగోట మలుపుగొనుచు
తొంగి ముంగురు లోలి దూగాడ మోముపై
తిన్నగా వ్రేలితో దిద్దుకొనుచు
గిలుకుపావల పాదతల ముంచి వేమారు
చివ్వున లేచి యాసీన యగుచు

చికిలిబాకును డాకేల జెరివికొనుచు
గనుగొనలు జేవురింప దిగ్గనుచు లేచి
అధరపుటములు నల్లల నాడుచుండ
ఓరి మోరోజిపంతు! ని న్నొగి దెమల్తు ''

అని లేచి యార్చినది. ''పాట్నా గులాబిపావడ'' 'జిలుగురత్నాల పోసీలు' 'గిలుకుపావలు' 'చికిలిబాకు' అనునవి కవయిత్రి క్రమహృదయమును దెల్పుచు పాఠకుల పలుకరించుచు తిక్కన ద్రౌపదిని జ్ఞప్తికి దెచ్చుచున్నవి. వీరవనిత

యామె యదిగో ! బవరమునకు దూకి బాలచంద్రు నెట్లు కవ్వించుచున్నదో చూడుడు:-

"మగవాడౌ నట దాను, పౌరుషగుణప్రాప్తం బట ప్రాభవం
బగ, నెత్తురులు జిమ్మ లౌచు నెగబ్రాకె న్నాళనాళంబులన్"
యని పిచ్చలించి కచ్చవట్టి లాగుచున్నది.

వెల్తి రా దోయి మీ వీరలోకమునకు
రోసమా? మూతిపై మీసమా మీకు?
పడతి చెల్లుబడిని పచరించునాఁట
నిలుప మన సెటు లాడు ఁకమగాడుఁకు?
స్వాతంత్ర్య మనునది సర్వుల కొకటి
సానిసబ్బాయింట చతురంగ మౌనె?
ఉగ్గుబాలను గాదు యుద్ధంబు గాని''

ఈయెత్తిపొడుపుతో విడువక చిరకాలముగా తనలో రగులుకొను చున్న అహంకారాగ్నిశిఖల నెట్లుమియుచున్నదో. —

"ఆడుది సింహాసనాసీన యైన
కన్నుగుట్టునె నిన్ను గన్న బాబునకు?
సర్వేశ్వరుని సృష్టిజాలంబులోన
స్వాతంత్ర్య మనునది సర్వుల కొకటె
పశుపక్షు లైనను పారతంత్ర్యాన
మధురజీవాప్తిగా మనియుండ గలవె?''

అని గర్జించినది. నిజమునకు యుగయుగముల తరతరముల పారతంత్ర్యమున మునింగిన భారతమహిళ యేనాడు సర్వతంత్ర స్వతంత్రయై విజ్ఞానవిభాస్వరయై జగద్వేదిక నన్నిరంగముల మున్నాడి నిలుచునో, నాఁడే దేశము సుభిక్షమయి సుఖశాంతుల కాలవాలమై సరివారిలో తలయెత్తికొనగలదు. అంతవఱకిట్లు జీర్ణించిన చరిత్రపుటలు త్రిప్పుకొనుచు కన్నీళ్ళు గ్రుక్కుకొనుట కన్న గత్యంతరము లేదు. కనుకనే, యీ కవయిత్రీమణి పరువులెత్తి పోవుచున్న కాలమును బట్టి నిలిపి మరి ప్రశ్నించుచున్నది.

''కాలమా! మాదు నాయకురాలివంటి
బిడ్డ నే దేశమం దైనవె బెంచినా?''

శ్రీనాథ కవిసార్వభౌముని ''పల్నాటివీరచరిత్రము'' నందా యీ భాగములు తహవేలు వేసి, సరిచూచి, తూచి, విలువలు కట్టి జమాఖర్చులు నిలువలు తేల్చిన, ఈ కవయిత్రిఖాతాకే తెలుగువా రెక్కువ వడ్డి చెల్లింపవలసియుందు రనుట అసత్యము కాదు—

పలుకువిలువ తెలిసిన కవి పదములు వాడుటలో చాల పొదుపరియు, భావములు పరికించుటలో గడుసరియు నై యుండును. శ్రీమతి యనంతమ్మ గారును మలుపచ్చిమాటలతో తెలుగువారి గ్రామసీమల తీరుతీయములు చవిచూచుటలో కలమును పర్వులెత్తించినారు.

వర్షర్తువు వైభవము చూడుడు :—
''ఆకాశముపై కళ్ళు లెత్తుకొని
కన్నుల పేదరికంబు గీలుకొన
భగవంతునిపై భార ముంచుకొని
విత్తెడు కర్షక విభులున్నా, మా
కోపు లెడ్లపై కోటేరూ, మా
కొట్టము ముంగిలి కోనేరూ, మా
పశువుల గాచెడి పాలేరూ''

''నీ కుండపోతకు మురిసిపోయినా'' రని వర్షలక్ష్మితో విన్నవించి, తమ యాతిథ్య ప్రథమధర్మము లైన యర్ఘ్యపాద్యము లందించుచున్నారు.

గొలగొల జారెడు కొండవాగులును
పసరుల గ్రక్కెడి పచ్చికపట్టులు
జేబులు దేరెడి చివురుజొంపములు
మోసులు గట్టిన మొలకపైరులును
అర్ఘ్య పాద్యముల నర్పించూ, ప
చ్చాకుపుట్టముల నందించూ, తే
జాజులపానుపు సవరించూ, మే

ల్పసిమిజాలరుల బరిపించూ, ఓ
సజల జలదమా! స్వాగతము"

క్రమాలంకారముగ స్వాగత సత్కారములు దీరిన వెనుక నిష్ఠాగోష్ఠిలో—
"ఏరువాక కీ వేతెంచినచో

ఘమఘమలాడును తొలకరిచినుకులు
గమగమలాడును గమ్మవాసనలు"

అని చనువు కుదిరించుకొని తుంటరి వానదేవుడు సేయు కొంటెపనులు చెప్పుచున్నారు.

"మాటున దాచిన తాటిగొడుగులను
పల్లెబాబుచే బట్టించెద వోయి !
కమతగాండ్ర కరికంతము గూర్తు
గొల్లవారి తల గొంగళ్లి డెదవు-
అటునిటు పనికై యరిగెడు సతులకు
చేటలు నెత్తిన దీటు గొల్పెదవు
కళ్లపెత్తనము గల పెద్దలకును
గుడ్డగొడుగు గీల్కొలుపుదు వన్నా '
కొమ్ములు దిరిగిన కోటీశ్వరునకు
చెప్పులు చేతికి జేర్చి కులెక్కెదవు"

అవును. లోకములో ప్రభుదర్శనమున కేగువారు తలపాగలు సేత నిడుకొనుట యాచారము కాని, వర్షప్రభువుదర్శనమునకు చెప్పులు చేతబట్టుట మాత్రం తథ్యము. ఏమి చేసినను చల్లని శీతదృష్టిని వీక్షించుచు ప్రకృతిని 'రాజవైభవము రంజిల్లగా' ''గాలిరథముపై కదలి వత్తువోయి" వేళపాళాలేకుండ వస్తే జాగ్రత్త! అనవసరంగా తిట్లుతింటావని హెచ్చరించారు.

"ఖండవృష్టి యని గర్హించెడి మా
కాపుకుమారుల కండ్లనీళ్లతో
పిడకలు పుడకలు పిండి పప్పులును

# 76. శ్రీమతి పుట్టపర్తి కనకమ్మగారు

సాహితీలోకమున నేమాత్రము ప్రవేశము కలవారైనను 'పుట్టపర్తి' దంపతుల నెఱుగనివా రుండరు. 'అచట పుట్టిన చిగురుకొమ్మైన చేవ' యను నట్లాకుటుంబమున కవిత పిల్చిన నోహో యని పలుకుచుండును. ఈ సతికి పతియైన, శ్రీ నారాయణాచార్యులుగారు కవి, రసజ్ఞుడు, బహుభాషావేత్త, విమర్శకుడు, పండితుడు. మఱి యా పతికి సతియైన శ్రీమతి కనకమ్మగారో, ఆయన కర్ధాంగలక్ష్మియే ! చూడముచ్చట గొల్పునట్టిది వీరి దంపతీవైభవము.

వీరి ప్రస్తుతావాసము కడప మండలమందలి ప్రొద్దుటూరు. భర్తతోబాటుగా నీ పుణ్యసాధ్వినామము వారి ప్రతిగ్రంధముపైనను గ్రంధకర్తగా ప్రక్క ప్రక్కల కనబడుచునె యుండు టెంతో ప్రశంసార్హమైన విషయము.

ఈయమ భర్తతోపాటు ఒకానొకప్పుడు 'అగ్నివీణ' సారించి పతి ప్రథమ మూర్ఛన చేసి యాలాపింపగా, తా నందుకొని ద్వితీయ మూర్ఛన నాలాపించి చూపినది. ఈ జీవకావ్యమందలి ప్రతియణువును ప్రాణమున్న ప్రతివ్యక్తి హృదయమును ప్రతిస్పందించును. ప్రతిస్పందించుటే కాదు- సొంపు తడి మారని యీ కావ్యగభీరార్థములు రసవిహీనము గాని [illegible] ప్రతిధ్వనించును. స్త్రీ, సౌకుమార్యమునకు, కోమలత్వమునకు ప్రతినిధి. అట్టి స్త్రీ మగవానికి ఛాయామూర్తి మాత్రమే. ఆమెకు హృదయములేదు. ఉన్నను దానికి విలువ లేదు. ఆమెకు ప్రత్యేకభావములు లేవు. ఉన్నను, వానికి గుర్తింపులేదు. ఆమెఊహలు తోచరానివి, ఆమె ప్రత్యేకత భాసింపరానిది. అట్టి "చిన్నమనసును చిన్నబుచ్చుటె యెన్ని కని యోచింతురో ఏమో?" ఇంత పవిత్రతకును ఉపేక్షయే మనసార పూజించు పతిదేవునికడ సహితము లభించు ప్రతిఫలము.

ఈ విస్మృతస్త్రీలకు - స్త్రీలకే కాదు, కఠినకాలపథాన నలిగి తుత్తుమురైన ఉపేక్షిత వస్తుసంచయమునకు శ్రీమతి- కనకమ్మగారు 'వకాలతు' తీసికొన్నారు. ఆమె కావ్యకుసుమాలన్నీ అవే చూడండి. 'యశోధర'-యశోధర

పశ్చాత్తాపం, ద్వితీయ వనవాస 'దుఃఖితసీత'- 'జీర్ణవిజయనగరం' 'హంపివిరూపాక్షుని ముంగిలి రాతిరథము,' 'కస్తూరిబా' అనునవి. ఇట్టివారి ప్రభావౌజ్జ్వల్యము 'విచిత్రభావకర్కశులైన పండితులకు తట్టనిది.'

"అతడు బ్రహ్మర్షి యని జగం బధికభక్తి
బాడినది రసతంత్రభావములు గూర్చి;
వానికీర్తిఁ జంతాసఖీ వాడివత్త
లైన భవదీయచరిత మే మయ్యె నమ్మ? "

అని యశోధరను సానుకంపముగా పరామర్శించి, ఇల్లాలి నేడ్పించిన బుద్ధదేవుని నిర్వాహకమును కొంచెపఱచుచున్నారు.

'చెక్కిళులయందు చిరునవ్వు చిందులాడ,
లక్ష్మివై యున్న నిన్ను నిల్లాలి విడిచి
యడవులకు పారిపోయినయట్టివాడు
ధవుడు గొనితెచ్చె శూన్యవాదమ్ముకడకు.'

అంతే కాదు - బుద్ధుని నైతికవిజయమునకు, అఖండ తపస్సిద్ధికిని యశోధ రచల్వయే కారణ మనుమాటను ప్రపంచమునకు చాటినారు.

"నీ మనసుచల్వయే బుద్ధు నింతవఱకు
నిలిపినది కాలమందు, కానీ- విచిత్ర
భావకర్కశు లైన యీ పండితులకు
తట్టలే దమ్మ నీ పవిత్రత సవిత్రి."

వెలితిపడని కూర్పు, సొగసు చెడని తీర్పు శ్రీమతి కనకమ్మగారివి !

గంగాతరంగ నిస్వనములలో ప్రతిధ్వనించిన సీతాసాధ్వి విషాద గానము :—

''చాకలివాని మాటకయి సాధ్వి ననిందితశీల నైన న
న్నా కఠినోగ్రకాననములందు దొలంచుట ధర్మదృష్టి రా

జా ! కృపణంబుగాదు ! జనకాత్మజశీలము పృచ్ఛ సేయరా !
నీ కొకయాత్మ యున్న గమనింపుమురా బదు లేమి వచ్చునో?"

"నీ కొక యాత్మ యున్న గమనింపుమురా!" యని సీత యనుకొన్న వాక్యములు గంగాప్రవాహముతో బాటు నీరు నీరుగా నీరవముగా సాగిపోయినవి. లేకున్న వాని కేనాడో ఫలితము కనబడియుండవలసినది:—

''నను విడిచినావు గానీ,
నిను విడువగలేదు నేను నిర్మలగంగా
వనిని ప్రతికుసుమమందును
కనుగొందును సుమ్మ భావకల్పితు గాగన్.

హృదయమే లేని రాముఁడు ప్రేమమయిని
విడిచినాడు చాకలివాని నుడుల కొగ్గి;
హృదయ ముండిన సీత జీర్ణించుకొన్న
దాత్మదుఃఖంబు దయితుని యశముకొఱకు.

ఆహా ! యేమి యీ లోకోత్తర కల్పనము ! అక్షరమునకు లక్ష లీయ దగిన అక్షరరమ్యపంక్తి ! కనకమ్మగారూ ! "దయితుని యశముకొఱకు" ఒక్క సీతమ్మయే కాదు— సీత నొరవడిగ తమ జీవితాంకములను చరిత్రపుటలలో స్వర్ణమయముగ దిద్దుకొన దలచిన యావత్ స్త్రైణము నంతయే !!

కన్నుల నీరు నించు కరుణరసము, రసముతో జాలువారు నౌచితియు, ధార నంటివచ్చు ప్రసన్నతయు, ప్రసన్నత నంటివచ్చు మాధుర్యమును వీరి కావ్యముల సర్వాంగీణములై యున్నవి. కనకమ్మగారు సారించినది యగ్నివీణ ! కాని వారిసీతమ్మ చదువరుల గుండియలపై శ్రుతుల సవరించి తంత్రులుమీటి యాలాపించినది విషాదవీణ !!

హంపిలోని రాతిరథము ఇట్లు నడువవలె నట !!

| | |
|---|---|
| కల వోలి, కలలోని | కాలమే స్తబ్ధమై |
| వలపుటచ్చర వోలి | కనులు విచ్చుక జూడ |
| ఆచ్చరలమనసులో | కృష్ణరాయల కీర్తి |
| నాకాంక్షలను బోలి | కాంత నాట్యములాడ |
| నడువవే రథమా !! | నడువవే రథమా !!! |

అబ్బా !! ఏమి కనకమ్మగారి కోరిక ! ధ్వని వ్యంజకముగా గూఢముగానే కాని, మనసులోని మాట స్పష్టముగా విప్పరు కదా !

"కల వోలి, కలలోని వలపుటచ్చర వోలి" అనగా కలలోని యచ్చర ఎంత సత్యమో, రాతిరథము కదలుటయు అంతే సత్యము. కాని కదలినచో, నది "యచ్చరి గమనము" వలెనే యుండును. అచ్చర మనసులోని యాకాంక్షవలెనే, ప్రభాతసౌందర్యకాంతులు వెలిజిమ్మను. ఆ రాతిరథ మేదో ! ఏదో కాదు- మూగ వోయి, కండ్లుపోయి, హృదయమే పోయి, శిలాసదృశమైన తెలుగుల విజ్ఞానచైతన్య హృదయమే.

అది కదులుట స్వప్నసదృశము కాదా ! అట్టిది కోరుట మృగ మరీచికలలో జలము త్రాగ గోరుట యట్టిది. నిజముగా రథమే కదలినచో, "కృష్ణరాయల కీర్తి కాంత నాట్యము లాడదా ?" మఱి "దేశమ్ము తెలుగు" "ఏను తెలుగు" అని రొమ్ము విరిచి సవాలుచేసిన ప్రభురాయడు కదా మఱి యాతడు !! కావుననే రథము కదిలిన మరల "అడుగడుగులలో తెన్గుటందము చిరునవ్వు" నవ్వు నని శ్రీమతి కనకమ్మగా రాశించిరి. జిలేబిచుట్టలలోనుండి రసము లావృతు లావృతులుగా చిప్పిలునట్లు, సన్నజాజిపువ్వులనుండి యందములు కుప్పలు కుప్పలుగా కురియునట్లు హృదయము చల్లనై ఝల్లు మన్న దొక్కమారు !! కాని యేమి లాభము!! అది చక్రములు అరిగి విరిగి కాలగర్భమున సురిగిపోయిన రాతిరథము !?

వా రనినట్లు మన కేమి మిగిలియున్న దచట ? తెన్గునిట్టూర్పు తప్ప !! ప్రళయరాక్షసి మువ్వలరవళి తప్ప !!

స్పృహణీయము లగు ధ్వని, భావ, రస, గాంభీర్యములను సొగసు తడి యారని వర్ణపటలితో, పదవితతితో హృదయసుల హత్తుకొనునట్లు చిత్రించుటలో నీ చిత్రకారిణి కుంచె పందెము వైచినది. నిజముగ కనకమ్మగారి కావ్యములు సాహిత్యక్షేత్రమున కేతా మెత్తిన మధుకుల్యలే !!

# 77. శ్రీమతి బుజ్జా కమలాదేవిగారు

విశాఖపురీ స్వగృహారామవాటికలలో ఆ పురీరామల హితసౌభాగ్యముల నౌదల నిడుకొని సందడి దండడిగ దిరుగు శ్రీమతి కమలాదేవిగారు నిజముగ కమలాదేవియే. "కదలియాడుచున్న విజ్ఞాన చైతన్య మామె" "కరగి పోసిన కళాజీవస్వరూప మామె" అన్నచో, నామెను గూర్చిన స్వరూపజ్ఞానము ఒకింత పఠితలకు సన్నిహితముగా కలిగింప గల్గితి నేమో! ఆమెకు తెలియని కళలుండునో ఉండవో !! జీవము లుట్టిపడునట్లు చిత్రముల చిత్రించ గలదు. చిత్రములు అచ్చుపడునట్లు జిలుగుకుట్టుల కుస్తరింపగలదు. మోడులు చిగుర్చునట్లు వీణియల మొరయింప కలదు. శిలలు కరగునట్లు హాయిగ కంఠమెత్తి పాడగలదు. పండితుల సెబాసని మెచ్చునట్లు కలము త్రిప్పగలదు. ఆంధ్రావనిని సుప్రసిద్ధులైన 'బుద్ధవరపు' వారియింట బుట్టి, 'బుజ్జా' వారి యిల్లు మెట్టినది. అనేకములగు శక్తుల బ్రసాదించియు భగవంతు డామెను అనాథగా శపియించినాడు. శాపమువలని తాపమడుగక శతదుఃఖ దుఃఖినియై ఆరడిపోవు మనసు నూరటబుచ్చుటకై, పనికాని పనిగా మహిళాసౌభాగ్యవిహితకార్యకలాపముల కధికారిణియై అలవోకగా జీవితము నెగ్గించుచున్న చిరతపస్విని యామె !

అంతే కాదు- మృతజీవు లగు నాప్తజనముల యాత్మశాంతికై కాలక్షేపము లేఖనీవిక్షేపము చేసి కావ్యనిక్షేపముల దీసి తరుగని తత్కాంతిరేఖలలో, మాయని మమతతో ఆప్తులకీర్తుల జరామరముగ నచ్చువోసిన చిరంటి యామె. ఆమె యావాస మొక కళావాసము.

1903 వ సంవత్సరమున వీరు జన్మించిరి. వీరి మాతామహులగు దివాన్ బహద్దూర్ వల్లూరి జగన్నాథంపంతులుగారు మహాభాష్యములను, బ్రహ్మసూత్రములను 'ఆంధ్రశారీరక' మనుపేర కందపద్యములతో తెనిగించిరి వీరి కబ్బిన కళానిష్ణాతృత్వ, మాయననుండి వంశపరంపరాగతముగ సంక్రమించిన వారసత్వమే !

వీరి వన్నియు ననేకమకుటములతో గూడిన లఘుకావ్యములు. వాని నన్నిఁటిని ప్రోదిసేసి ప్రస్తుతము 'సుమమాల' నుండి విరిసి పరిసిన 'భావ లహరి'గా నాంధ్రుల యామోదానుభవములకై దేశముపై బరవు ప్రయత్నమున నున్నారు.

ఒకప్పు డామె వ్రాసిన ''వందేమాతర'' మను దేశమాతృ స్తవమును చూడుడు :—

''శ్రీరమణీయ నిర్మలసమృద్ధజలాంచిత పుణ్యవాహినీ
వారిపునీత సర్వఫలపాదప మంజుల పుష్పవల్లరీ
హారివనీసమేత ! సదహస్కర చంద్రవిభాప్రపూత ! స
త్సారభవాత ! తుంగగిరిజాత ! నమ స్త సుశ స్త సస్యసం
భారశుభప్రజాత ! మణిమానిత ! కాంచన ముఖ్యలోహ వి
స్తారఖనిప్రతీత ! ఘనశైలశిఖాంబుఝరీ ప్రపాత ! సం
ధ్యారుణర క్తకాంతి విభవాతిశయాంబరదిక్ప్రభూత ! కా
సారసరోజషండవిలసన్మధువిణ్మృదుగీత ! పక్షి వా
గారవసుప్రభాత ! మహితాబ్ధిపరీత! నిరామయ ప్రథా
భారతమాత !..........''

ఈ విధమున 'ర' ప్రాసతో, 'త' అంత్యనియమముతో సుమారు నలుబది యాబదిపంక్తుల ఉత్పలమాలికను రచించిరి. ఇది వీరి సంస్కృత పాండిత్య గౌరవమున కొకమచ్చు మాత్రమే !!

ఇక వీరి ఖండకావ్యము లున్నవి. వీనిని ఖండకావ్యము లనవలెనో, కావ్యఖండము లనవలెనో తోచకున్నది. కాని కర్పూరఖండములు, ఇక్షుఖండ ములు ననినచో సరిపోవు నని చెప్పదగును, ఒక మహాకవి—

"యతి విటుడు గాకపోవుటెట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున."

నని వాకొనియున్నాడు. అట్లుత్తరకుమార ప్రజ్ఞలుగా శ్రీమతి కమలాదేవి బీరములు బింకములు పలుకకున్నను, వారి విషాద కావ్యగీతికావళి వినువారల

నెల్లరి ననుకంపముతో గదల్చివైచుచు, వీరి పద్యావళు లాలకించిన "అపిగ్రావారోదతి" యను నుడి సత్యసిద్ధ మగును. మఱి శృంగారాదులు రచించినను నంతే, యుల్లము త్ఫుల్లమై రాగిల్లును.

వీరిపలుకులు భారతీసతి ముంజేతి చిలుక లనుట అతిశయోక్తి కానేరదు—

సకలవస్తు సంపద్భరితములై యైశ్వర్యభోగములతో దులదూగు కుటుంబము లలో పుట్టియు మెట్టియు "చెలువునుండి తావి, వలవునుండి చెల్వు విడబడంగ పుష్ప ముడుగు" నట్లు, తొలిజవ్వనముననే భర్తృవిహీనతా దౌర్భాగ్యమునకు పాలుపడినది. తచ్ఛోకమున కనురెప్పల నించిన జలములతో సంతాన సంరక్షణ మును సేసికొనిరి. కాని విధి బలమున తనయుని, తనయను గూడ గోల్పో యిరి. ఇట్లు దెబ్బపై దెబ్బ తగులగా, మన స్సతివికలమై యామెకు ప్రకృతి యందలి ప్రతిస్వల్ప రేఖాస్పందనము నొక గాఢవిషాద రేఖోపచితమో యనునట్లు కనులబడినవి. పరశ్శతము లగు శీర్షికలలోని వీరి రచనము లన్నియు చదివిన వారెవ్వరు కాని 'అయ్యో పాపము!'' అని కాని, 'అబ్బా ఎంత దుఃఖము!' అని కాని వచింపనివారుండరు.

''కలితవికీర్ణరాగలతికానిచయోచ్ఛ్రవ మంజు మంజరీ
విలసనభంగకారకలవిత్రము, తుష్టిమరోజ్ఞచంద్రికా
ఫలన నిరోధకృన్మలినవారిధరం... ... ...''
బట విధవాత్వము!

దానిని ''వర్గక్రమోదితా బలలకువద్దు వద్దు విధవాత్వముజీవము లుండు నంత కున్" అని వర్ణనాతీత మగు వారి చిరవిరహబాధ పూర్ణముగ వ్యక్తము చేసిరి.

అంతే కాక, ఈ జీవితబాధ గాధాశేషమై శిథిలజీవిగా పరిణామము చెంద, భగ్న మైన తమ హృదయవిపంచితో పాషాణములను గూడ కరగించు కరుణగీతముల నాలాపించి :—

''ధర విపన్నజీవి మురువుచెడి విషణ్ణ
వదనమందు నటుల వరుస దప్పి

యున్న నా విపంచి నొద్దిక నీకడ
దెచ్చితి సరిజేయు దిట్ట వనుచు.

... ... ... ...

"నిలుపకు మికయ్య నీశ్రుతి నిల్లె, తెగును
గాక! జీర్ణతంతువులు సాగ బటువు జెడి
నిముస మైనను జాలు ననిమిషగతిని
బలుకనిమ్ము త్వత్కరముల భవము మఱచి-"

అంతే కాదు-సుకుమారకళా స్వరూపిణి యనదగు త న్నింత పడరాని యిడుమలకు గురిసేసిన భగవానుని 'జటిలుడు' అను కావ్యమున నెటు లెదుర్కొనిరో కాంచుడు:—

"నింపు సౌ పుల దళుకొత్తు నిఖిలసృష్టి
నిటు లవజ్ఞతఁ జూచునో జటిలరూపి
నిలువు మెటు బోదు వీ గాఢకలుషతతిని
జూడ నీవైఖరి నవేవొ జాడ లొలయు,

హత్యకు గాని చౌర్యమునకు గాని యేగ సిద్ధపడు ముష్కరుడు చీకటి చాయల నెల్లఱ కనుగ్రామి యేగుచుండ, నెవరేని జూచి 'ఎవడవురా నీవు! నీ ముఖం చూస్తే దొంగలా గున్నావు!' అని నిలువదీసి అడుగునట్లు, కాలస్వరూపి యగు దేవదేవుని నిలువదీయుటే కాక--

"లేదు భయము నీకట వక్ర! లేశమైన
యేల నను జూతు మిటు లింత ప్రాలుమాలి?
యడుగకయె నే నెవరో విన నాశ యున్న
వినుము- నిను మించు మొరటునై మసుదు నిలను"

అంతతో వీనిని విడిచినదా! లేదు-తన కసిదీరునట్లింకను నురుముచున్నది.

"అనుపమానిసి! ఇఁక చెప్పు హృదిని విప్పి
సుంత పెఱసు దక్కి భవదుదంత మంత

కర్కశా? నీ నుడి యిక గ్రాహ్య మగునె?
చేయి జూపుము, నీ రేఖ చిక్క గొనుదు"

అని కచ్చెబట్టి పిచ్చలించి యా పగవానిని కయ్యమునకు లాగుచున్నది:

"హింస జేయ దోష, మీఖండు శిక్షించు"
ననుచు బెద్ద లెల్ల రాడుచుందు;
రిట్టి జీవహింస యెనయించు నీ కెట్టి
శిక్ష తగునొ నీవె చెపుము దేవ"

అని యుగ్రభక్తితో నడుగుచున్నారు- వీరి యనుభవమువలె వీరి యను భావమును నింత తీక్ష్ణ మైనదే—

శోకమునే కాదు: సంతోషమును వర్ణించినను, వికృతిని కాక ప్రకృతిని వర్ణించినను, నీ వరవర్ణిని లేఖిని తత్తద్రసోచితశయ్యల నలంకరించు ననుటకు ఈ క్రింది పద్యములు దృష్టాంతములు. చూచితిరా? వీరి రచనాపాటవము? ఏ రసమున కలము ముంచిన, నా రసమునఁ బరితలు తన్మయు లగుదురే కదా! 'ఘనాఘనము' అను మకుటమున.

"ఘను డగువాడు చండకరవృత్తి హరింపగ లోకసారముఁ
ఘను డగు నేను గల్గియు నకార్యము సైతునె యంచు నెంచుచుఁ
గొనకొని మధ్యవర్తి వయి శోభను మాన్ప సుకంకణుండవై
ఘననినదంబు లుప్పతిలగా నరుదెంచితె పుణ్యమేఘుడా"

అనన్యభావశబలతయు, అనర్ఘశోభా పదసంచయమును గల్గి శబ్దగత శ్లేషతో రమణీయార్థప్రతిపము చేసిన యీ పద్యములు 'పొసగ ముత్తెపుసరుల్ పోహళించి' నట్లున్నవి-

వీరి 'ధూర్తగోపాలుడు' మఱింత బాగున్నది.

"ఊదకురా నీ మురళిని,
వేదన హెచ్చెడు జగమున వింతగ బళుప

జ్ఞాదులె తెలియని వివశత
నొదల వంచెడు ''మతి'' జన మలయక నెటులో''

'వెన్నెల వెలుగున రాగము క్రొన్ననవలె విచ్చి వింతకోరికలింప' ఆహా! యెంతటి సుమనోజ్ఞకల్పనము! అట్లే పలుపోకల పోయి, పోయినంతమేర రసప్రసన్నము చేసినారు- ఎన్నని వ్రాయను? హయప్రచారములు, రగడలు, తరువోజలు, ఎన్నో వృత్తములు, దండకములు, సంస్కృతశ్లోకములు, ఎన్నో మాలికలు మాలికలుగ సుదీర్ఘపంక్తులుగా గ్రుచ్చికుప్పలు వోసిరి. 'అడవిమల్లె, ఘనజీవితము, మ్లానవదన, అళిమిధునము, తొలకరి, కాంక్ష, కొలువు, ప్రాంజలి, పుష్పసాప,కృశాఙ్గము, శారదాగమనము, నిద్రాదేవి......ఇంక నెన్నో శీర్షికలలో తెలుగు నుడికారపు సొంపులలో, సంస్కృతోక్తులలో పువ్వులు గ్రుచ్చినట్లచ్చుపడ, మెత్తని కూర్పుమలపులలో, మధురభావరసావిష్కృతిలో, విధురభావనివేదనములో, కల్పనా సౌరభ్యములో, శిల్పనాసౌలభ్యములో, ముక్కెరలో ముత్తెము పొదిగినట్లు పొదిగి చూపినారు- పాఠకులు వారి కావ్యము లన్నియు చదివి కావ్యరసామోదము ననుభవింపవలసినదె.

"నైసర్గికీచ ప్రతిభా, శ్రుతంచ బహునిర్మలమ్"

అనునుడి వీరియెడల సార్థక మైనది- ఆంగ్లమున, సంస్కృతమున గూడ కవనము చెప్పగలరు-

ఈ మహిమాన్విత యేదేని విపుల కావ్యగ్రథనాప్రయత్న మేలచేయరో! ఇట్టివారి కావ్యములే కదా సారస్వతమునకు పుష్టిని, సరసహృదయావళికి తుష్టిని చేకూర్చును.

---

# 78. శ్రీ మాణిక్యం వేదవల్లి తాయారమ్మగారు

పావన గౌతమీతీరస్థమైన గోష్పాదక్షేత్రము (కొవ్వూరు) నివాసముగా గల శ్రీమతి సోదరి తాయారమ్మగారు సంస్కృతసాహిత్యము చవులెఱింగిన సారస్వ తీయ ఆంధ్రమున లోతులు చూచిన అనుభవజ్ఞ.ఆధ్యాత్మికము, వేదాంతము, జ్యోతి షము వీరి యభిమాన విద్యలు. కవిత్వము తండ్రిగారికడనుండి యరణము తెచ్చు కొన్న చెలిమికత్తె.

ఆధ్యాత్మికానుభవములతో నిండిన మనస్సు, న్యాయవాదవృత్తి అనుభవ ముతో పండిన మేధస్సు కలిగి, ఇహపర లౌకికజ్ఞానమున తల నెరసిన సాధు సత్తములు శ్రీ చదలవాడ గోపినాధముగారు వీరి జనకపాదులు, మానిక్యము వారి కోడలు. 42 - 43 ఏండ్ల వయస్సు. వీరు శ్రీమతి కామాక్షమ్మగారి పర్యవేక్షణమున నడుపబడుచున్న ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలలో విద్య నభ్యసించి, ఉభయభాషా ప్రవీణ పట్టపరీక్షనిచ్చి, యచ్చటనే చాలకాలము బోధకు రాలుగా నుండి, ప్రస్తుతము స్వస్థానమున కొవ్వూరునందు సంస్కృతపాఠశాలను, మహిళా సమాజమును నడుపుచు, ఈశ్వరచింతనతో ప్రశాంతముగా కాలము గడుపుచున్నారు. ఆధ్యాత్మికానుభవముచే ఆరముగ్గిన బుద్ధితో, అద్వితీయజ్ఞాన సంపదలచే వికసించిన చేతనతో, ప్రతినిముసము నన్ను వీపుదట్టుచు పరామరికల పాలుకాకుండ కార్యరంగమున హెచ్చరించుచుండెడి బాల్యసఖి. శ్రీతాయారమ్మ గారి హితభాషలు నాచెవుల కింకను రింగు రనుచు నామెపై గల భక్తిశ్రద్ధలను నానాఁటికి నతిశయింప జేయుచున్నవి.

స్త్రీహితచింతకురాంధ్రలో వీ రొకరుగా ప్రవేలుమడిపించుకొన్న మహిళాసేవ, అమృతహృదయగా అనుగునెచ్చెలులలో నవనీతసమాన యనిపించుకొన్న హృదయమార్దవము, చక్కని శిక్షకురాలిగా తోడి గురుకులములో ఖ్యాతిదెచ్చు కొన్న బోధనాపాటవము. సమ్యగధీతగా పండితలోకమున మెప్పులు బడసిన పాండిత్యపు గరువతనము, వీరికి ఉగ్గుబాలనుండియు వచ్చిన సహజశిక్షలై, రాను రాను మా సోదరిగా రూపుగొన్నవి.

నాకు వీరికావ్యములపై నున్న రక్తికంటె, వీరి యుదారహృదయముయెడ నున్న భక్తి హెచ్చు. నారక్తికిని, భక్తికిని మించినది నన్ను సహితము మంచి చెడుగు లుపదేశించి మలపుకొను వీరి వాక్చక్తి !!

ఏవంవిధగుణ శ్రీ యనదగు నా సోదరి కావ్యాళితో చదువరులను సమీపింతును.

ఆంధ్రీకృత "చైతన్యలీలామృతసారము" (వచనము) ఒక్కటే వీరి ముద్రితగ్రంథము. ''రామశతకము,'' ''ఆంధ్రీకృత బాలరామాయణము,'' ''అహల్య'' అను కృతులు అముద్రితములు.

వీరి రామశతకమందలి పద్యములు; —

"ఏరూప మైన గానీ । నీరూపమె యంచు నెంచి నేర్పున గన, నీ
వారూపమునసె భక్తుల। మారాముల నెల్లదీర్చి మనిచెదు రామా''
''నూవులలో తైలముపలె । నావులపాలను గలట్టి యా వెన్నవలెఁ
జీవులు వీడక నెప్పుడు। నీవే నివసింతు గాదె నిజముగ రామా !"

''ఆత్మారాముడ వీ వని ' యాత్మానాత్మల గుర్తు నందినపిదపన్
స్వాత్మకునొరునాత్మకుబర । మాత్ముండొక్కడనుబూధి యోగదె రామా
''లోకంబు లన్నినీలో । నేకంబుగ నున్న గాని యెఱుగనటుల నా
లోకించి తటస్థునివలె । తాకకనే యుందు వయ్య తారకరామా !!''

ఇట్లాధ్యాత్మికమును, తాత్త్వికము నగు విషయములను గైకొని పోసుపోను గహనముగ నీశతకము రచించిరి. శైలి సర్వులకు సులభముగా తెలియనంత తేట తెల్లముగా నున్నది.

"బాలరామాయణము" నందలి బాలరాముడు !
సకలలోకప్రియుండును సజ్జనుండు
సాధుధర్మమ్ము లెఱిగిన జ్ఞానధనుఁడు
ఎల్లనరులు పయోనిధి నెపసినట్టు

లుత్తములతోడ నేవేళ నుండువాఁడు॥
మంచికులమున బుట్టిన మహితయశుఁడు
సర్వభూతములకు ప్రీతి సలుపువాఁడు
నగుచు నీ భావములతోడ నలరుచుండు
జనని కౌసల్య యానంద మినుమడింప.''
ఇట్లు పెరిగి శ్రీరామచంద్రునితో కడకు-
"సర్వలక్షణ సంపన్న సాధ్విమిన్న
భర్తయే దైవ మనియెండు పరమసుగుణ
దేవి జానకి గూడ నాదేవుతోడ
నేగె రోహిణి సోముతో నేగునట్లు''

వీరి యహల్యా మిక్కిలి యజ్జ్వలముగా నున్నది:—

"ఆమాపులు, నాపలుకులు, । నా చేతలు, నాయొయారం, మావిన్నాణం,
ఔ చోద్యమైన నడకలు । నేచేడియలందు గాన గానమేయుగమందున్॥"

"ఆయమ యందచందములు నాపెవిలాసము లెల్ల రెప్పలన్
వేయక చూచు యక్షులును వేల్పులు సిద్ధులు సాధ్యచారణుల్
హాయిగ నీమెతో బరిణయం బయి సౌఖ్యము లంద గోరుచున్
తీయని భావవీచికల దెప్పల దేలుచు నుండి రిత్తఱిన్''

అహల్య నడుగవచ్చిన గౌతముని ముస్తాబునందలి భవ్యత్వమును చూడుడు:—

"చిరతపోబలమున సిద్ధి నొందిన దివ్య
దేహంపుకాంతులు తేజరిల్ల
ముత్యాలు గూర్చిన మురిపెంపు యజ్ఞోప
వీతంబు మెడలోన వ్రేలుచుండ
పసిమినిగ్గులు దేరు మిసి మించు మేనున
పసిడివల్కల మెంతొ బాగుమీర
ప్రణవజపమ్ముచే పావనం బైనట్టి
రత్నాక్షమాల కరమున వెలుగ

దివిజగంగాతరంగిణీ తీర్థములను । నింపినట్టి కమండల మింపు మీర
గా ధరించిన భూరితపోధనుండు । గౌతముం డరుదెంచెను గన్నెనడుగ"

ఇక నమరపాలుడు ఇంద్రుని ముస్తాబునందలి దివ్యత్వమును జూడుడు:—

"తనదు వాహన మైన దంతిదేహపుకాంతి
దిశల కపూర్వంపు తేజ మిడఁగ
తనచేతి వజ్రాయుధమునుండి వెల్వడు
మెఱుగులు కనుల మిర్మిట్లు గొలుప
తను దాల్చినట్టి మందారదామంబుల
ఘుమఘుమల్ దిశలందు క్రుమ్మరింప
తనదు సౌందర్యంబు తరుణుల మనముల
నానందవీచిక లమరజేయ

నూతనోత్సాహ మెదలోన నూలుకొనఁగ
వెలఁది చక్కఁదనమ్ము భావించుకొనుచు
వేలుపులపతి యైన దేవేంద్రుఁ డవుడు
కన్నె నడుగంగ వచ్చెను కౌతుకమున"

చూడుడు. ఈ యిర్వురుపరుల వర్ణనమందును అంగశోభావర్ణన మేమంతి లేదు. అంతయు వారివారి వైభవ ప్రాభవ వర్ణనమే. శ్రీమతి సోదరిహృదయ మెట్లు ఆడంబరమును, అలంకరణమును, ఆంగిక సౌందర్యమును ఆస చేయదో, అట్లే వారి కావ్యకన్యయు ఆడంబరము నొల్లదు. ప్రశాంతయగు వీరి కవితా కన్యపై వాగ్దేవి ప్రశాంత దృక్కుల ప్రసరించు గాక !

———

# 79. శ్రీమతి చుండూరు రమాదేవిగారు

ఏలూరుపురవాసినియైన శ్రీమతి రమాదేవిగారు నేటి పత్రికా లోకానికి చిరపరిచితురాలు ఏలూరునందలి సుప్రసిద్ధ హోమియో వైద్యులు శ్రీ వేంకటేశ్వరులు గారు వీరి భర్తగారు. వీరి తండ్రిగారు వడ్డి మార్కండేయులుగారు. తల్లిగారు సీతారామమ్మగారు. 1912 సంవత్సరము జననము- బాల్యము నుండియు పాఠశాలాశిక్షణ మింత యెఱుగక తండ్రికడనే విజ్ఞానబోధ వడసినారు. పశ్చిమగోదావరీ మండలమందలి హేలాపురి వీరి నివాసస్థానము.

సుమారు పదివర్షములనుండి యెడతెగని కృషితో తెలుగుదేశములోని యనేక పత్రికలకు కథలు, వ్యాసములు, పద్యములు, గేయములు వ్రాయుచు ననల్పముగ భాషాసేవ చేయుచున్నారు. కథాశిల్పమున వీరికలము మిక్కిలి యంద మగు పోకడలు బోయినది.

పత్రికలలో ప్రచురితమైన శీర్షికలు కాక, 'రాఘవేశ్వరశతక' మొకటి, 'విరుల సరులు' అను ఖండకావ్య మొకటి వీరి వింకను సముద్రితకావ్యములు. కథారచనమునందు వలెనే, గేయములయందును వీరిచేయి బాగుగా తిరిగియున్నది. జీవమూ జవమూ గలిగిన వీరి గేయములు పఠితల నాకర్షింపజాలినవిగా నున్నవి:—

''విరులలో వాసనల్ విరిసినయట్లు,<br>
మాటలో నర్థంబు మణిగియున్నట్లు,<br>
తంత్రిలో నాదంబు దవిలియున్నట్లు,<br>
గీతిలో భావంబు గెలుబుకొన్నట్లు,<br>
ఒండొరుల భావంబు లొక్కటై పొలుపొంద-<br>
అది గదా దాంపత్య మాదర్శమై యుండు''

అని వీరు తమ ''దాంపత్య'' మనే కావ్యమున దంపతీధర్మమున మంజుల ఫణితిని నిర్వచించిరి.

"కనకసౌధమ్ములు గలిగియుండినను.
తులలేని భాగ్యము తూగుచుండినను
మనసులు వేరైన, మహి సుఖమేది"

అని నిష్కర్షగా కూడ తేల్చి సిద్ధాంతము చేసిరి.

''ఎంతటి మాయలాడి చెలి! యీగతి నన్ గికురించిపోయె నీ
పొంతకు రాదుగా సుదతి పున్నగరాజమ ! సుంత తెల్పవే !
కంతునిబారి త్రోసి నను కాంత యొకింత పరాఙ్ముఖంబుతో
చెంతను బాసిపోయె సుమి, చెప్పుము తప్పక కానిపించినన్''

అని ప్రియాన్వేషణమున వీరు నాయకపాత్ర ధరించి చెట్టు చెట్టును, పుట్ట పుట్టను బ్రతిమలాడినారు. ఈ కావ్యమున వీరి కవిత్వము మృదూక్తి మధురముగను, ముగ్ధమనోహరముగను నున్నది.

"నిండు చందురు హసియించు నెమ్మొగంబు,
తళుకు వెన్నెల మఱపించు మొలకనగవు,
సొరిది కలువల నేలెడు సొగసుకనులు,
మెరపుతీవను బోలెడు మెలతమేను''

ఇట్టి సమంచిత రూపరేఖాంచితమైన నాయిక కన్బడకుండుటకు నాయకుడు చేసిన పరమాపచార మేమో తెలియునా ?

''అద్దముముందు నిల్చి దరహాససమంచిత చంద్రబింబమౌ
ముద్దులు గుల్కు మోముపయి ముద్దియ తిల్కము దిద్దుచుండ నే
నొద్దికమీర చేర జని యు ప్పని యాదితి నంతె గాని, యిం
కెద్దియు నేర మే నెఱుగ, నింతటికే పొలయల్క చెల్లునే?''

' నేరమె సుమ్ము కా దనను-నీరజపత్రవిశాలనేత్ర తా
వైరము బూని నాయెదద వంతల పా లొనరించి యేగుటల్
నేరము కాదొ నీమదికి! నేర్పున నింతిని బుజ్జగించియున్
కూరిమిమీర నా దరికి కోమలి నంపు రసాలవృక్షమా''

అని ప్రియుడు ప్రియ నన్వేషించుచు, గంగవెఱ్ఱు లెత్తినట్లు తిరుగుచున్నాడు కాంతుల యనురాగపు వెఱ్ఱు లిట్టివే కాబోలును !! ఈ కావ్యముతీరు చూడగా, నిది రాధికకొఱ కైన కృష్ణుని యన్వేషణ మేమో ! యనిపించుచున్నది. కాకున్న, ఆధునిక నాయకులైన నీ నయగారపు వర్ణనకు శ్రీమతి రమాదేవిగారిపై యలుక వహించి యుందురు ;—

వేరొకచో వీరి రాధిక---

'మధురనాదము లొలుక నా హృదయవీణె
సారె సవరించి విసిగి వేసారిపోతి,
పలుక దయ్యెను తొల్లింటి భావగీతి
మూగవోయెను నేడేమొ మోహనాంగి'

అని వాపోయినది--

వీరి సంక్రాంతి నిజముగ కాంతివల్లియే చూడండి :--

పసిడి బంగారుపంటల పాలవెల్లి,
కష్టజీవుల కృషికుల కన్నతల్లి,
చీకు చింతల మఱపించు స్నేహవల్లి
వచ్చె నల్లదె సంక్రాంతి- వచ్చె నదిగో!''

ఇంకను సిందలి సహజోక్తి మాధుర్యమును దనివార గ్రోలుడు:--

''తెల్లవారకమున్నె తల్లితోడనె లేచి
గొబ్బిళ్ల చేయుట కుబ్బువారు,
అక్క పెట్టిన ముగ్గు గక్క చేయ దటంచు
వింతచుక్కలపట్లు వేయువారు,
చలికంఠముల కట్టి చలిమంటదరి జేర
వెనుచుట్టి మాతను వేడువారు,
వలదురా యని తల్లి వారింప నలుకచే
బుంగమూతిని పెట్టి బ్రొమ్కువారు,

రండు తలయంటుకొందురు పండు గన్న
వలదు చలి యంచు పడకల వ్రాలువారు''

వీరు సంక్రాంతిలో సందడిగా కనబడుచుందురు - ఇక రాఘవేశ్వరశత కము''న స్త్రీజనతను పీ రెట్లుద్బోధించిరో, చూడుడు:--

కంటెలు కాసులున్ వివిధ కాంచనవ్రాతము కల్గియున్న మా
కంటెను మిన్న లెవ్వ రని గర్వము చెందిన లాభ మేమి ? ఈ
కంటెలు కాసులున్ తుదకు కాలము తీరినవేళయందు మా
వెంటను రావు సుమ్మ, వేగతి బ్రోతువొ రాఘవేశ్వరా ?

కథలు వ్రాయుటే గాని, కవిత సెప్పుట నేరనని యీామె వినయమున కనుటే కాని, చక్కని బరువగు కావ్యములు సృష్టింప గల ప్రజ్ఞ యీామె కపారముగా కలదని యేరి కైన తెలిసియే యుండును.

ఇట్లే కమ్మనౌ కావ్యసంపదచే ఆంధ్రుల నలరింతురు గాక యని యాశింతును.

---

# 80. శ్రీమతి నాళము సుశీలమ్మగారు

'మధురకవి' శ్రీ నాళము కృష్ణరావుగారి నెఱుగనివారు ఆంధ్ర లోకమున నుండరు. గౌతమీగ్రంథనిలయసంస్థాపకులుగా, 'మానవ సేవ' పత్రికాధిపులుగా సంఘసంస్కార పితామహులుగా, బ్రాహ్మ మతావలంబులుగా, తేనెయూటల నూరించు మధురకవిగా, ఆంధ్రదేశ మెన్నో విధముల వారికి గురుపద మిచ్చి పూజించుకొనుచున్నది. అట్టి శ్రీకృష్ణారావుగారి సతీమణి నాళము సుశీలమ్మగారు. వీరి పుట్టినింటివారు ఏలూరు వాస్తవ్యులు జమీన్దారులు సుప్రసిద్ధ మోతే కుటుంబము వారు. శ్రీ మోతే కృష్ణయ్యగారు, రామమ్మగార్లు వీరి తల్లిదండ్రులు; శ్రీ మోతే కృష్ణరావుగారు వీరి సోదరుడు. 1889 వ సంవత్సరమున జనించిరి. శ్రీ కృష్ణారావుగారిని పరిణయ మాడిన వెనుక, వారీయమకు తెలుగు కవితాహృదయముతో పరిచయము కల్గించినారు. అది మొద లామె యేమేమియో వ్రాయుచునె

యుండెను. కాని యవి లోకము గుర్తు తెచ్చుట కామె మన సొప్పలేదు. ఈ నిరాడంబరశీలము ఆమెకు సహజగుణము. లోకములోని యెందఱు స్త్రీలకో ఆదర్శముగా నుండ దగు స్వభావ ప్రవర్తనలు కలిగియుండియు, నీయమ కీర్తి నాశింపదు.

పూజ్య బాపూజీ ఆంధ్రదేశమున నడుగిడినపుడు కలిగిన భావ పరివర్తనతో నానాడు రాసులు రాసులు బోసి వైదేశిక వస్త్రదహనము గావించి, ఖద్దరు ధారణ మొదలిడిరి. అంతే- అది మొదలు ఇంతవఱకు ఆమె విదేశవస్త్రము ముట్టి యైన నెఱుగదు. అనుదినము నిత్యకృత్యములతో బాటు రాట్నము ద్రిప్ప వలసినదే. ఆ నూలుతో గుడ్డలు నేయించవలసినదే. ఆ గుడ్డలతోనే నిత్య వ్యవహారము జరుపవలసినదే. అంతే-కాని యిబ్బంది యైనను, విదేశ వస్త్ర మునకై పైస వెచ్చించుట కామె యొప్పదు. రాట్నముతో బాటు ఆమె సాగించు నిత్యకార్యక్రమము ఇంకొకటి- యది అనుదిన వీణావాదనము. కానీయైనను మందుమాకులకు వెచ్చపెట్టుట కిష్టపడక సతతము ప్రకృతివైద్యమునే నెఱపుచే కాక, ఇరువదివత్సరములనుండి యన్నము మాని యపక్వాహారములపై నుండు చున్నారు. సుమారు ఇరువది వర్షముల నుండి "ఆంధ్ర మహిళాగానసభ" యను పేర నొక గానకళాసంస్థను స్థాపించి, మహిళల గానకళాభివృద్ధికై పాటుపడు చున్నారు. ఇట్లవిరళోత్సాహమును, అవిరత దీక్షయు గలిగి, ఈ సముద్యమశీల యెన్నియో సత్కార్యముల గావించి మించిరి.

వీరు పెద్దపెద్ద కావ్యములు వ్రాయలేదు. ఏదే నవసరము తటస్థించి నపు, డా యవసరము ప్రసక్తి గైకొని యనేక శీర్షికల వ్రాసిన పద్యము లెన్నో కలవు.

డోలోత్సవము.

చిట్టిపాపను దోడ్తెచ్చి తొట్టె నుంచి
సుదతు లెల్లఱు గూడి బల్ సుందరముగ
తొట్టె నూపుచు పాటలు బాడవలయు,
వేగ రా రమ్మ చానలు వేడ్కతోడ,
జోల వినుమను హాయిగ బాల నీవు

లీల లన్నియు మానియు సోలియుంటి,
హాస్యమో, యిది నిద్రయో, అభినయమ్మొ,
తెలియ జెప్పవె మా కింత తెలుగుబాల!
ఇంతసేపును గోలగా నేడ్చి యేడ్చి
మురువుటుయ్యాలలో నుంచి ముదిత లూప
ఒక్క త్రుటిలోననే నీవు అక్కజముగ
నిదుర చెందితివే? యిది ఎక్కువ యటె?
అహాహా! ఊయలఁ గలదొ యనంతసుఖము,
నిర్మలం బైనట్టి నీదగు హృదిని గలదొ?
ప్రాప్త మౌనె మా కింత భవ్యసుఖము?

వారి తల్లిగారు సర్వగుణసమ్మాన్య రామమ్మ జమీన్‌దారిణి మృతి నంది నపుడు, వ్రాసిన మాతృవియోగమునందలి కడపటి పద్యము : —

"ఎనుబదేడుగా జీవిత మ్మింత రోసి,
సర్వబంధుల విడనాడి, నిర్వికారు
పాదయుగమును సేవింప భక్తితోడ
నరిగియున్నావు కాబోలు నమరపురికి".

---

# 81. విజ్జపు హేమలతాదేవిగారు

సుప్రసిద్ధ నాళము వంశముననే శ్రీ వల్లభరాయడుగారు వెంకటసుబ్బమ్మ గార్లకు జన్మించి, యోపినంత సారస్వతసేవ చేయుచున్నవారిలో శ్రీమతి హేమ లతాదేవిగా రొకరు. వీరి యావాసము రాజమందిరము. విజయనగరము విజ్జపువారి కోడలు. కాని, బాల వితంతు వగుట, వీరి మనికి యంతయు రాజ మందిరముననే. వారి జననము 1914 కావచ్చును.

శ్రీ నాళము రామలింగయ్యగారిచే స్థాపింపబడిన ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలయందు చదివి 'ఉభయభాషాప్రవీణ' పట్టము గైకొని, యచటనే, హిందీ పరీక్షలకు చదివి 'విశారద' పట్టము గైకొని, చిన్న ఖండకావ్యముల చేయునంతటి ప్రతిభ సంపాదించిరి. కొన్నినాళ్లు తాము చదివిన కళాశాలయందే ఉపాధ్యాయ పదవిని గూడ నిర్వహించిరి. ప్రస్తుతము వీరేశలింగము హైస్కూలున పని చేయుచు రాజమందిరమున నున్నారు.

వారి కవిత్వమున మచ్చుకు "దేశసేవ"---

"తనయు డుదయించినంతనె, తల్లితనదు
నసువులను బాసి యరిగె దా నమరపురికి;
పాప మా తండ్రి వానిని పరమప్రీతి
బెంచి యానందు డను నామ మించియుండె;
మాతృదేశమ్ము సేవయే మాన్య మనుచు,
తనకు పొరుగున నున్నట్టి తపసికడనె
ఆత్మజుని వీడి తనవాంఛ నరుస మొదవ
నతని కెఱిఁగించి సత్వర మరిగె నెటకొ:
కలదు జపికుటీరమ్మున కన్నె యొకతె
విజయ యన్ బాల యతడును విమలమైత్రి
విద్యయును బుద్ధులును నేర్చి వివిధగతుల
చిలుక గోర్వంకలట్టుల చెలగుచుండ్రి"

ఇటు లున్నది వీరి కవిత్వము.

# 82, 83 శ్రీ అయితం ఇందిరా, భారతులు

సుప్రసిద్ధ కవిశేఖరులు అయితం కాశీవరప్రసాదరాయవర్యుల కుమార్తెలు అయితం ఇందిరా, భారతుల నామములు వాఙ్మయ ప్రపంచమున శ్రుతపూర్వములే. వారిర్వురును 1930, 31 వర్షముల జన్మించిన బాలికలు. వారు కావ్య గానము సేయుట మొదలిడి యపుడే 6, 7 వర్షము లైనది. వీరి జనని సావిత్రమ్మగారు. వీరి జనకులు హృదయనివేదనము, కోదండరామచరితము, సులభీకృత బాలఛందము, బోసు భారతమను మహాప్రబంధము మున్నగు పంచాశత గ్రంథ కర్తలు. వీరి ప్రస్తుతనివాసము గూడూరు.

ఈ కవయిత్రీ సోదరీమణుల రచనలు జననీశతకము, అన్నపూర్ణా సుభాషితరత్నావళి యనునవి పద్యగ్రంథములు, ప్రతిమాదేవి యను చారిత్రాత్మక నవలయు నై యున్నవి.

బాల్యమునుండియు విద్యాశిక్షణ తండ్రిగారిదే. ప్రస్తుతము రాజమందిర మందలి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలయందు వీరు భాషాప్రవీణ పట్టపరీక్షకు చదువుచున్నారు.

బింకము సడలని పదబంధముతో పొంకముగా కలము ద్రిప్పనేర్పు ఈ సోదరీమణుల కవిత్వమున గాననగును.

వీరు వ్రాసిన "అన్నపూర్ణా సుభాషితరత్నావళి"కి స్వర్గీయ శ్రీ మాగంటి అన్నపూర్ణాదేవిగారు, విదేశములయందు, తన భర్త విద్యాభ్యాసము చేయుచుండగా, వ్రాసిన లేఖాళియే కావ్యవస్తువు.

అన్నపూర్ణాదేవి లేఖ లుదాత్త రమణీయములు. వీనియందామె వెన్నియో విషయముల దడవినది. శృంగారము, వీరము, కరుణ, భక్తిరసములు వానియందు ప్రధానముగా పొంగి పొరలినవి. మాతృదేశార్చన, సేవారక్తి, కావ్యమునందంతయు ప్రబ్బికొని యున్నవి. భర్తకు గావించిన యుద్బోధము, కడపటి లేఖలలో దండు నారాయణ రాజుగారికి గావించిన యాత్మబోధమును అసమాన

ములు, అద్వితీయములు పెండ్లియైన రెండునెలలకే భర్త యగు బాపినీడుగారు తన్ను విడిచి విద్యకై అమెరికా కేగుట, తా నిట విరహవ్యథాకులితయై కాలము గడుపవలసివచ్చుట, బుద్ధి, భావన, మనసు తన స్వాధీనము గాకుండ కాంతునిపై కరుగుట, వానిని మర్లించుకొనుట, సత్యాగ్రహోద్యమమున జేరుట, అది మొదలు భర్తను కూడ ఉద్యమమునకై ప్రోత్సహించుట ననునవి లేఖావిషయములు.

ఉజ్జ్వలము లైన ఈ లేఖాంశములను మఱింత యుజ్జ్వలముగా రచించినా రీ బాలికలు.

"ప్రియజనని దేశసేవ కర్పింప నన్ను
బితల నత్యంతభక్తితో వేడికొందు,
నాయకా! యిందు నా కీవు సాయపడుము;
జీవితము వృథ గాగ వసింపజాల''.

మొదటినుండియు దేవి యభిలాష యిట్టిదే.

''సాయ మాశించె మీనుండి సంఘ మెల్ల,
వలయుచో ప్రాణధనముల వలదె విడువ?"

ఇట్లుత్పన్నమైన దేశభక్తి, సేవారక్తి, పోను పోను దృఢపడి సత్యాగ్రహోద్యమమున బాపూజీ ప్రవేశించి శంఖము పూరించుటతో బలపడి, దృఢపడి యొక రూపము దాల్చినవి. భర్తృసందర్శనార్థము అమెరికా కేగ దలచిన ప్రయాణ మాగిపోయినది :—

''దాస్య మరసి స్వాతంత్ర్యంబు దలచినారు
దీక్షతో స్వరాజ్యము భారతీయు లిచట;
అమెరికా రాను, నా కిట నర్హ మైన
దేశసేవాప్రకార సద్దీక్ష గలదు"

యోగ్యమతి యైన అన్నపూర్ణ కర్తవ్యము నిర్ణయించుకొన్నది.

''సత్త్వగుణరాశి, యార్యుండు, సరళశీలి
దేశభక్తాగ్రగణ్యుండు, దివ్యమూర్తి,

సతత పరమేశ్వరధ్యానజాతబలుడు
గాంధి పతి నేటి యసహాయ కదనమందు''

ఇట్టి ఉద్యమమునందు జేరి యామె బుద్ధి స్థిరరూపము దాల్చి నిర్మాణాత్మక మైనది.

''కల విభూషల నేలూరుకడ నొసంగి
కడగి బెజవాడలో వెండి గాంధి యడుగ,
బైడిగాజులు నాల్గు సభక్తి నిడితి
కఱకు వడుకునూల్గుడ్డను గట్టికొంటి.''

ఆమెలోని యీ తీవ్రాసక్తిని గలిగిన పరిణామ మారయుడు- ఎంత విచిత్రమొ? ఎంత యగాధమొ?

''చేరినది మీరు పంపిన చిత్రపటము,
పొంగిపోతిని, నటుపైని క్రుంగిపోతి,
దుస్థితీరు, నిల్చినభంగి దుర్భరంబు,
కోపగించితి, నేడ్చితి, గూలబడితి''

చూచితిరా ? యీ పద్యమునందలి గ్రథనశక్తి. అతి సంగ్రహమగు రచన అతిశయ మగు భావవిస్తారత, అత్యంతరమణీయ మగు నీ రచనాసౌందర్య మతి మాత్ర మైనది.

''కాల్చనిచ్చితి భక్తితో గాంధి కేను
రెండువే ల్వేయు పట్టుచీరెలను, మఱియు
పెండ్లిచీరెను గూడ నర్పించుకొంటి,
వలయుచో బ్రాణమే నిత్తు భరతధరకు''

ఇంతకు దెగువ చేసియు, నామె మన మూరడపడినది కాదు.

''పెండ్లి యుంగరమును గూడ బ్రీతితోడ
తిలకునిధి కిచ్చినాను, మీ విలువ గలుగు

చేతిగడియారమిచ్చితి, జేత మలర
నకట ! మిము నిచ్చుకొనెడు భాగ్యంబు లేదు"

అని వాపోయినది ! ఎంతి విశుద్ధమైన యంతఃకరణ ! ఎంత సత్యమైన దీక్ష !! ఇంతతో నామె దేశభక్తి చరమపరాకాష్ఠ నందినది.

ఇట్టి సుందరతర విషయములను సత్యం శివం సుందరమ్ము లగు పద్ధతితో సన్నజాజులదండవోలె గ్రుచ్చి, ఆంధ్రుల హృదిని గైసేసినారు.

వాడిన పదములలో ఒక్కటియు అర్థము కాని పదము లేదు. అర్థవిహీనమైన పదముసు లేదు. అతి సరళ పేశల మృదూక్తియే అయినను, ఏదియో ఒక కమ్మసి ధార, ఒక తియ్యని ప్రవాహము, ఒక చిక్కని కూర్పు, ఒక చక్కని నేర్పు, ఒక్క- పొల్లుపదమునకైన కొంత యెడమీని అల్లికబిగింపును నొక్కచో ప్రోగుపడి విశదమైన రూపముతో పరితల లోగొనుచున్నవి కవిత్వ మన్న నిట్టిదియే కాబోలు!

ఇంతే కాదు- ఈమె శృంగారభావములను ఎంత సముచితముగ వెలిబుచ్చినదో కాంచుడు :—

"లేమి భరియింతు నెట్టులో భూమగతిని
గాని, మీ ప్రేమలేమికి గలుగు పగపు
అన్యజనములపై జూపునంతయేని
గరుణ జూపరు, నామాట గాని వినరు."

"యుష్మదీయభావంబుల నొక్కనాడు
నెఱుగ, బరులతో జెప్పెద రింతె కాని,
వెతలు నవి, నీయవిగ భావింపలేరు.
పెండ్లి క్రొంగ్రొత్త నిటు లుండ, వెనుక నెటులొ"

"ఎఱుగుదురు మీరు మీ రింటె యెసగునపుడె
నిద్ర పోలేని యెన్నియో నిశల నెటుల
జింత వాక్రందనముల జేసినాను,
వలదె నా కనుకూల దాంపత్యఫలము."

"నన్ను బాధల బెట్టెడు తెన్నుకంటె
మీర లనుకూల సతి నొందు మీననేత్ర
పెండ్లియాడుట మేలు లీ వెతల వేల?
జ్ఞానహీన యంచేని హార్షమిడరాదె ?

"లేఖకుడు కరినాత్ముడో, లేఖ నిచ్చు
వాడు నిర్దయుడో, జాబు ప్రాప్తిగాదు,
వరుడ నః గని నే డానవాలు నేని
పట్టిలేవు, నాహృదయంబు భ్రాంత మయ్యె"

పెండ్లైన క్రొత్తకాలపు పొంగునందు కూడ ఉచితమైన లజ్జ, ఉచితమైన సిగ్గు, సింగారము, సాంసారిక మగు నుదాత్త భావములు.

కావ్య మంతయు నిట్లె యున్నది. ఏ పద్యమున కాపద్య మొక వెలలేని మణిమాణిక్యము. ఉచిత మగు ఇతివృత్తము, దానికి దగిన రచన, వీని రెండిటి నలంకరించు తనివోని భావసంపద.

విభుడు కవిచే, విభునిచే కవియు, కవిచేతను ప్రభునిచేతను కొలువు కూటమును శోభించు ననున ట్లున్నది.

వయసున పసివార లైనను, కవితాగౌరవమున వయసువా రన దగిన యీ సోదరీద్వితము కృతివిన్యాసను ఆంధ్రుల యదృష్టరేఖ యన పొలుపు మిగిలినది. చిన్నతనముననే యిట్లు సుమాశించిన వీరి లేఖిని నింక పెద్దతనమున నెట్లు పిసాశిం చునో, వేచియుందము.

శీఘ్రకాలముననే విద్యా పరిపూర్తి గావించుకొని, యితోధిక గురుతర కావ్యసంపదలతో నాంధ్రవాణికి అమూల్య భూషల నర్పించుకొందురు గాక !

---

# ఆంధ్ర కవయిత్రులు

ఐదవ తరము

---

నవ్యాంధ్ర వాఙ్మయము

## 84. శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

భావకవిత్వ మను పేర వెలసిన యీ యుగపరివర్తనమున ఋషులతో బాటు పాలుగొని ముందంజ వేసిన గౌరవము శ్రీమతులు తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, సౌదామిని (బసవరాజు రాజ్యలక్ష్మమ్మ), చావలి బంగారమ్మగార్లదే. 1935 వ సంవత్సరమున వెల్వడిన భావ కవిత్వముల సంపుటి వైతాళికులయందు వీరల గేయములు, ముత్యాల సరముల వెలువరించబడి యున్నవి. వీరి తరువాతనే స్త్రీలలో ఈ లక్షణము విరళముగా ఆశ్రయము కల్పించుకొన్నది.

శ్రీ తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు సుప్రసిద్ధ కాంగ్రెసు అనుయాయులు, గాంధేయమతానుష్ఠానపరులు, బ్రాహ్మ మతాభిమానులు నగు శ్రీ తల్లాప్రగడ నరసింహంపంతులుగారి పత్ని. 1900 జననము. ఇప్పటి కాపురము పశ్చిమగోదావరియందలి చాగల్లు. అచ్చటనే శ్రీ నరసింహము పంతులుగారి బందుగులు సాధుసత్తములు శ్రీ ప్రకాశరాయుడుగారు గాంధియాశ్రమము నొకదానిని స్థాపించి యుత్తమ పద్ధతులతో నడుపు చున్నారు. వీరును అందే నివసించుచుండిరి.

వీరి కావ్యము లప్పటప్పట పత్రికలయందు ప్రచురింపబడుచే పరిత లెఱింగినది.

వచ్చి లాలించేటి ప్రియుడా! నన్ను
మచ్చికల నలరించు ప్రియుడా!
హెచ్చైన ప్రేమసుధ లిచ్చి నన్ను
వగల మఱపించేటి ప్రియుడా!

భవ మెంతొ భారమై పరుగులెత్తే వేళ,
శీర్ణమై నాగుండె శిధిల మయ్యే వేళ,
కన్నుగవలో నొక కాంతిపుంజము దాల్చి
చిన్ని నవ్వులు మోముపై చిందులాడంగా
ప్రేమతో మనసిచ్చి ప్రీతితో తనువు జేర్చి
రమ్య మధురాలాపరసము నాపై చిల్కి
నడకలో నొక వింత నాట్య మాడుచునుండ
పలుకులో నొక తీపి పలుకరించుచునుండ
ఇరుల నీ నవ్వుతో విరిసిపోవగ జేసి
మాటిమాటికి నాలో మమత పెంపొందించి
"వచ్చి లాలించేటి"

'కుపితవిధి' యను ఈ చిన్ని కృతిలో విరహార్తను చక్కగా ధ్వని ప్రాణముగా నుపలక్షించిరి :—

"పూలమాలిక లల్లినందుకు
కరకుకత్తులె కానుక లాయెను,
తేనెసుధలను చల్లినందుకు
తేటిపోటుల కాటు లాయెను,
అగ్ని, మండే గుండెలోన,
ఆర దేమి చేతునే ?—
మలయపవనుడు పారిపోయె
మాధవీ మృదుసౌరభము గొని,
విలువ లేని చలువకానుక
లిచ్చినాడు గదమ్మ నీకు
గరళ మగునో? కట్టకడకు
మురళిసన్నిభగాన మగునో ?
వేచియుండుము వేగపడక
కాచియుండుము మాలతీ !"

ఇందు "మలయపవనుడు పారిపోయెను మాధవీ మృదుసౌరభము గొని" అను గీతిక వెలలేని రతనంపు తునుక యనదగును.

ప్రియు డన్యాసక్తుడై స్వీయను ద్యజించుటే గాక, పూర్వ ప్రణయినీ హృదయ సౌరభము కూడ కానిపోయి, యా పరకీయ కొసంగి వైచినాడు గదా యని స్వీయ బాధపడుచున్నది.

'విలువలేని చలువకాన్క-
లిచ్చినాడు గదమ్మ నీకు,......

అను పదములయందు స్వీయకు పరకీయపై గల్గిన ఈర్ష్యాద్వేషము లభివ్యక్తములై గరళ మగునో కట్టకడకు" అను పదములలో నా ఈర్ష్యాగుణము పరాకాష్ఠను పొంది స్త్రీసహజత్వమును పోషించినది.

వీరి ఇంకొక మకుటము- ''సహజబాధానుభవము కల ప్రేమికల పాట్లు" అను కావ్యమున మగవారి ప్రకృతి నచ్చుగ్రుద్దినట్లు ప్రదర్శింపజేసినారు శ్రీ సుందరమ్మగారు.

"లేత కాంతుల వెలుగొందు లేగులాబి
మించు రక్తిమ గాంచి, తా మించు ప్రేమ
కౌగిలింతల గనుటకు గలిసె లతిక
చిగురుటాకుల జిగి మించు చెలువుతోడ"

... ... ... ... ...

''ప్రేమ గనిన లతాంగి యన్ నెనరు లేక
అలరుమ్మ్రుకులంపు చెల్వ యన్ కరుణ లేక
తొలుత దరి జేర్చి ముద్దాడి దయ దొరంగి
కంటకంబులచే తను వెల్ల గీరె''

... ... ...

"ప్రకృతిని నడచు భర్తల చేత లివియె;
ప్రేమకొఱకు నై జీవించి, ప్రేమకొఱకె
కష్టమే సుఖమని మానసముల నెంచి
బ్రతుకు సుకుమారలే పుణ్యసతులు భువిని
సహజబాధానుభవమె ప్రేమికల పాట్లు''

పతులే ప్రాణమని దైవ మని భావించి, ప్రేమించి, వారినే పూజించు సతులను నిరాకరించి హింసించి బాధించు కొందఱ మగవారి దుశ్చర్యలను "గులాబి చెట్ల నాశ్రయించిన లతకూనల అవస్థల" మీదుగా చాటిచెప్పిరి.

ఇంకను చిల్కా, అంధకారము, స్నేహరుచి, మున్నగునవి యెన్నో కావ్యములు వీరివి కలవు.

అందరాని యూహము లెన్నో అంతరంగమున కుదించి పరుగు లిడియెడి భావముల నొక పట్టణవాసి పదసంచయమున బంధించు ప్రయత్నము వీరి కవిత యందు ఛాయగా గనబడుచుండు నని విమర్శకు లనిరి.

ఈ ద్వితీయ ముద్రణావసరమున జెప్పదగిన దొక మాట కలదు. శ్రీమతి విశ్వసుందరమ్మగారి రచనల నన్నింటిని వారి సోదరులు శ్రీమల్లవరపు కృష్ణరావుగారు, మల్లవరపు విశ్వేశ్వరరావుగారును ప్రకటించి యుండిరి.

—:❦:—

# 85. శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు

(సౌదామిని)

శ్రీయుత వీరేశలింగముపంతులుగారి సంఘసంస్కారమును, గురజాడవారి కవితాసంస్కారమును సాటివార లగు తనబోటివారికి హృదయసంస్కారము గావింప, మొరసిన రమ్యవీణ యనునట్లు, బ్రదుకు బ్రదుకె యొక నవ్యగీతికయై, దివ్యరాగిణియై తేజరిల్ల, కావ్యసౌరభపరీవాహమున జీవికల నల్లనల్లన, ప్రసవమట్లు దేల్చి తెమల్చివైచినవారు శ్రీ బసవరాజుదంపతులు ! కవితయే లాసుగా గూడుకట్టుకొన్న అప్పరాయని గీతికలలో ఒక మధురమైన హృదయానుభూతి, ఒక మంజులమైన చైతన్యస్పందనము ప్రతిరవము లీనుచుండును. కమ్మని తన కవితాసుమముల యెదప్రాలి ఝుమ్మని మొరసి పాతకాళిని ముసరికొనెడ గేయములు వ్రాసి

మృతజీవియైనాడు అప్పరాయుడు ! వారిసతియే సౌదామిని. వీరి గీతములు మిక్కిలి చిన్నవై, మిగుల గంభీరములై యుండును. పలుకు సున్నితమైనను, తలపు సునిశితము.

వీరి జననము 1904 వ సంవత్సరము. భర్తమరణానంతరము వీరు చాల కాలము గుంటూరు శారదానికేతనమున నుండి దేశసేవ యొనర్చుచు జీవితము గడుపసాగిరి.

"చింతమానుకొమ్మపైన
వింతగాను గువ్వజంట
సంతోషముతోడ సరస
సల్లాపము లాడుచుండె."
వాడుటాకు లన్నియు బడి
వాదల నాడుచు బోవున్.
... ... ... ... ...
చల్లని చిరుగాలిపాట
మెల్లగ వీనుల సోకగ,
వాకిట నిలబడి అడుగుల
చప్పుడైనయప్పు డెల్ల,
ఆత్రముతో నీవె వచ్చి
తని భ్రమపడి చూతు నాథ!
... ... ... ... ...
సందె జారె చుట్టుప్రక్క,
మినుకు మినుకు దీపమ్ములు
వెలుగుచుండె దూరమ్మున,
కోవెలలో హాయిగాను
మేళము వినవచ్చుచుండె,
చల్లగ వెన్నెలలు కన్న
తల్లి వోలె కాయు గాని
మన సేమో మాటుమణగె''

ఈ గీతి యుత్తమ మైన ధ్వని కుదాహృతి యని విమర్శకులనిరి, నిజమే. తుది మూడుపాదములు మరింత రసపూర్ణములు. కాని, అటనట గమనములో తూగు సడలినది.

"దురదృష్టము" అను వీరి కావ్యము వీరి జీవితములోని విషాదముచే మలీమస మైన యేదో యొక ఘట్టమును తొంగిచూచుచు మర్మవేధ యొనర్చుచున్నది :---

"చూచితి మెంతో దేశము
సుఖము శాంతి దొరకునో యని
మునిగితి మెన్నో నదులను
మోక్షము చేపట్టుద మని,
యెక్కితి మెన్నో కొండల
నీశ్వరు దర్శింతా మని,
మ్రొక్కితి మెన్నో వేల్పుల
నొక్క పండు వర మి మ్మని,
నోచితి మెన్నో నోములు
కాచి ప్రోచు నని పార్వతి;
కడకు దేవిదయచేతను
కంటి రత్నములు రెండు;
బ్రతుకు కలంకారము లౌ
వాని దాచ చేతగాక
ఎచటనో పోగొట్టుకొంటి
మెంతటి దురదృష్టముననో"

బహుశః కడుపున గన్న బిడ్డల వియోగబాధయే వీరి కిట్టి చుమ్మర్లు గలిగించిన దేమో?

ధ్వన్యనుప్రాణిత మైన వీరి కవిత యితరుల కుత్తమాదర్శ మైనది.

---

ఇది సరియే-ఇక వీరి "కప్పతల్లిపెండ్లి" బాగున్నది చూడుడు.

"కప్పతల్లీ పెళ్లి చూడరే— నేడు
కావెళ్ల నీళ్లొంపినాడు
వరుణదేవుడు పంపినాడూ— ఓ చెలి
వాడ లన్ని నింపినాడు
గగనతలమునుంచి నేడు— వీవనలు
చెట్లచే వేయించినాడు.
స్వర్గాధినాథుడూ నేడు,— రథ మెక్కి
పయనమై పోతువున్నాడు.
భత్యాలు లేకనే వాడు.— బాగ
బాజాలు వే[illegible]
బండరాళ్ళపైన మా వాడు. — చక్రములు
బడబడా దొర్లించినాడు.
బాణాసంచా వెలితి లేదే.— పెళ్లికి
బహు బాగుగా చేసినాడే.
కప్పమ్మ పెళ్లికో యంచూ— మేళములు
గొప్పగా తెప్పించినారే.
కప్పమ్మ గడప తొక్కినాదీ.—శుభమన్న
సూచనలు చూరు చెప్పినది.
కప్ప లెగిరే వాన లమ్మా— పొలములూ
కనకమే పండుతా యమ్మా॥

'కప్పల సంతోష మెంత హెచ్చైన నంతగా వరిచేలు పండు' నన్న సామెత నాధారముగా చేసుకొని వ్రాసిన ట్లున్న దిది. వర్షప్రకృతి సహజములైన వస్తుసంపద యంతయు కప్పమ్మపెండ్లి కనువుగా కూర్చి రూపకానుప్రాణిత వ్యంగ్యము మాతృకగా రచించిరి.

———

# 87. శ్రీమతి కొత్తపల్లి లలితగారు

ఈ కుంకుమశోభిత శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి కొమరిత. నవ్యాంధ్ర సారస్వతమున కాచార్యులైన శ్రీ సుబ్బారావుగారి నెఱుగని సారస్వతేయు లుండరు. జడకుచ్చులు, రమ్యాలోకము, మాధురీదర్శనము మున్నగు నెన్నో కృతుల రచించి మాన్యు లైన వారు శ్రీ సుబ్బారావుగారు

వారికిని, శ్రీమతి వరలక్ష్మమ్మగారికిని ద్వితీయపుత్రికగా 17—8—1980 సంవత్సరమున మాతామహులయింట జన్మించిరి. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు M, A. గారు వీరిభర్త. శ్రీ వీరభద్రరావుగారి జన్మస్థానము రాజమహేంద్ర వరము అయినను, ఉద్యోగధర్మముపై విశాఖపురిలో నివాస మేర్పఱచుకొనిరి.

శ్రీమతి లలితమ్మగారు లలిత లలితముగా వాణిలాస్యమున వర్తించు లలితాకుటీరమున లాలితముగ పెరిగిరి. లలితాదేవి శ్రీ సుబ్బారావుగారి యుపాస్య దేవత. తమ కులదేవత పేరిటనే తమ ముద్దులతనయ ముద్దుమురిపెముల జూడ నుత్సహించి, వా రట్లు తనయకు పేరిడిరి పసిడిగంటము పట్టి, పలుకురమ్యత ముట్టి, అక్షర రమ్యపంక్తి నవ్యయానందము చిందిన కవితాచార్యుని వారసురా లీమె.

పురిసిళ్లకొలది కావ్యమధువును పుట్టియే త్రావినదో! పుట్టకమునుపే యాని నదో కాని, ఆవగింజంత మేర అడుగుకదలిన తొట్రిలు తలపుతేనెలు పారించు వీరి లేఖిని అమృతములు చిందుచు సాగిపోవును. అయినను, ఆచార్యులు పారించిన తేనెయూటల బాటలు వేరు, ఆచార్యుని తనయ అనుసరించిన నవ్యకవిత్వపు తీరులు వేరు. తాతపాదు డాలోచించి యొక యడుగు ముందు వేయగా, తను జాత ఆలోచింపకయే యింకొక పదము ముందునకు సారించిరి.

ఆలోచనకు వ్యవధి యేది? అది యొక మహాప్రవాహము. శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు, బుచ్చిబాబు మున్నగువారు మొదలిడిన నవ్యకవిత్వపు వెల్లువయై

తెలుగు దేశమును ముంచివైచినది. దేశమునందలి పరిస్థితులు తారుమారై దేశస్థితి అల్లకల్లోలమైనది. పాలించు ప్రభువులు పాలితప్రజలు మంచిచెడ్డలు, బాగోగులను లక్ష్యపెట్టక స్వార్థపరులై ప్రజాధనమును, ప్రజాక్షేమమును ఊరగొనిరి. ఆంగ్ల విద్యాభ్యాసము కతమున జనతలో నాగరక వ్యామోహములు పిక్కటిల్లినవి. అగుట, ఇనులకు నిత్యావసరములు పెరిగి సామాన్యుల జీవనప్రమాణమును మన మూహింపలేనంత, సాధారణులు భరింపలేనంత, యతిమాత్రముగా పెరిగిపోయి నవి. అసలే ఆర్థిక దుస్థితిచే క్రుంగి కృశించిపోయిన భారతీయ సామాన్య జీవనము ఈ యెద్దడికి తట్టుకొనలేక తల్లక్రిందు లైనది. ఒకప్పుడు నిత్యకల్యాణము పచ్చ తోరణమైన భారతీయగృహాంగణము కన్ను తెరువగానే, కసిగాయల కడుపుచిచ్చుల రోదనతో, ఆలుమగల యన్నాకలివేదనతో మూల్గుచు దుఃఖము దైన్యమును నిత్య మాంగల్యము చేయ ముంగిళ్లైనవి వాస్తవికదృక్కు లగు కొందరు వ్యక్తుల కీ దృశ్యములు వేదనను పెంచినవి. నిత్యదారిద్ర్యమున నిలువెల్ల గూలిన జీవికి నిత్య జీవితమున నన్నియు భయంకరసమస్యలే. ఆ జీవితభావన నాకళింతకు దెచ్చుకొని, హృదయమున పుక్కిలింతలుగా ద్రోసికొనివచ్చు దుఃఖమును పరిత కర్థ మగునట్లు చేయవలెనను నాసతో జగతీరంగమున గల వాస్తవిక పరిస్థితిని నగ్న సత్యముతో వర్ణించిన అధివాస్తవిక కవులకును అన్నియు సమస్యలే అయినవి.

అన్నీ సమస్యలే—
సందేహాలే--
ఏవో,
ఏవేవో——ఏవేవో
ఘోషలు వినబడుతున్నాయి
గుండెలు విడిపోతున్నాయి''

అని శ్రీ శ్రీ ఒకచో వ్రాసిరి అట్టివారి పరిస్థితి నగ్నముగ వర్ణించుటయే గాక, అట్టివారినిగూర్చి సహానుభూతితోడను వీరు కవిత్వములు వ్రాసిరి.

దానికి నియమిత మగు ఛందము (అనగా లక్షణము) లేదు. ఆంగ్లసారస్వతమందు చెప్పబడిన Rythm అనగా--- ఊతము లేక తూగు, లేక గమనము అనునదియే ఈ కవిత్వమునకు ప్రాణము. కొంద ఱిందు Rhyme ను కూడా

(అనగా, అంత్యనియమమును) పాటింతురు. పూర్వకవిత్వము గణపరిబద్ధము. అందును దేశీయచ్ఛందము మాత్రాగణపరిబద్ధము. ఇవి గీతము, సీసము మొదలగు నవి. శ్రీ అప్పరాయాదులు ఆవిర్భవింపజేసిన నవ్యకవిత్వము — ఆదియే భావ కవిత్వము మాత్రాచ్ఛందోబద్ధము. అనగా, ఒక్కొక్క పాదమునకు నియమిత మాత్రలు గల గణములు నియమితముగ నున్న చాలును. నిర్దిష్ట మగు గణ ముండవలె ననియు లేదు. ఇంక నేటి నవ్యకవిత్వమున కదియును లేదు. ఒక విధ మగు నడక మాత్రమే దీనికి ప్రధానము. ఆవేదన చెందిన హృదయమునుండియో, అనుభూతి నందిన డెందమునుండియో ఎట్టి అడ్డు ఆతంకములు లేక ఏ భావము తిన్నగా నెట్లు వచ్చునో, దాని నట్లే ఒక నియమిత మైన గమనవేగముతో అక్షర రూపమున నిబంధించుటే వాస్తవిక కవితా లక్షణము. భావకవిత్వమునకు పిదప వచ్చిన పరిణామమున యీ కవిత్వము అహంభావకవిత్వ మనబడినది. తరువాత వాస్తవిక కవిత్వము, అటుపైన అధివాస్తవిక కవిత్వము నని పేర్లిడిరి. Lyric Poetry అని, Surrealistic poetry అని, Realistic poetry అనియు ఆంగ్ల మున వాకొనబడు కావ్యగుణములే ఆంధ్రమునను భావకవిత్వము, అహంభావ కవి త్వము అధివాస్తవిక కవిత్వములయందును భాసించినవి.

అట్టి కవిత్వమున కీ యుగమున శ్రీ శ్రీఇత్యాదు లాద్యులు. శ్రీ శ్రీ గేయం: —

ఇతిహాసం-చీకటిగోడల<br>
అట్ట అడుగున పడి కాన్పించని<br>
కథ లన్ని కావా లిప్పుడు,<br>
దాచేస్తే దాగని సత్యం.

... .... ...

నైలునదీ నాగరికతలో<br>
సామాన్యుని జీవన మెట్టిది ?<br>
తాజమహల్ నిర్మాణానికి<br>
రాళ్లెత్తిన కూలీ లెవ్వరు ?

.... .... ...

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుని సాహస మెట్టిది ?
ప్రభు వెక్కిన పల్లకి కాదోయ్—
అది మోసిన బోయీ లెవ్వరు ? శ్రీ శ్రీ

సుడులు దిరుగుచు. ఉరవడులుగ్రక్కు ఈ ప్రవాహమున కలమును ముంచి తలపు లోతుల నర్థమంతను వరించినవారిలో శ్రీమతి లలితమ్మ గారొకరు. నవ్యాంధ్ర కవితా పితామహు లనబరగిన తండ్రి గారియింట బాల్యము గడపి నపుడు, సోదరులతో బాటు వీరును విశేషముగ ఆంగ్ల సారస్వతమును ద్రచ్చిరి. పుట్టుకనుండి కవిత్వపు పుట్టువు బుట్టిన శ్రీమతిగారి హృదయ మీ సారస్వతసేవనచే నిండార దనిసి క్రొత్త పోకడల గట్టున త్రేన్చినది. ఎప్పుడును నవ్యతను, స్వేచ్ఛను గోరి వెదకుకొను శ్రీమతిగారు కంఠము బట్టి, ఊపిరి యాడనీయక, క్షణక్షణము నొక్కి వేయుచున్న దుష్టగ్రంథి ఏదో తునిసినట్లై ఆనందమున దనిసి 'సెబాస్! కోరిన పంథ దొరకిన" దని సంతోషించి యంగీకారముద్ర వైచిరి. కాని ఇంతలో తటస్థించిన శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారి నెయ్యము పెంపున వారికి తెలుగుతియ్యము నోరు సోకినది. శ్రీ వీరభద్రరావుగారు కదలియాడుచున్న తెలుగువ్యక్తిత్వము ! నీరు పల్లము బట్టినట్లు, స్వభాషా మాధుర్యపు చవులు మఱిగి వీ రినుమడించిన ఉత్సాహముతో, అతిశయించిన అభిలాషతో తెలుగున రచనలు సేయ నుద్యమించిరి. వీరి యీ యుద్యోగమునకు ముఖ్య ప్రోత్సాహకులు శ్రీ వీరభద్రరావుగారే. వీరి రచనములు చాలా భాగము గద్యవాఙ్మయమునకు చెందినవే.

కాని, అపుడపుడు గేయములు కూడా వారు వ్రాసినవి కనుపించుచున్నవి.

1. ఆదిగో—
చూడు మాతని
మట్టిలో దాచిన దచటనే.
పక్షులు రాల్చు పచ్చనాకులు
పరామర్శకో యన...

2. నేడు—
లే దాతని
శరీర మచట;
కనుపించ దాతని
ముద్దుమోము...

3. నాటి—
సమాధి
జీర్ణచ్ఛాయలన
పూచు గడ్డిపూ లెన్నెన్నో
ఆతనికై
విషాదముతో తలలువాల్చును.

4. అల్ల నల్లన—
దారినే పయనించు మేఘుడు
రాల్చిపోవును కన్నీటిబొట్లు
దేవతలు పంపిన కానుకలట్లు

5. ఆతని—
విచారముతో
భూదేవికడుపులోదాచుకొనెనో
ఆ చల్లని తల్లి
నిశ్చలప్రకృతిలోకల్పుకొనెనో
కానుపించవు
మనకాతని అడుగుజాడలైనా.

6. నిశీథములో
ఆ సమాధినుండి
వినగవచ్చు
వైరాగ్యబోధక వాక్యములు
రామ రామరామా యనుచు
రాతిహృదయాల చలింప
జేయుచు...

7. కడసారి—
చిదానందుడు
చిన్న వాడయ్యు
భావన కందని బాధలతో
సాధించె రామనామ మహిమ
చూపించె మాకు జ్ఞానపథంబు.

8. లేదు—
చావ లేదు-చావలేదు
ఆతని
మహోజ్వల తేజస్సు
ఇంచుక
విరక్తి వహించి
దేహంబును విసర్జించిన
అమరజీవి
చిరంజీవి
చిదానందుఁడు!!

9. మా అమ్మ
వరలక్ష్మమ్మ ఇంట
కారణజన్ముడై వెల్గిన
చిఱుతప్రాయపు చిన్నతమ్ముడు
గతించె నని విలపించు
తోబుట్టువను నేను.

చిన్నతమ్ముడు నందామృతికి కలగిపోయిన శ్రీమతి లలతగారు హృదయా వేదన ఎంత కరుణామయ మైన కవిత్వమునకు అనుభూతి నిచ్చినదో చూచితిరా?

భాష యే దైన నేమి? ఛందమేదైన నేమి? ఆ గేయములోనుండి ముందునకు దూసికొని వచ్చిన ఆ భావపు సొంపునకు, ఆ పాదములలోనుండి తొంగిచూచు కవితాత్మకును హర్షింపని వా రెవ్వరు? ఎల్లెడల నిండి వెల్లువయై ముంచియెత్తిన శోకరసమునకు కనులు చెమర్చని వా రెవ్వరు? నిజముగా నిది యొక భావ స్రోతస్సు. ఒక కళాఖండము. ఒక రసోపాయనము. "మట్టిలో దాచిన దచటనే" అని నిర్దేశించి చూపుటలో పనవి పనవి వాపోవుట వ్యక్తమగుచున్నది. "పక్షులు రాల్చు పచ్చ నాకులు పరామర్శకో యన" అనునది యెంత గురుతర మైన భావము! ఎట్టి కదలికయో సహృదయులే ఎఱుగుదురు. లలిత మైన ఉప మాన రేఖ అచట ఒక చిన్న కదలికలో మెఱసిపోయినది.

"జీర్ణచ్ఛాయలన పూచు గడ్డిపూ లెన్నో ఆతనికై విషాదముతో తల వాల్చును." చిన్నియనుగుపై దమకు గల ప్రేమానురాగముకతన సృష్టి యంతయు నాతనియెడ గౌరవ మాకల్పించుచు, నాతనిమృతికి శోకించుచున్నట్లే యామెదృష్టికి దోచినది. "రాల్చిపోవును కన్నీటిబొట్లు దారినే పయనించు మేఘుడు" "దేవతలు పంపిన కానుకలటుల" ఓహో! ఏమి యుదారభావ కల్పన! దుఃఖము తలమున్కలై కారుమబ్బులు గ్రమ్మిన హృదయపుటంచుల నుండి తెగిపారిన శోకరసము పరిమితిని దెల్పుటకు ప్రకృతియందలి మబ్బులు రాల్చెడి నీటిబొట్లకంటె నింక నతిశయోపమానము నెట్లు చూపగలరు? కాని, యొక మనవి, "మరో ప్రపంచం– మరో ప్రపంచం", ఇత్యాది శ్రీ శ్రీ గేయము లలో ఒకఒద్దిక గల గమకపు దూకుడు-తూగు- కనబడును. ఆ తూగే- ఈ పదకవిత్వము (worse libers) నకు జీవము. ఆ తూగు విషయమై వీరు ప్రయత్నించిన బాగుండును.

నిజమున కిది యొక శోకవిధుర మగు భావస్రోతస్సు. రసపరవశ మగు ఈ చిరంటికలము చిందు లింకెన్నెన్ని ఎన్ని విధముల పఠితల హృదయ సీమలపై జీవసస్యముల మొలకెత్తించ నున్నవో? అపరూప భావశోభాసమన్విత మగు వీరి లేఖినీవిన్యాసము తెలుగు హృది కొక క్రొత్త విన్నాణము.

---

# 88. శ్రీమతులు పరచూరి భువనేశ్వరి అన్నపూర్ణాదేవిగార్లు

నవ్యాంధ్రకవిత్వమునకు ప్రతినిధిగా శ్రీ శ్రీమతి లలితమ్మగారిని సమీక్షించిన వెనుక సవివరముగా జీవితవిశేషము వివరించుచు సమీక్షింపవలసిన కవయిత్రుల సంఖ్య ముగిసినట్లే.

ఇక నప్పటప్పట గృహలక్ష్మి ఇత్యాది పత్రికలయందు పద్యములు వ్రాసి వ్యక్తిగత చరిత్రలు తెలియబడని కవయిత్రుల నామములును. వారి రచనలు నీక్రింద పేర్కొనబడుచున్నవి. శ్రీమతులు భువనేశ్వరీ, అన్నపూర్ణాదేవిగారలతో కవయిత్రుల జంటలసంఖ్య నాలుగైనది.

వీరి లేఖిని శక్తిమంత మైనది ప్రాచీనాధునాతన కవిత్వముల రెంటను వీరి కలము చెయ్యితిరిగినది,

తెలుగుబిడ్డ—

"కడుపునిండార త్రాగంగ గంజి లేదు,<br>
కట్టుకొనుటకు చింపిరిబట్ట లేదు,<br>
నిద్ర వచ్చుచో జానెడునేల లేదు,<br>
దీన హరిజనస్థితి యిదె తెలుగుబిడ్డ!"<br>
వీరు సాటివా రంచు భావింప వేల?<br>
ఈశ్వర సుతుల టంచు నూహింప వేల ?<br>
రక్తసంబంధ మంట తలంప వేల?<br>
నీకు సోదరుల్ సుమి వారు తెలుగుబిడ్డ!<br>
ప్రభు మహేశ్వర దర్శన ప్రాప్తి లేదు,<br>
వారికొలకు తటాకమ్ము స్పర్శ లేదు,<br>
గ్రామమధ్య సంచారము కష్టము, దుర

దృష్టులే హరిజను లింత తెలుగుబిడ్డ !
ఉపవసించె గాంధి యిరువదొక్కదినము
వారి క్షేమాభివృద్ధికి పాటుబడుచు,
పన్న మొడ్డెను వారికై ప్రాణములను
పిలిచి చేర దీయ వ దేమి తెలుగుబిడ్డ !

పిలుపు-బాబుజీ యిదె నీకు కబు రంపెన్

జాబు జవాబులు పంకిరా వట
జాగు సేయక రమ్మ్మ రమ్మిక...
బాబుజి ఇదె — —
లేచినటి ముప్రొద్దు నేమో
పాచిపోయిన దంచు పొలమున
కాచికొని యుండెదవు కాపూ !
లేచి రా వేమోయి ముందుగ ! —బాబు

దేశకల్యాణంబు నీలో
పేశలంబై యున్న దట, నీ
కోసమే లండనకు తా నీ
వేసమున పోయినా డటే, —బాబు

మ్రోడుబారిన నిఖిలలోకాల్
జోడుకోదెలతోడ బెరిగిన
నీదు నరచే యధివసించి
సుధాదిర్ఘురులకు జీవ మిడు నట" —బాబు

మండుటెండల నిప్పుకలలో
దండి పడమటి శాంబరములను
క్రాగిపోవుచు యాగిపోవుచు
జోగి వైస మనుభోగి వీ వట" —బాబు

సంయుక్తపలుకులు :—

మూగెను శత్రుసైన్యములు, ముప్పు ఘటిల్లును గట్టికోటకున్,
వేగమె యడ్డుకోవలయు, వేఱు యుపాయము లేదు, సేవలన్
త్యాగము జేసి క్షాత్రయుత పౌరుషదీప్తి వెలుంగ పోరు మో
యీ గగనంబునన్ కుసుమవృష్టి సురల్ గురియన్ ముదంబుతో.

పగను సాధింపనెంచి యీ పందతోడ
నరుగుదెంచెను మా తండ్రి యల్లు డన్న
మాట మఱచి నీమీదకు, గోట మీటు
మయ్యు! మామగా రనియెడు భయము వలదు.
అబలపలుకు లివి యని యనాదరమ్ము
సేయు దేమొ? శౌర్యంబు నన్ బాయలేదు;
శూర పృథ్వీరాజపతికి దార నౌట
మానినీమణి, రసకాంత మఱచి తేమొ?
సత్య మేప్రక్క, నాప్రక్క జయము ధ్రువము,
లెమ్ము - చింతింప బని లేదు ప్రియుడ! నీకు
దేశసంరక్షణమే మీకు స్థిరవ్రతమ్ము
పచ్చినెత్తురు నీ ఖడ్గపాయసమ్ము,

మామూలుమాటలలో వీరరసస్ఫూర్తి తేవలయు నని చేసిన ప్రయత్నము కానబడుచున్నది.

'ఖడ్గపాయసము' అనుచో, 'కత్తిపాయసము' అని యుండవలెను 'భయము వలదు' అనుచో యతిభంగము కల్గినది. ఒక్కింత శ్రద్ధ వహించిన నిట్టివి పొసగకుండ గలవు.

సంయుక్తనిర్వేదము.

సైన్యము సన్నగిల్లె, రణసాధనసంపద యట్టిపోయె, రా
జన్యకుమారరత్నము వశంవదు డయ్యె, నశించె దుర్గముల్,
దైన్యము హెచ్చె, శాత్రవులదాడి కలంచుచునుండె, దస్సితిన్,
అన్యము గోచరింపదు, మహాత్మ! లలాటము నేమి వ్రాసితో?

ప్రాణనాధుని శత్రులు పరిభవించి
దిట్టతనమున నేడు బంధించియుండ,
చివికి సంయుక్త సంధికి సిద్ధపడునె ?
...　　...　　...
సమరరంగమున కురికి శాత్రువులను
లేడిపిల్లలవలె కబళించివైతు;
చేవ దరిగిన వెంటనే జీవములను
వీరబలివేదికకు సమర్పించివైతు.

ఇట్లు వీరు తమ కలమునకు జాతీయవిషయములను వస్తువుగా దీసికొని రచించిరి

---

# 89. శ్రీమతి చర్ల సుశీలాదేవిగారు

'పసులకాపరిబాలిక' అను రెండు మకుటములలో వీరు నాగరక జీవనము కంటె, యౌవనలంపటజీవితముకంటె, పల్లెజీవితము, అమాయిక ముగ్ధజీవితము ధన్యమైన దనుచున్నారు.

మలయశైలశీతల మందమారుతములు
సౌరభంబుల జల్లెడు సమయమందు,
ప్రకృతినర్తకి నాట్యముల్ పఱపుతరిని,
పాటపాడుచు దుమ్మెదల్ వరలువేళ,
చిలుకలును ముద్దుపలుకులు పలుకువేళ,
లలితశాఖలు వంగి సలాము సేయ.
పసులకాపరి తనముందు పశువు లెల్ల
మేయుచుండగా, నొక చెట్టుచాయయందు
బట్ట బఱచి హాయిగా నట బండుకొనియు,
వచ్చి రాని పదంబుల పాడుకొనుచు,

కోయి కోయను కోయిలకూతలకును
దిరిగి కో యని కూయుచు, దేపదేప
నవ్వుకొనుచు, మదిని మహానందమందు,
పసులకాపరిదే భువి పరమసుఖము.

వీరి 'బాలిక' బాగున్నది.

మోహాంధతమసాన బుధు లేల బడెదరో
నా నొకయప్పుడు నవ్వుచుందు,
వీ మాయసంవృతి నే గూడ బడవలె
నేమొ నా నొక పరి నేడ్చుచుందు.
వే చింతయును లేక యెలమితోడుత నుంటి
నన నొక్క మా రాడుచుందు,
వమలతత్వము గాంతు నను నట్లొకపరి గ
న్నర మోడ్చి పరవశ వగుచునుందు

వహహ! నీ చిద్విలాసము నరయదగును;
నింతలో నవ్వు, లంతలో నేడ్పు, లంత
లోన నాటలు, నంతలో మౌనవృత్తి
నందుచుందు బాలిక! ధన్య వనగ నీవె!

ఈ స్వభావోక్త్యనుప్రాణిత ఉత్ప్రేక్ష చక్కగా నుండలేదా?

---

# 90. శ్రీమతి రాజేశ్వరిగారు

ఇంటిపేరు సహితము తెలియని వీ రెవరో కాని, వీరి లేఖిని వర్ణించిన విషయ మేదైన కానిండు-అది రసప్రపూర్ణముగ నుండును.

— వీరి లవణసాగరమథనము —

ఆ సబర్మతీతీర ఋష్యాశ్రమంబు
బయలు వెడలిన సత్యతపస్వివెంట
పరువులిడినది సకలప్రపంచదృష్టి
ఏ ప్రళయవహ్ని పుట్టునో యేమొ యనుచు;
దారిపొడవున శాంతిస్వతంత్రసమర
జైత్రయాత్రా పురోగామి చరణసరణి
ధన్య మైనట్టి ధూళి నొదల ధరించి
పొంగిపోయెను భూదేవి నింగిదాక,

ఇందలి కల్పనారామణీయకమును, యెత్తుగడలోని బింకమును చదువరులు గుర్తించి యుందురు.

ఎక్కడి దండీతీరం ?
ఔక్కడి శాంత్యాశ్రమంబు ! ఈక్రోశశతం
బెక్కరణిని నడుచనో యీ
ముక్కాళుల ముసలి ? యనిరి ముగ్ధప్రజలున్"

విశ్వసౌభ్రాతృత్వ విద్యోదమానాను
రాగగీతమె మంధరాగ మయ్యె,
శాంతి సామ్రాజ్యానుశాసక నిష్కామ
భూషణమ్మె యాది శేషు వయ్యె,
ఒకవంక పశుబలం, బొకట సాత్త్విక నిరో
ధంబు దానవ దైవతంబు లయ్యె,
శాస్త్రప్రయోగావలంబన స్రవదుష్ణ
రక్తకుల్యలె హాలాహాలము లయ్యె,

లవణ సాగర మథన వేలాప్రభూత
దర్శనాతీర సర్వస్వతంత్ర భార
తీయ రాజ్యేందిరయె రమాదేవి యయ్యె,
మోహినీమూర్తియై మహాత్ముండు వెలసె,

అని లవణసత్యాగ్రహోద్యమమును క్షీరసాగరమథనముతో బోలి చక్కగా వర్ణించిరి. కాని, తుదియందీ పాదము కూడా చేర్చిన వర్ణనము పూర్తియై యుండెడిది.

"అందు పొడమిన లవణమే అమృత మయ్యె" ననునది.

వీరి శ్రావణపూజలోని యీ పద్యముం జూడుడు:—

ఇరుగమ్మ కెంత యదృష్టమో ? పెనిమిటి
కొనిపెట్టె బంగారుగొలుసుల జత,
పొరుగమ్మ దెంతటి పుణ్యమో ? మువ్వల
యొడ్డాణమును కొని యుంచె భర్త,
ఎదురింటి సీతమ్మవదినె ప్లీడరు గుమా
స్తాభార్య నాను ముస్తాబు నొందె,
నందాక యేల- వయసు మీరినది మా
మేనత్త కాసులపేరు కొనెను,

దిగదుడుపురీతి నా కెట్లొ తెగువచేసి
కాసు కొనివారు, చాలు- సేబా సటంచు,
దిగులు నొందకు భర్తపై మగువ! గేహ
లక్ష్మి కిడు కాంత యొక యనురక్తియె సుమి !

చాలు! వీరి శిల్పసౌందర్యము నొత్తి ఋజువు పల్కుట కివి చాలు !

---

# 91. శ్రీమతి తులసీలతణగారు

## పిచ్చి కల్లాలు

తళుపివెన్నెల పచ్చికెరటాల లేచి పొం
గులువారు పాలబుగ్గలను నులిమి,

బంగారుపోత నిబ్బర మూని మెరయు గుం
  డ్రని చిట్టిచేతు లల్లన గ్రహించి,
మెలమెల్ల దప్పుటడ్గులు వేయగా దీసి,
  వ్యత్యస్తసాహాలవంక జూచి,
చిరుబొజ్జమీదుగా జేర్చి చేతులు ప్రేమ
  మోముపై కెత్తి దొబూచు లాడి,
చంక నిడికొని మనసార చౌకళించి,
శిరము మూర్కొని కన్నుల జేర్చికొనుచు,
నన్ను లాలించినట్టి నన్గన్న తల్లి
పిచ్చికల్లాలు మా యమ్మ పిలిచికొందు"

పసిబాల బాల్యచేష్టలను వ్యక్తపఱచుటకై వీరు గైకొన్న పదసంచయము మనోహరమై యున్నది.

---

# 92. శ్రీమతి కర్లపాలెం రాజ్యలక్ష్మిగారు

కొండవీడు.

రమణీయముగ నుండు రాజమందిరములు
  శిథిలమై గూబల చేరదీసె,
ఉరుపుష్పఫలశోభి తోద్యానవనములు
  సర్పరాజముల కాశ్రయము లయ్యె,
స్త్రీలు జలకమాడ శృంగారసరసుల
  జ్వరదాయకం బగు జలము నిండె,
సైన్యసంతతి నివాసంబయి యలరారు
  బురుజులు గబ్బిలంబులను జేర్చె,
కోటవాకిళ్లు శిథిలమై కూలిపోయె,
అశ్వగజశాల లన్నియు నడిగిపోయె;
ఔర ! విధివశమున కసాధ్యంబు గలదె!

## 93. శ్రీమతి ఆదూరి లీలావతీదేవిగారు

### నిరీక్షణ

"బాల బాలగులాబీల పూలమీద
రాలి పడియున్న తుహినంపు రాసులవలె.
చెక్కిళులపయి చిందు నా స్వేదబిందు
పటలి పథపథికులకు గన్పట్టుచుండు."

"ఆపెచూపు లేరికొఱకొ ? అందులోని
భావ మేదొ, యేరి కెఱుక ? పూవుపూవు
ను విడదీసి రేకు లొలిచి పనవి పనవి,
పై కెగయు సంజపై దృష్టి బఱపె నపుడు."

"అలికి దేదేని వినిపించినంత, తనదు
సోలిపోయినట్టి సొలపుచూపు లెల్ల
నల్దెసలను సారించి కనలుచు రూక్ష
వీక్షణముల నిలుపు నిరీక్ష లెవరికొఱకొ ?"

"సలిపి సలిపియు విసికి వేసారి కడకు
సద్దులే వినబడని యా సంజయందు
కుమిలి కుమిలియు తనలోనె క్రుంగిపోయి
నడచె నింటికి నడుగులు తడబడంగ
దాం యొక్కతె రాగార్ద్రభావ మూని."

భావము సుగమ మయిన యిది యొక యాధునిక కవిత.

---

# 94. శ్రీమతి సామవేదము సీతారామమ్మగారు

జానకీనిర్వేదము - భిక్షువు.

ఖండకావ్యములు వ్రాయుటలో శ్రీ సీతారామమ్మగారొకరు సిద్ధహస్తలుగ గృహలక్ష్మియం దగపడుచున్నారు.

వీరి జానకి నిర్వేదము :—

''పిడుగటు లీ యుదంతము చెవింబడినంతనె, నాదు ప్రాణముల్
విడివడిపోవ వేలనొ ! ద్రవించెదు నీ మన మెల్ల నాకు నై
సుడివడి స్రుక్కియింత దయ జూపగ లేక రఘూత్తముండు నా
నడవడి దోషయుక్త మనెనా ? అనలుం డెఱుగండొ ? లక్ష్మణా.

ఏ యనురూపదంపతుల నే భవమం దెడబాపియుంటినో?
ఈ యడవిం దపించి కృశియింపగ నిట్లు దయాసముద్రు డ
న్యాయపు వాదు నమ్మి కడు నా కొనగూరిచెనెగ్గు, నైన దా
నే యిటు లుండ, లోక మది నేర్చునె యొంకొకరీతి పల్కగన్.

తలలో నాలుకవోలె నుండి, తన సంతాపాగ్ని మత్ప్రేమవా
గ్జల సందోహముచేత నార్చుచు నజస్ర మ్మెక్కుడౌ భక్తితో
సలుపంగ లేదొకో సేవలన్ వనములో ? సంతోషియై ప్రేమవా
క్కుల దా బల్కగ లేదొ? కూరిమిని నాకుం గూర్చడో ? లక్ష్మణా!

ఇంతే కాక, 'భిక్షువు' అను మకుటమున వీ రొక ఆదర్శమగు సంభాషణను వినిపించిరి:—

గృ — చింపికంబళి పైన గప్పుకు
చిరుగుబట్టల గట్టి వణకుచు,
వంక రగు కఱ్ఱొకటి బుచ్చుకు,
వచ్చినా దండీ ముదుసలి-వచ్చినా దండీ

భి — ఎండ మలమల మాడ్చుచుండెను,
రెండుఝాములవేళ బాబూ!
తిండి తిని నా ల్గాయె నేటికి,
దండ-మిదు డొక్కింత కబళం.

గృ — ఏదియు గానివేళ నిపు డేటికి వచ్చితి విట్లు? భోజనం
బా? దయసేయు మింక పలుభంగుల జెప్పకు, వారియిండ్ల కా
మీదుగ నేగ రాదె: పది మీరిన భోజన ముండునే? వృథా
నీ దయ నీ యయుక్తు లిట-నేగుము వచ్చినత్రోవ శీఘ్రమే.

భి — మేడలును మిద్దెలును గలిగిన
మేటిదొర లీరీతి బలికిన,
కూడు దొరకునే? దండ మయ్యా!
కోపపడకండో.

గృ — చెప్పినమాట నీ మదికి జేటుగ దోచెనె: మా గృహంబులో
నప్పుడె యెల్లరుం దినుట నన్నము లేదు? నిజమ్ము-నీకు నై
యిప్పుడు వండనేర, మిక నెచ్చటికేని జనంగ మేలు, నీ
విప్పగిదిన్ వచింప ఫల మింతయు లేదు, వృథాప్రయాసముల్.

భి — మేడ లున్నా ఫలము లేదు.
మిద్దె లున్నా ఫలము లేదు,
కూడవచ్చే పుణ్యమును గడు
కూడబెట్టుము నీవు జీవా!

గృ:— చాలుం జాలును-కట్టిపెట్టు మిక నీ చాతుర్యముల్, పూరకే
యేలా యిట్టులు బిట్టుగా నరచెదొ? ఈవేళ బస్తుండినన్
పోలే దీ కఠినంపు బ్రాణము, యశంబో ద్రవ్యమో యన్నవా
రేలో చత్తురు శీఘ్రమే? మఱి యిదేమో మీకు దీర్ఘాయువుల్?

... ... ... ... ...

ఇంకా ఇట్లు కొంత సాగిన దనుకొనుడు గ్రంథము. ఇందు నిత్యము సామాన్యముగా ప్రతియింటను జరుగు సంభాషణ మెంత స్వభావోక్తిగా గూర్పబడి చిత్రింపబడినదో చూడుడు.

---

# 95. శ్రీమతి బెల్లంకొండ కనకమ్మగారు

వీరు తమ ఆంజనేయస్తుతి ద్వారా మానవులు నేర్చుకో దగిన ఆదర్శములు చూపుచున్నారు.

తన రాజ్యమును వీడి పనుల పాలై పోవు
        భానుజు సహచారి వైననాడు,
దశరథసూనుండు తలయూచి మెచ్చంగ
        అంచితరీతి భాషించునాడు,
ధరణిజాన్వేషణార్థము సముద్రము దాటి
        చిటికెలోపల లంక జేరునాడు,
రామానుజ ప్రాణరక్షణోద్యోగివై
        తెగువమై నొకకొండ తెచ్చునాడు,

స్వామిభక్తియు, సభ్యసంభాషణమ్ము,
అన్యదుర్లభ మగు ప్రతాపాతిశయము,
సతత పరహితజీవితము నాగ
నేమొ ప్రకటించితివి మాకు స్వామి! నీవు.

---

# 96. శ్రీమతి మానికొండ అలమేలుమంగ తాయారమ్మగారు

గీతికా మౌక్తికహారము.

"హృదయ మవియంగ ప్రేముడి నెన్ని మార్లొ
పిలిచినది ప్రేమభిక్షకై ప్రియుడ! సుంత
పలికినను నోటిముత్యాలు ఒలుకు నోయి?
పూజ సేసిన నా భావపుష్పసమితి.

విరస మగుచుండె నీ పాదసరసిజముల
అమృతమయ దృష్టి నలరింప వైతి వేల?
మేళవించితి ననురాగలీల నాదు
హృద్విపంచి ఉపేక్షచే ప్రిదులగలదు.

ప్రణయగీతమ్ము వాయింపరాదె నాథ!
కాంతు గదిసిన యీ ఉషఃకాంత నొసట
ప్రొద్దుపొడిచెను, వెలవెల బోతి నేను,
అర్ఘ్యమును గొంట కేనియు నవధి లేదె?"

ఇట్టివి కొన్ని భావగీతములశ్రేణికి చేరదగినవిగా నున్నవి.

---

# 97. శ్రీమతి దోసపాటి సీతారామమ్మగారు

— ఆంధ్రమాత —

గోదావరీ కృష్ణ పాదోదకముల
  ద్రావించి పెంచె నే రాజమాత,
సంపూర్ణ సస్యప్రశస్త్యము లిడి బ్రోచి
  మన్నించి మనిచె నే మహితజనని,
తరులతా గుల్మకంద వనౌషధములచే
  ఘనబల ధాత్రియే కన్నతల్లి,
పరమపతివ్రతా భవ్యచారిత్రల
  గని కీర్తి వెలసె నే కర్మభూమి,

కవిజనంబుల పాలిటి కల్పకంబు,
పరమసౌభాగ్యముల కేది పట్టుగొమ్మ,
అమ్మహాతల్లి రూపంబు నాత్మ దలచి
ఆంధ్రమాతకు వందన మాచరింతు.

—:※:—

# 98. శ్రీమతి నుదురుపాటి శేషమ్మగారు

వృషభరాజు (Bull) అనే ఆంగ్లరచన కనువాదము.

వీరి యీ కావ్యము అంతయు ముత్యాలసరములలో చాలా దీర్ఘముగా ఉన్నది. మచ్చునకు రెండు మాత్ర మిచ్చుట ఉదాహరింతును.

''అడవిమెకముల నదరజేసెడు
నట్టి క్రోల్పులి యైన తనతో

పోరి రెండవసారి పొంతను
పోమి కల గాంచెన్.

... ... ... ... ...

"నిదుర మేల్కని తత్క్షణమ స్వా
ప్నికము తన గోసార్వభౌమత
తెలిసికొని యా ముసలివృషపతి

''ఆధిపత్యం బెంత కలిగిన,
నంగపటుత్వం బెంత మెఱసిన
వార్ధకమున జీవి కుత్తల
పాటు తప్పదిలఁ"

---

# 99. శ్రీమతి నల్లూరి రత్నమాంబ

నా జన్మ భూమి.

నిష్ఠుర నిస్తంద్ర నీహార నిష్యంద
ధారాకలిత హిమధరముతోడ
స్వాంతసమ్మదవారి పరిపూర్ణవిభ్రాజి
త వితత కాసారతతులతోడ
సౌరభ నిర్భర శతపత్రసంఘాత
సంయుతోరుధునీ ప్రచయముతోడ
నానా తరులతా వితాన సముద్యోత
సాంద్ర విపుల వనీచయముతోడ

లలిత ధావళ్య కౌముదీవ్రజము నెమ్మి
త్రస్తరించెడు ధవళ సౌధములతోడ

మించి యేపును గాంచి రహించి ధరణి
సరవి ఔలువారు సతము నా జన్మభూమి.

సంస్కృతమయ మగు నాంధ్రోక్తిచాతుర్యముతో జన్మభూమిని వీ రిట్లు ప్రస్తుతించిరి.

---

## 100. శ్రీమతి ఎ. కోమలమ్మగారు

— సంప్రార్థనము —

"భారతి తావక మృదుపదపంకజ సంతతచింతనరతి మమలాం
క్రూరతరారి సమూహనిషూదన సముచితబలయుతధృతి మమలాం
తావక జయజయ గీతాగానే కర్ణమనోహర కంఠరవమ్
మోహక కవితాలింగిత పటుతర కోమలతర వాణీవిభవమ్
తావకబంధనతోడన శక్తిమ్ త్వత్ప్రీతిత్వస్థాపన యుక్తిమ్
కరుణా మంజుల సంతతవత్సల యాచే సవినయం"

కేవల గీర్వాణవాక్కులతో వీరు భారతీస్తోత్రము చేసియున్నారు.

---

## 101. శ్రీమతి కొల్లూరి గౌరీదేవిగారు

సౌదామని.

"ఈ యనంత గాఢాంధకారాయతాభ్ర
పథమునందున ఫెళఫెళార్భటులతోడి

జలదసంచయమందున సాగి యొంటి
నెచటి కేగెదొ? సౌదామనీ! వచింపు.

అతిమనోజ్ఞ నక్షత్ర నీలాభ్రవీధి
హర్ష దానందములతో విహారమాడు
ప్రావృడభ్రపయోధరస్వామి! వలచి
తిరుగుచుంటివ యీరీతి దిశల నెల్ల?"

"క్రేళ్ళురుకు మృగచందంబు గేళి సేసి
వెడలుచుండెడి రసపుత్రవీరు వోలె
నేగుచున్నావు నీ కంత వేగ మేల?''

వీరి యూహాపథము రమణీయముగ నున్నది.

---

# 102. శ్రీమతి చర్ల నగరాజకుమారిగారు

బొబ్బిలి బెబ్బులి.

"అరరే! ఎంతటి ఘోరకృత్యె! మపురా! ఆంధ్రావనిఁ జేసినా
రరిభూనాథులు, వీరబొబ్బిలికి? కట్టా యెంత కష్టంబు?
స్ఫురదభ్రంకష బాహువిక్రమలసచ్ఛూరుఁ మహావీరు, భా
స్వరతేజఃపదవీనిధాను నను పాపారాయు నూహింపరే?

''దరి లేనట్టి తరిన్ గ్రహించి, దయయున్ దాక్షిణ్యమున్ వీడి, ని
ర్భరక్రోధాగ్ని వెలార్చి గాల్చితిరి, పాపం బంచు పుణ్యం బటం
చు రవంతేనియు నెంచకుండ మనమందున్, శత్రురాడ్గర్వభా
స్వర క్రోధాగ్ని విదగ్ధమాను డగు పాపారాయు డొప్పారగన్.

ప్రళయకాలాగ్ని చెలగి నిర్భయముతోడ
ప్రజ్వలించిన, ఎదు రుండువార లెవరు?
ఈ వెలమ కేసరీంద్రము తావకీన
రుధిరధారలు గ్రోలక వదలు నొక్కొ?

"శత్రుమారణోత్సాహ ప్రజ్వలిత క్రోధ
పూరితాగ్ని చ్ఛటలతోడ బొబ్బిలి పులి
వచ్చుచున్న ది దే, రండు పౌరుషంబు
లున్నచో, కాచుకొం డిక నోటువడక.

గమనించితిరా- శౌర్యరసము క్రక్కుదలు ధారావిశేషము! "అరరే ఎంతటి —" అను శార్దూలవిక్రీడితపు ఎత్తుగడలోనే బొబ్బిలి బెబ్బులి వీరవిహార విస్ఫూర్తివి విడంబించినది. ఎత్తినది మొదలు తుదిదాకునంతవఱకు ఒకటే ధార. వీ రిట్టి నిర్వహణముతోడనే 'బొబ్బిలి' యంతయు రచించిరో యేమో తెలియ కున్నది. అంతయు రచించియుండిన బాగుగ నుండి, అనంతమ్మగారి కావ్యముల వలెనే ఆవేశపూరితమై యుండియుండును.

---

# 103. శ్రీమతి అయ్యదేవరబాలాత్రిపుర సుందరమ్మగారు

టీచర్సు ట్రైనింగుగూర్చి హాస్యరసముగ వ్రాసిన ఈ పద్యములు బాగుగా ఉన్నవి.

"బాబూ బ్రదికితిమి"

ఏ ఖ్యాచి నడుగునో, యెవరినో, యను భీతి
గొలుపు క్రిటిసిజముల్ తొలగిపోయె,

వ్రాసినదానినే రామకోటిగ వ్రాయు
      నబ్జురువేషను లంతరించె,
పాడిన పాటనే పాడించు నీ నోట్సు
      ఆపు లెసన్సుల హంగు లుడిగె.
తలపని తలపుగా తగిలెడు టీచింగు
      వర్కు బాధలు కూడ ప్రాతపడియె,

వేళపాళలు లేని డ్రిల్ వెనుకబడియె,
గడిచె డాక్టరు సర్టిఫికట్ల బాధ.
బ్రదికితిమి జీవుడా! శాంతపడగదోయి!
గడచిపోయెను ట్రైనింగుగండ మహహ!"

"ఎలుకను దెచ్చి 'పిల్లి యిది, యీనడుమన్ విధి మూడుకాళ్ళపి
ల్లుల సృజియించె' నన్న, దలలుం గదలించుట తీరె, మా మనం
బులకు యథేచ్ఛ గల్గె, ప్రతిపుస్తక మొక్కొక దేవు డన్న రో
జులు గతియించె, నింక పరిశుభ్రపు నోగిర మబ్బు జీవుడా!"

దొరగారితో మాట జరుగురకై చేయు
ముస్తాబులనుజూడ బోము ముందు,
పూర్తిగా స్టైపెండు ముట్టునో ముట్టదో,
యను తొట్రుపాటుల నరయబోము,
...   ...   ....

      ...   ...   ...
చిత్రలేఖన దీక్షయు చెల్లె, గాన
      బ్రదుకు జీవుడ! తీరె నవస్థ లెల్ల.

"చిత్రి, యులియును, అంపంబు చేత బట్టి,
చెక్కుచున్నట్లు నటియించు చేష్టితములు
నిన్నియును గూడ నేటితో సున్న యయ్యె,
జీవుడా! భీతి లే, దింక చింత యుడుగు"

ట్రైనింగు సమయమున, జరుగు నాటకము లన్నిటిని గుది గ్రుచ్చి యిట్లే యీమె యింకను హాస్యముగను, సహజముగను వ్రాసిరి. ఈమె యేది వ్రాసినను నిట్లే హాస్యమయముగ నుండును.

---

# 104. శ్రీమతి వింజమూరి సీతాదేవిగారు

"పంజరమునుండి."

"యుగయుగమ్ములనుండి నే నుంటి నిచట,
నీలియాకసము పిలుచు నేమొ నన్ను?
ఈ దినము బంధములు లేవు, ఇపుడె తలుపు
తెఱచి రెవ్వరో విడుదల తెచ్చినారు."

"అరుణరాగాన పూర్వాద్రియందు స్వేచ్ఛ
కొలువు తీర్చు ప్రొద్దున వియత్తలములోన
కెగిరిపోయితి గాని, యీ గగనపథము
దూరమై తోచె, స్వేచ్ఛయే భార మయ్యె,
తరతరముల దాస్యమ్ముపై బరువు దోచు,
స్వేచ్ఛ నీ హృదయమ్ము మోసికొనలేదు."

హిందూదేశీయులకు గాని, స్త్రీజనులకు గాని చిరంతన పారతంత్ర్య మెన్నడైన బాసిపోయి స్వాతంత్ర్యము వచ్చినను, అలవాటులేని యీపాసనముగ నది వారికి వెగటుగనే తోచు నని యీ శ్రీమతి వ్యక్తీకరించిన భావము స్వభావోచితముగ నున్నది.

---

# 105. శ్రీమతి పట్టికొండ విశాలాక్షిగారు

"అభ్యుదయ గీతాలు"

గృహలక్ష్మిలో బాగుగా ప్రఖ్యాతి గన్నవి. అందుండికొన్ని శీర్షిక లుదహరించెదను. 'జలదమా!' —

చుక్కల్లో చంద్రుండు
చూచుచుండగనె,
మాయమై పోయెను,
మబ్బుతున్కలో నెపుడొ,
ఈ చిన్ని వెన్నెలలో
ఏ పూలతావియో
మెయి సోకినంతనె
మేనెల్ల మఱచితిని.
పండు రేయెండలో
సెందు హృదయమ్ముతో
క్రైత నల్లెడు కవులు
కరగి నీరై పోరె?
చందమామా! రావె!
జాబిల్లి! రావె! యని
పసిపాప నాడించు
పడతు లే మైరొ కద?
చిట్టిపాప యెంత
చిందులు ద్రొక్కునో?
కవు లెంతగా నిన్ను
కతినోక్తు లాడుదురొ?
తొలగిపో జలదమా!
తొలగిపో, తొలగిపో!
తొలగిపోవుదు వేని,
కలయట్లు జగమెల్ల
పండువెన్నెలలోన
పరవశం బౌను గా.

"భృంగమా" అను గేయాలు చూడండి :—

ఈ కలువపూవులో
ఈవు ఝుంకారిస్తు,
ఆ కలువపూవులో
ఆపె ఝుంకారిస్తు,
ఏమి చేయుచునుంటిరే!
భృంగమా!
ఏమి చేయుచునుంటిరే!
రమణీయ మైన ఆ
రామవాటికలోన
గుంపు గుంపులు గూడి
సొంపుగా గూర్చుండి
ఏల చూచుచునుంటివే?
భృంగమా!

ఏల చూచుచునుంటివె?
అస్ఫుటిత కుసుమాళి
నందముగ కూర్చుండి,
పరిమళం బింతేని
పరవశము గాకుండ
కాపు కాయుచు నుంటివే?
భృంగమా!
కాపు కాయుచు నుంటివే?
కలువరేకులలోని
కమ్మతావులు చిమ్మ
మధురాసవాస్వాద
మత్తచిత్తమ్ముతో
ఝుంకార మొనరింతువా?
భృంగమా!
ఝుంకార మొనరింతువా?

భవదీయ మృదుగాన
పారవశ్యమ్ములో
ఉన్నంత సేపు నా
కొక్క విషయం బేని
జ్ఞప్తికైనను రాదుగా॥
భృంగమా॥
జ్ఞప్తికైనను రాదుగా.
సద్భావసౌధాళి
శాంతచేతస్కులై
కల్పనాప్రతిభమై
కైత నల్లెడు కవుల
కామోదమును గూర్తువా
భృంగమా!
ఆమోదమును గూర్తువా?

వ్యంగ్యధోరణిలో రచించిన ఈ "భృంగమా" అను శీర్షికను గేయములు బాగున్నవి.

"స్వాగతము" అను శీర్షికలోని భావప్రకర్ష ఇంకా ఉదాత్తముగా నున్నది.

కవిగేయములే వినుచు,
కవిపద్దెములే వినుచు,
కవిజీవితేశ్వరిగ
కలకాల ముండుచు,
కవయిత్రిమాటయే మఱచావా?
కవికవుంగిలి లీన మైనావా?
స్త్రీ వయ్యునున్ మాదు
చెంతకే రాకుండ

అచటనే వసియింప దలచావా॥
స్త్రీకులోద్ధరణ కైనను రావా?
స్త్రీ లన్న అభిమానమే లేదా?
... ... ...
వేగమే రావమ్మ ఓ కవితా!
స్వాగతం బిస్తాము మృదుకవితా!
నీరాజనం బిదుగొ ఓ కవితా!
నిన్నె పూజిస్తాము ఓ కవితా?

నిజముగా సరస్వతి కిట్టి స్వాగతము కాంత లందఱు నీయ వలసినదే. ఇచ్చి ననే కాని, సరస్వతి వీరి యిలువేల్పు కా దేమో? భావగౌరవమున కెంత వెల యైన నియ్యవచ్చును. ఈశ్రేణి పద్యములు శ్రీ కొత్తపల్లి లలితగారి సమీక్షయందు వివరించిన కవిత్వశ్రేణికి చెందినవి. శ్రీమతి విశాలక్షమ్మగా రిట్టి వెన్నో రచించిరి

---

# 106. శ్రీమతి జయంతి లక్ష్మీమంగతాయిఁగారు

వీ రొకరు ఇట్టి అభ్యుదయ కవిత్వమును వెలయించినవారుగా నున్నారు. వారి 'అభ్యుదయము' అను శీర్షికను చూడుడు:—

అందు "ప్రకృతిభాగ్యం. ప్రణయప్రభావం" అను పాదాలలో—

చిరుకలివెలుగుల-
దినపతిబింబం
తూరుపుదెసనే
పొడిచింది-
వెలివెలిచీకటి
చిటికలోననే
ప్రొద్దువెలుగులో
కరిగింది-
మానిని కోరే
మానవలోకం
నీతిహీనతలో
సమసింది-
మహిళలు వలచే
మాన్యప్రపంచం

మహామహిమనే
లేచింది-
ప్రకృతిభాగ్యం
ప్రణయప్రభావం
తెలుసుకు తెలిపే
భావౌన్నత్యత
పైపై రంగుల
వర్ణన చేసే
ప్రాతజబ్బు లీ
క్రొత్తసొబగులో
నవకవులారా!
యువనటులారా!
నవ్యమహోదయ
పాంచజన్యమున.

సుస్వరశ్రుతిలో
భావగీతికలు
పాడండి-
ప్రణయనాటికను
ఆడండి-
... ... ...
భావగీతికల
హృద్యారావములు,
ప్రణయనాటికల

లాస్యభాగములు
పాంచజన్యపూ
పంచమస్వరమూ
విశ్వం నిండాలి.
దెసలను దాగొను
వేలుపుపెద్దలు
ఎదుటికి
రావాలి.

---

# 107. శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

వీరు తణుకువాస్తవ్యులు. అచట మహిళాసమాజ మొకటి పెట్టి స్త్రీజనసేవ చేయుచున్నారు, అపుడపుడు జాతీయసమస్యలపై వ్రాసిన వారి పద్యములు గృహలక్ష్మి యందు కనబడుచున్నవి. వీరు ప్రసిద్ధ కాంగ్రెసుభక్తులు.

స్వేదుకన్యను గూర్చి:—

ఎక్కడి యాంగ్లదేశ మిది, యెక్కడి భారతదేశ ? మద్దిరా !
ఇక్కడి కేగుదెంచి, యిటు లెంతయు దీక్షను మాదు ముక్తికై
తక్కక రాత్రియుం బవలు తల్లిరో! స్లేడురో! పాటునొందు, నీ
ఎక్కువ యైన ఈ ఋణము నేగతి నీగెద మమ్మ యిమ్మహిన్?

మృగతృష్ణను బోలెడు నా
దగను విలాసమును విడిచి, తల్లీ! స్లేడూ!

నిగమాంతవేది గాంధికి
దగ కూతుర వైతి, వెంత ధన్యవో ధాత్రిన్?

సత్యాగ్రహులకు ;—

రథచోదితుం డౌచు రాజిల్లు కేశవున్
మఱపించు శ్రీ గాంధి మహిమ దలచి,
వ్యసనసప్తక మాచి పరగెడు ధర్మజు
మఱపించు నా పటేల్ మహిమ దలచి
సురరాజు సుతునిదౌ సుప్రభావంబును
మఱపించు జవ్హారు మహిమ దలచి,
వాయుపుత్రికు పేరవరు భీమసేనుని
మఱపించు నా సుభాష్ మహిమ దలచి,

సేను, అన్సారి ప్రభృతుల చేవ నెంచి,
యుద్ధవిశ్రాంతి గైకొనియుండు దయ్య!
మఱల రాగల సంగ్రామ మహిత విజయ
లక్ష్మికరగ్రహమ కొఱకు లక్ష్య మెంచి...

ఇంకొకప్పుడు సత్యాగ్రహులకు చేసిన "ప్రబోధము" గాంచుడు:—

కను డా మాలల దుఃఖనిస్వనములన్ కారుణ్య మేపారగా
ననుతాపాశ్రుకణ ప్రవాహమున తానంబాడి, జాతీయ సే
వన దీక్షారతి బూని, భారతము గాపాడంగ త్యాగవ్రతం
బున నాత్మాంజలి మాతృచరణాంభోజంబు పై నంటుచున్
వెనుకం జూడక రండు-లెండు-తెగువన్ వేవేగ నారీమణుల్॥

దాస్యాంధకారము తరిమివేయుటకు నై
ఖద్దరు దీక్షతో గట్ట రమ్మ!
గద్గదస్వరముతో కడు దుఃఖ మందెడు
పంచమసుతుల పాలించ రమ్మ!

ఆత్మనాశ మొనర్చునట్టి త్రాగుడు మాన్పి
దేశవస్తుల దీక్ష దెల్ప రమ్మ!
మన భాష, మన జాతి, మన దేశ మభివృద్ధి
నెనయు మార్గముల నూహింప రమ్మ!

మనము పూర్ణస్వతంత్రత గనెడువఱకు
తీరబో దమ్మ మన పని తెరవలార!

మాతృ సేవాపరాయణ మహిత దివ్య
కంకణము దాల్చి రా రమ్మ గరితలార!॥

ఇట్లే వీరు సత్యాగ్రహోద్యమ సమయమున స్త్రీల ననేక విధముల ప్రబో
ధించియుండిరి.

---

# 107. శ్రీమతి పోతాప్రగడ రాజ్యరత్నమ్మగారు

సమతను వెంట నంటు నల చంద్రుని ధాటికి నోర్వలేక, దా
గమలిన మోము వాంచి, తరుకాండమసన్నిధి నేడ్చుచున్నయా
కమలముఖిన్ గనుంగొనుచు, కామిని గావగజాలకుండుటన్
విమల హిమాంబురూపమున వేదన నొందెడు వృక్షసంతతుల్.

వీరి 'ప్రేమ' యను మకుటమునందలి పద్యములు బాగుగా నున్నవి:—

"రా జయి నేను బుట్ట, సతిరో నీవు భిక్షుకివై జనించినన్,
తాఱుల చిహ్నమై తనరు రమ్యకిరీటము మూల ద్రోచి, వే

రాజుల మన్నన ల్గనుచు రంజిలు నా శిర మంత వంచి, నీ
రాజితపాదపీఠి దగ భృత్యునికై వడి నుందు నెంతయుఁ.

---

## 108. శ్రీమతి లలితాకుమారిగారు

సకలాశావరిదృప్తి సూర్యుని యుషస్సందేశముల్ తెల్పు నీ
యకలంక మ్మగు వేళ మోహనము దివ్యమ్ముఁ సుమీ నేడు వి
శ్వకళాతంత్రుల మీటి భారతయశస్సౌభాగ్యముల్ పాడి, మే
లుకొనం జేయుము నీదు గీతములతో లోకమ్ములఁ సోదరీ!

వీరి 'శ్రావణలక్ష్మి' బాగున్నది:--

మోవిపై దూగు మెరపుల మొలకనగవు,
భుజముపై వ్రాలు మొయిళుల ముద్దుకురులు,
తనువు నిండిన పూల యందంపు సొగసు,
వరల నేతెంచె శ్రావణభాగ్యలక్ష్మి.

కొండయంచుల నాడుకొను నల్లమబ్బుల
మాటున వెల్గు శంపాకుమారి,
పూవుడొంకల నాకుపొత్తిళ్ళనకుమ క్రొం
బసపుల జల్లు సంపంగికన్నె,
కెంపుల దానిమ్మగింజల గొరుకుచు
పిలపిల మని కూయు చిలుకపడుచు,
ఏటిచెంగటి గాలి కెగిరెడి ముంగురుల్
మెల్లన సరిచేయు పల్లెపిల్ల

ఎంతటి అమాయక మనఃప్రవృత్తితోడ
స్వాగత స్నేహగీతముల్ పాడినారా?

బాంధవప్రేమసూచక బాష్పసమితి
వరల నేతెంచె శ్రావణ భాగ్యలక్ష్మి.

బంగారుజలతారు పైట చెంగావియం
చలు గాలితాకున మెలితివడగ,
నీలాలమీద చిన్నెల వన్నియల నింపు
చిన్నారి చూపుఁ జెమ్మగిల్ల,
పగడాలపెదవి గేదగిరేకు సన్నని
మొలకల చిరునవ్వు మురువు సూప,
చిగురాకు మెత్తని చేతుల బంగరు
పంకలగాజులు తళుకు లీన,

లోలకులు చిన్నిచెవుల నుయ్యాల లూగ,
మోమునం గుంకుమపుబొట్టు ముద్దు లొలుక,
నడలు తడబడ, క్రొత్త సందడులు మీర,
వచ్చె వేడ్కఁ మా వదిన శ్రావణముతోడ.

వీథివీథుల ముగ్ధ వీక్షాపరంపరో
న్ముక్త నిస్తులభావ మౌక్తికములు,
బాటబాటల యౌవనాటోప పరిజృంభి
తాధరోష్ఠ దరహాసరుచులు,
పథపథమ్ముల వయఃప్రౌఢకాంతాస్మేర
సహిత వాక్యారావ సముదయములు.
జాడజాడల బాల జలజాననా పాద
కంకణ కింకిణీ క్వణనగతులు,

ఎచట జూచిన కేరింతలే, బెడంగు
నడకలే, క్రొత్తక్రొత్త సందడుల సడులె,
నిండి మా చిన్నిపల్లె నెన్నండు లేని
సంపదల ప్రతిధ్వని జూపె శ్రావణమ్మ.

అవిరత మాంగల్యశోభతో నిత్యకళ్యాణము పచ్చతోరణము ఘటించు నీ శ్రావణశోభను నింకను జాలమంది కవయిత్రులు గానము చేసిరి.

---

# 109. శ్రీమతి తుమ్మల వసంతాదేవిగారు

ఈమె రచించిన శ్రావణకృతి మఱియొక విధముగ నున్నది :—

"వ్రాలు తటిల్లతాతతిని వ్రాలు ననంత సువృష్టిధారలున్
రేలు పవల్ మిగుల రేలుగ జేసెడి యుష్మదీయ మౌ
లీల మహావిచిత్రము బళే! సుమి శ్రావణదివ్యలక్ష్మి...
.. ... ...
మెఱపులె దీప్తమై, స్తనితమే మఱి దివ్యమృదంగవాద్యమై,
పఱచిన శాద్వలమ్ములు తివాసులు గా వెలుగొంద, నందు మై
మఱచి మయూరపాత్రములు మంజుల నాట్యము చేయ, నొప్పు నీ
మురిపెపు శ్రావణ ప్రణయమోహిని .... ...

ఇప్పట్టున శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారి 'వరలక్ష్మి' ని గూడ సేవింతము.

"శ్రావణభాగ్యలక్ష్మి! ఘన స్వాగత మమ్మ దయామయీ! జగ
త్పావని! లోకపాలనవిధానమతిన్ దయచేసినావె! ని
న్నేవిధి నర్చసేయగల ? నీ హృదయస్థితనై యథేచ్ఛగా
సేవల నంది లే నగవుచిందుల దీవన లిచ్చి బ్రోవుమా.

చల్లగా వచ్చి శ్యామల శాద్వలములు
ననలు గొనుచున్నవో ఏమొ, గను మొకింత
వేదివేలుపుకాకల వాడిపోవు
ఆలప్రేగుల దన్ను తీయనిజలాల."

అని పైరు పంటల క్షేమమును జూడవే శ్రావణమా యని ప్రార్థించి యున్నారు శ్రీమతి రాజేశ్వరిగారి "ఇరుగమ్మ కెంత యదృష్టమో" యన్న యుద్బోధ మిదివఱకే ఆలించియున్నారు. ఇంక నెందఱో యిట్లె ఋతుగాన మొనర్చియున్నారు.

---

# 110. శ్రీమతి మీనాక్షిగారు

"ఆంధ్రీ"

శ్రీల వెలసిన తెలుగుతల్లికి
గీర్తి గాంచిన యాంధ్రజననికి
జేరి హారతు లీయగా, వే
గిరము రావే సోదరీ!
పలుకుపలుకున దేనె లొలికెడు
తెలుగుతోటల తీపుతేటలు

వెలికి జిమ్మిన మొల్లసతి వలె
గులికి కూయవె సోదరీ!
సుధలు గురిసిన తెలుగుచాటను
సిరులు విరిసిన తెలుగుతోటను
బుట్టి పెరిగెడు మనకు తె దిక
నెట్టి కొఱతయు సోదరీ!

---

# 111. శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

దే శ సే వి క,

రాతిరి గప్పు హైమపు తెరన్ మరుగొందిన కేతకీసుమం
బాతపకాంతి మందమలయానికులు కూర్మి మఱుంగు వాయుచుఁ
బీతసమస్తమాంద్య మయి విస్ఫుర తేజము లొల్కునట్టు, లౌ
రా! తమమున్ విడంబడి విరాజిలుచుండిరి దేశసేవికల్.

ఆతపవహ్నికీల లవణాంబుధి తీరమునందు నుప్పు దా
చేతుల జేసినట్టి నవచెల్వమొ, కృష్ణుని జన్మభూమికిన్

జాతర చేయుటఁ గలుగు శాంతరసంబో, ముఖంబు నింప వి
ద్యాతతగౌరవాన్వయవిభాతి మనోజ్ఞవిలాస మొందెడిన్.

తల్లి సమస్తదీక్షలకు దక్షిణభూమియ, దేశభక్తులన్
పిల్లలలోన ఆంధ్రి యనుపేరిటి దెంతయు ధైర్యశీల యం
చెల్లజగంబు దన్యాగడ నిఃతలు జేసిన దా స్వతంత్రభా
స్వల్లిక దేవసేవికయ భారతభావివిశుద్ధలక్ష్మిగా.

---

# 112. శ్రీమతి R. శారదగారు

'నీరసము' (హరీంద్రున కనువాదం)

ముద్దువన్నెల దరిగిన పువ్వు బోలె,
రమ్యలహరీవిహీన వారాశి వోలె,
పరువు గల వాజి లేని సంగరము వోలె,
నీవు లేకున్న నా యున్కి నీరసంబు.

మిసిమి గల పృథ్వి లేని యాకసము వోలె,
ప్రాణతతి గోలువడు శరీరంబు వోలె,
మృదుజలకణరహిత వారిదము వోలె,
నీవు లేకున్న నా యున్కి నీరసంబు.

ఘననినదశూన్యమౌ మృదంగంబు వోలె,
మేలి మెఱుగుల విడనాడు మెఱపు వోలె.
కనదతులకాంతి లేని ఖడ్గంబు వోలె,
నీవు లేకున్న నా యున్కి నీరసంబు.

పరమగ్రంథవిహీనుడౌ గురువు వోలె,
బయనమున త్రోవ దప్పిన పాంథు వోలె'

నంత మెఱుగని సంతతచింత వోలె,
నీవు లేకున్న నా యున్కి నీరసంబు.

---

# 113. శ్రీమతి కల్వాల పార్వతీదేవిగారు

ప్ర బో ధ ము

ఎన్ని దినంబు లుండగల వీ వబలాహ్వయధారి వౌచు? నా
సన్నము కాలచక్రము నిజప్రభలన్ సబలాత్వ మూని, వి
ద్వన్నుత మార్గచారిణిగ వర్తిలు, మంత నితాంత తేజ సం
పన్నవరేఖలన్ జెలగుమా తరుణీ! భువి నూత్న సంస్క్రియన్.

గ్రామసంఘ మనాచార కలిత మగుచు
దమకు గర్తవ్య మెఱుగక తల్లడిల్లు
చుండు రని వార లెలమి నొంద, దివ్య
సత్పథంబు లొసగుమ సాధ్వి నీవు,

---

# 114. శ్రీమతి రాజహంసగారు

స ర స్వ తీ పూ జ.

చిఱుతమేఘముచేత జీవితేశ్వరి కొక్క
కబురు పంపించిన కవి యొకండు,
ముద్దులోపల నొక మోక్షమార్గము చూపి
నాటకం బల్లిన మేటి యొకడు,
పోయిన స్వర్గమ్ము పొలుపొంద చిత్రింప
నందు డయ్యెను జగద్బంధు వొకడు,

నిండుజవ్వనమున నిషధభూపతి ప్రేమ
తెలుగువ వ్రాయించు ధీరు డొకడు

దేనసము లొట, భారతీదేవిచెంత
నర్ధసింహాసమ్ముపై నధివసించి,
శ్రావ్య మోహన మధుర ప్రశాంత మైన
గీతికావళి పాడుచు కీర్తి గనిరి'

... ... .... ఈశ్వరిపూజకు సిద్ధులై శుభ
స్వాంతము లొప్ప నా తరుణిపాదముచెంత వసించి రయ్యెడన్.
పిదప మిగిలిన కవులు తన్మధుర మైన
కావ్యకుసుమాల శ్రీదేవి కని యొసంగి,
నిలిచి రయ్యెడ తమ తమ నెలవులందు
పూజ ప్రారంభ మౌనని పొంగి పొంగి.
... ... ...

"ఎవ రది పూజవేళ నిటు లేద్దురు నా గదిచెంత?" నంచు న
ద్దివిజలతాంగి భారతి పదే కవివర్యుల ప్రశ్నచేయ, నా
భువి నొక కృష్ణశాస్త్రి కవిముఖ్యుని తేనెయెలుంగు పేద్పులే
దివిజగృహాంతరంబుల నదే వినగాబడె నంచు పల్కుటన్.
.... ... ... ...

కల్పన చమత్కారముగా నున్నది. కవిత్వమును దదనుగుణముగా బాగుగ నున్నది.

# 115. శ్రీమతి కడియాల సుభద్రా కామేశ్వరరావు

'రాఘవా' యను మకుటమున నిందాస్తుతిపరముగ నెన్నో పద్యములను గృహలక్ష్మియందు వీరు ప్రకటించిరి.

"ఒప్పులకుప్ప! మా జనని, యుర్విజ, పూతచరిత్ర, సాధ్వికిన్
త ప్పొక చేల కల్గు? విశదం బది నీకును, నైన నిర్దయన్
నిప్పుల కప్పగించితివి నింద్యకథావిశేషి వౌచు, నీ
మెప్పుల కేమి, భూజనులమీదికి ద్రోసితి తప్పు రాఘవా!"

"ఇనసుతుకంటె గూర్చు సఖు డింద్రతనూభవు డౌను నీకు, నీ
మనమున నేమి యెంచితివొ, మాన్యుడు గా డొకో యింద్రుపట్టి? నీ
జనకజ దెచ్చి యీయ డొకొ, సమ్మతి నాతనిమైత్రి సల్పినన్?
ఇనకులవర్ధనుండ వగుటే కద కారణ మెన్ని యెంచినన్!'

# 116. శ్రీమతి 'అమలగ్రంథకర్త్రి'

ఈమె పేరే 'అమలగ్రంథకర్త్రి'యో, లేక 'అమల' యను గ్రంథము వ్రాయుటచే నట్లు పిలుబడుచుండిరో? కాని, యామె 'అమల' గ్రంథ మిప్పుడు కానరాదు.

అ మ ర వ్ర ని త

కాలవశతను తన పూర్వగతిని వీడి
తిమిరవాహినీ గర్భాంతరమున మున్గి

చేయునది లేక ప్రకృతి తా జిన్నవోయె,
చిమ్మచీకటితో మెరసినది మెఱపు.
మెఱపువెలుగున కదలె నా తరుణి యచట
ముడి సడలియున్న పెన్నెరుల్ పుడమి బ్రాకె,
బెదరి జారిన తన పైటచెరగు సర్ది
వరుస సరులను కన్నీటితెరల దుడిచి
మెఱపువెలుగున కాసార మృదుల మధుర
తర తరంగాలపై నాడు సరసిజముల
నుంత యానంద మొదవింప జూచె నువిద.

మకుటమునకును దీనికిని సంబంధము కానరాదు.

---

# 117. శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మగారు

## వి ర హి ణి

అది మనోహర మధుర సాయంతనంబు.
ఆమె సౌధాంతర విలసితాసనమున
కరతలంబు కపోలభాగమున జేర్చి
యేమొ యోచించుచుండె నధోముఖాన.

కలువపత్రంబులను బోలు కన్నుదోయి
దుఃఖభారపు బాష్పముల్ దొరల నేల ?
పగడమును బోలు నధరబింబంబు వన్నె
దరిగియుండ గతం బేమొ తరుణి కిపుడు ?

విన్నబోయెను వదనారవింద మకట !
శత్రుగతమధ్య జీవితేశ్వరునికొఱకొ?"

బలతియుండిన రీతి గన్పట్టుచుండె,
విరహకారమునన్ యేమొ వెలదిమేను.

కోకిలలపాట కామె చీకాకుపడదు,
చంద్రకాంతిచే నామెకు తొంద్ర లేదు,
మలయపవనంబుచే నామె యలత గనదు,
నాతి గదలక పతిని ధ్యానంబు సేయు.

అట్టి దృఢచిత్తమున నున్న యా యతివ పతికి
బంధనం బెంత ? శత్రులబల మదెంత ?
కష్టజలధిని లంఘించి కాంతహృదిని
జేరలేకుండునే ? ... ...

---

# 118. శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

– ప్ర కృ తి –

కరుణావిదూరులౌ నరహంతకుల కీ జ
గం బెల్ల నిబిడాంధకారమయము,
మధురవాగ్ధను లైన పృథుకవీంద్రుల కీ వి
శాలవిశ్వము సుధాసాగరమ్ము,
రాగశూన్యంబౌ విరాగిలోకమున కీ
ప్రకృతి మిథ్యామనోభ్రాంతియుతము,
స్వైర సంచార శృంగారవర్తనుల కీ
సకలంబు ముత్యాలచంద్రశాల,

శ్రీగుణోన్నత నిశ్చలచిత్తవృత్తి
నా జగన్నాథుదర్శనం బాత్మ గోరు

అకలుషాత్మకు లైన భక్తాగ్రగణికి
సకలబ్రహ్మాండగోళ మీశ్వరమయంబు."

అని వర్ణించిన యీ ప్రకృతివర్ణనము చాలా బాగుగ నున్నది. వీరు గృహ లక్ష్మీప్రముఖ రచయితలలో నొకరు. వీరి గల్పికలు, కథలు, వ్యాసములును ఎన్నో పత్రికలయందు ప్రచురింపబడుచుండును. వీరి కథలలో, గల్పికలలో సజీవ మగు ఇతివృత్తము ఉట్టిపడును. నిర్దిష్ట ప్రయోజనమును నెఱవేర్చునవిగానుండుచు. మనోహరముగా నుండును. ఆ సిద్ధహస్తమే పద్యములలో కూడ కనబడుచున్నది. రవీంద్రుడు, ''మూలతత్త్వము మహనీయయై యున్న, నది ఏ పద్ధతిలో ప్రస రించినను మహనీయత్త్వమునే ప్రభవించును..."అనినట్లు, హృదయము సారతర మైనవారికి పద్యమం దైన నేమి, గద్యమం దైన నేమి, వారి వివిక్తత భాసించు చునె యుండును. పద్య మింత యింపుగా రచించు నేర్పున్నను, వీరు హెచ్చు పద్యరచనమునకు దలపడ రేలనో ?

—

# 119. శ్రీమతి పట్టిసపు సీతమ్మగారు

బ్రతికెడు రెండురోజులను బాముల నెన్నొ సహించి, తిండికై
సతతము పొట్ట చేత నిడి, సత్యము వీడి పరిభ్రమించి, యే
కతముననో రహస్యముగ కాలము ద్రోయుచునుండి, యింతలో
మృతి కెరయౌచునుండు తను వేల సృజించితివో ? పరాత్పరా!

ఉసురుల బాయువెన్క క్షణ ముండగజాలని పాడుబొంద ము
న్నసమము లైన భోగముల నంది, జరీమడుపుల్ ధరించి, లే
దు సమ మటంచు మీసముల దువ్వుచు, క్రిందును మీదును గాన క
న్నసలినదే కదా యిపుడు క్రుగ్గినవెన్కను కన్నవారికే
విస మయిపోయె, నిట్టి తను వేల సృజించితొ ? యో పరాత్పరా !

పుట్టిననాటనుండి తలపు న్వలపు న్విడనాడలేని యీ
మట్టిశరీరమం దసువు మాయము కాగనె, కాటిలోపలన్
పుట్టెడు పుల్లలం దునిచి బుగ్గి యొనర్చుట కక్క రౌను, నిం
కెట్టుల నమ్మ నీ తనువు లేల సృజించితివో పరాత్పరా !

ఈ పద్యముల వైరాగ్య కరుణరసము లుట్టిపడుచున్నవి.

---

# 120. శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

చి న్ని చె ల్లా యి

కళ్ళగుళ్ళము త్రోసి కదలవే యని కొట్టు,
పేదబొమ్మకు మాటలాడ నేర్పు,
పీటపై బొమ్మల బెట్టి యాటల నాడు,
చెంబులలో నీళ్ళు చేర్చిపోయు,
తల్లిదౌ పగడాలదండతో నుబుసాడు,
తిరుగు బొంగ్రము గాంచి మురిసిపోవు.
ఖాదిజెండా బూని గాంధికి జే యను,
గాలిపటంబుతో కేళి దేలు,

గిలకపందును గైకొని కులుకుచుండు,
చందనపుబొమ్మ ముద్దాడి చంక జేర్చు,
చెంబునకు త్రాడు గట్టి నీరంబు చేదు!
చిన్ని చెల్లాయి సావిత్రి చేయు పనుల,
గన్నవారికి కడుపు చెక్క లగు గాదె.''

స్వభావోక్తి బాగుగా నున్నది. విశదమైన ధార, విరళమైన ధోరణితో నలరారుచున్నది.

ముద్దుగా రెడి పాలబుగ్గ చిర్నగవుల
 నిగ్గులు లేతవెన్నెలలు గాయ,
కళ లీను కాటుకకంట దొల్కెడి చూపు
 తెల్లదిక్కుల కాంతి వెల్లి గొలుప,
చిన్నారి పొన్నారి సిరు లొల్కు పదముల
 గజ్జెలందెలు ఘల్లు ఘల్లు రనగ,
ఒడ లెల్ల లావణ్య మొలికిపోవగ పోత
 బోసిన బంగారుబొమ్మ బోలె
దనకు చిట్టిచెల్లాయి... ..."

అందఱకూ అద్దూముద్దే అలతు లగు పదములతో పొలతులగు నర్థములతో చిట్టిచెల్లాయి మనోహరముగా వర్ణింపబడినది.



# 121. శ్రీమతి కొమఱ్ఱారి సత్యవతమ్మగారు

దసరా ముసురు

ఇం దెవ రెవరు ఎట్లు కనబడెదరో చూడుడు :—
ఆటగారు నిటగారు ననుచు నందందందు
 ముసుగుతో సరిదెడు ముసలితాత,
క్రొత్తదుస్తులతోడ క్రోతియో, విల్లంబొ
 గాని వానలో బోవు కొంటిపిల్ల,
తడికాగితముతోడ పడవ సేయు మటంచు
 పడి యేచ్చుచుండు దుందుడుకు కొడుకు,
పంతులకట్నంబు, పప్పుబెల్లాలకై
 పడివచ్చు పంతులు బాలికలును,

అత్తవారింటి వంటల నారగించి
యోరచూపుల బరపుచు నౌకరి కొకరు
తమి గనుంగొనియెదు నూత్నదంపతులును
వరలుచుందురు దసరామునురులయందు

కవి ప్రసారించు వింతదృష్టులలో నిది యొక వింత దృక్కోణము. 'శరద్వేళ' యను మకుటమున శ్రీమతి ఓలేటి నిత్యకళ్యాణమ్మగారు—

"సిగ్గుచూపులతోన జిందులాడెడు సుధా
లీలల యౌవనశ్రీలతోడ,
చలువనవ్వులలోని చక్కందనము గూడి
జాల్వారు రాగరసంబుతోడ,
అమల మోహన హృదయాంతర్గతం బైన
తీయని ప్రేమప్రదీప్తి తోడ,
రమణీయ నందనారామ నిత్యానంద
భావార్ద్రసౌఖ్యసంపదలతోడ,

మృదుకనీనిక లుత్పలశ్రీని గురియ,
వింతభావాళి డెందాన వెల్లివిరియ,
పండుగకు నేగుదెంచిన పతిని గాంచు
అమ్మచాటున నిల్చి మీనాక్షి యోర్తు"

అమలహృదయమున పేరటాండ్ర బిలుచు సుదతి యోర్తును మనకు దర్శింప జేసినారు శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు—

పారిజాతాది సత్పరిమళ కుసుమముల్
సంతసంబున గొన్ని సంతరించి,
కస్తూరికా గంధకర్పూర మాదిగా
పరిమళద్రవ్యముల్ పదిలపఱచి,
పుణ్యాంగనాజన పూజ్యచిహ్నము లైన
పసుపు కుంకంబుల భక్తి దెచ్చి,

సత్కవీశ రచిత సద్గ్రంథముల నెల్ల
భారతీపీఠాన పాదుకొల్పి,

ప్రవిమలం బగు భక్తితో కవికుమారి
శారదాదేవి నర్చించు శ్రద్ధతోడ
దేవినవరాత్రముల సల్పి, తేజ మలర
సంతతోత్సాహ మాత్మలో సంఘటిల్ల.

దేవి నర్చించు కవికుమారిని, విల్లమ్ములు బూని పుర మేగు బాలికావళిని మన కనుల గనబఱుపగా, శ్రీమతి కొమ్మూరి సత్యవతమ్మగారు ముసలితాతను, కొంటెపిల్లను, చుండుడుకుకొడుకును, పంతులను, బాలికలను, నవోఢలను మన కండ్ల బడజేసినారు ఇందలి వ్యక్తులను నిత్యము మనము చూచుచునె యుందుము.

కాని, వారినిగూర్చి శ్రద్ధతీసికొని తీర్చి దిద్దిన వా రుండరు కదా! కవిదృష్టి, కవితలంపు అచ్చటనే ప్రత్యేకత భాసింపజేసికొనును.

---

# 122. శ్రీమతి తూతిక కమలాంబగారు

వీరి నవనాగరకము విమర్శ మీకు నచ్చునా? కొంచెమాలోచించండి

"పసుపు మోమున రాయు పని మోటు దోచెను,
ఫేసుపౌడర్లపై ప్రీతి హెచ్చె;
ముద్దులు గుల్కెడి దుద్దులు పస వోయె,
చెవులకు లోలకుల్ చెలువు మీరె;
కాళ్ల కందము గూర్చు కడియముల్ వోయెను,
పట్టీలగొలుసుల పట్టు దీరె,
ముక్కున నగ లుంట మోటుగా దోచెను,
మోమున తిలకంబు గోము వోయె,

ముడియు గొప్పను సిగయును మోటు లయ్యె.
వాలుజడలందు మిక్కిలి వాంఛ యొదవె,
భరతభూమిని జరియించు భామినులకు
కరము పెంపారు క్రొత్త నాగరికమునకు.

ఇట్లే, వీరు మగవారి నవనాగరికమును గూడ విమర్శించియుండిరి. ఇది చదివినపుడు, కొందఱు మా సోదరీమణుల కెంత యాగ్రహకారణ మైనదో? ఆమె పత్రికలలో వ్రాసినది. కాబట్టి బ్రతికిపోయినది. కాని యెట్టయెదుట మాట లాడిన, నామెను బట్టి దుయ్యబట్టియుండెడివారు. అమ్మా! కమలాంబగారూ! మీబోటి వారల మాట పాటిసేయువా రెవ రెమ్మా ఈ కలిలో?

శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారి వన్యవృత్తి ఈ రేషను రోజులలో అనుసరణీయముగా నున్నది.

ఆకలి యైనప్పు డవనీరుహంబులు
పక్వఫలంబు లర్పనము సేయ,
పరిపూర్ణతోయలై ప్రవహించుచుండెడి
శైలాపగలు దాహశాంతి సేయ
పొమ్ము లె మ్మనకుండ భూమీధరంబులు
వసియింప నిమ్మగు వసతు లీయ,
జాలినయట్లుగా సరసాంబరమ్ములు
ధరియింప భూజపత్రతతు లొసగ,

దినుటకై తిండి, త్రాగుటకును జలంబు.
పండుటకు దావు, ధరియింప వస్త్రములును
నహహ! లభియించుచుండు నయాచితముగ;
వన్యవృత్తియె దలపోయ ధన్యవృత్తి,

ఔను-నిజముగ నీ దుష్కాలమున వన్యవృత్తి ధన్యవృత్తి. రేషనువలన బియ్యము దొరుకదు. వానలు లేక సరిపడు నీరు దొరుకదు అద్దె కంట్రోలువలన నుండుట కిండ్లు దొరుకవు గుడ్డ కంట్రోలునవలన సరిపడు గుడ్డ దొరుకదు లక్ష్మీ కాంతమ్మ గారు మన యందఱకును సరిపడు నడవులు వారు చెప్పినట్లు సకలవస్తు

సమృద్ధములగు వానిని చూపుదురేమో ? పోవుదమురండు - ఇల్లుకంటె గుడి పదిలము కాదా !

శ్రీమతి పొణకా కనకమ్మగారి ననుసరించి మనమును స్వాతంత్ర్యజ్యోతి వెలుగులలో ప్రకాశములలో ముందునకు సాగుదము రండు :—

నవస్వతంత్ర మహామహోత్సవ రథమ్ము.
విమల కళ్యాణ రాజమార్గముల దిరుగ,
వచ్చె దినమణి ప్రాభాతవర్తనముల
అమ్మ i నీచేతి కాగడా యై వెలుంగ''

విశ్వసాగర కల్లోలవీచిలోన
నవ్యభారత స్వాతంత్ర్య నౌక ద్రిప్పి
విజయతీరాల లంగరు విడియ నదిగొ !
ఖరకరుడు వచ్చె తల్లి ! చుక్కాని పట్ట''

''ఈ మహానంత యానమునం దమోఘ
పరమ సౌభాగ్యసీమ జూపగ స్వయముగ
పుష్పకము దెచ్చి యంజలి మోడ్చి లోక
బాంధవుడు నిల్చె జననిరో ! స్వాగతముల.''

సత్యమును, ధర్మమును, నహింసయును, ప్రేమ,
త్యాగమును పంచప్రాణములై స్వరూప
మవతరించుచు బాపూ మహాత్మ తేజ
మెపుడు ముం దయి మము నడిపించు గాక !

ఈ నడిపించుట యెక్కడకో, ఏ మహాప్రయోజన మాశించియో, యది ఇపు డిన్ని యిడుమల గుడుచుచున్న ప్రజలకు శ్రేయస్కరమో కాదో ...?

---

# 123. శ్రీమతి చేజెర్ల రామరత్నమ్మగారు

వీరు కాళహస్తిపుర నివాసినులు. ఏ విషయము పైనైనను ఆశుధోరణిగ వందలకొలది పద్యములు నిముస మాత్రమున చెప్పగల సామర్థ్యము కలవారు. అయినను వీరికడ ఇపు డేమియు ఒక్క పద్యమైనను ఇది వఱకు వ్రాసినవి జాగ్రత్త పెట్టియుంచ లేదట. ఉన్నదేదో పంపించిరి. అందుకొన్ని –

హెచ్చరిక

చేడె లెందరో మున్ను చెఱసాలకు నేగి
అష్టకష్టంబుల ననుభవించి,
సతుల సుతుల వీడి సత్యాగ్రహము సల్పి.
ధన ధాన్యముల గూడ ధారవోసి,
ఆహార నిద్రలు వ్యవహారములు మాని.
కారాగృహములందు కాల ముడిపి,
మహనీయు లెందఱో మన దేశ కాంక్షతో
లాటీల దెబ్బలధాటి కోర్చి,

ప్రాణముల సైత మర్పించి ప్రజ్ఞ మెఱయ,
పరుల హింసింప దలపక, భావమునను
గాంధిదేవుని ఆజ్ఞను గారవించి,
భారతీయులు పలుపాట్లు బడిరి గాదె.
భారతీయుల హృదయముల్ భగ్గు మనగ,
గోడుగోడున ప్రజ లెల్ల గోల వెట్ట.
నీతి లేకను మన నేలు కోతిదొరల,
ఖండితంబుగ మన గోడు కట్టికుడిపె,
అక్రమం బగు పాలన మంత మొంది
సత్యపాలన మిపుడె సంస్థాప నాయె,

ఎఱ్ఱకపిగము లీనాడు తుఱ్ఱు మనిరి,
బడసితిమి గాదె స్వారాజ్యభవన మిలను.

ఆ మహాత్ముని ఆశయ మాత్మ దలచి
స్వార్థత్యాగ మొనర్చి సుస్వాంతమందు
రామరాజ్యంబు స్థాపింప రారె! వేగ!

శ్రీమతి రామరత్నమ్మగారి మాట విని మన మందఱము రామరాజ్య స్థాపనము సేయ బోదము రండు. అచట నైనను సుఖశాంతులబ్బు నేమో!

---

# చరిత్ర తెలియని ఇతర కవయిత్రులు

ఇంక వీరందరు గాక, వివిధము లగు పత్రికలయందు రచయిత్రులుగా నున్నవా రెందఱో కన్పట్టు చున్నారు. శ్రీమతులు దివాకర్ల శారదామణి, కామరాజు మైత్రేయి, తెలికిచర్ల వసుంధర. వట్టి శేషాంబ, పాకల రాజామణెమ్మ, డి. అనసూయ, అడపా సుగుణమణి, కె. సుగుణమణి, సి. వి. రమణమ్మ మున్నగువారు. వీరు నవలలు కూడా రచించిరి. శ్రీమతులు వక్కలంక రామాబాయమ్మ, అమ్మిశెట్టి కనక రత్నాయమ్మ, శ్రీపాద శారదాదేవి, పతానేని భారతదేవి, మధునాపంతుల సావిత్రీదేవి, చింతలపాటి జగదంబ, నాయని కృష్ణ కుమారి, జటావల్లభుల వెంకటరత్నమ్మ, చూడికుడుతమ్మ, తాడి నాగమ్మ, బేతా సీతాంబ మున్నగు వారలెందఱో గద్య, పద్య రచయితలుగా కనబడుచున్నారు.

శ్రీమతి దామెర్ల సీతమ్మగా రనువారు అధ్యాత్మ రామాయణ కీర్తనలను స్త్రీలపాట లని ప్రసిద్ధికెక్కిన ఊర్మిళనిద్ర మున్నగు పాటల ఫణితిలో రచించిరి. శ్రీమతి నల్లాన్ చక్రవర్తుల వెంకటమ్మ గా రొకరు శ్రీ చివుకుల సరస్వతీదేవిగా రొకరు కీర్తివాఙ్మయకర్త్రు లుగా నున్నారు.

ఇంతే కాక, హైదరాబాదు సారస్వతమున ముందు పేర్కొన్నవారు గాక, యింక నీ క్రిందివా రగపడుచున్నారు. శ్రీమతులు సంగం లక్ష్మీబాయమ్మ, లోకనంది సత్యవతమ్మ, కొండా శకుంతలమ్మ, రత్నాల కృష్ణాబాయి, ఎల్లాప్రగడ సీతాకుమారి, నందగిరి ఇందిరాదేవి, ఇల్లిందుల సరస్వతీదేవి, చాత్రాతి లక్ష్మీ నరసమాంబగార్లు అనువా రింకొొక పదుగురుకవయిత్రులు. కథానికా రచయిత్రులు, ఏకాంకికా రచయితలు కనబడుచున్నారు. అంతే కాక, మాలతీ చందూరు, బొందలపాటి శకుంతలాదేవిగారు ప్రసిద్ధ కథారచయితలుగా పేరుమోసిరి. ఇంతే కాక, ఈ దిగువ నియ్యబడు రీతిగా భారతిపత్రికయందలి వాఙ్మయ సూచికలో కవయిత్రు లగపడుచున్నారు. వారి కావ్యముల గూర్చిన పొలకువ కానరాదు

శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు సుప్రసిద్ధ సత్యాగ్రహోద్యమ నిర్వాహకురాలు. ఆమె యెన్నోకథలు రచించిరి. అట్లే కొమ్మూరి పద్మావతీదేవిగారు సుప్రసిద్ధ రచయిత్రి.

| | రచయిత | రచన | ముద్రణ |
|---|---|---|---|
| 1 | ఉమ్మిడిసింగు తాయారమ్మ | సావిత్రినాటకము | 1914 |
| 2 | నూనె సుబ్బమాంబ | అభినవ రామాయణము | 1914 |
| 3 | ఎన్. మూర్తమ్మ | ఆనందానుభవము | 1914 |
| 4 | ఎన్. స్వర్ణమ్మ | ఇందిర (నవల) | 1919 |
| 5 | యం చూడమ్మ | ఉపన్యాసమంజరి | |
| 6 | కొటికల పెద్ద తులసమ్మ | కందార్థనక్షత్రమాలిక | 1919 |
| 7 | కొ. సాధనమ్మాళ్ | కన్యకాజననము | |
| 8 | వేమూరి ఆండాళ్లమ్మ | కమలిని | 1916 |
| 9 | ప. నరసమ్మాళ్ | కళ్యాణ కీర్తనలు | |
| 10 | అమ్మయ్యమ్మాళ్ | కృష్ణ నాటకము | 1891 |
| 11 | కారుపల్లి రామాంబ | గానరామాయణము | |
| 12 | జ్ఞానమాంబ | చంద్రమ్మకథ-పాటకథలు | 1910 |
| 13 | పి సీతమ్మ | త్రిపురసుందరి | 1915 |

| | | |
|---|---|---|
| 14 లక్ష్మీనరసింహయోగిని | దక్షిణమూర్తి (హరికథ) | 1916 |
| 15 తేకుమళ్ళ లక్ష్మీబాయమ్మ | దేవశతకము | 1911 |
| 16 ఇప్పగుంట వేంకమాంబ | దైవప్రార్థన | 1912 |
| 17 భాష్యం ఆండాళమ్మ | ఆళ్వారులచరిత్ర | |
| 18 బి. ఓ. నారమాంబ | నారీహితరత్నమాల | 1921 |
| 19 పి. అలివేలు మంగమ్మ | పద్మినీహంసుని గానవినోదం | 1892 |
| 20 యస్ శేషమాంబ | పాండురంగశతకం | 1918 |
| 21 ఆ. వేంకటాంబ | యక్షగాన రామాయణం | 1912 |
| 22 ముక్కామల ఆదిలక్ష్మమ్మ | రామశతకము | 1900 |
| 23 యమ్. ఎ. మంగతాయారమ్మ | సుల్తానీ కళ్యాణం | 1917 |
| 24 జి వేంకటమ్మ | సురేచనీ కళ్యాణము | 1898 |
| 25 జి. లక్ష్మీనరసమాంబ | సుగుణావళి | 1917 |
| 26 శ్రీరామపుత్రి | సీమంతినీ చరిత్ర | |
| 27 డి. వేంకటసుబ్బమ్మ | కల్పనాకావ్యము | 1920 |
| 28 విస్సంరాజు సీతమ్మ | సావిత్రి నాటకము | 1904 |
| 29 అమ్మణ్ణి అమ్మాళ్ | గానమనోహరి కీర్తనలు | 1918 |
| 30 కళ్ళేపల్లి వేంకటరమణమ్మ | వలరక్ష్మి శతకము | 1914 |
| 31 పింగళి అనంతమ్మ | హరిశ్చంద్ర నాటకము | |

ఇందు గద్య, పద్య, ప్రబంధ, నాటక, హరికథా, కథానికా, గేయ రచయిత్రు లందఱును కలరు.

సుమారు అర్ధశతసంఖ్యా కలిగిన యీ కవయిత్రుల పుస్తకము లెట నున్నవో కాలము తేల్చ వలసియున్నది. ఇంక నెవరైన కవయిత్రు లుండిరో, నాకు దెలియక వారి గ్రంథముల నీ పొత్తమున చేర్చలేదో, దయచేసి మన్నించి వారు నాకు తెలిపిన సంతోషముతో నిందు చేర్చుకొందును.

పురుషులు దీక్ష నుజ్జగించిన కవయిత్రుల చరిత్రల నపేక్షతో వ్రాయుటే నాకు పరాయణ మని తెలియుదురు గాక.

## అనుబంధము

# 1. శ్రీమతి బంకుపల్లి వెంకటరత్నమ్మగారు

ఆంధ్రదేశమున శ్రీ వీరేశలింగము పంతులుగారికి కడు సహాయులై, శ్రుతి స్మృతి పురాణాదుల నన్వేషించి వితంతువివాహాదులు శాస్త్రసమ్మతము లని రూపించిన శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రి గారి సతి వెంకటరత్నగారును గ్రంథ కర్త్రిణియే. శ్రీ మల్లయ్యశాస్త్రిగారు జగత్ప్రసిద్ధులు. పురాణవాచస్పతి, కావ్యతీర్థ, ఆంధ్రవిద్యారణ్య ఇత్యాద్యనేక బిరుదాంచిత ధీప్రభావులు. అట్టి శ్రీ శాస్త్రిగారు తనకడ గల అనేక శిష్యగణముతో బాటు భార్యను గూడ ఛాత్రిణిగా స్వీకరించి, ఆమెకు విద్యాబుద్ధు లలవరింపజేసిరి. శ్రీమతిగారి తండ్రి యగు పోకల సింహాచలముగారును మంచి ప్రసిద్ధ గాయకులు. ధార్వాడ మాధవరావుగారి శిష్యులైన వీరు మున్ముందు ధారాకోట సంస్థాన విద్వాంసులుగా నుండిరి. శ్రీమతిగారి తల్లి సీతారామమ్మగారు. శ్రీ వెంకటరత్నమ్మగారి వయస్సు ఇప్పుడు 62 వర్షములు. జన్మ విరోధినామ సంవత్సరము.

ఇంత ముదుసలివయస్సునను వీరు ప్రస్తుతము బాలభాగవతమును గద్యకావ్యముగా వ్రాయుచున్నారు. వీరి యోపిక, వాఙ్మయాభిరతి ప్రశంసనీయము లనదగి యున్నవి. వీరి యితర కృతు లీక్రింది విధముగ నున్నవి. సంగ్రహ రామాయణ మను గద్యకావ్యము. జానకీవిజయ మను బృహత్కావ్యము, స్త్రీల వ్రతరత్నహారము అను ద్విపదకావ్యము. ఇందు జానకీవిజయము దక్క తక్కినవి యముద్రితములు. జానకీవిజయమునకు శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగా రుపోద్ఘాతము వ్రాసిరి. స్త్రీ వ్రతరత్నహారమున కడపట భగవద్గీత ప్రసంగమును కూడ ద్విపదగా రచించినదానిని ప్రచురించిరి. కొన్ని మంగళహారతులు కూడ కలవు.

స్త్రీలు చేయు వివిధము లగు వ్రతవిధానములు, వ్రతకథలే స్త్రీ వ్రతరత్నహారములోని వృత్తము. వరలక్ష్మీవ్రతము :—

"శ్రీ కైలాసము చెలగు చుండెను
ఎత్తగు శిఖరము లెల్లెడ వెలయగ,
దేవలోకమున దిరిగెడివారలు
ఆటల నాడుచు, పాటల పాడుచు
వచ్చుచు నుందు రీ పర్వతమ్మునకు.
శౌనకాదు లగు సకల మునీంద్రులు
తపములు చేయుచునుందు రచ్చటను;
ఒక్క దినమ్మున నోపిక మీరగ
శివుడు మణిసింహాసనమున
ఆసీనుండై యలరుచు నుండెను."

శైలి ఇట్లు సామాన్యముగ నున్నది.
గీతార్థసంగ్రహము దీనికంటె బాగుగ నున్నది.

''యుద్ధరంగమున కురికిన పార్థుడు
రథము నిలుపు మని రయమున బలికెను,
శ్రీహరి నిలిపెను జెలగుచు రథమును;
ఉభయసైన్యముల యోధుల జూచెను,
తాతలు, తండ్రులు, భ్రాతలు, గురువులు
నీ విధి వారిని నే విధి ద్రుంతును ?
అనుచు నర్జును డప్పుడె ధనువును
విడిచెను వికలత కలిగిన మనమున..."

ఇది యిట్లున్నది. ఇందు వీరు స్త్రీజనత కిట నట నుద్బోధము కూడ నొనర్చిరి.

'హారతిదె గైకోరా ఆదిలక్ష్మిపతి'' అను హారతిపాటయందు- 'వేల్తురు దీపము విధమున నొకటిగ । నిల్తురు లక్ష్మి యు నీవును జగతిని' అచుచో, వస్తుకృత వస్తుధ్వని కనబడుచున్నది.

వీరు పూర్వము నరసన్నపేటలో నుండెడివారు. ప్రస్తుతము పర్లాకిమిడియం దున్నారు.

---

# 2. శ్రీమతి పర్సా జానకీదేవిగారు

దక్కను సారస్వతచరిత్రలో సువర్ణాక్షరముల లిఖింపదగిన సాహితీ చరిత్ర కలిగిన కవయిత్రులలో శ్రీమతి పర్సా జానకీదేవిగా రొకరు. వీరి జననము 1923. మహిళాభ్యున్నతి, పీడితసముద్ధరణమే యాశయముగా పెట్టుకొని నిరాడంబరముగా రచనలు సాగించుచున్న లలితకళారాధకురాలు. హిందీవిద్యాభ్యాసము, గృహపరిశ్రమ మొదలైన యితరవ్యాసంగములు కూడ లేకపోలేదు. రచనారంగమున నీమె కవితాకుమారి. క్రొత్త క్రొత్త భంగిమల జూపి పఠితల నానందింపజేయ గలరు. రచన లింకను సముద్రితములు. "రసాంజలి", "నిలింపశ్రీ" "మధురశ్రీ" యనునవి.

వీరి కృతులనుండి మచ్చున కొక్క పద్యము. ఋతుత్రయము:-

"మానవ జీవితమ్ము మధుమాస వసంత మనోజ్ఞ శోభతో,
వానలతో, మహాశిశిరవాయువుతోడ ఋతుత్రయంబు పెన్
గానల దూరినట్టు కలగాపులగ మ్మయిపోయె, పేదకున్
వానలు కొల్ల లౌను, చలిబాధలు హెచ్చు వసంతముల్ త్రుటుల్.

మానవులలోన ధనికుడు మాన్యు డగును
ఆకలికి రోయువాడు పుల్లాకు సుమ్ము,
అందు ప్రథముని జీవిత మంత మధువె,
మొండివాన రెండవవాని గుండెలందు.

చైత్ర వైశాఖమాస వాసంత శోభ
ధనికలోకంపు విశ్రామధామ మయ్యె,

శ్రావణాషాఢ నిబిడ వర్షానిశా త
మస్సు పేదకు మృత్యుధామమ్మె యయ్యె.

ఋతుప్రతిభ పేదలలోను భాగ్యవంతునిలోను నెట్టి ఫలితము గల్గించునో వీరు చక్కగా సూచించిరి.

---

# శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు

వీరు దక్కను సారస్వతమున బాగుగా సుప్రసిద్ధురాలు. ఈమె భక్తిగీతములు, ప్రార్థనాపద్యములు వ్రాయుటలో నేర్పరి. ఎంతటి భక్తురాలో, అంత రసపిపాసి యామె. ప్రియుడింట లేనియపుడు ప్రేయసి మనసెట్టి వెతల గుడుచునో, అట్టియెడ ప్రియురాండ్ర భావములెట్లు పరువిడునో, చాల సున్నితముగ చక్కని సాంసారికకథానకముల వోలె కమ్మని పద్యములలో చిత్రించునేర్పీమెకు కొల్లలు. భావపుష్టిచే పచేళిమ మైన వీరి కావ్యపాకములు చవులెఱిగిన రసికలోకమునకు చక్కని యామెతలు. శృంగార విరహ కవనరచనమున దక్కను సారస్వతేయులు వీరికి మహనీయస్థితి కల్పించియుండిరి. 'గౌరి' యనుకావ్యములోని కొన్ని పద్యములు:—

పున్నెము లందు సద్రచన బొందిన యీ పరమవ్రతంబులో
బన్నిన కంకణమ్ము కరపంకజమం దలరార, భక్తిసం
పన్నత నారితేరిన యుమాసమలన్ పద మంటి మ్రొక్కన
య్యన్నులమిన్న లాడెడు ప్రియంబులు చెల్లియ ! నిన్ను నోముతఱి.

ఎవ్వరు నేర్పిరే చెలియ! యీ గతి వాయన మిచ్చి పల్క? నీ
నవ్విన నవ్వులో తెనుగునాటి మనోహర కీర్తివల్లికల్
పువ్వులు పూచెనమ్మ, నరపుంగవు డౌ పతి నెమ్మనమ్ములో
గ్రువ్విన భావముల్ వెలికి గూర్చినవే నునుసిగ్గుదొంతరల్.

కొసల మటల్చి వేసినది క్రొమ్ముడి నూతన ధూప సౌరభ
ప్రసర సువాసితమ్ము నయి వ్రాలెను వెన్నున నంటి దీర్ఘమై,
ప్రసవచయమ్మునం దుపరిభాగమునం దెటు నిల్పితమ్మ? ఈ
పస విదిలించుకొన్న పతిభాగ్యము నే మని ప్రస్తుతించెదన్?

శ్రావణగౌరీవ్రతము చేయుటకై, తలస్నానము చేసి, వెంద్రుకల తడి యార్చి, యా సుదీర్ఘవినీల కేశబంధమున చమత్కారముగ నం దొక సౌందర్య రేఖాలాలిత శ్రీ తోచున ట్లుపరిభాగమున కొసరి యొక పుష్పము నిల్పి, నాథుని మన్మథానలశిఖ నుద్దీప్తము సేయు నీ ఆంధ్రబాలికా ముగ్ధ మనోహర రూపరేఖను వర్ణించుటలో ఈమె చూపిన సొబగు పోకడను గమనించితిరా? ఈ వర్ణనమున భక్తియు రక్తియు జంటపంటలు పండినవి.

ఇట్టి చమత్కారము లీమె లేఖినిని నిత్యనూతనములుగా మనము గాంచ గలము. చక్కని యల్లిక గల సమాసముల కూడ పచరింప గలరు.

ఓ చైతన్య కళాస్వరూపిణీ! త్రిలింగోర్వీసుమారామముల్
పూచెం గా మధురాననేందుమధు సంపూర్ణ ప్రవాహమ్ములన్''

వీరి రచనలలో 'పతిభక్తి' శ్రీరంగదేవస్తోత్రము' ముద్రితములు. శకుంత లాపరిణయము, వేణుగోపాలశతకము అనునవి అముద్రితములు.

---

# 3. శ్రీమతి నేమాని భారతీరత్నాకరాంబగారు

ఇందుమతీదేవిగారితో పేర్కొనదగిన వారు వీరు

జన్మము తూర్పుగోదావరి జిల్లా-రాజోలు తాలూకాలోని బెల్లంపూడి గ్రామము. ఖండవల్లి సీతమ్మగారు, సూర్యనారాయణశాస్త్రిగా రను వారు వీరి తల్లి దండ్రులు. సోదరుల విద్యాభ్యాసముకొఱకు వీరు మెల్లగా నైజాము చేరిరి. అచటనే శ్రీమతిగారు బాలికల యున్నతపాఠశాలలో స్కూలుఫైనల్ చదివి కృతా

ర్థులైరి. సుబ్బారావుగారు వీరి భర్త. వారి జీవితమున దాదాపు ఇరువది సంవత్సరముల ప్రాయమున భర్తృవిహీనదుఃఖము నంది మెల్లగా బి ఏ. వరకు చదివి తాము చదివిన పాఠశాలలోనే ప్రస్తుత మాంధ్రోపాధ్యాయినిగా పనిజేయుచున్నారు.

పత్రికలలో చాల వ్యాసములు, కథానికలు వ్రాయుచుందురు. పుస్తకరూపము నందినవి చాల తక్కువ. అవును మరి-మహిళాసారస్వత ప్రచురణకు దీక్ష వహించువా రెవరు? వీరి కవిత్వగురువు బిదురు వెంకటశేషయ్య బి. ఏ. గారు. వారును బహు కావ్యనిర్మాతలే. వీరి ప్రథమ కావ్య మగు 'నిర్మల' వారికే అంకితము.

'నిర్మల' అను నీ కావ్యము షేక్స్పియర్ మహాశయుని "As you like it" అను పొత్తమునకు స్వేచ్ఛానువాదము. ఇది కాక, 'భారతీనక్షత్రమాలిక' యను గ్రంథము, గేయరూపముగా "రుద్రమదేవి" "విజయదశమి" "ఖడ్గతిక్కన" యను వానిని రచించిరి. వీరి ప్రథమ ప్రయత్న మగు "భారతీనక్షత్రమాలిక" యందలి శైలి చక్కగా నున్నది:—

"జాతీయత్వము, దేశభక్తి, స్వమతాచారాభిలాషంబునున్,
పాతివ్రత్యము, సత్ప్రవర్తనమునున్, సర్వాదరస్థానమౌ
నీతిన్, గార్యములందు శ్రద్ధ యెదలో నిండారుటన్, మాపయిన్
ప్రీతింజేసి యొసంగ వేడెదను తల్లీ! నిత్యమున్ భారతీ!"

"పరదేశానుగతంపు నాగరకతల్ పాటించి, జాతీయతన్
వెర పింతేనియు లేక మా పడతుకల్ విద్యావతీరత్నముల్
ధరపాల్ చేయుచునున్న వారలు గదా! దాక్షిణ్యపుణ్యాత్మవై
తరుణీ! వారల కిచ్చి ప్రోవుము స్వజాత్యాసక్తినిన్ భారతీ!"

ఇట్లు స్వమత దేశానురక్తితో గూడియున్న వివి.

ఇక వీరి 'నిర్మల' యను కావ్యము సులలిత శైలిలో ధారావేగముతో గూడియున్నది:—

"కిలకిలారావముల్ గెరలి గూండ్లను వీడి
ఖగము లాకసమున నెగియుచుండె,

నింగినుండి యినుండు తొంగి చూచుచు భువిఁ
బంగారుకిరణముల్ పఱపుచుండె,
పద్మబాంధవు గని పద్మభామినులును
ముసిముసి నవ్వుల మురియుచుండ్రి,
పుష్పసౌరభములఁ బొందుగా గొనివచ్చి
పవను డన్ని దెసల పఱపుచుండె...''

అట నట ప్రకృతివర్ణనలు కలవు. సారస్వతమున సముచిత స్థానమున నున్న వీరి లేఖిని యుజ్జ్వల కావ్యసృష్టిని చేయును గాక యని యాశింతును.

---

# 4. మోద ప్రసూనాంబ

'మ హి ళ'

హిందీసాహిత్యశిరోమణి, పండిత కర్ణవీర నాగేశ్వరావుగారి పుత్రిక యగు మోదప్రసూనాంబగారు రచించిన 'మహిళ' యను చిన్న కావ్య మొకటి ఉదాత్త భావ సమంచితముగ కన్పట్టుచున్నది. శ్రీ కర్ణవీర నాగేశ్వరావుగారు బహుభాషా విశారదులు. నిజ మగు స్త్రీ విద్యాభిమానులు. సాహిత్యక్షేత్రమున బహుళ వ్యవ సాయ మొనర్చిన మహనీయులు.

ఇట్టివారి కుమారీరత్న మైన మోదప్రసూనాంబగారు సుభగంభావుకత కల్గిన రమణీయ కావ్యవిపంచిని మొఱసిన దన్న నది యన్వర్థమే. విశేషప్రజ్ఞాశాలిని యైన యాకీర్తిశేషురాలు 1927 వ సంవత్సరమున పుట్టి, 1948 వ సంవత్స రమున తనువు చాలించుట కేవలము ఈశ్వర సంకల్ప మనుకొని ఊరడి చెంద వలసియున్నది. చిఱుత ప్రాయముననే సంస్కృతభాష నుపన్యసింప గలిగి తన వయస్సున మించిన ప్రతిభోన్మేషముల జూపిన యీ బాలిక చిరకాలము మని యుండిన నెంత చక్కని కీర్తి ప్రతిష్ఠలను దనకును, దన తండ్రిగారికిని, దన దేశమునకును నార్జించియుండెడిదో ?

ఇట్టి కుమార్తెను గని, యామె తనకు, తన వంశమునకు మోదప్రసూన యగు నని సంభావించిన శ్రీ నాగేశ్వరరావు గారు కడపొత్తమును జూచుకొని, యామె తనకు ఖేదప్రసూన యైనది కదా యని వగల బొగలవలసివచ్చు టెంత చిత్రమగు విధి నిర్ణయము !

చూడు డీమె 'మహిళ' ను ప్రారంభించుటయందే యెంతచక్కని రుచిరతను కనబఱచినదో?

'సిరివి నీవె, యింటి సింగారము న్నీవె,
శక్తి వీవె, లోకజనని వీవె.
విద్య వీవె, విమలవిజ్ఞాననిధి వీవె,
మహిళ! నిన్ను మించు మహిమ గలదె?
''నీదు శక్తి యున్న నిలుచును లోకముల్,
నీదు శక్తి లేక నిలువ దేది;
నీదు శక్తి విశ్వనిర్ణయమును దెల్పు. ॥మహిళ॥
'సబల వీవె, మాతృసద్భావము న్నీవె,
భారతాంబ వీవె, ప్రమద వీవె,
అట్టి నీవె యబల వైన నిం కేమందు? ॥మహిళ॥
'మహిళ యనెడి మాట మఱచుటయే కాక
యామె సేవ నెందు నరయరైరి,
తత్ఫలంబు దేశదాస్యంబు నా నొప్పె ॥మహిళ॥
"దుర్గపూజ జేసి దుర్మార్గులం దున్మి
వీరవనిత లనగ వెలసినారు,
పూజ నెఱిగి నారి పూజ్యురా లాయెను, ॥మహిళ॥
''విజయలక్ష్మి విదుషి విజ్ఞానమును గన్న
శక్తిలీల లన్ని సార్థకములు.
దేశమహిమ దెల్ప దివ్యవ్రతము బూనె ॥మహిళ॥

ఇట్లు సుగ్రథితమైన పదబంధమునకు సురభిళ మగు భావప్రసూనమును గూర్చి, వివిధ విషయములను విశదముగా నిందు దెల్పిరి. ఈ కావ్యమునకు

మనవి వ్రాసిన వీరి చెల్లెలు ఆదిశేషభూషణాంబగారు కూడ పద్యవిద్య నెరిగిన వారే.

---

# శ్రీమతి దొప్పలపూడి అనసూయాదేవిగారు

## మాతృహృదయము

గుంటూరుజిల్లా బాపట్లతాలూకా, రేటూరుగ్రామవాస్తవ్యులైన శ్రీ దొప్పలపూడి రత్నముగారి భార్య. శ్రీమతి దొప్పలపూడి అనసూయమ్మగారు పదునైన భావసంపద కలవారు. వీరి జననము 1919. వీరి తండ్రి కమ్మచౌదరిగారు. తల్లి మాణిక్యమ్మగారు. వీరును తత్ప్రాంతవాసులే. వారు B. A. పట్టము నంది, తన కుమార్తెకు చక్కని సాహిత్య సంస్కృతి నలవఱచిరి. శ్రీమతి అనసూయమ్మ గారు ఏమంత పెద్ద చదువులు చదువకున్నను, తండ్రికడ జాగరూకతతో భద్రము చేయబడియున్న రామాయణ, భారత, భాగవతాద్యుద్గ్రంథములను సహితము చదివి తెలిసికొనగల నేర్పు సంపాదించి, మెలమెల్లగా తనకు దోచిన రీతి నల్లిబిల్లి కవిత్వ మల్లుట కారంభించిరి. ఈ పిపాస నెఱింగి అచటికి చాల సన్నిహితులుగానే యున్న శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఆమెను దరిసి పద్యవిద్యారహస్యముల దెల్పుచు, నామెలో నణంగియున్న దీప్తి కుద్దీపనము గావింప మొదలిడిరి. అది మొదలామె చిటిపొట్టి పద్దెములతో వాణిని సింగారింప దొడగినది. కడకు తన గురువర్యులగు అభినవతిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి కనకాభిషేకోత్సవ సందర్భమున, తాను వ్రాసిన 'మాతృహృదయము' అను చిఱుకబ్బమును అర్పణముచేసి గురుఋణము దీర్చిరి.

ఈ సాధ్వి తనకు కొంత వయసు మీరువఱకు గూడ పిల్లలు కలగ లేదను వేదనతో గడు వంతల గ్రుమ్మగ్గి, ఆ దుఃఖముతోడనే తన హృదయ వేదనను

వెలార్చుచు గైతను గైసేసెడి దట. తరువాత తన తపసు పండెనో యన్న ట్లామె చూలు దాల్చినది. అప్పటి నుండి ఈ గ్రంథ మువారబ్దమగుచున్నది.

స్త్రీలు స్త్రీహృదయమును వ్యక్తీకరించుచో, నెట్లుండునో యను నూహమున కీ కావ్యము పరమసాక్షికము. గ్రంథము చిన్నదైనను, యిందలి మాతృహృదయ భావనావేశము మిగుల విశాలమైనది. సరళమైన భాషలో, నామె చూలు దాల్చినది మొదలు తనకు గల్గిన భావము లన్నింటిని చాటును మాటును లేక, జంకును గొంకును లేక వెల్లడించినది.

"అంకురంబుననె ప్రేమాంకురం బగు నాకో,
నెలదప్పినంతనే నెమ్మనంబు?
పొంగారు వాంఛాతరంగాలతో నిండి
పోవుచుండె ని దేమి? ......

గర్భవతులైన వారినిఁ గాంచినంత
ప్రసవవేదన నెంచి మానసమునందు
నెంతయో భయ మొందు నా కిప్పు డింత
మధుర భావన గల్గ నా మాయ యొక్కొ ?

కానరాని మహాశిల్పి లోన జేరి
రాత్రిపవలయందు విశ్రాంతి లేక
ఎట్లు సృష్టించుచుండెనో యేమొ, వాని
యిష్టమే కాని, నాచేత నేమి యౌను?

చూచితిరా వారి భావపరంపర ? పిల్లలు లేరని తపియించి తపియించిన తరుణి తొలుచూలు దాల్చినపుడు, గర్భ మనగానే మొదట కల్గు భయము, తరువాత కల్గు మధురభావనలు. లోన నున్న శిశువు సౌందర్యముం గూర్చి కుతుకము, ఆ బిడ్డ నెపుడు చూతుమా యను నాతురత, అన్నియు అచ్చున గ్రుద్దినట్లు వర్ణించి యున్నారు.

"ఎచ్చటనుండి వచ్చె నిత డీ భువిమీదికి? నింద నేరితో
మచ్చిక లేకపోయె, నిజమానసమార్గవిహారి యౌచుఁ దో
డ్తెచ్చిన దివ్యవిగ్రహము దృష్టికి గోచర మౌచు నుండెనో
వచ్చినదాది లోకమున పాలవు చూడ్కులు నవ్యమూర్తికిన్.

చెఱియొక భాష యెఱింగిన
యిరువురలో నున్న భావ మెఱిగించుటకై
యిరుబాసల పండితువలె
బరిచయముం జేయు ప్రభువు బాలుని నాకున్.

'పరిచయము' అను మకుటమున గల పద్యములు బాగున్నవి.

ఇంతే కాదు, 'దీపజ్యోతి' యను మకుటమునఁ గల యీ క్రింది పద్యముల జూడుడు. ఉక్తివైచిత్ర్యము, ఉజ్జ్వలభావవిశదకాంతితో నీ పద్యములు మనము నాకర్షించుచున్నవి.

"కనువిచ్చి కనుట నేర్చిన దాది దీపమున్
గనునట్టు లితరంబు గాంచ దయ్యొ,
ఇటు రాకపూర్వమం దేకాంతి జూచెనో
యెఱిగినరీతిగా నరయుచుండు,
తేజస్స్వరూపుడౌ దేవాదిదేవుగా
భావించు నేమొ దీపంబు నతడు?
మాయ పుచ్చుటకునై మాలిమి చేయునో
తన మాలుగా దీపమును ప్రభుండు.

చిన్ని పాపని యుల్లమ్ము చీకటింట
నుండ నొల్లదు నిద్రించుచున్న దప్ప
ఎల్లవారలు వెల్గునే యిచ్చగింప,
బిల్లవాఁడును దానికై ప్రీతిపడఁడె?

''పుణ్యపాపము లాకృతి పొందియున్న
కరణి దోచును వెల్గుచీకటులు హృదికి,

పాప మెఱుఁగని యీ పసిపాప లేత
మదికి జీఁకటి యెట్లు సమ్మదము గూర్చు?

చూచితిరా-యీ పద్యములయందలి సొగసు! పసివాడు దీపమును చూచుటనుగూర్చి యామె యెన్ని విధముల భావించినదో! కడపటి రెండు చిన్నిగీతములును ప్రకృష్టభావపరిణతిని పట్టి యిచ్చుచున్నవి.

పిల్లవాడు జోలపాటలయం దనురక్తు డగుట జూచి, యామె హృదియందు గల్గిన భావవితతి గాంచుఁడు.

''సంగీత సాహిత్య సారం బొకింతయు
జవిచూచి యెఱుగని చంటిబిడ్డ
ఆలించు దనగోల చాలించి జోలసా
టలు పాడుచుండ నిశ్చలితు డగుచు,
నవనవం బగు బాలు నవనీతహృది గాన
కళయందు గల చవి దెలిసికొనియె

అంతే కాదు-బిడ్డని యేడ్పునందు కూడ వీరు విచిత్రభావ భంగిని వెలార్చిరి :—

''ఏడ్పురూపము దాలిచి యేగుదెంచు
శిశుహృదయవాణి గుండెకు జేరి మ్రోఁగు,
పట్టికిని నాకు దైవ మేర్పఱచినట్టి
కానిపింపని తంతిమార్గమ్మునుండి.

ఇట్లే కావ్య మంతయు తేనెలూరు తేట కవిత్వపు పసతో తెలివైన ఊహాపోహములతో పలువిధము లగు మకుటములుగా విభజ్యమై అందగించినది.

అన్నింటి కంటె యీ క్రిందిభాగములు పరమపరాకాష్ఠ చెందిన భావసౌందర్యమునఁ దులలేనివై యున్నవి.

'పాలు' అను మకుటమున నీ కుంకుమరేఖాంచిత కూర్చిన భావసంచయము నిజముగా అద్భుతమైనది. ప్రతిమాతయుఁ దన పసినిసుగునకు

స్తన్యమిచ్చి నపు, డిట్టి భావములను పొందుచునే యుండుచు. ఐనను, అసునిశిత భావపంక్తి నామె బాహిరముగ నెట్లు వెలిపుచ్చ గల్గును. కాని, పీరు మాత్రము వానిని చక్కగా అక్షరరమ్యపంక్తిని బొదివి మాతృహృదమును మన కందించినారు.

''గుప్పునఁ జప్పరించుచును గ్రోలగ పీలగు పాత్రలందు నీ
కప్పటి కప్పుడే పచనమై ప్రవహించును వెచ్చవెచ్చగా,
నిప్పును నీళ్ళు లేక, యిట నిల్చెడి నెన్మిదిజాములందు నీ
కెప్పటి కాక లౌనొ, యపుడెల్ల ననున్ గడు తొందరించుచున్.

''ఆకటిచిచ్చు రేఁగ. నట నర్భకు గర్భములోన స్తన్యముల్
దూఁచుచుఁ బొర్లిపోవుటకు దొందర చెందును, దివ్యశక్తియే
కాక మతేమి యౌను? బసికందువు నేడుపు పాలచేఁపుతో
నేకము చేసి బిడ్డదరి కేఁగఁగ వేగిర పెట్టుచుండెడిన్''

''నమ్మిక లే కనేక తరుణమ్ములలోఁ బసివాని వీడి దూ
రమ్మున నేవియో పనులరాపిడిలో బడి, పాలపొంగు ల
క్ష్య మ్మొనరింపకున్న సమయమ్మున, సూటిగ బిడ్డయేడ్పు లు
ల్లమ్మను దాఁకుచుండగఁ, దొలంగెను సంశయమల్ల మెల్లగన్

ఇచ్చట నున్న స్తన్యముల కెట్టులు గోచర మయ్యె నంచు నా
కచ్చెరు వయ్యెఁ దొల్దొలుత, నంటియు నంటని నాస్తిక ప్రచా
రోచ్చయముల్ మదీయహృదినుండి కలంపగఁ జాల వింక, నే
తుచ్ఛపుదాడికిన్ బదము తూలదు పో యిక నంచు నమ్మెదన్.

''మానవకల్పితాన్నములు మానుగ నీ గతి దూరదృష్టిచేఁ
గానగఁ జాలునే మనకు గల్గెడు నాఁకలి? ప్రేమమూర్తి చేఁ
బూనుటచేతనే శిశువు బొజ్జను రేఁగెడు నాఁకటిన్ గనం
గా నగు దివ్యమౌ తెలివి గల్గి వెసన్ బయనించు స్తన్యముల్.

కడపటి పద్య మందలి యీశ్వరవిశ్వాసము అతిశయిత ప్రేమ మహిమము, వాత్సల్య సహజానురాగము ననునవి యన్నియు ముప్పిరి గొని, యెట్లా కవీశ్వరి భావసౌమనస్యమును ప్రకర్షింప జేసెనో పాఠకులు గ్రహించియే యుందురు.

ఇఁక నొక్క ఘట్టమును జూపి విరమింతును. లేక లేక కలిగిన నిసుఁగు మలమూత్రాదుల నెత్తివేయుటలోఁ దల్లి పొందు విచిత్రానుభూతి, పిల్లవాని సేవలో నలవాటు లేని తల్లి యెట్లెట్లలవాటు పొందునో, ఊపిరి తిరుగనీయని నిరంతర బాలసేవాకార్యక్రమమున ప్రప్రథమమునఁ దల్లిభావన లేమో. అన్నియు నిందు చక్కఁగా పొందుపఱుపఁబడినది.

బానిస నైతినే యనెడు భావము స్వాంతమునం దొకింతయున్
గానఁగరాదు, బిడ్డపయి గల్గదు కోపము, నెవ్వరేనియున్
న్యాసతగాఁ దలంతు రసు నొప్పి జనింపదు, తాకబోయినన్
ప్రాణముపైకి వచ్చు గతభావము మచ్చునకైన దోచదే.

''మలమూత్రముల వీడి మలినంబు చేయునో
పత్ర్రమ్ము నను శంక వదలకుండ
నుండెడి దెంత మో జుండినన్ బిల్లల
యందు నేఁ దల్లి నౌనంతదాక

చీదరయె లేదు బిడ్డని సేవ జేయ,
ప్రేమ ప్రతిఫల మిచ్చుచు, స్వామి నన్ను
బెంచు నుద్యోగిగా నియమించినాడు,
ఎదురు చెప్పక శిరసావహించుకొంటి.

ఆహా ! ఎంతటి పరార్థమహితము తల్లిబాధ్యత ! అన్ని విధముల కాంతి పూర మనదగు కావ్యరత్నమును గూర్చి శ్రీమతిగారు మహిళావాఙ్మయమున కపూర్వశోభను గూర్చినారు. వీరి యితర రచనములు:--- అశ్రుతర్పణము, ఉషశ్శ్రీ, విహంగ విలాపము అను ఖండకావ్యములు. ఇవి పత్రికలలో వెలువడినవి. 'విరాగిని' అను కావ్య మింకను అముద్రితము. అవియును ఇట్లే అపూర్వప్రతిభావంతములై యుండియుండును. ఇట్టి శిష్యరత్నము నుత్సహింప జేసి ప్రపంచపు వెల్గునకు దెచ్చినందులకు శ్రీ సీతారామమూర్తి చౌదరిగారు వంద్యులు.

---

# శ్రీమతి చోరగుడి హనుమంత్ శేషమ్మగారు

భాషాప్రవీణ పరీక్షాపట్టము నంది, యంతతో దనివివసక, ఆంగ్ల భాషా పరీక్షలయందును గృతార్థురాలై, యంతకును దృప్తివడక, కావ్యరచనయందును గాలక్షేపము సేయుచున్న శ్రీమతి శేషమ్మగారి పూనిక ప్రశంసనీయము.

వీరు, రాజస్థాన చరిత్రలయందు మిక్కిలి ప్రసిద్ధుడైన రాజసింహుని వలచి వరించి వివాహమాడిన రూపనగరాధీశుని తనయయగు 'విమల' యొక్క జీవితము 'విమల' యను పేర నే దంకముల నాటకముగా రచించిరి.

ఇది యిప్పటి ఏకాంకికల వలె ఎక్కువ సంభాషణాత్మకముగా నున్నది. ప్రార్థన, నాంది, సూత్రధారి, బీజము, పతాక, విష్కంభము, ఇత్యాది ప్రాబద్ధతు లిందు గానరావు. కాని యేలకో, ఒక్క ద్వితీయాంకము ప్రారంభమున విష్కంభము గూర్చినారు. అట నట ప్రసక్తానుప్రసక్తముగ కొలది పద్యములు, కొలందిగ పాటలును గలవు. ధోరణి అతి సామాన్యముగ నున్నది.

'ఊర్మిళ' యను నాల్గంకముల గద్యనాటిక యొకటి. ఇది పత్రికాప్రచురణ మునకే యుద్దేశింపబడినది. ఊర్మిళ అన్ని యేండ్లు నిద్రించుటకు గల కారణము పూర్వశాపము. ముందీమె కిట్టిస్థితి కలుగునని తెలిసి వసిష్ఠుడు లక్ష్మణునకు సంజీవనీసంబంధి సంపెంగలతను పెంచ నిచ్చుట, ఆ నిద్రాసమయమున నామె కా సంజీవనీ సంసేవనముతోఁ బ్రాణరక్షణ జరుగుట-యనునవి యిందలివిశేషములు.

ఇక 'మేలుకొలుపు' ఐదంకములుగల సాంఘిక గద్యనాటిక - ఇదియు బత్రికాప్రచురణకే వ్రాయబడినది ఈనాటివిద్య, విద్యార్థుల యుద్దేశములు, కట్నములు, వివాహములు, ఆర్థికదుర్భిక్షము, పిల్లనుగన్న తలిదండ్రుల దుస్థితి యిందు చక్కగా వివరింపబడినవి.

జ్ఞానసుందరి- అను నారాశ్వాసముల కావ్యము ఇంకను అసంపూర్ణము. మాళవ రాజకన్యజ్ఞానసుందరి సవతితల్లిచే హింసితయై యడవులలో గడునిడుమలు

గుడుచుట, కడకొక రాకుమారునిచే వివాహితయై సుఖ మందుట - యనునది యిందలి కథాసారము.



ఇవి కాక, సంయుక్త సందేశము, చంద్రావతి లేఖ, కుంతీ పరివేదనా భరము, జానకీ సందేశము, మాంచాల హృదయము, ద్రౌపదీ పరిదేవనము, మండోదరి హితము, అను ఖండిక లెన్నో కలవు. ఇందు కొన్ని పత్రికలలో ప్రచురింపబడినవి. చాలవఱ కముద్రితములే. స్త్రీహృదయపరామర్శమగు భావ సంచయ మని పై మకుటములే చెప్పుచున్నవి. ఇట్లు అనేక కావ్యముల వెలయించిన యీ శ్రీమతి వాసస్థానము, ప్రస్తుతము బాపట్ల.

వీరి పుట్టింటివా రగు పోలూరివారు గుంటూరుమండలము నందలి గోకన కొండ గ్రామము నివాసస్థానముగా గల్గి ప్రాచీన ప్రసిద్ధి నందినవారు. అహోబల పండితునిచే తన మేనమామగను, పండితుడుగను ప్రశంసింపబడిన పోలూరి మాధవయజ్వ ఈ వంశమువాడే.



పోలూరి నారాయణరావుగారికిని, వెంకటేశ్వరసమ్మగారికిని నీమె 1921 జూను మాసమున జన్మించిరి. 1928 వ సంవత్సరమున చిలకలూరుపేట వాస్తవ్యులు చోరగుడి హనుమంతరావుగారి కుమారులు రామారావుగారితో వీరికి వివాహము జరిగినది. వీరి స్థిరనివాస మిపుడు విజయవాడ యైనను, వీరి భర్తగారు ప్రభుత్వ సహకారశాఖయందు పనిచేయుచున్నవా రగుట, నిలుకడ లేక తిరుగు చుండిరి.



వీరు తమ ఇరువది రెండవయేట పూనికగా విద్యాభ్యాసము మొదలిడి 1949 లో భాషాప్రవీణ పరీక్షయం దుత్తీర్ణురాలైరి.

1951 లో B. O. L. పరీక్షలో నెగ్గిరి. ప్రస్తుతము M O. L. పట్టము పొందుటకై రామాయణ నాటకములపై పరిశోధనము చేయుచున్నారు.

ఇట్టింత విద్యావతు లాంధ్రావనిని గొలదిగనే యున్నారని చెప్పనగును

---

# సమీక్ష

సారస్వతము తత్తత్కాల ప్రతిబింబము. తత్తద్దేశాచారములతో తమ తమ హృదయాభిప్రాయముల మలపికొని, తమ తమ కావ్యములలో విశ్వజనీనతను ముద్రించి, సమాజజీవనమున కవులు తమ ప్రత్యేకతను స్థాపించుచున్నారు. దేశకాలావధులను దాటి, సాహిత్యరంగమున నైక్యప్రతిష్ఠ జేసికొను జగజ్జీవనము సాహిత్యజీవనమున కుపకరణమువంటి దని కూడ చెప్పవచ్చును. ఈ మానవ జీవితము కవిహృదయమున ఏ ధ్వనిని పుట్టించునో, దాని ప్రతిధ్వనియే సాహిత్యము. కవిహృదయమున మథిత మైన యీ జగజ్జీవనము, లేదా సాంఘికానుభూతి యాతని యుద్దేశము ననుసరించి రూపాంతరము నందును. రూపాంతర మొందిన యీ మానవజీవన భావమే క్రొత్త వేషముతో చమత్కార మగు ప్రాత వాసనలతో కూడిన పాఠకునిచే అద్దమునందు వలె చూడబడి హృదయమును సంస్కార మొనర్చును. నూతన రససృష్టి యైన సాహిత్యమున కీ జగదనుభూతి ఉపాదానకారణము మాత్రమే యనుమాట మరువరానిది. నిజమునకు సాహిత్యము విశ్వజీవనమున కధిశాస్త్ర. అది ధర్మసందేశ రూపమై విశ్వమువారిచే గురువుగ నారాధింపబడుచున్నది.

అటు లయ్యును, ఆ యుపకరణము లేనిచో, సాహిత్య సృష్టి జరుగ వీలు లేనిది సంఘమునకు సాహిత్యమునకు ఈ మానవజీవనమే కూడలి.

సభ్యత కలది సంఘము. కళ్యాణగుణవత్త్వము సభ్యత. అట్టి సభ్యత కల సంఘానుభూతి సాహిత్యవిషయము. సాహిత్యోపాదనము కూడ. తిరిగి యీ సాహిత్యమే సంఘానుభూతికి విషయము, ఉపదేశకము నగుచున్న దనుటయే యిం దభిప్రేత మగు నర్థము. కాగా, దక్షుడగు కవి కావ్యనిర్మాణమునకు పని పూనినపుడే, యీ యభిలషితాంశము చరితార్థ మగును. బలీయ మైన సంఘోద్దేశమునకు, సంఘపరపతికి ఒదిగి, వ్యక్తిత్వము కోల్పడి, సామాన్య జనత తలలు వాల్చుచుండ, విశిష్టభావనాపథాంతరవర్తి యగు నొక్కొక్క మహావ్యక్తి విశ్వ

మానవికతను జయించి, అంతర్వ్యక్తము చేసికొన్న ఏకాత్మవికాసముతో సాధారణ సాంప్రదాయబద్ధములగు వివిధదృక్పథముల కాకరమగు ప్రజాజీవనపద్ధతి నుద్గమించి, తన రూపకల్పనాప్రభావబలమున తన సృజనాశక్తి ప్రాబల్యమున విశ్వమానవికతను తన అదుపులోకి దెచ్చుకొని, ఆ అతి సామాన్యమానవికతాస్వభావమునకు మహాసేనాపతియై, మహానాయకుడై, తన తీర్చి దిద్దిన నవ్యమార్గముల సాహితికి జగన్నాథరథయాత్ర చేయించును. అంతేకాక, క్రమక్రమముగ తన నూతనపథ చాలనమునకు పరిచాయకులై సహృదయులతో తనను సమీపించు జనతకు సుహృదయుడై స్వాగతమిచ్చి, నెయ్యముతో తియ్యముతో నిండుహృదయమును కానుక పెట్టి, చల్లని తన సాహిత్యాంగణమున వారి కాశ్రయమిచ్చి, కావ్య రసామృతమును మధుపర్కముగ నొసగి, వినిన్ద్యమాన మగు సంఘజీవనమున విసివి విసివి, తన ప్రాంగణమున ఆనందముతో, తృప్తితో, నిశ్చింతతో విశ్రమించిన యా లోకజీవనమున దానును బహుళరూపమున నానందముతో కరిగి లీయమై, పరమాత్మ పదారవిందముల కడకు జేరిపోవును. ఆహా! సాహిత్య మెంతటి పదార్థమధురము! జగతీరంగము యొక్క సృష్టికల్పనమున బహురూపకామి యగు విశ్వేశ్వరుని యవరోహణ సౌభాగ్యము! కావ్యజగతీరంగము యొక్క రూపకల్పనమున విశ్వాత్మ యగు కవీశ్వరుని ఆరోహణ సౌందర్యము! "ఏకంసత్ విప్రా బహుధావదన్తి" యను సూక్తి పరమేశ్వరునకువలె కళాకారునకును అనువర్తించును. ఇట్లు పరినిష్ఠితమైన సాహిత్యాత్మ యొక్క పవిత్రలక్షణములు ఏ కావ్యమున నాశ్రయము కల్పించుకొనుచున్నవో, ఆ కావ్యములే విశ్వశ్రేయస్కరములు. తత్కావ్యకర్తలే జగద్ధితంకరులగు ఋషీశ్వరసములు! "నానృషిఃకురుతే కావ్యమ్" అని యూరకనే నుడివిరా భారతీయులు!

విష్ణుపాదోద్భవి యగు గంగామహాదేవి స్థానపాతము నంది, మహాపథము నలంకరించి, యటనుండియు భ్రంశయై, శుభ్రహిమగిరి కూటము నాశ్రయించి, అచ్చటను స్థిరతను భజింపలేక భూపతితయై, అధోగతియై, సామాన్య జీవన పరివాహమున సర్వజన సులభ ప్రాపణీయయై, కడకు పాయలు పాయలై, మలకలు మలక లైనట్లు, పరార్థమహితసుందర మగు కావ్యాత్మ గాంభీర్యము చెడి సర్వజన సులభయై వినిన్ద్య యగుట, సహింపరాని దని కొంద రందురు. గంగా మహానది లోకావతరణము భజించుట పరహితజీవన యగుటకొఱకె యనియు,

రూపగంభీరత తగ్గకయే అంత్యమున మహాసాగరగామిని యై ధన్యజీవన యగుటయు నేటి కవిలోకము విస్మరింపరానిది. కాని, రమ్యార్థ మెచ్చట నుండిన నేమి, మహిత మగుచో పరిగ్రాహ్యము కాదా? అనువిద్ధ మైన సరసిజము శైవలములం దున్నను, రమ్య మనియే కదా ఋషివచనము!

మహిళావాఙ్మయ మంతయు తఱచి చూచిన, అదభ్రశుభ్రయు ధవళమనోహారిణియు నగు నీ వినిర్మలగంగా జీవనాదర్శము తేట తెల్లముగ స్పష్టము కాగలదు. గృహకర్తవ్యము దీర్చ వలసిన సీమంతిను లవకాశఖిన్న లయ్యు దత్తత్కాలసమస్యలలో నాయా ప్రభావముద్రల నంగీకరింపక ఔచిత్యము చెడనంతవఱకు పాల్గొని రనవలెనే కాని, తోడి కవిలోకముతోపాటు పోయినదే పోకగా అంధానుసరణ మొనర్చి రనరాదు. సోదరకవులు వాఙ్మయపథమున నెంత హైన్యమునకు పాల్పడినను,ఆదర్శపథముండి తొలగక, ఆ యా కాలముల సంఘనైద్యానుభూతికి లోబడి, చెత్త చెదారములగు కావ్యముల వినిర్మాణము సేయ నుద్దేశమే కవయిత్రికులమున కుండ కుండుట గమనార్హము, ప్రశంసార్హము నై యున్నది.

విశాలమైన ఆంధ్రవాఙ్మయాంబరమున కవయిత్రు లైన మహిళామతల్లులు జ్యోతిర్మయతార లట్లు శోభిల్లుచున్నారు. సర్వంవిధాయి యైన భగవానుని పరిపాలనా తంత్రమున వాణీమహాదేవి విద్యాశాఖామంత్రిణి యయ్యు, వనితా లోకము వాఙ్మయకర్తృతా ప్రచాలనమున మగవారితో బాటు దీటుగా కున్నారు. సంఘజీవితమునకు స్త్రీ ఆత్మ. పురుషుడు శరీరము. ఆత్మ ఎపుడును గూఢ పదార్థము బహిర్వ్యాపార మంతయు పౌరుషరూప మగు శారీరక కర్మయే. కాని ఆత్మశుద్ధి, అంతర్ముఖత్వము లేని కర్మ అగ్నిశుద్ధి బడయని అపరంజి యట్టిది. 'కన్నున్ననే కదా కాటుక దిద్దుట!' ఇంతకును, కోమలుల కోమల కరపల్లవ స్పర్శమును సందిననాడే సాహిత్యసృష్టి మృదులమును, గంభీరమును, మనోహరమును నై సత్యప్రకృతికి సన్నిహితముగ నుండి, సర్వాంగీణమును సర్వసమగ్రము నగును

కాని, మహిళల కట్టి యవకాశ మేది? అసూర్యంపశ్యలై, అంతఃపుర మేలు అంగనల బుద్ధిప్రాభవములును ఆవనికాభ్యంతరములనే అవధులుగా

జేసికొని రాజ్య మేలినవి. కావుననే, తెలుగు సరస్వతి రమణీయ గీతికావితాన మను చిరుగంటలు దిక్తటముల కలస్వనములు నింప, కవికుమారులు 'స్వస్తి' వాచనముల బలుకుచు ముందు నడువ, సారస్వత స్వర్ణరథ మెక్కి వాదవాదల విజయోత్సవము వెడలినను, తెలుగునారికి నీరాజన మెత్తుటకైనను దీరిక లేక పోయినది.

వాగనుశాసకునకు పిమ్మట రెండు శతాబ్దములు కడచనిన వెనుక కాని, తెలుగునారి ముస్తీబు తీరిచి ముంగిలి చూచుటకును ముచ్చట పడినది కాదు. ఆ బంగారు కాలము పదుమూడవ శతాబ్దమనియును, ఆ ప్రథమవంద్యాలు చానమ, ప్రోలము లనియు ముందే పేర్కొని యుంటిమి. ఇంచుమించు పదుమూడవ శతాబ్ది పూర్వార్ధమున నిట్లు వీరిచే అరంభపూజ కావింపబడగా, ఉత్తరార్ధమున గంగాదేవి సంస్కృతోక్తులతో పూత మొనర్చినది. అది మొదలు తరికుండ వేంకమాంబ వఱకు, అనగా ఇంచుమించు అయిదారు శతాబ్దము లాదికాలముగా నెన్నుకొన వచ్చును. పదమూడవ శతాబ్దమునకు పూర్వముగల కవయిత్రుల రచనలు కాల దష్టములై కానరాకున్నది.

అట్లని, అంతకుముందు స్త్రీల సారస్వతము లేదని యెవరు సిద్ధాంతీకరింప గలరు?

ఈ స్త్రీ వాఙ్మయము మూడు తెరగులు స్త్రీల నుద్దేశించి మగవారు వ్రాసినవి స్త్రీల కొఱకై స్త్రీలు వ్రాసినవి, సర్వవిషయముల నుద్దేశించి స్త్రీలు వ్రాసినవి అని ఇందు ప్రప్రథమమున స్త్రీల నుద్దేశించి వ్రాయబడిన సాహిత్య మంతయు గేయరూపమున నున్నది. 'లక్ష్మణదేవర నవ్వు'లో స్త్రీహృదయ వికాసము పువ్వులు దొడిగి నవ్వులు చిందినది. 'ఊర్మిళాదేవినిద్ర'లో భారతీయ వనిత గూఢమగు గాఢ హృదయానుభూతి సహానుభూతి నంది, చల్లగా నవ్వుకొని మెల్లగా నిదురించినది. సామాన్య స్త్రీజనతా బంధుర శోకమే కదా 'సీతమ్మ శోకము'న గూడు కట్టుకొన్నది. ఈ గేయ ప్రబంధములలో స్త్రీ కర్తృకము లేమైన నున్న వేమో! అది భావికాలమున పరిష్కృతము కావలసిన మాటగా మిగిలిపోయినది.

ఇక రెండవ తరమున - స్త్రీలకొఱకై కావించిన చిరంతన కావ్యసృష్టి కాననగును. కొటికలపూడి సీతమ్మ, భండారు అచ్చమాంబ, వింజమూరి వెంకట రత్నమ్మ, జూలూరి తులసమ్మ, పులుగుర్త లక్ష్మీనరసమాంబ, బుర్రా సూరమాంబ, సీరము సుభద్రయాంబ లీ యుగమున భద్రాసనములు గొనిన మహనీయలు. సాంఘిక సంస్కరణలతోను, భాషావాదములతోను, స్త్రీ జనప్రబోధకములతోను ఎంత యైన యీ యుగము క్రొత్త ప్రాతల మేలు కలయికల క్రొమ్మెఱుంగులు జిమ్ముసదిగా భాసించినది. సుమారొక యుగముసుండి ఉక్కు దక్కి పడియున్న సరస్వతి నుద్ధరించి లాలించిన సీతమ్మగారి మొదలుకొని, ముందుకాలమునాటి విపుల కావ్యకవితకు విశేశ్వరపూజ యొనర్చి యీ సంధియుగమునకు విశుద్ధ హృదయ సీరము సుభద్రాంబయె ప్రతినిధి యనవచ్చును.

మూడవ తరమునకు ఆధునిక వాఙ్మయ మని నామకరణ మొనర్చి, యీ యుగప్రారంభకురాలినిగా శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారిని గణనము సేసితిని. చిల్కపాటి సీతమ్మ, గుడిపూడి ఇందుమతీదేవి కనవర్తి వరలక్ష్మమ్మ, చేబ్రోలు సరస్వతి, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, గంటి కృష్ణవేణమ్మ, దేశరాజు భారతీ దేవి, గిడుగు లక్ష్మీకాంతమ్మ మున్నగు నీ శుభ్రమతులు యుగసారథ్యము వహించి సంపుల కభినందించి యుంటిమి.

సోదరి స్థానాపతి రుక్మిణమ్మగారితో నుపారబ్ధమైన నాలుగవ యుగమున పెండేమంచి అనంతమ్మ, బుర్రా కమలాదేవి ఓలేటి నిత్యకళ్యాణమ్మ, పుట్టపర్తి కనకమ్మ మున్నగువార లెల్లరు నీ యద్యతనాంధ్రకవితావాహినిని పదక్షాళన మొనర్చి, శుచిస్మితలై వాణీమహాదేవి హజారమున కొలువు దీర్చినవారే.

నవాంధ్ర మని పేరిడి, నేను విభాగ మొనర్చిన ఐదవ తరమునకు సారథులు శ్రీమతి కొత్తపల్లి లలిత, తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మి, లవణసాగరమును మథించిన రాజేశ్వరి, బొబ్బిలి బెబ్బులివలె గాంధ్రు మనిన ఆడుపులి చర్లనగరాజకుమారి, వట్టికొండ విశాలక్షి, మున్నగు వా రందఱును నీ యుగమున కర్తవ్యతా భారమును సమముగ పంచుకొనిరి. వయసున పెద్దవా రెందఱో యున్నను, ఇంపులు గులుకు కవితాత్మ కల లలితమ్మదే ప్రాతి నిధ్యము.

ఇక యుగలక్షణ సమన్వయమున కుపక్రమింతము మొదటి నుండియు మన కవయిత్రులు వాఙ్మయరంగమున తమ ప్రత్యేకస్థాన గౌరవమును దాము బాగుగ నిలుపుకొనుచునె వచ్చిరి. పురుషులే సృష్టి యంతకును ప్రాతినిధ్యము తీసికొని అందఱ హృదయ స్వభావముల వెలిబుచ్చిన నెట్లుండునో. మన కందఱకును అనుభూతపూర్వమే. స్త్రీ హృదయ మెంత కోమలమో, అంత కఠినము. ఎంత గహనమో, అంత గభీరము, అంత పేశలము, సులభలభ్యము. అట్టి స్త్రీ హృదయమును చిత్రించుట, స్త్రీల తలంపులను స్త్రీలపరముగ చిత్రించి శిల్పమున మలచుట యనునది బమ్మకును నలవి కాని పని సిద్ధహస్తు లగు కవీశానులు కొందఱట్టి నగిషీపనిని సాధించినవారును లేక పోలేదు. "చిన్న మనసును చిన్నబుచ్చుటె ఎన్ని కని యోచింతురో, మాల మాదిగకన్నె నెవతను మరులు కొనరాదో!" యని శ్రీ గురుజాడవారు ఒకచో కుపిత యగు సతికి పతిపై గల అక్కసును వెలి గ్రక్కించిరి కోపన లగు తరుణులు సాజముగ నిట్లే యందురు. కాని స్త్రీయే తనకు తానై తన స్వభావము వెలిబుచ్చుచో, నది యింకను స్వభావరమణీయముగను సత్యసంబద్ధముగను నుండు నని నా ఆశయము.

మహిళావాఙ్మయసృష్టికి నాందీపూజన మైన -

"పగరకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపు నాయకు లెందున్" అను మానితార్థ మేవిధమునను కలుషితము కాని, సాంకర్యము నందని న్యూనత నంగీకరింపని స్త్రీహృదయవ్యక్తి యగుట మన యదృష్ట మనవలయును.

ఆదికవయిత్రులలో నెన్నిక యగు కావ్యములు సృజియించిన గంగాదేవి, రామభద్రాంబ, రంగాజమ్మలు కవితాప్రియులును మహారాజులు నైన తమ తమ ప్రభువులకు మనసునకు నచ్చిన విద్యాగోష్ఠులకే తాము మన సిచ్చి, తత్ప్రియ వీరవిజయగాథలకే కావ్యగౌరవము కల్పించి కృతజ్ఞత మెఱయించుట యీ ఘట్టమున గమనార్హము కాదగిన విషయము అప్పటికి నిప్పటికిని మహిళావాఙ్మయ పోషకులుగా పేర్కొనదగినవారు ఎవ్వరును లేరు, ఒక్క రఘునాథ భూపుడును, అతని నందనుడు విజయరాఘవనాయకుడును, వీరేశలింగముగారును, ఇప్పటి శ్రీ కేసరిగారును దక్క. ఆ మహారాజుల కాలమున ననిదంపూర్వముగ

నుభయభాషలయందును రమణీయ కృతులు బహుళముగా వెలసి బహుధాప్రతిపత్తి నందినవి.

కాని, మఱియొక ముఖ్యాంశము:- ఆ కాలమునాటి వాఙ్మయ రీతి, లక్షణము, నాయకరాజుల యేల్బడిని తీర్చబడిన సాహిత్య వీథులలో - ధర్మాపేతమో ధర్మోపేతమో ఏది యైన కానిండు - పచ్చిశృంగారము కదుపలుచదనమునకు లోనై, విశృంఖల విహారము సేయుచు దొరలిపోయినది. మగనాలైన గంగాదేవియే కాదు, విలాసహేలలకు విహారభూము లనదగు నా వెలయాండ్రైనను, తమ కావ్యములందు అట్టి ధర్మగ్లానికి పాల్పడిరో! వారందఱును సరసార్థ మంజులములును, గంభీరార్థ మహనీయములును నగు కావ్యశ్రేణి నుత్పాదించిన గౌరవము నొందదగినవారే యైనారు. ఔచిత్యవిచారమున స్త్రీల సిగ్గరితనమునకు, హృదయపవిత్రతకు, నా కావ్యములు పరమసాక్షులే కదా! ఇం దుండి తప్పినది, ఒక ముద్దుపళని. ఆయమ కొక జోహారు! ఆయమ విశ్రుతపఱచిన విపులశృంగారమునకును, ఆధ్యాత్మికముగ మధుర భావనాపరముగ నర్థము చెప్పుచో, సమ్మాన్యయే యని వెనుకనే ప్రస్తావించితిమి. కాని, యా యమ రచనచే నది కలుషితమే యైనది "సర్వ వేదమయుడును, సర్వేశుడును, సర్వహృదయాంతరవర్తియు, సర్వజగన్నాథుడును నగు శ్రీ కృష్ణపరమాత్మకును, నాతని శక్తియు ప్రకృతిరూపిణియు నైన రాధికకును నడుమ నడచిన ప్రణయసంఘటనము కదా యందలి కథాంశము! ఆయమ ప్రస్తరించిన అతిమాత్రపు బాహ్యోపభోగమున నంతర్ముఖముగా ధ్వనించుచున్న ఆత్మ పరమాత్మల అతిలోక సంబంధమును మనమున గుర్తించుకొనిన పళని వర్ణనము హేయముగా కనుపించ" దని అట్టివారి వాదము!

కాని ముఖ్యముగ తన కావ్యమున పళని స్త్రీ హృదయమును చిత్రించుటలో ప్రత్యేక మగు పనితనము చూపినది. మగనికి పెండ్లియగు నని సంబరమే కాని తనకు సవతి వచ్చునని, అప్పటి యనుభవము దుస్సహ మని యెఱుగని రాధ గోలతనము బేలతనమును అందు ఎంత చక్కగా నిరూపితము లైనవో వ్రాయుట కలవి కాని పని

"సొమ్ము లియ్య వచ్చు, సొమ్మంద నియవచ్చు,
ఇయ్యరాని ప్రాణ మియ్యవచ్చు,
మగని నొరుల చేతి కిచ్చి మనగ తరమె?"

అను పద్యమున స్త్రీభావము అచ్చుపడినది. పళనికావ్యమున ప్రతిబింబించు నంతగా మానినీస్పర్ధాహృదయము, స్త్రీ స్వభావమును మఱి యిం కెందును గానము.

మృదు మధుర కంకణక్వాణము లొనర్చ ఊయెల నూపి, ఎలప్రాయుల జోకొట్టు కోమలకరము, ప్రాణపతికి మధురభక్ష్యములతో బాటు మధురహృదయ మును ఆమెత లిచ్చు అమృతహస్తమును నెంత మనోహరములగు కావ్యసూనముల విరియించి, యెట్టి మరందముల కురియింపగలదో, అను నంశమును జాతీయతా సంయుతము లగు తమ రచనల ద్వారా, కుప్పలు తెప్పలగు సామెతలతో కూడిన తమ ప్రబంధముల ద్వారా మొల్లయు, ముద్దపళనియు ఋజువుపఱచుకొన గలరు.

అందును మొల్ల పండితప్రశంసపు లన దగినవారికి తన కావ్యాపణమున బలపుతలపుల సొమ్మును బయలిడిన ద్యాంకరు. ముద్దుపళని, మొల్లలను దడవుటతో చాల ముందునకు వచ్చి పడితిమి కాని "చేమకూరను పాకముగాచేసి" సెబా సనిపించుకొన్న వేంకటకవి కావ్యసంసారమునకు భావసామగ్రిని పసపనము లిచ్చిన ఉదారపుటుంబిని తిమ్మక్క వస్తుసంపద, ఔదార్యము కొలదు లిడరానిది. తిమ్మక్క ఈ ద్విపదకావ్యమే కాక, కీర్తనలు కూడ రచించినది తిమ్మక్క కీర్తనల యందును, రంగాజమ్మ యక్షగానమునందును, పదకవిత రాగ తాళ నాట్యభంగిమ లతో సజీవముగా రూపు తాల్చినది. ఇందు వా రొదుగుతో కూడుకొన్న కంఠగత కోమలత్వమును శబ్దమున సన్నిధాపించినారు. రూపచిత్రణతో కూడి సాహారతను భజించిన నాట్యాభినయములు రంగాజి ప్రబంధమునందలి గేయములనుండి కదలి పోవుచుండును.

ఈ తరమున ద్విపదరచనలు చేసినవారు తరికుండ వేంకమాంబతో సరియొరు, యక్షగానములు చేసినవారును నామెతో నిద్వరే. ఆధ్యాత్మికత యామెతో కావ్యాను భవమున ప్రత్యక్షమైనది ఈ యుగలక్షణము సంతను ప్రోగుచేసి యుగ్గడింపవలె ననిన, ఆదికవయిత్రులైన వీ రందఱును మార్గదేశిచ్ఛందస్సులలో వివిధమార్గముల తను కవితారథమును నడిపించినారు. పురాణములు, కావ్యములే కాదు- ప్రబంధ ములు, యక్షగానములు అను శాఖలను వెలయించిరి జాతీయములు, సామెత లును పొదువుటలో తమకు తామే సాటి యైనారు. అంతమాత్రమే కాదు-

తమ కల్పన లన్యకవిరాజన్యుల కనల్ప కథాశిల్పమాతృక లవునట్లు దిద్ది తీర్చినారు. ఇది యీ యుగమునకు గల ప్రత్యేకలక్షణము. 'తేనె సోకనోరు తియ్యన యగు రీతి తోన నర్థ మెల్లదోచు నట్లు' పలకని కావ్యము 'మూగ చెవిటి వారిముచ్చట' యని ముదలకించి 'కందువమాటల సామెత లందముగా గూర్చి చెప్పినపుడె, తెనుగున కవి పొంది పొంకమై వీనుల విందగు' నని చెప్పిన మాట చెల్లించి చూపినారు. ప్రసిద్ధపక్షములు సాహసగాథలకు కవితాచాతుర్యము దోడుచేసి యా శాశ్వతత్వము కల్పించి మాన్యులైనారు. పండితవాదముల పట్టు చూపి, జయము చేపట్టి, సరస్వతీపీఠమును తంజనగరమునకు తరలించినారు నాడు విద్యానగరము కవులకు కొలువైనట్లు, నేడు తంజానగరము కవయిత్రులకు పట్టుకొమ్మయైనది. మొత్తముపై సంస్కృతపు చవి యెక్కువైనది.విపులకావ్యకవిత యీ యుగధర్మ మనిపించినది

మఱల తెర యెత్తుసరికి, రంగము నలంకరించునది వీరేశలింగ మహితుని యాస్థానము! ఇందు ముందు రానున్న అన్ని విధము లగు కవిత్వశాఖలకును నాంది జరిగినది. ఇది సంధియుగ మని మున్నె పేర్కొని యుంటిమి. స్త్రీ విద్యా ప్రణాళికలు, ప్రబోధములు ప్రవర్తిల్లిన వీ సమయముననే అథఃపతనమై యున్న స్త్రీసంఘవ్యవస్థను చక్కబఱచి సంస్కరించుటకై స్త్రీలచే నడుపబడిన అనసూయ, హిందూసుందరి, సావిత్రి పత్రికలు బయలువెడలిన వీ యుగముననే కదా! సీరము సుభద్రమ్మగారి యందు వివిధ కావ్యకవితయు, పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి యందు పురాణకవితయు పొలుపు నెందినవి. శతకములు విస్తరించిన దీ కాలము ననే. అప్పటి శతక మిప్పటికిని ప్రణుతి గొనుచునె యున్నది. కవిత్వాభ్యాసము కొఱకై యందఱు నేదో యొక శతకము చేసిరా యనిపించును. వయసున చిన్న దైనను, కాళ్లకూరి మహాలక్ష్మీసుందరి నీ యుగముననే చేర్చవలసివచ్చినది. ఆంగ్లమందు కవిత్వ మల్లిన మగువ యీ యుగమున నీమె యొకతెయె యగపడు చున్నది. వెన్నెలకంటి హనుమాయమ్మగారి సంస్కృతకావ్య నేతృతావిశిష్టత విస్మరింప దగినది కాదు- జ్ఞానమాంబగారి రచన మొక తృతీయఃపంథా యైనది- ఆ కావ్యరత్నములతో సరితూగగల కావ్య మింకొకటి గన్పడదు. ఆ మహాయోగిని కొక్క నమస్కారము చేసి సాగిపోవలసినదే. ఈమె మొదలు మహిళా సారస్వత

మున గూడ బ్రహ్మసమాజ మతవాసనలు అలమికొన్నవి. వచనగ్రంథ రచనారంభ మును ఈ కాలముననే జరిగినది.

తరువాత తరువాత, సారస్వతమునందలి అన్ని శాఖలును బ్రబ్బికొన్నవి. కావ్యములు, ప్రబంధములు, ద్విపదలు, ద్విపదలు, శతకములు, నవలలు, నాటకములు, ఏకాంకికలు, కథానకములు, గల్పికలు ఖండకావ్యములు మున్నగున వెన్నో పోను పోను ప్రోద్బలము నందినవి. శ్రీ కనకమ్మ, గుడిపూడి ఇందుమతీదేవి సరస్వతీదేవి, సీతాంబగార్ల రచనలలో ఆధ్యాత్మిక కావ్యములు, పురాణములు, ప్రబంధములు, నాటకములు, ఖండకృతులు, నవలలు ముసురుకొన్నవి. పోణకా కనకమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగార్ల భగవద్గీతానువాద మొక స్వర్ణభూష. సరస్వతీ రామాయణముతో స్త్రీల రామాయణములు ముచ్చటగా మూడని యీ వఱకే ముచ్చటించి యుంటిమి.

దేశరాజు భారతీదేవి, గంటి కృష్ణవేణమ్మ ఓలేటి నిత్యకళ్యాణమ్మ మున్నగు వారి రచనలలోను ఇంకను ఇతరుల కొందఱ రచనలలోను వీరనాయక స్మృతులు, పండుగ ప్రశస్తులు, రాష్ట్రోద్బోధనలు స్వాతంత్ర్య రేఖానముద్దీపనములు మనము కాంచగలము. పుట్టపర్తి కనకమ్మ, దేవులపల్లి సత్యవతమ్మ, చర్ల నగరాజకుమారి, రాజేశ్వరిగార్ల రాతిరథము, సత్యాగ్రహోద్బోధము, బొబ్బిలి బెబ్బులి, లవణసాగర మథనము, వీరచంద్రావతి శీర్షికలలో దేశభక్తి తీవరించి యున్నది. మదమంచి అనంతమ్మగారి రాష్ట్రప్రబోధము పద్ధతియే వేరు. గండరించిన వారి రచనాశిల్పమునందలి కావ్యమూర్తులు సజీవములై వ్యక్తులతో ఎట్ట ఎదుట నిలువబడి పలుకరించి యుపదేశము చేయుచున్నవా యను నట్టుండును అది యెవ్వరు ప్రయత్నించియు ప్రాప్తించలేనిది. వారి జాతీయ కవిత్వమున కొక జోహారు. మొత్తముపై మదమంచివారిది మంచి కవిత్వము. శ్రీ బుర్రా కమలా దేవిగారి ఖండకావ్యముల ప్రశస్తి యొక ప్రత్యేకస్థానము నాక్రమించినది. ఆంధ్ర సారస్వతమున ప్రభవించిన Lyric సాంప్రదాయము చక్కగా ప్రతిఫలించినది. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారితో ఏచి పూచిన విషాదకావ్యగానము వీరియందు స్పందించినది. కృష్ణశాస్త్రిగారిది అనుభవ మందక పడిన ఆవేదనము. కమలాదేవి గారిది అనుభవము చాలక పొందిన ఆక్రోశనము. ఏమైనను, చరమపరాకాష్ఠ

పొందిన వీరి విషాదవీణా శ్రుతీనిక్వాణమున ప్రతివారి అనుభవములును ఏదో విధముగ ప్రతినినదించుచునె యుండును ఇంతకును సారస్వతమున వారి ఖండ కృతుల కొక చక్కని స్థానమున్న దనుట నిర్వివాదాంశము.

సోదరి స్థానాపతి రుక్మిణమ్మగారి రచనలు చంద్రునినుండి తొరగి పారిన యమృతమువలె కళామాధుర్యమున తొణికిసలాడుచు, ఆహ్లాదకారణము లగుచున్నవి. శ్రీమతులు విశ్వసుందరమ్మ, రాజ్యలక్ష్మి, బంగారమ్మగారల గులాబి, కప్పపెళ్ళి మున్నగు భావకవిత్వపు పలుకుబడులు చవిచూచి యుంటిరి.

ఈ భావకవితా ప్రాబల్యము యువకవులలో ఎక్కువ ప్రోత్సాహమును రేపినది భావకవిత్వమున పరిణతప్రజ్ఞు లగువారి నాదర్శముగ పెట్టుకొని, యా కవిత్వమునకు మనసిచ్చిన వా రెందఱెందరో కలరు. భారతదేశ స్వతంత్ర సముపార్జనమునను, రవీంద్ర, గాంధీజీ యిత్యాదుల మహాపురుషుల మృతినిర్వేద ములవలనను గలిగిన ఉత్తుంగ భావ సంచాలనములు కావ్యజగత్తును కదలించివైచి, కమ్మని రచనల కాధారప్రాయములైనవి. భారతీదేవి, గిడుగు లక్ష్మీకాంతమ్మ మున్నగు కొందఱి రచనలలో నివి కొల్లలుగ కనుపించును.

అష్టాదశ వర్ణనలతోడి మహాకావ్యముల కంటె, అల్పార్థసంప్రయోజనము లగు ఖండకావ్యములు హెచ్చు ప్రచారము నందినవి- అంత కంటెను రసప్లుత ములుగ ఖండికలు బహుళప్రశస్తి నొందినవి.

వీనివలన కావ్యధర్మము కుంటుపడిన దనువారు కొందఱు, వీని వలననే కావ్యప్రయోజనము ఎక్కుడుగ సిద్ధించిన దనువారు కొందఱునై వాదోపవాద ముల బెంచిరి కాని, సిద్ధాంతమును భావికాలమునకే యప్పగించిరి. కావ్యమేదైనను, తద్గతభావార్థములే కద ముఖ్యార్థములు. అట్టియెడ, నిది మహాకావ్యమా, ఖండ కావ్యమా, భావకవిత్వమా, ప్రబంధకవిత్వమా అను చర్చ పండితమ్మన్యు లగు వైతండికుల పనియే కాని వేరొండు కాదు. ఒకానొక నిర్దిష్ట మగు ఛందమున శ్రేయోపాదకము లగు కావ్యార్థము వివరించి ప్రచలింపజేయుటే పరాయణము-

ఇంతలో నాటకమునందంతర్నాటకమువలె, శ్రీ శ్రీ, చలంగార్ల ప్రవేశ ముతో రంగము క్రొత్త రంగులు దొడిగినది. వీరు వెలయించిన బాటయే గేయ

సారస్వతము. దీని లక్షణము వెనుకనే బాగుగ తెలిసియుంటిమి. అభ్యుదయ గీతాలు, "నందా" మున్నగునవి రచించిన శ్రీమతి వట్టికొండ విశాలాక్షి, లలిత మున్నగువారు కవితాసఖితో స్నేహసంబంధము తళుకొత్త జేసినారు. ఆమెతో బాటు ఆంగ్లసారస్వతమున కవిత్వము చెప్పువారు మూగురు. తక్కినవారు మహాలక్ష్మి సుందరియు, బుర్రా కమలాదేవియునై యున్నారు. బుర్రా కమలాదేవితో సంస్కృతమున కవిత్వము చెప్పినవారును మూగురే. శ్రీమతి కాంచనపల్లికనకమ్మ గారు ఎ.కోమలమ్మ అను వారలు-తక్కినవారు లలిత తురుష్కభాషాభూషిత కూడ. సర్వేశ్వరు డిట్టి మహనీయాభరణముల నింకను ప్రసాదించును గాక! కొమ్మూరి పద్మావతి యొకతె చలంగారి శిష్యురాలుగ కనబడుచున్నది. సోదరి పద్మావతి నిశిత ప్రతిభాశాలిని. అనేక ఉద్యమములలో నామె ప్రజ్ఞానిర్వాహకము లారి తేరినవి. బ్రహ్మ సమాజభావవ్యాప్తి, స్త్రీల నాటకరంగ ప్రవేశాభిలాషలు, చలంగారి భావానుకరణములు వీరి రచనలలో కొంసరి ముసరికొన్నవి

ఇన్ని తరములు, ఇన్ని శతాబ్దములు గడచసిన పిదప సింహావలోకము చేసి చూడ, స్త్రీవాఙ్మయమున శతక మెక్కువ పాలుగొనినదా యనిపించుచున్నది, కావ్యములు, ప్రబంధములు, నవలలు, ఖండ కావ్యములు, నాటకములు- ఇట్లు వరుసగా లెక్కింపవచ్చును. ఇప్పటిలో వ్యాసరచనము, వీని నన్నిటిని మించినది కథాసాహిత్యము, లేఖాసారస్వత మొకటి చెప్పదగినది- హెచ్చు పాలు గొనుచున్నది. గీతము మొదలు వృత్తములు, కందములు, సీసములు, గేయములు, ముత్యాలసరములు నను వివిధచ్ఛందములు వీరి చేతులలో సుడులు దిరిగినవి.

కళాహృదయము కుసుమకోమలు లగు తరుణులకు సహజ సిద్ధము. ఏదేని రమ్యభావప్రకటన చేయవలె ననిన, తత్ప్రయత్నము పురుషులకు కృతకమె యనవలెను ఆపాతమధురమును, ఆలోచనామృతమును అగు సంగీత సాహిత్యములు సరసాంగులకు అనభ్యస్త సంప్రాప్తములును, అశిక్షిత పటుత్వపాకములు నగు సహజశిక్షలు. విశ్వమున గల మృదులతను, మధురతను, రమణీయకతను, కమనీయకతను, కాంతా సమధర్మముగ తత్త్వవేత్తలు నిర్ణయించిరి. విశ్వశ్రేయస్కర మగు కావ్యధర్మము కూడ కాంతాసమ్మితముగనె యుపలక్షించుట దీనికి ప్రబలోదాహరణము. కాని, మహిళాలోకము అనవకాశబాధితము. ఐనను,

ఓపినంతవటు లి ట్లీ సార్వస్వత మహోద్యమమును హృదయపూర్వకముగ నాహ్వానించుచు, నెప్పటి కప్పుడు వినూత్న రచనా వ్యవసాయధురీణ లగుచున్న కవయిత్రు లెందఱో అందఱును మనకు వంద్యమానలే యగుచున్నారు. ఇట్టివారు సరస్వతీసేవానురక్తలుగనే కాక, దేశమాతృ కళ్యాణరేఖాలంకారకారిణులుగ కూడ పొగడొంద గల్గుచున్నారు.

పరమపిత యగు నేకేశు డెప్పుడును దనివోని కళాసంపదతో నీ యమృత వ్యవసాయికురాండ్ర నాచంద్రార్క మాశీర్వదించును గాత!

మహిళా సారస్వత మనల్పమై, మహీయస గౌరవాస్పదమై యాశాశ్వతము వర్ధిల్లును గాత!

"సహనావతు సహనౌభునక్తు సహవీర్యం కరవామహై-
తేజస్వినావధీత మస్తు మావిద్విషామహై."

— :o: —

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ముద్రణ : శివాజి ప్రెస్ సికింద్రాబాద్.